కంచ ఐలయ్య

# అంటరాని దేవుడు



తెలుగు:

పాలకోడేటి కృష్ణమూర్తి

నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్

# అంటరాని దేవుడు


రచన

**కంచ ఐలయ్య**

తెలుగు

పాలకోడేటి కృష్ణమూర్తి



**నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్**

*ఎమ్‌హెచ్ భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర*

*హైదరాబాద్ -20, ఫోన్ : 040 - 27660013*

122903

ప్రచురణ సంఖ్య : 1402

ప్రథమ ముద్రణ : సెప్టెంబర్, 2016

వెల : ₹ 150/-

ప్రతులకు : నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్
ఎమ్.హెచ్. భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్
ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ -20
ఫోన్ : 040 - 27660013

బ్రాంచీలు : నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్ బ్రాంచీలు
హైదరాబాద్ - చిక్కడపల్లి, బాగ్‌లింగంపల్లి (ఎస్.వి.కె.), ఇ.సి.ఐ.ఎల్.,
నల్గొండ, హన్మకొండ, ఖమ్మం, కరీంనగర్, నిజామాబాద్

ప్రజాశక్తి బుక్‌హౌస్ బ్రాంచీలు
విజయవాడ, గుంటూరు, విశాఖపట్నం, తిరుపతి, ఒంగోలు, నెల్లూరు

ముద్రణ : నవతెలంగాణ ప్రింటర్స్ ప్రై. లిమిటెడ్, హైదరాబాద్

# విషయసూచిక

# అంకితం

**మా  కుటుంబంలో మొదట అమెరికాలో పుట్టిన పాప**

**'తను'కు**

– కంచ  ఐలయ్య

# ఈ నవల ఎలా, ఎందుకు రాసాను?

నవతెలంగాణ పబ్లిషర్స్ నా ఇంగ్లీషు నవల 'అన్‌టచబుల్ గాడ్'ను తెలుగులో 'అంటరాని దేవుడు' పేరుతో అచ్చు వేస్తున్నందుకు కృతజ్ఞతలు. ఈ నవల నేను 2004-05లలో ఆరు నెలల పాటు అమెరికాలో ఒక ఫెలోషిప్ మీద ఉన్నప్పుడు రాసింది. ఇండియన్ ఇతివృత్తాల మీద ఇండియన్ రచయితలు ఇంగ్లీషు భాషలో రాసిన నవలలు చాలా తక్కువ. అలా రాసిన రచయితల్లో ఎక్కువ మంది విదేశాల్లో జీవిస్తూ రాసినవే. ఇండియాలో ఉండి రాసిన కొద్దిమందిలో బ్రాహ్మణ లేదా ఆ కుల దగ్గరి సంబంధిత కులాల వాళ్ళు రాసినవే. ఈ రచయితలంతా యూరోపు - అమెరికా వంటి దేశాల్లో ఇంగ్లీషులో రాసిన నవలలను చదివి రచనా పద్ధతిని కాపీ కొట్టి రాసినవే! ఆర్.కె. నారాయణ నుండి, అరుంధతీరాయ్ వరకు ఈ దేశ అగ్ర కుల సంస్కృతిని విదేశస్తులకు చెప్పడం కోసం రాసినవే. ఈ దేశంలో సామాజిక మార్పు తేవాలనే దృక్పథంతో రాసిన నవలలు అసలు లేవనే చెప్పాలి. ముల్కరాజ్ ఆనంద్ రాసిన 'అన్‌టచబుల్' కొంత సామాజిక మార్పును దృష్టిలో పెట్టుకొని గాంధియన్ ఫ్రేమ్‌వర్క్‌లో రాసింది. ఈ రచయితల్లో ఎక్కువమంది బ్రాహ్మణీయ పునాదుల నుండి రావడమే కాక పూర్తిగా పాశ్చాత్య నవలా పద్ధతిని అనుసరిస్తూ రానినవి. ఒక కొత్త పద్ధతిని ఎక్స్‌పరమెంట్ చేసినవి లేవు.

ఈ నవల ఒక కొత్త పద్ధతిని, భిన్నమైన ఇతివృత్తంతో రాశాను. చాలా రాష్ట్రాల సంస్కృతి, కులాల సంస్కృతి ఈ నవలలో అలలు, అలలుగా పాఠకుని

ముందుకొస్తాయి. కథానాయకుడు ఒకడుండడు. చాలామంది పురుషులు, స్త్రీలు, తమ తమ కుల సంస్కృతులను ఒంటినిండా ఆరబోసుకొని పాఠకుని ముందుకొస్తారు. వలసవాదాన్ని తిట్టి, వలసవాద పద్ధతుల ననుసరించడం, కులమతాలను దాచి దేశ సంస్కృతిని పుస్తకాల్లో నుండి పుట్టించడం ఇందులో మచ్చుకైనా ఉండదు.

పాశ్చాత్య సాహిత్యాన్ని అనుకరించి ప్రాంతీయ భాషలోరాసి దేశభక్తి చాటుకునే ఛాందసవాదం ఇందులో ఉండదు. ఆర్.కె. నారాయణ 'మాల్‌గుడి డేస్'కి, యు.ఆర్. అనంతమూర్తి 'సంస్కార' వంటి నవలలకు అందనంత దూరంగా అసలు భారతీయుల ఆత్మ పరిపక్వతతో ఈ నవల సాగుతుంది. గురజాడ చెప్పిన దేశమంటే మట్టికాదోయ్ – దేశమంటే మనుషులోయి' తలకిందుల పాండిత్యానికి బదులు దేశమంటే ముందు మట్టి – ఆ మట్టి నుండి వచ్చే మనుషులు' అనే శాస్త్రీయ దృక్పథాన్ని ఈ నవల ఈలవేసి చెబుతుంది. ప్రతి దేశపు మనుషుల్లో ఆ దేశపు మట్టి వాసన వుంటుంది, దాని ఉనికి ఉంటుంది అని ఇది నిరూపిస్తుంది.

ఈ నవల రచయితగా నేను ఈ దేశపు మట్టి మనిషిని, బ్రహ్మతల మనిషిని కాదు. ఈ దేశ మట్టి నుండి వచ్చి మళ్ళీ మట్టిలోకే పోత. నేను బూడిదను కాను. ఆ మట్టి నుండి మళ్ళీ ఏమై పుడతాననేది ఈ నవల చెబుతుంది. నేను ఈ నవలలో కమ్యూనిజాన్ని శ్రీశ్రీ జగన్నాధుని రథచక్రాల్లా నడిపించలేదు. దాన్ని ఒక షెఫర్డ్ గొర్రెల్ని పచ్చిక బయలల్లో ఎలా తిప్పుతాడో అలా తిప్పాను. ఆ గొర్రెల్లోనే తోడేళ్ళు ఎలా దాగి వున్నాయో, ప్రేమ పేరుతో ఎన్ని కుల సంబంధాలను కాపాడుకుంటున్నాయో చూపించాను.

మట్టికీ మనిషికీ చాలా బలమైన సంబంధముంది. అందువల్లే ఒక భౌగోళిక ప్రాంతంలో మనుషులు ఒక రంగులో, ఒక రూపులో పుడతారు. మరో భౌగోళిక ప్రాంతంలో మరో రూపంలో, మరో రంగులో పుడతారు. ఆఫ్రికన్లు అక్కడే ఆ రంగు రూపాల్లో ఎందుకు పుట్టారు? ఆసియన్లు అక్కడే ఆ రంగు రూపుల్లో ఎందుకు పుట్టారు? యూరో – అమెరికన్లు ఆ రంగు రూపుల్లో ఎందుకు పుట్టారు? ఆయా మట్టి ప్రభావం వల్ల అలా పుట్టారు. అందువల్ల ఈ నవల మట్టిని ప్రతిబింబిస్తుంది. అదే ఆఫ్రికా నుండి

అమెరికాకు బానిసలుగా పోయిన ఆఫ్రికన్ – అమెరికన్లకు ఇక్కడి మట్టి మనుషులకు ఉన్న పోలికను చూపిస్తుంది.

ఇంగ్లీషులో అచ్చయిన కొద్ది రోజులకే 'అన్‌టచబుల్ గాడ్' రెండో ముద్రణ వచ్చింది. ఇది ఈ నవల మొదటి ప్రాంతీయ భాష అనువాదం. నవల రాసిన్నాడు నా పేరు 'కంచ ఐలయ్య' మాత్రమే కాని ఇప్పుడు నా పేరు కంచ ఐలయ్య షెఫర్డ్. నా పేరు ఇలా ఎందుకు మారిందో చాలామంది పాఠకులకు తెలుసు. అగ్రకులాలు, ముఖ్యంగా బ్రాహ్మణీయ శక్తులు తమ ఆధ్యాత్మిక ఆధిపత్య బిరుదులతో దళిత, బహు జనులను అణగదొక్క చూశారు. ఈ ఆధిపత్యాన్ని ఏ పేర్లు పెట్టుకోవడం ద్వారా కూలగొట్టాలో దళిత బహుజనాలకు అర్థం కాలేదు. కొంతకాలంగా కొన్ని కులాల వాళ్ళు బ్రహ్మణీయ శక్తులనే అనుకరించి సంస్కృత తోకలు తగలించుకున్నారు. కాని స్థితి మారలేదు. వాళ్ళ ఆధిపత్య కుల ఐడెంటిటీ అలానే బతుకుత్నుది.

మానవ జీవితంలో కులం, మతం కన్నా వృత్తి చాలా ముఖ్యమైంది. తమ వృత్తి ద్వారానే మానవులు ప్రకృతిని పదార్థంగా మారుస్తారు. వృత్తి ద్వారానే మట్టికీ – మనిషికీ ఉన్న సంబంధం మార్పుకు అవసరమయ్యే వస్తువుగా రూపాంతరం చెందుతుంది. అయితే వృత్తుల్లో కొన్ని వృత్తులు శాస్త్రీయమైనవి, అభివృద్ధికాముకమైనవి. కొన్ని వృత్తులు మోసం, దగా ద్వారా ఆ వృత్తిదారులకు బతుకును, ఆస్తిని ఇస్తాయి. శాస్త్రీయ అభివృత్తుల్లో అతి ముఖ్యమైంది పశుపోషణ. అందులో గొర్రె – మేకల పెంపకం అతి గౌరవప్రదమైంది. ఆ వృత్తి కలిగిన తల్లిదండ్రులకు నేను పుట్టినందుకు గర్విస్తూ నా చివరి పేరును ఇంగ్లీషులో షెఫర్డ్‌గా పెట్టుకున్నాను. అయితే నవల కవర్‌పేజీపై పేరు కంచ ఐలయ్యగానే ఉంటుంది. ఎందుకంటే మొదలు ఆ పేరుతోనే అచ్చయింది కనుక. ఇక ముందు రాసే పుస్తకాల మీద మాత్రమే పేరు మారుతుంది.

ఈ నవల తెలుగు అనువాదం తెలుగు భాషను అభివృద్ధి చేసి ఆదరించడానికి కాదు. ఇంగ్లీషు చదవలేని వాళ్ళు, తెలుగు మాత్రమే చదవగలిగే వాళ్ళు నేను ఈ నవలలో ఏం చెబుతున్నానో అర్థం చేసుకోవడానికి మాత్రమే. రానున్న రోజుల్లో ఈ దేశ ప్రజలందరూ ఇంగ్లీషులో రాయడం, ఇంగ్లీషులో చదవడం

చేయాలనేది నా కోరిక. కారల్‌మార్క్స్ వర్గ పోరాట అంతిమ లక్ష్యం గురించి చెబుతూ "వర్గ పోరాటం వర్గాలను అంతం చెయ్యడానికే అంటాడు." అదేవిధంగా తెలుగులో నేను రాసేది, మాట్లాడేది కూడా తెలుగును అంతం చెయ్యడానికే. ఈ నవలను తెలుగులో అనువాదం చేయించి అచ్చు వేస్తున్నందుకు నవతెలంగాణ పబ్లిషర్స్‌కు మరోసారి నా ధన్యవాదాలు.

**హైదరాబాద్** **- కంచ ఐలయ్య షెఫర్డ్**

**2, సెప్టెంబర్ 2016**

# 1

# పరయ్య ఆత్మ

**సూ**ర్యాస్తమయ సమయం. పరిసరాలన్నీ మంచు తెరల్లో మసకమసకగా ఉన్నాయి. సాయంత్రం కురిసిన జడివాన కాస్త గెరువు ఇచ్చినా, గాలి హోరు మాత్రం తగ్గలేదు. ఎందరో స్త్రీలు పనులు ముగించుకుని ఇళ్లకు తిరుగుముఖం పట్టారు; ఇద్దరేసి స్త్రీలు కలిసి అడుగులు వేస్తున్నారు, ఒకరినొకరు పెనవేసుకున్నట్టుగా, పంట పొలంలో మడికోసి, బండపైన కుప్పలు పెట్టించడం స్త్రీల పని. ఏ కులస్తులైనప్పటికీ పురుషులు పురుషులే కదా! వాళ్లు పొలానికి నీళ్లు పెట్టడం, పొలం దున్నటం, పశువులకి మేత వేయడంలాంటి పనులు చేస్తారు. వంట చేయడం, కలుపు తీయడం లాంటి పనులు చేయరు. స్త్రీ పురుషుల మధ్య ఈ పని విభజన ప్రకృతి సిద్ధమైనది; అది మనుషులు సృష్టించిందా లేక దైవం సృష్టించిందా అన్న విషయం ఎవరూ చెప్పలేనంత ప్రాచీనమైంది. ఆ గ్రామం జీవం పోసుకున్న చరిత్రలా ఉంది. అక్కడి ప్రతి మనిషి శతాబ్దాలనాటి పురాతన చిత్రంలా వున్నాడు.

ఊరు చుట్టూ ఏపుగా పెరిగిన పచ్చని పైర్లు, పశువుల గిట్టలు రేపుతున్న గోధూళి దుమ్ము మేఘంలా వ్యాపించి అక్కడంతా మసకమసకగా ఉంది. వాతావరణం బాగా పొడిగా ఉంది. ఉదయం పొగమంచు కురవలేదు. కానీ సాయంత్రం వర్షం పడటంవల్ల కాబోలు మొక్కలన్నీ ఎవరో శుభ్రం చేసినట్లు తళతళలాడుతున్నాయి. వృద్ధులు కొందరు అక్కడక్కడ రచ్చబండలమీద కూర్చుని రాజకీయాల గురించి, అప్పుడప్పుడు తమిళ దేశాన్ని గురించి చర్చించుకుంటున్నారు. వారిలో కొందరికి పొడవైన మీసాలుంటే మరికొందరికి బట్టతలలున్నాయి. కొందరు పూర్తిగా గుండు చేసుకున్నారు. అందరూ తలపాగాలు ధరించారు. పొగ తెర కప్పినట్టు వ్యాపించిన గాలి ఆత్రంగా తమ తమ

గూళ్లకి చేరుకుంటున్న పక్షుల కువకువలతో నిండిపోయింది. అస్తమిస్తున్న సూర్యుడి నేపథ్యంలో కొన్ని ఇళ్ల కప్పులు కాషాయ రంగు కాంతితో కనిపిస్తున్నాయి. మరికొన్ని ఇళ్లు సాయం సంధ్య వెలుగులో కలిసిపోయాయి. పొలం పనులు ముగించుకుని ఇంటికి తిరిగి వచ్చిన స్త్రీలు వంటింటికి పరిమితమయ్యారు. వర్షంలో తడిసిన కట్టెపుల్లలతో వంట చేయడానికి వాళ్లు కుస్తీ పడుతున్నారు. కట్టెపుల్లల పొగ దుమ్ములో కలిసిపోయింది.

స్త్రీలు వరి చేనుకోసి పోగుచేసిన వరికట్టలను ఒకచోట చేర్చి మోపు గట్టే ప్రయత్నం చేస్తున్నాడు పరయ్య. కల్లంలోకి వరికట్టలను తీసుకుపోవడానికే ఆయన ఈ ప్రయత్నం చేస్తున్నాడు. పరయ్య ఓ అసాధారణ వ్యక్తి.

ఆడ, మగ, ఇద్దరు చేసే పనులను అతడొక్కడే చేయగలిగే శక్తి ఉన్నవాడు. స్త్రీ పురుషులతో వాదులాడే వ్యక్తిగా అతనికి పేరుంది; అతని గొంతు, నడవడిక స్త్రీ లక్షణాలను పోలి వుంటాయి. పాశ్చాత్య మహిళలు మగవారితో కలిసి పొగపీల్చినట్టుగా పరయ్య పొగపీల్చే ఆడవాళ్లతో కలిసి మట్టి చుట్ట వెలిగించి 'ఉప్పు ఉప్పు'మంటూ రెండు, మూడు బుక్కలు పీలుస్తాడు. పరయ్య గేదెలాంటి నల్లటి నలుపు. భుజాల వరకూ వేలాడే పొడవాటి జుట్టు. గోచీ గుడ్డ తప్ప, ఒంటి మీద బట్టముక్క లేదు. సామాన్యమైన ఎత్తు. అతనికి సన్నపాటి గడ్డం ఉంది. బక్కపలుచని లసలసలాడే ముడతలు పడ్డ శరీరం.

ఏదో బాధలో వున్నట్టు నేల మీద అతని అడుగులు బరువుగా పడుతున్నాయి. పరయ్య తన ఊరు దేవాపురం వెళ్తున్నాడు. ఆ ఊరు చుట్టుపక్కల చాలా దేవుళ్లు ఉంటారని అంటుంటారు.

అధిక శ్రమతో అలసట చెందిన అతని భుజాలు విల్లులా వంగివుంటాయి. అయినప్పటికీ అతని ఆత్మస్థైర్యం సడలలేదు. అతనిలో ఆత్మశోధన మొదలైంది; స్త్రీలు కోసిన మొక్కలకి ఆత్మలు ఉంటాయాని ఆశ్చర్యపోయాడు.

ప్రాణమున్న ప్రతీదానికి ఆత్మ అనేది వుంటుందని, తను కట్టలు కట్టి తలమీద పెట్టుకున్న మొక్కలు కూడా జీవులేనని, వాటికీ ఆత్మ వుంటుందన్న భావన కలగడంతో అతని తల భారంగా మారింది.

మనుషులు ఉపయోగించే వృక్ష సంతతిని నిర్దాక్షిణ్యంగా నాశనం చేసినప్పుడు పశువులు, పక్షులు చచ్చిపోయినంత బాధపడ్డాడు. ఒకవేళ తప్పు చేస్తున్నామన్న భావన లేకుండా ప్రజలు వాటిని నాశనం చేస్తే అవి మరో దేవుడి సృష్టి అని తను భావించగలడా?

మట్టిదారిలో తన ఊరి వైపు వెళ్తున్న పరయ్యకి వర్షం పడి ఆగిన తర్వాత మడుగులో కప్పల బెకబెకలు వినిపిస్తున్నాయి. తడి తడిగా వున్న నేలపైకి చీమలు పుట్టలోంచి బయటకి వచ్చి వరుసగా ఒకదానివెంట మరొకటి ఎంతో పొందికగా వెళ్తుండడం కన్పించిందతనికి. ఒక చీమకి ఇబ్బంది కలిగితే మిగిలిన చీమలు ఇబ్బందిలోనున్న చీమను రక్షించడానికి పాకుతూ పోతున్నాయి. ఆ చీమలు ఒకదానితో మరొకటి ఐకమత్యంతో, సంఘీభావంతో కలసికట్టుగా మెలగాలని వాటిని సృష్టించిన భగవంతుడు, వాటినలా ఉండమని ఆదేశించాడేమోనని ఆశ్చర్యపోయాడు పరయ్య. ఇంతలో దూరంగా కుక్కలు మొరగడం వినిపించిందతనికి. రోడ్డు పక్కన మురికి వాసన ముక్కుపుటాలకి తాకుతోంది. మురికి గురించి అతనికి బాగా తెలుసు. మురికి, దుర్గంధం మధ్యన జీవించాడతను. అయినా మానసిక దుర్బలుడు మాత్రం కాదు. అంతేకాదు ప్రతీదానికి ప్రతిస్పందించే అలవాటు అతనికి లేదు.

దారిలో ఆడకుక్క, మగకుక్క జతకూడడం కనిపించిందతనికి. జతకూడినప్పుడు అవి ఇబ్బంది పడలేదు. కానీ పెనవేసుకున్న తర్వాత స్పర్శకాలని లోపలికి లాక్కోలేక, విడివడలేక కొంతసేపు పెనుగులాటతో బాధగా మూలిగాయి. ఆ తర్వాత అరుచుకున్నాయి. కుక్క పరిభాషలో చెప్పాలంటే అవి బొయ్యిమని మొరుగుతూ పోట్లాడుకున్నాయని చెప్పవచ్చు. పరయ్య వాటి సుఖభోగేచ్ఛ గురించి ఆలోచించసాగాడు. అది సుఖానుభూతితో కూడిన బాధ. ఒక కుక్కని మరో కుక్క నాలుకతో ఆత్మీయంగా నాకుతోంది. జంతువులు నాలుకతో నాకుతూ ప్రేమించుకుంటాయేమో అతనికి తెలియదు కానీ అవి అలా ప్రవర్తించడానికి కారణం ప్రేమ మాత్రమేనని అతనికి తెలుసు. పెనవేసుకున్న తర్వాత అవి ఓ అసాధారణమైన బాధకి గురవుతాయి. తను కూడా అలాంటి బాధ అనుభవించాడు. తను రోజంతా పనిచేసి కోసి ఎండబెట్టిన మొక్కల్ని వదిలి వెళ్లేటప్పుడు కొత్త వరి వంగడాలని లూటీ చేసినంత బాధపడ్డాడు. అంతేకాదు, భూస్వామి ఆజ్ఞాపించినప్పుడు కోడిని అందుకుని, దాని పీక కోసినపుడు కూడా చాలా బాధపడ్డాడు. కానీ కోడికూర తినాలని ఎప్పటినించో అనుకుంటున్నాడతను. తనకి కోడి కూర అంటే చాలా ఇష్టం. కానీ కోడిని కోసినందుకు బహుమతిగా తనకి ఉండని మాంసం, ఎముకలే మిగులుతాయి. భూస్వామి కుటుంబంలోని వారందరికీ మాంసం లభిస్తుంది, వాళ్ల స్వహస్తాలతో కోడి కోసిన పాపం చేయలేదు గనక. కోడి కోయాల్సిందిగా పురమాయించిన వాళ్లు, తినేవాళ్లు పవిత్రులు. కోడి కోసిన అతను, కోడి మాత్రం పవిత్రం కాదు. పవిత్రత, అపవిత్రత ఎండమావుల్లాంటివని అనుకున్నాడు పరయ్య.

పరయ్య నడుస్తూనే ఆలోచిస్తున్నాడు. కుక్కలు పెనవేసుకున్న తర్వాత బాధపడతాయి. అయినా సరే అవి మళ్ళీ కలుసుకుంటాయి. అవి జతకూడి కొత్త కుక్కలకి జన్మనిస్తాయి. బతుకు చక్రంలో భ్రమణం చేస్తూనే వుంటాయి. సంతోషం, బాధ ఆ బతుకు చక్రాన్ని తిప్పుతాయి. అయినా పరయ్య తన జీవితంలో ఏనాడూ సుఖపడలేదు. అంతేకాదు కోళ్ళని చంపడం, ధాన్యం పోగుచేసి మోపుకట్టడం లాంటి పనులు చేసేది ఇతరుల కోసమే గాని తన కోసం, తన పిల్లల కోసం కాదు. వరి పొలానికి నీళ్ళు పెట్టడం, ఎరువులు వేయడం, ఇంకా యజమాని పశు సంపదని మేపడంలోనే అతను సంతోషాన్ని అనుభవిస్తాడు. ఈ పనులన్నీ అతన్ని పాపిగా చిత్రీకరిస్తే, పొలం పాడి పశువులు వున్నా, వాటిని పోషించని అతని యజమాని మాత్రం పవిత్రుడు. తనకి తెలిసినంతవరకు వాస్తవంగాను, న్యాయబద్ధంగాను తినడం పవిత్రమైంది. భూస్వామి గ్రామ ప్రయోజనం కోసం తింటాడు. పురోహితుడు భగవంతుని ప్రీత్యర్థం తింటాడు.

పరయ్య ఆలోచనలు తన ఇంటిపైకి, పేదరికంపైకి మళ్లాయి. కడుపునిండా తిండి వుంటే సుఖం. కుక్కలకు మల్లే సంతోషం, బాధతో కూడిన జీవితాన్ని తను ఇష్టపడేవాడు.

కానీ సుఖం తర్వాత కలిగే బాధ అతను ఎరగడు. అందుకే బలవంతంగా మానవుడి బతుకీడుస్తున్నందుకు కుక్కలా అంతులేని బాధననుభవించాడతను.

కరువు కాటకాలు సంభవించే ముందు వేసవిలో రోడ్డుపైన ఊడ్చిపారేసిన మృత కళేబరాల మాంసం తిని తాను, తన కుటుంబం కడుపు నింపుకున్నారు. గాలికుంటు రోగం వచ్చి రోడ్డుపైన చచ్చిపడివున్న జంతువులు, గొడ్డుమాంసం వాళ్ల పూర్వీకుల ఆహారం అయినప్పటికి వాళ్ళు ఎన్నడూ బెదిరించి అడగడం గాని, ఓ హక్కుగా అడిగి రాబట్టుకోవడంగాని చేయలేదు. ఎద్దుమాంసం పిల్లలకి పెట్టాలనే ఆలోచన ఉన్నంత మాత్రాన ఆరోగ్యవంతమైన చిన్న ఎద్దు కూడా వాళ్ల కోసం రోడ్డుమీద చచ్చిపడి వుండదు. ఆవు ఉదరంలోని భాగాల్ని తినాలని వాళ్ల చిరకాల కోరిక. అంతేకాదు, గొర్రె – మేకమాంసం గాని, కోడిమాంసం గాని గత కొన్నేళ్లుగా వాళ్లు తినలేదు. కొన్ని కుటుంబాలలో వాటిని తినకపోవడం తరతరాలుగా కొనసాగుతోంది. కనీసం గ్రామంలో ఉత్సవాలు జరిగే సమయాల్లో కూడా వాళ్లకి ఆ అవకాశం లభించదు సరికదా అదనంగా మిగిలిపోయిన మాంసం ముక్కలు యజమానుల ఇళ్ల వెనక పెరటివైపు వృధాగా పారేసినవి దొరికినా వాటిలో మాంసం కన్నా బొమికలే ఎక్కువగా ఉంటాయి.

ఒకరోజు కుక్కలతో పాటు తన పిల్లలు కూడా ఆ బొమికల కోసం ఎగబడినట్టుగా పరయ్యకి కల వచ్చింది. కానీ నిజ జీవితంలో ఎన్నడూ అలాంటి సంఘటనల్ని చూడదలచుకోలేదతను. అసలు తప్పు కుక్కలది కాదు; ప్రకృతిలో ఒకటై జీవించడం మటుకే తెలిసిన పరయ్య కుటుంబానికి కుక్కలకి అవినాభావ సంబంధం వుంది. అంతేకాదు, అతని ఇంటి చుట్టూ కుక్కలు యథేచ్ఛగా తిరుగుతుంటాయి. అవి పరయ్య పిల్లలతో ఆడాలని తహతహలాడ్తాయి. ఆ కుక్కలు చుట్టుపక్కల వీధుల్లో తిరిగే మరికొన్ని కుక్కలతో కలిసి ఎంతో వాత్సల్యంతో దొరికిన ఆహారాన్ని పంచుకుని తింటాయి. నిజానికి ఈ కుక్కలు నిమ్న కులస్తులయిన శూద్రులకి, అంటరాని వాళ్లైన పరయ్యా కుటుంబాలకి చెందినవి కావు. కుమ్మరి పిల్లలు, గొల్లెల కాపరుల పిల్లలు ఇంకా వడ్రంగుల పిల్లలు వాళ్ళ వీధి దాటి ఎన్నడూ తన ఇంటిని చూడలేదు. కానీ కుక్కలు మాత్రం శూద్రుల ఇళ్లలోను, తన ఇంట్లోను ఆహారాన్ని దొంగిలించి తింటాయి. వ్యర్థాల కోసం కొట్లాడుకుంటాయి. వీధిలో వున్న మట్టిపాత్రలని పూర్తిగా నాకి పెరటి వైపున్న వంటింటిలోకి పరుగెడ్తాయవి. మనుషుల్లో ఉన్నట్టుగా ఈ కుక్కలకి కులాల వర్గీకరణ, ప్రాంతీయ భేదాలు ముద్రవేయడంలో హిందూ దేవతలు విఫలమయ్యారు. వాటికి కులం లేదు. కులంతో వాటికి పనిలేదు. అందుకనే అవి మనుషులతో సంబంధాలు పెట్టుకుంటాయి, ఏ బాధలూ లేని, సంతానోత్పత్తితో మగకుక్కకు బాధలేని సంబంధమది.

కుక్కలతోను, కుక్కల సమానులతోనూ సంపర్కం లేకుండా ఉండడానికి గాను బ్రాహ్మణులు ఈ వీధికి దూరంగా గ్రామానికి ఆవలవైపు నివసిస్తారు. భూస్వాముల భూములైన అగ్రహారాలలో వాళ్లు నివసిస్తారు. వీరు ఉత్పాదక మనుషుల నుండి, సామాజిక సంబంధం వున్న కుక్కల నుండి, బరువులు మోసే గాడిదల నుండి దూరంగా నివసిస్తారు. బ్రాహ్మణులు వాళ్లలో వాళ్లు సంబంధాలు కల్గియుండటంతో పాటు ఆర్జన ఉన్న దేవుళ్లతో కూడా నేరుగా సంబంధం కల్గివుంటారు. వారి దృష్టిలో కుక్కలు, దేవుళ్లు పరస్పరం శాశ్వత వైరుధ్యం గలవి. హిందూ దేవతలు ఛండాలురని, పరయ్యలని లేదా కుక్కలని సృష్టించే నైచ్యానికి దిగజారలేదు కాబట్టే బ్రాహ్మణులు వాటిని అధికంగా ద్వేషిస్తారు. పరయ్య భావనలో దానికి సాక్ష్యమేమంటే బ్రాహ్మణులు పై మూడింటిని మలంకన్నా ఎక్కువగా ద్వేషిస్తారు. కారణం, భగవంతుడి శిరస్సు నుంచి పుట్టిన బ్రాహ్మణుడి మలం కూడా అతడి శరీరం నుండి పుట్టడమే. అంతేకాదు, ఆ మలం వాళ్లు ఏ మాత్రం లక్ష్యపెట్టని పరయ్య దేహం కన్నా ఎక్కువగా గౌరవించదగినది.

పరయ్య బిగ్గరగా నవ్వాడు. ఈ రోజు అతని మనస్సు వ్యాకులంగా వుంది. తనలో చోటు చేసుకున్న ఆలోచనలతో అతని హృదయం అలసిసొలసి కలుగులోకి పరుగెత్తే ఎలుకలా మారింది. అతను తాను పడ్డ కష్టాలు, బాధల గురించి, తిండి గురించి ఆలోచించసాగాడు. పిల్లలు మదిలో మెదిలారు. వాళ్లు ఆ దేవుడిచ్చిన వరం. అయినా వాళ్ల భవిష్యత్తు నిరాధారం, భయంగొల్పేది. అయితే ఈ కుక్కలు వాటి పిల్లల గురించి చింతిస్తాయన్న ఆలోచన అతడిని ఆశ్చర్యపరిచింది. పిల్లలు ఆకలితో వున్నా, గాయపడ్డా తల్లి కుక్క వెంటనే వాటి దగ్గరకు పరుగెడుతుంది. కానీ తండ్రి కుక్క అలా కాదు. దానికి బాధ్యత పట్టదు. పరయ్య మళ్లీ ఆలోచనలో పడ్డాడు. తను తండ్రి కుక్కలా అదృష్టవంతుణ్ణి కాదనుకుంటున్నాడు. ఒకవేళ బాధ్యత వహించాలనుకున్నా తండ్రి కుక్క దాని పిల్లల్ని ఎలా గుర్తిస్తుంది? సాధారణంగా కుక్కలకి వావివరుసలుండవు. అటువంటప్పుడు దాని పిల్లలేవో దానికి ఎలా తెలుస్తుంది? అలాగే నాకూ నా పిల్లలెవరో తెలియకుండా వుండినట్లయితే నేను కూడా స్వేచ్ఛగా తిరిగేవాడిని. కేవలం అంటరానివాళ్లలో సగం మందే బాధపడేవాళ్లు. తల్లులు పాలివ్వడానికి పిల్లల్ని అంటిపెట్టుకుని వుండేవాళ్లు. పురుషులు తాత్కాలిక బాధకి సంతోషించేవాళ్లు. పిల్లల బాధలు, ఆకలి, దిగంబరత్వం, అవిద్య, దురదృష్టంలను పట్టించుకోకపోవడంతో నిత్యానందం పొందేవాళ్లు. పరయ్య ముందుకు సాగుతున్నాడు. నడక వేగం హెచ్చింది. మరోసారి పరయ్య మదిలో ఆలోచనలు చెలరేగాయి. అసలు మనుషులు బట్టలు ఎందుకు కట్టుకుంటారు? కుక్కలు, పశువులు బట్టలు ఎందుకు కట్టుకోవు? అందరూ గనక దిగంబరంగా వుంటే తనకీ ఓ బాధ తప్పేది. కాని దుస్తులు ధరించాలన్నది ఆ దేవుడి కోరిక అని అందరూ అంటుంటారు. వాళ్ల పిల్లలు రంగు రంగుల బట్టలు తొడుగుతారు. నా పిల్లలు నగ్నంగా తిరుగుతారు. నేను అర్ధనగ్నంగా తిరుగుతాను. నా భార్యకి ఒక చీర జాకెట్టు వున్నాయి. కట్టుకోవడానికి సరిగ్గా గుడ్డల్లేవు ఇంకో జత వుంటే బాగుంటుందని దాని ఆలోచన. పిల్లలు కూడా తొడుక్కోడానికి గుడ్డల్లేక అల్లాడిపోతున్నారని అనుకుంటుంది. వాస్తవానికి దేవుడు మాకు ఇలాంటి ఆలోచన పెట్టి వుండాల్సింది కాదు. తను ఎప్పుడూ నా గురించి, పిల్లల గురించి ఆలోచిస్తూంటుంది. మాకు కూడా పశువుల్లా ఎటువంటి ఆలోచనలు లేకపోయివుంటే బాగుండేది. ఇంతలో తన నడక దారిలో మలుపు రావడంతో పరయ్య అటువైపు వెళ్లాడు.

తను మాత్రం ఏం చేయగలడు? గొడ్డు మాంసం తినడం మానాలా? గాలిని ఆహారంగా తీసుకుని బతకాలా? కుక్కలు, గాడిదల్లా జీవించే మౌలిక లక్షణాలు తనకి ఇవ్వకపోవడం దేవుడి తప్పిదం కాదా? పరయ్య సాగిపోతున్నాడు. దారిలో అడ్డంగా

బురదగుంట కనిపించడంతో గుప్పించి దూకాడు. వర్షం, గాలి కూడా భూమిని తాకుతాయి. తాను మాత్రం అంటరానివాడు కావడంతో దాన్ని తాకలేదు. అతనికి ప్రపంచమంతా అంటరానిదే. అవతల వీధి మొదలుకుని ఆ పైన వుండే బ్రాహ్మణ భూములవరకు. అతను నేలపైన నడిచినందువల్ల ఏర్పడే కాలుష్యం ఎన్నటికీ శుద్ధికానిది. ఒకవేళ అతను ఏ పూజారినో తాకితే తన అంటరానితనం మాయమౌతుంది. అది ఉనికిలో లేకుండా పోతుంది. కానీ లేదు.. లేదు.. పూజారిని తాకడమంటే హిందూ దేవుళ్లని తాకడమే. ఆ దేవుళ్ల భుజాలు, కాళ్ళూ చేతులు, తలలు, ఆయుధాలు, కవచాలు, కత్తులు, త్రిశూలాలు, గొడ్డళ్ళు ఇంకా... అటువంటి సంఘర్షణతో కూడిన జీవితం తనెలా తాకాలని ఆశించగలడు? ఇలా ఎన్నో ప్రశ్నలు.

పరయ్యకి వణుకు పుట్టింది. మరి అటువంటప్పుడు తాను పుట్టడానికి దేవుళ్లు ఎందుకు సమ్మతించినట్టు? దానితో ఒకవేళ దేవుళ్లకి సంబంధం లేకపోతే పెద్ద దేవుళ్ల శత్రువులు ఇతరమైన దేవుళ్లు ఈ పతితుల్ని పుట్టించడానికి ఉన్నారా? ఆ ఇతరమైన వాళ్లు ఎక్కడున్నట్టు? వాళ్ల పని వాళ్లు ఎందుకు చేయడంలేదు? వాళ్ల అనుయాయులకి పెద్ద దేవుళ్లు మణిమాన్యాలు ఇచ్చి వాళ్లకి ఓ స్థాయిని కల్పించారు. తన జీవితం కూడా ఆ ఇతరమైన దేవుళ్ల పరమైతే ఏదో విధంగా వీలు చూసుకుని ఆ విషయం వాళ్లని అడగాలనుకున్నాడు పరయ్య.

ఈ రోడ్డుని తాను నడవడానికి ఉపయోగిస్తున్నందుకు పరయ్యలో మళ్ళీ వణుకు మొదలైంది. ఎవరైనా చూస్తే ఎలాగన్న విషయం కూడా తను ఆలోచించదలచుకోలేదు. తన స్పర్శ, నీడ, ఊపిరి ఓ వ్యాధిగ్రస్థుడిలా కాలుష్య కారకాలు. కానీ వాస్తవానికి తను సంపూర్ణ ఆరోగ్యవంతుడు. అలసిపోయినా, అర్థాకలితో అలమటించినా, కష్టాల్లో బాధల్లో ఉన్నా కూడా తను ఆరోగ్యవంతుడే. మరి అటువంటప్పుడు సమాజం రోగభూయిష్టమయిందని అనుకోవాలా? అంటే తనలో ఓ రకమైన మలినం వుందా, తన జీవితానికి గుర్తుగా అంటరాని విధమైన పేరున్నట్టుగా. ఆ చరిత్ర తనలోనే వుంది. తన ఇంటి చరిత్ర 'అంటరానితనం.'

ఓ, తనకి ఆత్మ అనేది వుంటే అది కూడా అంటరానిదే అవుతుంది. అది ఎలా కనిపిస్తుంది? దాని రంగు ఏంటి? మిగతా ఆత్మల కన్నా అది ఎలా భిన్నమైంది? అది ఒకేలా కనిపించే రక్తంలా ఉంటుందా? భయంకరమైన దాని దృఢత్వం తన జీవితంలో

బాధపడ్డ సంఘటనల్ని గుర్తుచేస్తూ మదిని తొలుస్తోంది. తన శరీర ఉనికి చిత్రహింసల చరిత్రకి అలవాటైన గృహమేనని ఆత్మశ్లాఘన చేసుకున్నాడు పరయ్య.

గ్రామాల్లోని గోడల మీద రాతలున్నాయి. 'మనమంతా మేలుకోవాలి... వాలి... వాలి...! కానీ మేలుకొలిపేదెవరు? దేనికోసం? అసలు నిద్రించేది తనొక్కడేనా? పరిపరి విధాలా ఆలోచిస్తూ తలవంచి నడుస్తున్నాడు పరయ్య. ఇంతలో తన వీపు మీద ఎవరో గట్టిగా గుద్దినట్టు అనిపించిందతనికి.

ఏమిటిది అనుకుంటూ ఒక్క క్షణం ఆగి బిత్తరచూపులు చూశాడు. వెంటనే ఒక బలమైన గుద్దు అతని వీపు మీద పడింది పెద్ద శబ్దంతో.

'ఓరి దేవుడోయ్... చస్తున్నాను!" అంటూ పెద్దకేక వేశాడు. మళ్లీ గట్టిగా బాదారు. అతను నేలమీదకు జారిపోయేంతవరకు కొడుతూ 'బాస్టర్డ్, ఆత్మ, పరమాత్మ, కులం వంటి గంభీర విషయాలు ఆలోచించడానికి నీకెన్ని గుండెలు అంటూ ఓ అనామకుడు గర్జించిన మాటలు వినిపించాయి. 'దాని అర్థం... సమానత్వమా? ఓ ఆడకుక్కకి పుట్టిన వాడివి. నువ్వు కూడా ఆలోచించడం, అర్థం చేసుకోవడం మొదలెట్టావా? నువ్వు కూడా!'

"వద్దు వద్దు కొట్టొద్దు కొట్టొద్దు... మీకు దణ్ణవెడతాను. అయ్యలారా! నేను మీ బానిసని. లేదు, లేదు మీ నౌకర్లకి నౌకర్ని! నన్ను చంపొద్దు అయ్యా. మీ పాదాల దగ్గిర పడుండేవాణ్ణి. నా తల కన్నా ఎక్కువ విలువైనవి అవి. నేనొక్కడినే కాదు అయ్యలారా. నా పిల్లలు ఇంకా వాళ్ల పిల్లలు (మనుమలు) మీ కాళ్ల దగ్గర పడుంటారు. ఇదిగో అయ్యా నా తలని నీ పాదాలపైన వుంచుతున్నా. నా పుట్టుకే అందుకు. మరెందుకూ కాదు. నన్ను దయదల్చు. అయ్యలారా నన్ను వదిలేయండి..." అంటూ బిగ్గరగా అరిచాడు పరయ్య.

అగంతకులు కొట్టడం ఆపారు.

'నన్నెందుకు కొట్టారు?

నేనేం తప్పు చేశాను?

ఎవరికి అపకారం చేశాను?'

సగం అచేతనావస్థలో నసిగాడు పరయ్య. అందుకు సమాధానంగా మాటలు విన్పించాయి పరయ్యకి.

"ఏమిట్రా పేలుతున్నావ్? ఒళ్లు దగ్గర పెట్టుకుని బతుకు.

ముందు మీ ప్రాణాల గురించి ఆలోచించి ఆ తర్వాత సర్వ సమానత గురించి ఆలోచించు. అంతా మీ మూర్ఖత్వం. నీ మొహం చూస్తేనే తెలుస్తోంది. నువ్వెలాంటి వాడివో నువ్వేం ఆలోచిస్తున్నావో. నువ్వు నడిచేటప్పుడు వెనకనించి, పక్కనించి ఎవరొస్తున్నారోనని కూడా చూట్టంలేదు. పరయ్యలు ఆలోచించడం మొదలు పెడితే ఎంత ప్రమాదకరం? స్వర్గంలోని దేవుళ్ళు, భూమ్మీదున్న దేవుళ్ళు ఆలోచించడం ఆపేస్తారు. స్వర్గం పతనమై నరకం ఈ భూమ్మీద కొస్తుంది..."

"ఊహించలేం... ఊహించలేం" అరిచింది మరో గొంతు.

మరో గొంతు హెచ్చరిస్తున్నట్టుగా అంది, "కులం గురించి ఆలోచించకు. 'కులం'లోనే బతుకు. కులం కులమే. నువ్వు దాని గురించి ఆలోచించడానికి వీలు లేకుండా సృష్టించబడింది. పరయ్యల ఆలోచనలు గ్రామానికి అరిష్టం... ఈ ప్రాంతానికి... ఈ దేశానికి... ఈ ప్రపంచానికి కూడా అరిష్టం. ఈ నేల మీదున్న మన దొరలంతా ప్రపంచమంతటా కులాలన్ని ఆచరణలో పెట్టాలనుకుంటుంటే నువ్వు దానిని ఇక్కడే సమాధి చేయాలనుకుంటున్నావా. మన దేవుళ్లు ఏమయ్యారనుకుంటున్నావు? ఈ మధ్యన అంటరాని బాస్టర్స్ అంతా ఆలోచిస్తున్నారు. దేవుడి గురించిన ఆలోచన : పేరూ ఊరూ లేని దేవుడి గురించి ఆలోచిస్తున్నారంటే మీరంతా ముస్లింలుగానో, క్రిస్టియన్లుగానో మారాలనే. పేరూ ఆకారంలేని దేవుడెవరు?" అంటూ పరయ్యని కాలితో బలంగా ఒక్క తన్నుతన్నాడు.

మరో వ్యక్తి కలుగజేసుకుంటూ అన్నాడు, మీ వెనుక ఏదో బలీయమైన శక్తి, కుట్రలు వున్నాయి. తెల్లవాళ్లు కొందరు మీలో ప్రవేశించి మరో ఆత్మని సృష్టిస్తున్నారు. మీరు గనక దాన్ని పెంచి పోషిస్తే ప్రమాదాన్ని కొనితెచ్చుకున్నట్లే. ఆర్యుల పవిత్ర భూమి ఆర్యావర్తం అంతమైపోతుంది. హిందూ దేశమైన ఈ భరతఖండం కాలి బూడిదైపోతుంది. ఆత్మ పరమాత్మని గురించి తెలుసుకోవాలన్న పరయ్య ఆలోచించిన పాపానికి మన ఉనికికి చరమగీతం పాడినట్లే.

అచేతనావస్థనుంచి నెమ్మదిగా లేచాడు పరయ్య. అతను మంచం మీద పడుకున్నాడు. తన జీవితంలో ఇదివరకు ఎన్నడూ ఇలా జరగలేదు. శరీరం చచ్చుబడినట్లయింది. కానీ ఏదో శక్తి 'దేహం' నుంచి విడివడిన తన ఆత్మని తిరిగి శరీరంలోకి తీసుకురావడానికి కొట్టుమిట్టాడుతోంది. అతని భార్య బయట నిలబడింది. 'దేవుడా నీకు మేమేం అపకారం చేశాం! మేమేం అపకారం చేశామని?' అంటూ భార్య అరుపులు వినిపిస్తున్నాయి.

పరయ్య పక్కన కూర్చున్న జక్కరయ్య ప్రార్థన చేస్తున్నాడు. తాలూకాలోని నరకాపుర గ్రామంలో ఓ చిన్న ఆస్పత్రిలో వున్నట్టు గ్రహించాడు పరయ్య. తెల్లపిశాచాలు వాళ్ల పాపాలని ఈ నేలమీద మరింతగా విస్తరింపజేశారని గ్రామాధికారి ఉద్దేశం. ఆ ప్రాంతానికి చెందిన గ్రామాధికారులు మాట్లాడుకోవడం విన్నాడతను : "ఆస్పత్రులు పాపపంకిలమైనవి. ఎందుకంటే పురుషులు స్త్రీలు కులస్తుడూ, కులహీనుడూ అన్న భేదం లేకుండా అందరూ అక్కడికి వెళ్తారు. వాళ్లు కూర్చుంటారు, నిలబడతారు. అంతేకాదు, ఎలాంటి కుల మత భేదాలు లేకుండా ఒకటే తరహా పక్కలు. ఒకవేళ స్త్రీలు వస్తే అక్కడి డాక్టర్లు చేయగలుగుతారు. తండ్రులకి ఎలా తెలుస్తుంది అక్కడపుట్టిన పిల్లలు తమకే కలిగారని?

అది మాత్రమే కాదు, అంటరానివాళ్ల ముడ్డిలో చేతులు పెట్టి ఆ చేతులనే మన నోటిలో పెడ్తారు. ఆస్పత్రులు తెల్లవాళ్లు స్థాపించిన వ్యభిచార గృహాలు".

పరయ్య భార్య మళ్లీ గుండెలు బాదుకుంటూ ఏడవసాగింది. "అయ్యో బగమంతుడా! మా మనిషి నిన్ను ఎప్పుడు ఏం చేశాడు? అతను ఏనాడూ ఎవరికీ ఏ అపకారం చేయలేదు. మాటలు రానివాడిలా మౌనంగా ఉంటాడు. అతని చేతులు పనిముట్లు. ఈ గ్రామం కుళ్లు కంపు కొట్టకుండా ఎన్ని శవాలు తొలగించాడని? రోజంతా ఎర్రటి ఎండలో రెక్కలు ముక్కలు చేసుకొని మంచి మంచి ఇళ్లు ఎన్ని కట్టించాడని? ప్రజలు చక్కగా నడవడానికి ఎన్ని జతల చెప్పులు కుట్టాడని? వాళ్ల పాదాలని అతను మా తలలకన్నా ఎక్కువగా భావించలేదా? అలాంటప్పుడు వాళ్లు అతడిని ఎందుకు చంపినట్టు?" అని బావురుమంది.

అదంతా ఓ రేడియో నాటకంలా విన్నారు అక్కడున్న జనాలు. ఒకడు మరో వ్యక్తితో అన్నాడు, "చూడు, చూడు, పాపాలు ఎలా పెరిగిపోతున్నాయో. పరయ్యలు మంచాలపైన పడుకుని మనల్ని నేలమీద పడుకునేలా చేస్తున్నారు. ఓ పరయ్యని కొట్టడంలో తప్పేముంది? వాళ్ల బతుక్కి అదే ఎక్కువ. డాక్టర్లకి కంప్లయింట్ చేయడం, మర్యాదస్తుల మంచాల్ని లూటీ చేయడంలాంటివి వాళ్లు మానుకోవాలి."

ఆ రాత్రి వేదశాస్త్రి ఇంటి దగ్గర సమావేశం జరిగింది. బెంగాల్‌కి చెందిన బెనర్జీ, మహారాష్ట్రకి చెందిన తిలక్, కర్నాటకకి చెందిన కృష్ణమూర్తి, కేరళకు చెందిన నంబూద్రి ఇంకా ఆంధ్రాకి చెందిన అప్పారావు వలయాకారంలో కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తున్నారు. ఇంట్లోని స్త్రీలు వంటగదిలో ముప్పై మూడు రకాల ఆహార పదార్థాలు వండుతున్నారు. అవి దివ్యమైన నైవేద్యం కోసం వండుతున్న వంటకాలు. స్త్రీలు మడిగా తడి బట్టలు కట్టుకోవడంతో వణుకుతున్నారు. తడిగాను, అర్థపారదర్శకంగాను ఉన్న

వస్త్రాలు రొమ్ముల్ని, తొడల్ని, పిరుదుల్ని బిగుతుగా అతుక్కుపోయి వున్నాయి. తడిబట్టలతో మడిగా వంటచేస్తే దేవుళ్లకి తృప్తి కలుగుతుందని అంటారు. సరిగ్గా అప్పుడే బొంగరంలా అటూ ఇటూ తిరుగాడుతూనే నోరు మూతపడకుండా మాట్లాడుతూ వుండే ఓ వృద్ధురాలు 'రామ, క్రిష్ణ, శంకరా' అంటూ సణిగింది. దాంతో కూరగాయలు తరుగుతున్న ఓ యువతి తలెత్తి ఆమె వంక తీక్షణంగా చూస్తూ 'ఈ మడి తడి జీవితాలంటే నాకు చిరాకు" అంటూ పొద్దున లేచిన దగ్గర్నుంచి రాత్రి పడుకునేదాకా ఎలుక కలుగులాంటి ఈ వంటింల్లో మగ్గిపోతూ మేము ఎన్నడూ తినని రుచికరమైన భోజన పదార్థాలని వండి తయారుచేస్తాం. మా మగవాళ్ల పొగడ్తల్ని, చివాట్లను బట్టి పదార్థాల రుచులు ఎలా వుంటాయో తెలుసుకుంటాం. మనకన్నా ఆ శూద్ర ఆడోళ్ళు, ఛండాల ఆడోళ్ళే నయం" అంది.

చీర కొంగుతో మెడపైన పట్టిన చెమట తుడుచుకుంటూ ఆ వృద్ధ స్త్రీ దీర్ఘంగా నిశ్వసిస్తూ భావగర్భమైన అంగవిన్యాసంతో "అలా మాట్లాడకు. మగాడు కనీసం వాసన కూడా చూడకముందే రుచులని గురించి మాట్లాడితే వితంతువవుతావు. అప్పుడు నీ కింది భూమి ఎలా విచ్చుకుంటుందో నేను చెప్పాల్సిన పనిలేదు. మగాళ్లు మగాళ్లే. ఎద్దుబండిలాంటి ఆడవాళ్లం మనం. వాళ్లు ఛస్తే ఎద్దులేని బండిలా మారతాం. తగలడ్డానికి తప్ప మరెందుకు పనికిరాదు. ఇప్పుడు తెల్లవాళ్లు పాత పద్ధతులకి స్వస్తి పలికిన తర్వాత పరయ్యలాంటి దుష్టులు కూడా భగవంతుడి గురించి ఆలోచించడమన్నది మన చుట్టుపక్కల జరుగుతోంది" అంది.

ఆ మాటలు వినగానే ఆ యువతి మొహం పాలిపోయింది. ఆమె తల వంచుకుని పనిచేసుకోసాగింది. ఆ యువతికి ఓ కొడుకున్నాడు. ఇప్పుడు వితంతువయ్యే విషయం అనాలోచిత ప్రారబ్ధం.

ఆ ఇల్లు ప్రార్థనలతో ప్రతిధ్వనిస్తోంది.

ఓమ్ భూర్భువః స్వః

తత్సవితుర్వరేణ్యం

భర్గో దేవస్య ధీమహి

ధియో యోనః ప్రచోదయాత్

(ఏ భగవంతుడు మా యొక్క బుద్ధిని ప్రేరేపిస్తాడో, (అలాంటి) ప్రేరణ కలిగించే భగవంతుని శ్రేష్ఠమైన తేజస్సును ధ్యానిస్తున్నాను.)

అక్కడంతా పరిమళభరితమైన ధూపం చుట్టూ దట్టంగా అలముకుంది. పూలబుట్టలు, పచ్చని ఆకుల సంచులు పరుచుకున్నాయి. అక్కడ పరచిన ఖాదీ రగ్గుల మీద గొప్ప గొప్ప వ్యక్తులు కూర్చున్నారు. వాళ్లకి కొంచెం దూరంగా ప్రధాన పురోహితుడు వేదశాస్త్రి పులిచర్మంపైన ఆశీనుడై వున్నాడు. ఆ పులి చర్మం పైతృకాస్తి (వారసుడికి సంక్రమించే మృతుడి సామగ్రి)గా ఆయన ముత్తాత వేదశాస్త్రి నుంచి సంక్రమించింది. అతని కుటుంబంలోని కొందరిని శర్మ అని పిలుస్తారు. కాలక్రమంలో అతని దగ్గరికి వచ్చేసరికి వంశపరిశీలన కారణంగా అది శాస్త్రిగా మారింది. కానీ ఆ రెండు పేర్లు కూడా వేదాలు, శాస్త్రాలు, పురాణాల ప్రావీణ్యతని తెలియజేస్తాయి.

తమిళ బ్రాహ్మణుల మూలాల గురించి రెండు కాల్పనిక గాథలు ప్రాచుర్యంలో వున్నాయి. మొదటిది ఉత్తరాన ఆర్యావర్తంలోని కొందరు బ్రాహ్మణులు రామాయణంలో వివరించిన యుద్ధ సమయంలో వీరుడైన రాముడితో పాటు దక్షిణాన ముఖ్యంగా తమిళ దేశానికి వలసపోయారు.

రెండవది, తమిళ బ్రాహ్మణులు దైవ వాక్కుతో సమానమైన పరమ సత్యంగా నమ్మేది. అదేమంటే, ఆర్యుల మొదటి నివాసం తమిళ భూభాగమని. యూరప్‌కి చెందిన వాస్కోడిగామా, ఆ తర్వాత వచ్చిన బ్రిటిష్ వాళ్లు పొట్టిగాను, నల్లగాను చప్పిడి ముక్కు గల వారిని ఆ ప్రాంతానికి వలసపోయేందుకు ప్రోత్సహించారు, పొడవైన, ఎత్తైన ముక్కు వుండే అయ్యంగార్ ఇంకా అయ్యర్ బ్రాహ్మణులతో కలిసిపోయేలా, స్థానభ్రంశం చెందిన ఈ బ్రాహ్మణులలో చాలామట్టుకు దేశంలోని ఇతర ప్రాంతాలకి వెళ్లిపోయారు. వాళ్లు వెళ్లిపోతూ వాళ్లతో పాటుగా ఆర్య సంస్కృతిని కూడా తీసుకువెళ్తే మిగిలినవారు తమ ఆర్య భావజాలాలు, మతవిశ్వాసాలు చెక్కుచెదరకుండా నిలుపుకున్నారు. చారిత్రాత్మకమైన ఈ వాస్తవాన్ని నిరూపించేందుకు చాలామంది స్కాలర్లు విస్తృతంగా పరిశోధనలు గావించారు. వారిలో ఒకరు ఆక్స్‌ఫర్డ్‌లోని గౌరవనీయులు వాసుదేవ అయ్యర్. ఆయన తన రాబోయే పరిశోధనా గ్రంథం 'వాస్కోడిగామా : ది ల్యాండ్ ఆఫ్ ఆర్యావర్త అండ్ ది బిగినింగ్ ఆఫ్ ఇండియా' మీద పరిశోధన చేస్తున్నారు.

ఎంతో ఆతృతగా ఎదురుచూస్తున్న పండిత శ్రేణుల్లో ఈ గ్రంథం చర్చనీయాంశమైంది. ఈ మధ్యనే ఆక్స్‌ఫర్డ్ వెళ్లిన బెనర్జీకి ఈ గ్రంథం తొలి రాత ప్రతిని చూసే అవకాశం లభించింది. అతను ప్రొఫెసర్ అయ్యర్ పరిశోధనల్ని, పరిశీలనలని సంఘానికి ఒక్క గుక్కలో తెలియజేశాడు. విద్యావంతుడైన వాస్కోడిగామా ఆర్యావర్తంలోకి

తనతోపాటు తుపాకీమందు, ఫిరంగి గుండ్లు మాత్రమే కాక బీరు, గొడ్డుమాంసం వాసనల్ని కూడా తీసుకొచ్చినట్టుగా శాస్త్రీయ ఆధారాలున్నాయి. ఆ తెల్ల విజేత పవిత్ర నదులలో ముఖ్యంగా గంగలో మద్యం పోశాడు, ఎప్పటికీ కాలుష్యమయ్యేలా. తనకి తనవారికి అంటిన గొడ్డు మాంసం వాసనతో దివ్య నైవేద్యాల కోసం వంటల్లో ఉపయోగించే మసాలా దినుసులు కూడా కలుషితమయ్యాయి. ప్రొఫెసర్ అయ్యర్ యూరోపియన్ బీరు ఇంకా గొడ్డు మాంసాన్ని ఆక్స్‌ఫర్డ్‌లోని తన ప్రయోగశాలలో పరీక్షించి వాటిలో ఏదో గంభీరమైన హిందూ వ్యతిరేకత ఉందని కనిపెట్టాడు. నల్ల ఆవుల నించి సేకరించిన యూరోపియన్ మాంసం అత్యధిక కాలుష్యకారకం. అది ఏ శ్రేష్టమైన కులానికి చెందిన వ్యక్తికైనా నిశ్చయంగా ప్రాణాంతకమైనది. చారిత్రాత్మకమైన ఈ రసాయన విప్లవ చర్య, నాయకత్వం వహిస్తున్న హిందూదేవుళ్లని ఇండియాని వదిలి ఇప్పటికీ స్వచ్ఛమైన ఆర్యన్ హిందూయిజం అమలులో వున్న నేపాల్‌లో స్థిరపడేలా చేశాయి. అక్కడ కూడా తెల్లని హిప్పీ టూరిస్టులు, ఇంకా హానికరమైన బుద్ధిజం, ఇంకా జీసస్‌ని విశ్వసించే పడమట వాళ్లు వండిన గొడ్డు మాంసం ముక్కలు, పన్నెండు ఔన్సుల కొలతతో ద్రవం, పలావ్‌తో కూడిన నిందాపూరకమైన నల్లని మేఘాలు ఉండడంతో దేవుళ్లు తూర్పువైపుగా మరింత ముందుకు సాగలేకపోయారు. తురుష్కులు, మంగోలుల గొడ్డు మాంసం, పలావుల గురించిన విషయాలు పక్కనపెట్టినా, ప్రొఫెసర్ అయ్యర్ తన విశేషమైన వంశపరంపరకి సంబంధించిన విశ్లేషణ ప్రపంచంలోని మొత్తం ఆహార సంస్కృతి మీద ప్రభావం చూపగలదన్న విశ్వాసంతో వున్నాడని గుంపులోని వారందరికీ బెనర్జీ తెలియజేశాడు. ఈ ఆహార సంస్కృతి గురించి అక్కడున్నవారందరికీ తెలియజేయడానికి సంతోషిస్తున్నానని, ప్రస్తుత ప్రొఫెసర్ అయిన అయ్యర్ చేసిన అద్భుత కృషికి బహుమతిగా 'ఆల్ హిందూ అసోసియేషన్' ఆయనకి ఓటు వేశారంటూ బెనర్జీ ఉదహరించాడు.

"ఈ రోజు చాలా మంచి రోజు" అంటూనే వేదశాస్త్రి "పరయ్య నాశనం అయ్యాడు" అన్నాడు.

బెనర్జీ కొద్దిగా ఇబ్బందిగా కదిలాడు. అతను మాటకారి మాత్రమే కాదు, చేతల మనిషి కూడా. పవిత్రమైన విందు భోజనం కోసం ఎదురుచూస్తున్నాడతను. ఆ భోజనం పరయ్య రక్తపు కంపు కొడుతుందేమోనని ఆలోచించదలచుకోలేదతను. ఆ విషయంలో రక్షించినందుకు సానుభూతిగా నవ్వాడు కృష్ణమూర్తి. 'దేవుళ్ల ఆరగింపుకి ముప్పై మూడు రకాల ఆహార పదార్థాలని సమర్పిస్తారు. అందుకు ఆ దేవుళ్లకి మనమంటే ఇష్టముంటుందా?'

'మనం మన కల్పన ప్రకారం దేవుళ్లని సృష్టించాం' అన్నాడు అప్పారావు తీవ్రమైన విషయాలని అసందర్భ క్షణాన చెప్పే అలవాటు ప్రకారం. సురక్షితమైన పూర్వార్జిత పులిచర్మం మీద కూర్చున్న వేదశాస్త్రి అతని వంక చూశాడు. "మనం మాయ లక్షణాన్ని అంటే పరయ్య దేహం అంతం చేశాం" ఉరిమినట్టు అంటూ అప్పారావు, "ఆత్మలేని పరయ్య శరీరం కోసం నరకంలో దేవుడు ఎదురుచూస్తున్నాడు" అన్నాడు.

"ఆత్మ, శరీరం ఒకటి కాదు. ఎందుకంటే ఒకవేళ హిందూ దేవుళ్ల శరీరాలు నేపాల్ గనక వెళ్తే వాళ్ల ఆత్మలు మాత్రం ఎప్పుడూ ఇక్కడే మనతోపాటు తిరుగుతుంటాయి. మనుషులు ఇతర దేశాలకి వెళ్లి అక్కడివారితో కలిసిపోయినా వారి వారి ఆత్మలు పవిత్ర ఇండియన్‌గా ఉండిపోవడంలేదా? మనం ఆత్మ జాతీయత, శరీర జాతీయత మధ్యన ఉండే భేదం గుర్తించాలి" అన్నాడు.

'హా!' అన్నాడు సమాధానం దొరక్క అప్పారావు. ఆత్మ యొక్క లక్షణం చర్మం రంగులో వుంటుందన్న నమ్మకంలో వున్నాడతను. అది పరయ్యకి స్వల్పంగా వుంది కానీ బ్రాహ్మలకి అది అధికం. తనకున్న ఈ అభిప్రాయాన్ని వ్యక్తపరచడానికి సరియైన మాటలు దొరకలేదతనికి.

తిలక్ గుంపు వైపు చూశాడు. అందరూ వంటకాల సువాసనల్ని ప్రశంసాపూరకంగా ఆఘ్రాణిస్తున్నట్టుగా గమనించాడు. అతను చిరాకుపడుతూ పెంపుడు జంతువుల పట్ల తనకు గల పగను వ్యక్తీకరిస్తూ నలుపు తెలుపు గురించి మాట్లాడసాగాడు. ఆ రెండింటిని నిష్పాక్షికంగా ద్వేషిస్తాడు తిలక్ : ఎవరూ కూడ అతన్ని రేసిస్ట్‌గా పిలవరు. అతను తన సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నట్టుగా అన్నాడు, "మిశ్రజాతి ప్రజలు మూర్ఖులు. గొర్రెలాళ్లు అసమర్థులు, గమ్యంలేని జీవులు. వాళ్లని అణచివేయాలి. ఇలాంటి బురద సంభోగాలని నివారించడానికే కులం ఉంది. శుద్ధమైన వాళ్లు అలాంటి వాళ్లతోనే సంభోగించాలి. అలా కాని పక్షంలో సృష్టి నిర్మాణం చెదిరిపోయి చిందరవందరవుతుంది."

ఆ మాటలతో వేదశాస్త్రి ఏకీభవిస్తూ అన్నాడు. "మన జాతి పిల్లలని పుట్టించడానికి ప్రత్యామ్నాయ మార్గాలని మనం అన్వేషించాలి. మీకు తెలుసా, ఒకప్పటి నలమహారాజు మగవాడి గర్భంలో పుట్టాడు, తన తండ్రి మరో మగాడితో కలవడం వలన.[1] పురుషులకీ రొమ్ములుంటాయి. అందువల్ల వాళ్లకి కూడా గర్భాశయం అనేది ఉంటుంది. పురుషులు పురుషులు సంభోగించుకునేలా మనం వాళ్లని ఆయత్తపరచి

**1. మగవాడు బిడ్డను కనవచ్చునని ఈ మధ్య అలోపతి కనుగొన్నది !**

కాలుష్యాన్ని పూర్తిగా నివారించగలిగితే సమస్య చాలా వరకు పరిష్కారం అవుతుంది. ప్రస్తుతం మనమంతా మహిళల నీతిబాహ్యతనం వల్ల భయం భయంగా బతుకులీడుస్తున్నాం. ఏ సమయంలోనైనా వాళ్లకి రక్తస్రావం జరగొచ్చు. త్యాగానికుండే పవిత్రతని, ధ్యానంలోని చిత్తశుద్ధిని వాళ్లు నాశనం చేస్తారు : వాళ్ల గర్భాశయాలు విషపూరిత అరలు. మన అంతిమ లక్ష్యం ఏమిటో వేదాలలో స్పష్టంగా వుంది. మానవులంతా విరాట్ పురుషుడికి జన్మించినట్టుగా తెలుపబడింది. ఆ పురాతన బుద్ధికుశలతని మనం తిరిగి పొందాలి."

అప్పారావు వ్యాకుల మనస్కుడై అటూ ఇటూ పచార్లు చేయసాగాడు. పిల్లల్ని కనడం స్త్రీల బాధ్యత. తను సంతోషంతో వుండటానికి కూడా అదే కారణమన్న భావన అతని మనసులో కలగడంతో విషయం మారుస్తూ గొంతు సవరించుకుని అన్నాడు. "అసలు మన స్త్రీలు తడిబట్టలతో వంటలు ఎందుకు చేస్తారు? గతంలో మన దేవుళ్లు మగవాళ్ల వంటకాలని ఇష్టపడ్డారు కదా."

అప్పారావు మాటలు వేదశాస్త్రికి నవ్వు పుట్టించాయి.

"ఓ పురుషుడికి జన్మించిన అదే నలమహారాజు ఆర్యావర్తంలో పాక శాస్త్రంలో ప్రవీణుడు. అతను కూడా తడి బట్టలతోనే వంటలు చేసేవాడు. భీముడు కూడా వంటలు చేయడంలో మంచి అనుభవం గలవాడు; అతనికి ఓ కాల్పనిక తండ్రి ఉన్నప్పటికీ, అతని వాస్తవ తండ్రి నపుంసకుడు (శాపగ్రస్తుడు) లేక సాధువు. అందుకే బాగా రుచిగా వున్న వంటను 'నలభీమపాకం'లా వుంది అంటారు. అంతేకాదు పురాతన వంటల పుస్తకాలలో ముందుగా నలభీమాదుల గురించిన ప్రశంసలుంటాయి."

వెంటనే తిలక్ జోక్యం చేసుకుని "మనం ఈనాటి చర్చకి వద్దాం" అంటూ "మనం పరయ్యని ఎలా హ్యాండిల్ చేద్దాం. ఆస్పత్రి వర్గాల నించి అతను చనిపోయినట్టుగా మనం వినలేదు. మనం విన్నవన్నీ పుకారులే" అన్నాడు.

"ఇప్పుడు అతను బతికితే గనక తెల్లదేవుడి మహిమ వల్లే బతికాడు అని వాళ్ళు కథలు కథలుగా ప్రచారం చేస్తారు. అతను ఛస్తేనే మనం డబ్బులిచ్చి కొట్టించిన దుర్మార్గులు జైలుకి వెళ్తారు" అన్నాడు వేదశాస్త్రి కోపంగా.

"శూద్రునికి అహంకారం కూడా పెరుగుతోంది" అంటూ నంబూద్రి "వాళ్లు 'పెద్దన్న'ని అనుసరిస్తున్నారు. అసలు దేవుడనే వాడే లేడని ఆ 'పెద్దన్న' అంటాడు. అది వాళ్లకి గుణపాఠం నేర్పుతుంది" అన్నాడు.

'హో!' అన్నాడు బెనర్జీ అరచేతులు రుద్దుకుంటూ.

"పెద్దన్న తెల్ల మిషనరీలని వెన్నుపోటు పొడుస్తున్నాడు. భగవంతుడిని తిరస్కరించాల్సిందిగా శూద్రులకి చెబుతున్నాడు. అది అతనికి మంచిదే" అన్నాడు బెనర్జీ. బెనర్జీ సోషలిస్టు కాదు. మంచి ఉద్యోగం. భార్య సంపన్న కుటుంబం నించి వచ్చింది. కానీ కలకత్తాలో కాలేజీలో చదువుకునే రోజుల్లో సోషలిజం పట్ల ఉదారతగలవాడు. ఎవరైనా తనని కులతత్వపు మనిషి అంటే దిగ్భ్రాంతికి గురయ్యేవాడతను. కులాన్ని అతను గుర్తించలేదు. అందువల్లే కులం కూడా తనని గుర్తించదని ఆశించాడతను. కానీ బాసూలు, భట్టాచార్యలు, ముఖర్జీలు, ఛటర్జీలు, ఘోష్‌లు, సన్యాల్‌లు, రేలు ఇంకా ఠాగూర్‌లు అతని స్నేహితులు. అతనికి అస్లం అనే స్నేహితుడు కూడా ఉన్నాడు. కానీ అతను శాకాహారి. పైగా క్రైస్తవుల చర్చిలో ఆధునిక భాషలు నేర్చినవాడు.

"పరయ్య మరణించాడా?" అడిగాడు కృష్ణమూర్తి.

ఇంతలో మేలి ముసుగులో వున్న ఓ స్త్రీ వెనకవైపు వున్న పెరట్లోంచి వచ్చి భోజనం సిద్ధంగా వుందని చెప్పింది.

"అసలు పరయ్య మరణించాడా లేదా?" అడిగాడు నంబూద్రి అగ్నిహోత్రం దగ్గర గుమిగూడుతూ. హోమగుండంలో అగ్ని జ్వలిస్తోంది. వాళ్లంతా మంత్రాలు ఉచ్చరిస్తూ ఒకరి తర్వాత ఒకరు అగ్నిలో నెయ్యి వేశారు. తమిళ బ్రాహ్మణ అగ్నిహోత్రం దగ్గర హాజరవడం బెనర్జీకి ఇదే మొదటిసారి. అక్కడ వున్న మిగతావాళ్లకి దాని గురించి కొద్దో గొప్పో తెలుసు. వాళ్లు తమిళ బ్రాహ్మణ అగ్నిహోత్ర పద్ధతుల్ని అనుసరించారు. ఈ విషయంలో అప్పారావుకి కొన్ని సందేహాలున్నాయి. ఏది ఏమైనప్పటికీ ఆధునికీకరణకి ఈ ఆచారాలు అడ్డంకి అన్న భావన అతనిలో నెలకొంది. కానీ వేదశాస్త్రి తీక్షణమైన చూపు అప్పారావుని మౌనం దాల్చేలా చేసింది. దాడులు చేయడంలో నైపుణ్యాన్ని ప్రసాదించే బ్రహ్మకి, ఉపాయాలని, పథకాలని అమలుపరిచే ఇంద్రుడికి, విరోధులందరిని దహనం చేసే అగ్నికి వాళ్లు కృతజ్ఞతలు తెలియజేశారు.

అగ్నిదేవుని ముందు క్రతువు చివరి సమయంలో వాళ్లు కళ్లు మూసుకుని గాలిలో చేతులు ఊపుతూ ఋగ్వేదంలోని పవిత్రమైన పురుషసూక్తం పద్యరూపంలో ఉచ్చరించారు; బ్రాహ్మణులు భగవంతుడి ముఖ భాగం నుంచి, క్షత్రియులు భుజాల నుంచి, వైశ్యులు ఉదరం నుంచి, శూద్రులు పాదాల నుంచి పుట్టారు. పంచములు

ఆ శరీరం నుండి జన్మించనివారు. వాళ్లలో ఒకడైన పరయ్యను భగవంతుడు ఎన్నడూ సృష్టించలేదు. వాళ్ళు ఏ చీకటి గుహలోంచి పాకుతూ వచ్చారో ఎవరికి తెలుసు? వేదశాస్త్రి విజయం గురించి ఏదో గొణిగాడు. కానీ ఎందుకు? అక్కడ కూర్చోవడానికి ఏర్పాటుచేసిన మెత్తలు చూసి బెనర్జీ సంతోషించాడు. అప్పటికే మొదటి విడత వడ్డన పూర్తయింది. భోజనానికి కూర్చునేముందు ఎదురు చూస్తున్న మగవాళ్లకి అవి అవసరం. తిలక్, బెనర్జీ, అప్పారావు బాసింపట్టు వేసుకుని కూర్చోవడానికి కొంత ఇబ్బంది పడ్డారు. వాళ్లకి ఇళ్లలో డైనింగ్ టేబుల్ దగ్గర కుర్చీలో కూర్చుని భోజనం చేసే ఓ చెడ్డ అలవాటుంది. వడ్డన చేసిన అరిటాకుల ముందు కూర్చుని అందరూ మడచిన అరచేతిలో నీటిని తీసుకుని విస్తరి చుట్టూ పరిషించారు. ఎవరూ విస్తరిని ఎడమ చేతితో తాకలేదు. ఆ విధంగా ఎవరైనా చేస్తే ఆ విస్తరిని మార్పిస్తారు. ఎడమ చేతితో నీళ్ల గ్లాసును తాకడానికి మాత్రమే వాళ్లకి అనుమతి వుంది. స్త్రీలు రెండోసారి ఆ తర్వాత మూడో విడత వడ్డనలు వేగంగా చేయాల్సి ఉంటుంది. వడ్డించిన ఆహార పదార్థాలవైపు గాని, ముఖ్యంగా వాటిని భుజించేటప్పుడు తినేవారి చేతివైపుగాని, నోటివైపుగాని స్త్రీలు చూడకూడదు. అలా చూస్తే ఆహారం పవిత్రతని కోల్పోయినట్లవుతుంది. వేదశాస్త్రి ఇంట్లోని స్త్రీలు మంచి అనుభవం కలవారు. వాళ్లు దయ్యాల్లా అణుకువగా వున్నప్పటికీ అనుకోని అత్యవసర పరిస్థితులలో మాత్రం ఎంతో అప్రమత్తతతో ఉంటారు. వాళ్లకి తెలుసు, ఇంట్లో శిష్టాచారం భ్రష్టత్వం చెందితే ధర్మశాస్త్రం శిక్షిస్తుందని, పంచమాలు తప్పు చేసినప్పుడు బహిరంగ శిక్షకి గురైనట్లుగా. “మనవారిలో సాహసవంతులు, ధైర్యవంతులు తగినంతగా లేకపోవడంతో మనం కలుషితమైన పురోహితవర్గం – మహిళలు వండిన భోజనం చేయాల్సివస్తోంది” అన్నాడు వేదశాస్త్రి గంభీరవదనంతో. “మనం నలమహారాజులాంటి వాళ్లని ఉత్పత్తి చేసే సామర్థ్యం కోల్పోయాం. మరోమారు గనక మనం పవిత్రత సాధించుకోగలిగితే మనం మేలురకమైన వ్యక్తుల్ని ఉత్పత్తి చేయగల సామర్థ్యాన్ని తిరిగి పొందగలం” అన్నాడు వేదశాస్త్రి. ఈ మాటలు అన్న వెంటనే కృష్ణమూర్తి వంక కొంత ఇబ్బందిగా చూశాడు వేదశాస్త్రి. కృష్ణమూర్తి వెంటనే మొహం మరొకవైపు తిప్పుకున్నాడు. మనిషిపైన మనిషి ప్రజనం పద్ధతి (స్వలింగ సంపర్కం) ఇంకా వంట పట్ల భోగపరాయణతని కృష్ణమూర్తి అంగీకరించడు : దాంతో వేదశాస్త్రి మాటలు అతన్ని వ్యాకులపరిచాయి. అంతేకాదు, తెల్లక్రిస్టియన్‌లకి స్వలింగసంపర్కం పట్ల సమస్యలు వున్నట్టుగా విన్నాడతను. తమని తెల్లవాళ్లు స్వలింగసంపర్కులుగా ముద్రిస్తారేమోనని భయపడ్డాడతను, వాళ్లు గనక వేదశాస్త్రి ఆలోచనల్ని పాటించినట్లయితే, అది జాతి

మేలుకోరి చేసేదైనా సరే. ఈ విషయాన్ని తన ప్రక్కన వున్న బెనర్జీకి చెప్పాలనుకున్నాడు కృష్ణమూర్తి. కానీ బెనర్జీ తన చుట్టూ వున్నవాళ్ళ వంక కన్నెత్తి కూడా చూడకుండా భోజనం చేయడంలోనే దృష్టి కేంద్రీకరించడంతో ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

చేపలు తినే బెంగాలీ బ్రాహ్మల జీవితాలలో అలాంటి స్వచ్ఛమైన శాకాహార విందులు చాలా అరుదు. బెనర్జీ చేపలు తింటాడని వేదశాస్త్రికి తెలియకపోవడం తన అదృష్టంగా భావిస్తాడు బెనర్జీ. బెంగాలీ బ్రాహ్మణులు చేపలని జలపుష్పాలంటారని, తను చేపలు తినే విషయం వేదశాస్త్రికి నమ్మకం కలిగేలా చెప్పవచ్చున్న అభిప్రాయం వున్నా ఎందుకో బెనర్జీ అశ్రద్ధ చేశాడు.

అందరూ ముప్పై రకాల ఆహారపదార్థాలు తినడం పూర్తి అయింది. వాటిలో చివరి మూడు ప్రత్యేకమైనవి. చిక్కని పాలలో ఉడికించిన ప్రత్యేక బియ్యంలో పంచదార, నెయ్యి వేసి చేసిన తీపి పదార్థాలవి. అవి భగవంతుడికి అత్యంత ప్రీతికరమైనవి. అధిక మొత్తంలో ముందు తిన్న పదార్థాల తర్వాత పొట్టలో కొంచెం ఖాళీ అవ్వడానికి కొంత భోజన విరామ సమయం తీసుకున్నారు. "చివరిగా ఈ స్వీట్ల నివేదన ప్రత్యేకత ఏంటి?" అడిగాడు నంబూద్రి వేదశాస్త్రివంక చూసి.

అందుకు సమాధానంగా "ముందు వడ్డించిన పదార్థాలు నలుపుతో కూడుకున్నవి. ఈ మూడు మాత్రమే స్వచ్ఛమైన తెలుపుతో వున్నవి. ఇలాంటి స్వచ్ఛమైన ఆహారం శత్రువులని ఓడించేలా చేసి మనకి విజయాన్ని చేకూరుస్తాయి. ఏ క్రిస్టియన్ ఆస్పత్రి కూడా పరయ్యా నాశనం కాకుండా రక్షించలేదు!" అన్నాడు వేదశాస్త్రి.

మధురంగా వున్న రుచికరమైన కమ్మని భోజనం తర్వాత వాళ్లు తృప్తిగా పొట్టలు నిమురుకుంటూ నవ్వుతూ మధ్యాహ్నపు కునుకు తీసేందుకు వెళ్లిపోయారు. అక్కడ మిగిలిన పదార్థాలు స్త్రీల కోసం.

మధ్యాహ్నం విశ్రమించినవాళ్లు ఆ సాయంత్రం మళ్లీ సమావేశమై వర్ణ ధర్మాన్ని, కుల వ్యవస్థని కాపాడతామని ప్రతిజ్ఞ చేశారు. 'ఆర్యావర్తం ఇండియా కాజాలదు!' 'భరత ఖండం ఇండియా కాజాలదు' అన్నారు వాళ్లు.

ఆ తర్వాత ఎవరిదారిన వాళ్లు వెళ్ళిపోయేందుకు ఉపక్రమించారు.

# 2

# నంబూద్రి మత మార్పిడి

**వే**దశాస్త్రి ఇంట్లో సమావేశానికి హాజరైన నంబూద్రికి అది మరపురాని అనుభూతి మిగిల్చింది, తను ఆశించిన సమాధానాలు పూర్తిగా లభించనప్పటికీ. రామేశ్వరం నుంచి దేవభూమిగా ఎంచబడే సెంట్రల్ కేరళలో తన గ్రామం శంకరన్ పిళ్లైకి బస్సులో ప్రయాణించడంతో నంబూద్రి నిద్రపోలేదు. కొబ్బరిచెట్లు, రబ్బరు తోటల మధ్య పాము మెలికలాంటి డొంకదారులలో బస్సు సాగుతుంటే తమిళ ప్రాంతానికి తన ప్రాంతానికి ఉన్న వ్యత్యాసాన్ని తెలుసుకుంటున్నాడతను. నేరేడు చెట్లు, పనస చెట్లు, రబ్బరు తోటల మధ్య నుండి బస్సు ప్రయాణిస్తుండగా కేరళ గొప్పదనం గురించిన అతని ఆలోచనలు బస్సు వేగం కంటే వేగంగా మెదడంతా ఆక్రమించుకున్నాయి. తను ఈ వేదభూమిలో ప్రత్యేకమైన అభిమానంతో పుట్టినట్టుగా అనుభూతి చెందాడు. అది కూడా దేవుని బిడ్డలైన నంబూద్రీల కుటుంబంలో. నంబూద్రీలు బ్రాహ్మణుల్లో శ్రేష్టమైనవారనీ, వారికి పరిపూర్ణమైన దైవజ్ఞానం కలదని అనుకున్నాడతను, దైవభక్తి కొరవడిన ఇంజనీరింగ్ పనితనంతో తయారైన కఠినంగా వున్న సీటుపైన కూర్చుంటూ. 'అయ్యో! నాలాంటి నంబూద్రీకి బస్సు ప్రయాణం అధ్వానంగా పరిణమించింది' అంటూ తనలో తాను గొణుక్కున్నాడు నంబూద్రి. వేసవికాలం అయినా ఉదయపు గాలులు చల్లదనంతో కూడుకుని ఉన్నాయి. బస్సులోకి వచ్చే స్వచ్ఛమైన చల్లగాలికి ప్రయాణీకులు చాలామంది మగత వచ్చినట్లే కూర్చున్నారు. కానీ రోడ్డు మీద జనాలు మాత్రం వాళ్ల వాళ్ల పనుల కోసం ఉరుకులు పరుగులు పెట్టడం గమనించాడతను.

కేరళ రోడ్లు వరుస ఇళ్లతో పట్టణ గ్రామీణ ప్రాంతాలని అంతులేని టౌన్‌షిప్పులా కలుపుతున్నాయి. దేవుళ్లందరూ కలిసికట్టుగా ఈ భూమిని సృష్టించారని నంబూద్రి

అంటూంటాడు. అయితే ఒక విషయం మాత్రం అతన్ని బాధిస్తుంటుంది. ఆ విషయం గుర్తుకువచ్చినప్పుడల్లా అతను వేదనకి గురవుతాడు. రోడ్డుపక్కన రైతులు, మత్స్యకారులు, గొర్రెల కాపరులు, అంటరానివాళ్లు, ఆదివాసీలు నల్లటి ఛాతీలని చొక్కాలతో కప్పే ప్రయత్నం చూసినప్పుడల్లా అతను బాధపడ్డాడు. కొందరు స్త్రీలు బ్లౌజులు వేసుకోవడం కూడా చూశాడతను. ఇదంతా చూసిన తను 'కేరళ ఎంతగా మారిపోయింది' అనుకున్నాడు. కేరళలోని యువతులందరూ ఈ పద్ధతి ఆచరిస్తే ఈ భూమి తన పవిత్రతని ఎలా కాపాడుకుంటుంది? శూద్రులు, ఛండాలురు పొలంలో అర్ధనగ్నంగా పనిచేయాలి; అది ప్రకృతి సిద్ధమైనదే కాకుండా వాళ్లవలన దిగంబర ప్రకృతి మరిన్ని అందాల్ని సంతరించుకుంటుంది. అర్ధనగ్న బ్రాహ్మణ పురోహితులు హిందూ దేవాలయంలో విగ్రహాల రూపంలో ఉండే దేవుళ్లలా కనిపిస్తున్నారు. ఆలస్యంగానైనా నంబూద్రి జబ్బల చొక్కా ధరించడం మొదలెట్టాడు.

వేదశాస్త్రిని కలిసినప్పుడు అతని బాన పొట్టమీద ఎలాంటి కుట్టులేకుండా నేయబడివున్న శాలువా చుట్టుకుని వుండగా చూసి కొద్దిగా సిగ్గుపడ్డాడు నంబూద్రి. వేదశాస్త్రి శరీరంమీద కుట్టిన వస్త్రం అంటూ ఏదీ లేదు. అక్కడున్న మిగతా వ్యక్తులు ముస్లింలు, క్రిస్టియన్‌ల వల్ల ప్రభావితం కాబడి కుట్టిన చొక్కాలు ధరించారు. తిలక్, అప్పారావులు ఒంటరిగా వున్నప్పుడు అప్పుడప్పుడు కోటు కూడా ధరిస్తారు. వీటిని గురించి వేదశాస్త్రికి దృఢమైన అభిప్రాయం వుంది. పాశ్చాత్య పోకడలు, మధ్య ప్రాచ్య దేశాల నాగరికతా వ్యామోహం వేదాల దేశంలో వ్యాపించాయని నసిగాడు నంబూద్రి.

బ్రాహ్మణుల ఆధునిక ఫ్యాషన్‌లకి సంబంధించి వేదశాస్త్రి ఎత్తిపొడుపులు జ్ఞాపకం రావడంతో నంబూద్రికి చిరాకేసింది. ఈ ప్రాంతంలో వేడి, తేమ అధికంగా వుండడంతో అన్ని ఋతువుల్లోనూ ఇక్కడి ప్రజలు ఒకప్పుడు అర్ధనగ్నంగా ఉండేవారు. చొక్కా అంటే ఏంటో కొన్ని శతాబ్దాల క్రితం వరకు వాళ్లకి తెలియదు. 1880వ దశకంలో తన బాల్య దశలో పురుషులు స్త్రీలు కేవలం 'ముండు (నడుము పై భాగంలో అంచుండి పాదాల వరకు వుండే కేరళ సంప్రదాయ వస్త్రం) కట్టుకున్నారు. ఉడుపుల పేర్లు ఎలా వున్నా కేరళ స్త్రీలు బ్లౌజులు గాని, జాకెట్లుగాని ధరించేవారు. పండగలు పబ్బాలు వచ్చినప్పుడు వాటి అంచులు ఆకర్షణీయంగా వుండేవి. మరి ఇప్పుడు? మహ్మద్ ప్రవక్త అరబ్బులని తల నుంచి పాదాల వరకు కుట్టిన వస్త్రాలతో, శరీరమంతా ఆచ్ఛాదనతో, మీసం లేకుండా ఉత్తగడ్డంతో అల్లాహ్ మసీదుకి రావాలని సూచించాడు. మహిళలు కుట్టిన బురఖాలు ధరించి కేరళలోని స్త్రీలని చెడగొట్టడానికి వచ్చారు. దాన్ని గురించి విచారించడానికి అతనికి తన జీవితంలోనే తగిన కారణాలున్నాయి.

ఏ విధమైన దుస్తులు నిరాడంబరతను అంతం చేస్తాయో అతనికి తెలుసు.

తన పక్కన కూర్చున్న వృద్ధుడి దగ్గుతో నంబూద్రి ఆలోచనలకి అంతరాయం కలిగింది. దగ్గుతున్నప్పుడు ఆ వృద్ధుడి శరీరం అటు ఇటు కదులుతూ నంబూద్రికి తగుల్తోంది. 'దుర్దినాలు దాపురించాయి. అకస్మాత్తుగా ఓ అనామకుడితో తాకబడ్డాను, బహుశా ఓ అంటరానివాడితో! ఈ బస్సులో సీట్లు కూడా అపవిత్రతకి హేతువులే'. ఈ ఆలోచన రాగానే నంబూద్రి శరీరం కంపించింది. నంబూద్రి ఆ వ్యక్తివైపు వోరగా చూశాడు. అతను కూడా తనలాగే పరిశుభ్రమైన దుస్తులు ధరించాడు. అతనిలో కొత్తగా ఏమీ కనిపించలేదు. అంటరానివాడి శరీరం నుంచి అదోరకమైన దుర్గంధం వస్తుందని, చేపలకంపు, మాంసం కంపు కొడుతుందని నంబూద్రి అంటుంటాడు.

ఈ ముసలాడు కొంచెం ఫరవాలేదనుకున్నాడు నంబూద్రి. 'నీ పేరేంటి?' అడిగాడు నంబూద్రి అతని వైపు చూసి.

'మాథ్యూ' అన్నాడతను.

ఆ పేరు వినగానే నంబూద్రి కొయ్యబారిపోయాడు. క్రిస్టియన్! ఈ బ్లడీ మాథ్యూ ఏ కులంవాడైతేనేం? 'కేరళలోని క్రిస్టియన్‌లు, ముస్లింలు దేవ భూమిని అపవిత్రం చేసినందుకు తప్పనిసరిగా నరకానికి పోతారు' అంటూ గొణిగాడు నంబూద్రి బస్సు దిగుతూ. అతను పచ్చని చెట్లు ఆవరించివున్న తన ఇంటివైపు నడిచాడు. పొద్దెక్కడంతో చుర్రుమంటున్న ఎండ తన బట్ట బుర్రని వేడెక్కిస్తుందని తలపైన గొడుగు వేసుకున్నాడు. చుట్టూ కాంపౌండ్‌వాల్‌తో పాటు తోట, కొబ్బరిచెట్లు, నేరేడు చెట్లు ఉన్న రెండంతస్తుల మేడ అతనిది.

ఇంటి బయట గేటు తీసుకొని లోపలికెళ్ళాడు నంబూద్రి. ఇంటి బయట వరండాలో కూర్చున్న మరదలు శివశక్తి నంబూద్రిని చూడగానే వెంటనే లేచి గదిలోకి పరుగెట్టింది, పాకుతున్న పామును చూసి కలుగులోకి వెళ్లిన ఎలుకలా. ఆమె అశాశ్వత శరీరంలో శాశ్వతమైన ఆత్మగల ఒక శాశ్వత వితంతువు. ఆమె శిరోముండనంతో వుంది. పరిశుభ్రమైన తెల్లని 'ముండు' నడుముకి కట్టుకుంది. రొమ్ముల్ని తెల్లని 'పల్లు' (వస్త్రం)తో కప్పుకుంది. సాంప్రదాయక ఉపవాసాలతో ఆమె దేహం శుష్కించింది. నేలమీద పడుకుంటుంది. చన్నీటి స్నానం చేస్తుంది. నిరంతరం తడిబట్టలతో వంటగదిలో పనిచేస్తుంది. నిష్ఠానియమాలు పాటించే బావగారైన నంబూద్రికి శుచిగా, శుభ్రతగా, మడిగా వంట చేయడం ఆమె దిన చర్యలో ఒక భాగం. ఒంటరిగా వున్నప్పుడు స్వేచ్ఛగా, సంతోషంగా ఉండకూడదని బంధువులు, వితంతువులు తరచూ ఆమెకి చెప్తుంటారు.

కానీ వాస్తవానికి, భయం గొలిపే బావగారు ఇంట్లోలేని సమయంలో స్వేచ్ఛలభించినట్లుగా భావిస్తుందామె. గత నాలుగు రోజులుగా నంబూద్రి లేకపోవడంతో కొద్దిగా ఊపిరి పీల్చుకుందామె. దక్షిణ భారతదేశపు వేదాంతుల నివాసంలో ఓ వితంతువు కోరుకున్న విధంగా మొట్టమొదటిసారి ఆమెకి స్వతంత్రం లభించినట్టుగా అనిపించింది.

నంబూద్రి అన్న రెండేళ్ల కిందట కాలం చేయడంతో అతని భార్య శివశక్తి శాశ్వతంగా వితంతువయింది. బెంగాల్‌లో ఒకప్పటి ఆచారమైన సతీసహగమనం అనుసరించడం నంబూద్రి ఇష్టపడతాడు. కానీ కేరళలో వైదికమైన వితంతుతనం అభివృద్ధి చెందింది, అది కూడా బెంగాల్ బ్రాహ్మణులకన్నా కఠినంగా, రాజారామ్‌మోహన్‌రాయ్ సతీసహగమనం ఆచారానికి కొద్దిగా అడ్డుకట్టవేయడంతో. నంబూద్రి అలసటగా వుండడంతో గొడుగు యథాస్థానంలో వుంచకుండా అక్కడే ఓ మూల వుంచాడు. శివశక్తి వరండాలో కూర్చుని వుండడం గమనించాడు నంబూద్రి. 'ఎదురుగా వున్న రోడ్డు మీద వచ్చీపోయే జనాలని తప్పకుండా చూసి వుంటుంది. ఏమో, ఎవరు చూడొచ్చారు? నేను గనక మరణిస్తే సెక్సు రొమాన్స్‌తో కూడిన ప్రపంచంలోకి రెక్కలున్న పక్షిలా ఎగిరిపోతుందేమో. ఇళ్లలో ఈ మహిళల ఉపవాసాలు, అస్పష్టమైన మాటలు నాకు తెలియనివా? మా అన్నయ్య స్వర్గం నించి అంతా గమనిస్తున్నాడు. తను మరణించిన తర్వాత పవిత్రురాలైన తన భార్య జీవించలేదు : అలా జీవించిందంటే దాని అర్థం కోరికలు తీర్చుకోడానికి రహస్యంగా అవకాశం కోసం నిరీక్షించడమే. మిగిలిన జీవితం ఎందుకు? ఆమె సతీసహగమనం చేసి ఆత్మప్రక్షాళన చేసుకోవడం మంచిది! ఇలా ఆలోచించినవాడై నంబూద్రి విచారంతో తలపంకించాడు. శివశక్తి కూడా మిగతావారిలాగే, 'ఆడకుక్క ఆ బిచ్... సీతామహాలక్ష్మిలాగే' అనుకున్నాడతను బాధగా. శివశక్తి విషయం వేదశాస్త్రితో సంప్రదించాలనుకున్నాడు నంబూద్రి. కానీ సీతామహాలక్ష్మి సమస్య కారణంగా ఆ ప్రయత్నం విరమించుకున్నాడు నంబూద్రి. ప్రయాణ సమయంలో ఒంటికి అంటిన దుమ్ము తువ్వాలుతో దులుపుకుని స్నానం చేస్తే బడలిక తీరుతుందని భావించాడు నంబూద్రి. స్నానం చెయ్యడానికి నూతి దగ్గరకి వెళ్తుండగా చాలా సంవత్సరాల క్రిందట తన దృష్టి శివశక్తిమీద పడిన సందర్భాన్ని గుర్తుకు తెచ్చుకోలేకుండా వుండలేకపోయాడు నంబూద్రి.

ఆ ఇంట్లో చిన్నవాడైన నంబూద్రికి 'సంబంధం నంబూద్రి'గా గుర్తింపు వుంది. నలుగురు కొడుకులు, ఓ కూతురు వున్న ఇంట్లో నంబూద్రి మూడోవాడు. ఏ నంబూద్రి కుటుంబంలోనైనా పెద్దకొడుకు మాత్రమే బ్రాహ్మణ యువతిని వివాహం చేసుకోవచ్చు. బ్రహ్మచారులుగా మిగిలిపోయిన సోదరులు నాయరు స్త్రీలతో లైంగిక 'సంబంధాలు'

పెట్టుకుంటారు. ఒక 'బాంధవ్యం' అనే ఒప్పందం కుదుర్చుకోవాల్సి వుంటుంది. దీని ద్వారా వాళ్లు తమ పవిత్రమైన కోరికలని తృప్తిపరచుకోవడంతో పాటు నాయర్ వంశస్థులుగా మిగలడానికి పిల్లలకి జన్మనిస్తారు. దీనినే 'మాతృక్రమానుగత నాయరిజం' అంటారు. ఈ పద్ధతి కేవలం దేవభూమి అయిన కేరళలోనే కొన్ని తరాలుగా వస్తోంది. దేవుడు వాళ్లకి నంబూద్రీలని ప్రసాదిస్తే అందుకు బదులుగా నంబూద్రీలు అవివాహిత భర్తలని నాయర్ మహిళలకి సర్వాధికారాలతో అందించారు. తరతరాలుగా తమ శరీరాలలో మిశ్రమ రక్తం ప్రవహిస్తున్నందుకు నాయర్లు ఎందరో గర్విస్తారు. కేరళలోని ఈ ధార్మిక ఆచారం కేవలం నంబూద్రి పురుషులకి నాయర్ స్త్రీలకి పరిమితం కావడంపట్ల శూద్ర వర్ణంవారు విభ్రాంతికి గురయ్యారు.

కొన్ని సంవత్సరాల క్రితం, నంబూద్రి పెద్దవాడయ్యే సమయం వచ్చినప్పుడు, తమ కులంలోని మనుషుల్లాగే అతను కూడా తన  కర్తవ్యం నిర్వహించాడు. అతని అన్నలు వాళ్ల వాళ్ల సాహస గాథలు చాలా బాగా వివరించారు. గోవిందన్ నాయర్ ఇంటికి పెళ్లి కొడుకుగా వెళ్లలేదు నంబూద్రి. పశువుల్ని కొనే వ్యాపారిలా వెళ్లాడు. అప్పుడతని వయసు ఇరవై సంవత్సరాలు. అయినప్పటికీ ప్రపంచాన్ని శాసించగల సహజ నేర్పు కలిగివున్నాడతను. 'సంబంధం' ఏర్పాట్లు ఈ విధంగా చేయబడ్డాయి. ఓ రహస్యపూరిత వాతావరణంలో ఎటువంటి ఆర్భాటాలు, అలంకరణలు లేవు. బహుశా ఎంతోకాలంగా ఈ విధంగానే జరుగుతుండవచ్చు. ఎందుకంటే మనిషి కావాలంటే బతిమాలుకోవాల్సి వచ్చేది. అంతకుమించి ఏమీ లేదు. నంబూద్రి గోవిందన్ నాయర్ ఇంటికి సంప్రదింపుల కోసం బయల్దేరాడు తన కండపుష్టికోసం స్వచ్ఛమైన పాలకోసం తనకి ఆవు కావాలన్నట్టుగా. ఈ రోజు కోసమే చాలా సంవత్సరాలు స్కూలు కెళ్లాడు తను. 'దిగువ వర్ణం ముందు అధైర్యంగా వుండడంగాని అనిశ్చితితో వుండడంగాని చేయకు : వాళ్ల ముందు నువ్వు యజమానిగా ప్రవర్తించు' అని కూడా తన అన్నలు అన్నారు. నంబూద్రి భుజాలు వంచి  ఆ చిన్న ఇంట్లోకి అడుగుపెట్టాడు. తనలో చిన్నగా వణుకు మొదలైందన్న విషయం అతను మరుగుపర్చలేదు. కానీ కాలుష్యం గురించి భయపడవద్దని మిగతావారంతా అన్నారు. 'సంబంధం' విషయంలో స్వచ్ఛమైన తన శరీరాన్ని మలిన ప్రాంతానికి తీసుకువెళ్లడానికి అనుమతించారు.  ఆ రోజు జరిగిన విషయాలను అతను గుర్తుకు తెచ్చుకున్నాడు.

'రండి సార్ రండి, రండి. ఇలాంటి శూద్రుల ఇంటికి మీరు గొప్ప వరం' అన్నాడు గోవిందన్ నాయర్ మోకాళ్ల మీద వంగి దణ్ణం పెడుతూ.

"లేదు, లేదు. ఇటువైపు వెళ్తూ వెళ్తూ తొంగి చూశానంతే" అన్నాడు నంబూద్రి నెమ్మదైన స్వరంతో. యువకులు, యోగ్యులైన బ్రాహ్మణులు శూద్రుల దగ్గరకి నిరాఘాటంగా పోవచ్చని, తప్పులేదన్నట్టుగా. కానీ మాట్లాడే సమయంలో అతని కళ్ళు అమ్మకానికి వున్న వస్తువు కోసం అటూ ఇటూ కదలాడాయి. కానీ ఆతృత కూడదనుకున్నాడు తను. ఇంతలో కళ్ళ ముందు ఏదో మెరుపు మెరిసినట్లయింది. 'ఎవరది?' అన్నాడతను అదే స్వరంతో.

గోవిందన్ నాయర్ మరింతగా ముందుకు వంగాడు. తను ఓ శూద్రుడయినందున నంబూద్రికి ఆహార పదార్థాలు గాని, మంచినీళ్లు గాని ప్రతిపాదించలేదతను. అతను రెండు చేతులు జోడించి 'అదా సార్, అది, అది నా రెండో బిడ్డ సీతామహాలక్ష్మి' అన్నాడు.

"కింద ఏం తొడిగింది?"

"ఓహో! ఊఁ, సార్ క్రిస్టియన్ స్కూలు వాళ్లు ఇచ్చారు ఆ డ్రస్సు."

వెంటనే నంబూద్రి చేతులు వూపుతూ "వాటిని తీసేయమని చెప్పు. ఇప్పుడు కాదులే. అలాంటి వస్తువులు నిందాత్మకమైనవి."

"అవును సార్, అవును. ఆ పిల్ల కొంచెం మొండిఘటం. నా ఇంటి ఆమె దాన్ని స్కూలుకు పంపుతుంది. ఉపయోగం ఏముంది?

నంబూద్రి తనలో తాను నవ్వుకున్నాడు. భయంతో ఆ పిల్ల చూసిన చూపులు అతనికి నచ్చాయి.

"ఎంత వయసు ఆ పిల్లకి ?"

"పదహారు సార్"

"ఓహో! ఇది బ్రాహ్మణ పిల్ల గనక అయ్యుంటే ఈపాటికి పెళ్లయి పిల్లాడు కూడా పుట్టేవాడు. కానీ ఈ నాయర్‌లకి ఎలా ప్రవర్తించాలో తెలీదు. వాళ్ళు వాళ్ళ ఆడవాళ్ళని కుక్కల్లా పరుగెట్టనిస్తారు. మంచిది. కనీసం పరువానికొచ్చిందీమె."

చిన్నపాటి విషయం గురించి మరింతగా మాట్లాడే అవసరం లేకపోయింది నంబూద్రికి. తనని తప్పుగా భావించే అవకాశం లేకుండా గోవిందన్ నాయర్ అసలు విషయాన్ని గ్రహించినట్టుగా అర్థం చేసుకున్న తర్వాత నంబూద్రి బయలుదేరాడు. గోవిందన్ నాయర్ తన ఇంటి గేటు దగ్గర నిలబడి కోరికతో నిండిన బ్రాహ్మణుడి గొప్ప ఆధ్యాత్మిక దీవెనలు తన కుటుంబంపైన ప్రసరించాయన్న ఆనందంతో నవ్వడం చూశాడు నంబూద్రి. అలాగే చక్కని యువకుడైన నంబూద్రిని కూడా! సీతామహాలక్ష్మి అందగత్తె

కావడంతో ఆ పిల్ల మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారు వాళ్ళు. ఇప్పుడు వాళ్ళ కలలు నెరవేరబోతున్నాయి : చరిత్రహీనులైన శూద్రుల ఇంట్లోని అంధకారం నించి ఈ సంబంధం వాళ్ళని రక్షిస్తుంది. సంతోషకరమైన ఈ విషయాన్ని భార్యకి తెలియజేసి తన ఆనందం ఆమెతో పంచుకోవాలనుకున్నాడు గోవిందన్ నాయర్. ఆమె పేరు ఎవరికీ తెలియదు. ఎందుకంటే అభ్యుదయేచ్ఛగల హిందూ శూద్ర కుటుంబాలలో భర్తగాని, పిల్లలుగాని భార్యని పేరుపెట్టి పిలవరు. అలాగే వివాహిత బ్రాహ్మణ మహిళ పేరుని కూడా ఎవరూ ఉపయోగించరు. హిందువుల కుటుంబాలలో, సమాజంలో కేవలం వితంతువులకి మాత్రమే పేరుపెట్టి పిలిపించుకునే అధికారం వుంది – చిరాకుకి సంకేతంగా. ఆ విధంగా గోవిందన్ నాయర్ భార్య ఓ అనామకురాలు, సరైన శూద్ర పద్ధతిలో వివాహమాడినప్పటికీ గోవిందన్ నాయర్ అస్పష్టంగా ముతకగా "హే ఎక్కడున్నావు?" అంటూ పిలిచాడు భార్యని. సమాధానం రాకపోవడంతో పెరట్లోకి వెళ్లాడు గోవిందన్ నాయర్. అతను పెరట్లోకి వెళ్తుండగా ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్న శబ్దం వినిపించింది; ఎవరో కాదు, తన భార్య పెరట్లో కూర్చుని వెక్కి వెక్కి ఏడ్వడం గమనించాడు. గోవిందన్ నాయర్ ఆమె దగ్గరకంటా వెళ్లి కూతురికి నంబూద్రి ప్రతిపాదన గురించి వివరించాడు. ఆమె వెంటనే తల ఎత్తి ఎర్రబడ్డ కళ్లతో కోపంగా చూస్తూ "ఓరి సన్నాసోడా! నీ మొహంలో ఆ వెకిలినవ్వు నాకు తెలియదనుకుంటున్నావా? ఆ వెకిలినవ్వుకి అర్థం తెలుసా! నా ఆశలన్నీ అడుగంటాయి. నువ్వు నిజంగా నీ కూతురు 'సంబంధం'లో జీవించాలని కోరుకుంటున్నావా? పేరులేకపోయినా నా బతుకే నయం : దానికి మర్యాదా వుండదు, పేరూ వుండదు. అది బ్రాహ్మల పిల్లలకి తల్లి అవుతుంది కాని పెళ్లి కాని నాయర్‌గానే ఉండిపోతుంది. దాని పిల్లలు బ్రాహ్మణులవుతారా లేక నంబూద్రీలుగా ఉండిపోతారా? వాళ్లు ఏ దేవాలయానికో పూజారులవుతారా? ఓ దద్దమ్మా అందుకు నువ్వెలా ఒప్పుకుంటావు?" అంది.

గోవిందన్ ఆమె ముందు మోకరిల్లి "మరేం చేయగలను?" అన్నాడు దీనంగా. ఎప్పుడైనా జరిగేదింతే. అసలు నీకు మంచి ఆలోచనలు అంటూ ఏమైనా ఉన్నాయా? బ్రాహ్మణులతో విరోధించే సాహసం మనం చేయలేము. మనం కేరళ సంస్కృతిలో ఒక భాగం. ఇక పిల్లల విషయమంటావా, వాళ్లు ఇక్కడే వుంటారు. మనలాగే వాళ్లు నాయర్లుగానే ఉంటారు. ఒకవేళ వాళ్లలో కొందరు అమ్మాయి అయితే... అంటూ అర్థాంతరంగా ఆగిపోయాడు గోవిందన్ నాయర్.

"అమ్మాయి అయితే ఏమవుతుంది? బిగ్గరగా అంటూ ఆమె ఈసడింపుగా అతని వైపుచూసి "నువ్వు వాళ్లని  కూడా అమ్మేస్తావా? సంప్రదాయాల గురించి నాకు చెప్పకు. నేనూ నా కూతుళ్లూ బ్రాహ్మణులకన్నా ఎంతో బాగున్నాం. ఇది తల్లుల పాలిటి

నిబంధన అని మాత్రం చెప్పకు సుమా! నా పిల్లలకి నా తల్లి ఇంటి పేరు పెట్టడానికి నువ్వు ఒప్పుకుంటావా? ఈ 'సంబంధం' అన్నది కేవలం వ్యభిచారం తప్ప మరేమీ కాదు. నా బిడ్డని ఈ వంచనకి గురి కానివ్వను" అంది.

"నాన్సెన్స్" అంటూ పెద్దగా అరిచాడు గోవిందన్ నాయర్. "ఓ బ్రాహ్మణుడు – ఓ నంబూద్రి – ఈ భూమ్మీద దేవదేవులు. వాళ్లు ఏం చెప్పినా మన ధర్మాన్ని వృద్ధి చేయమంటారు. మన దేవుళ్లు చెప్పినదేమిటంటే బ్రాహ్మణులు ఏది అడిగితే అది మీరివ్వండి – ధనం కావచ్చు, పశువులు కావచ్చు. లేకపోతే కూతుర్లు కావచ్చు. బ్రాహ్మణుడికి సమర్పించినది స్వయంగా విష్ణువుకు సమర్పించినట్లే అవుతుంది. మతపరమైన అభ్యర్థనకి దేవుడు నా కూతుర్ని ఇటువంటి గొప్ప నంబూద్రి నిర్ణయానికి వదిలిపెట్టమని నన్ను ఆశీర్వదించాడని నాకనిపిస్తోంది. ఈ నిర్ణయాన్ని ఎవరూ ఆపలేరు. వ్యవస్థని మార్చడమన్నది ఎవరి తరం కాదు" అంటూ బిగ్గరగా అరుస్తూ గోవిందన్ ఇంట్లోకి వెళ్లిపోయాడు.

తన తల్లిదండ్రుల మధ్య జరిగిన సంభాషణ వింది సీతామహాలక్ష్మి. దుఃఖం తన్నుకొస్తుండగా ఆమె కొబ్బరి తోటలోకి పరుగెట్టింది. అమాయక దూడ దాని తల్లి పాముని ఎదుర్కొనేటప్పుడు పరిగెత్తినట్టు. "ఆవు పెద్దపులితో పోట్లాడగలదు కానీ పాముని ఓడించలేదు. పాము భూమికి దగ్గరగా జీవిస్తుంది. అదే పసరిక పాము గనక అయితే పచ్చగడ్డిలో దాక్కుని కాటువేసేముందు ఎలాంటి సంకేతాన్ని ఇవ్వదు. దాన్ని ఎదుర్కోవడం ఎవరికీ సాధ్యం కాదు" అనుకుంది సీతామహాలక్ష్మి. తల్లితో ఎక్కువ సమయం గడపడంతో మహిళా ప్రపంచం గురించి సీతామహాలక్ష్మి ఎంతగానో నేర్చుకుంది. కానీ తనకంటూ ఆ ప్రపంచానికి ఎలాంటి హోదా లేదు.

సంప్రదాయానుసారంగా 'సంబంధం' గురించిన ఆచారం మొదట అధికారికంగా ప్రకటించింది ఏడో శతాబ్ది సంస్కర్త, హిందూ మతానికి ప్రస్తుత రూపం ఇచ్చిన ఆది శంకరాచార్యులు. అంతా మాయ – మిథ్య అన్నవారిలో ఆయనొకరు. అందువల్ల వివాహ జీవితం ఎంచుకోవాలా లేక వివాహాన్ని మతపరమైన 'సంబంధం' రూపంలో మతాచారాలని అనుసరించాలా, కులంలోనే కర్మకాండల ననుసరించి సామాజిక బంధాన్ని ఏర్పరచుకోవాలా అనే ప్రశ్నలు అర్థం పర్థం లేనివి. కావా? ఏది ఏమైనప్పటికీ ఎవరైనా లైంగిక జీవితం కోరుకున్నా, బ్రహ్మచర్యం కోరుకున్నా లేక వివాహం చేసుకుని వివాహ బంధంలోనుంచి సక్రమమైన సంతానం వచ్చినా, అక్రమ సంబంధం ద్వారా పిల్లలు కలిగినా ఆ వ్యక్తిలోని ఆత్మని పరిశుద్ధమొనర్చలేరు – ఒకవేళ అది బ్రాహ్మణ ఆత్మ గనక

అయితే, ఓ బ్రాహ్మణుడు లైంగిక క్రియలో పాల్గొనడం శరీర ఆకలి తృప్తిపర్చుకోడానికి కాదు, భగవంతుడికి ప్రీతి కలిగించేందుకు. మరి శూద్రులు, అంటరానివారు, గిరిజనులు – అపవిత్ర ప్రజానీకం – ఆ కార్యంలో కేవలం తమ స్వార్థపూరిత శారీరక వాంఛను తీర్చుకోవడానికి ప్రవేశిస్తారు. వాళ్ల ఆత్మలకి పవిత్రతతో సంబంధం ఉండదు. అందువల్లే ఆయా జాతులకి పుట్టిన పిల్లలకి పున్నామ నరకం నుంచి తప్పించి పుణ్యలోకాలు లభించడానికి పరలోక సంబంధమైన నిర్వచనానికి సంబంధించి పిండ ప్రదానాది కర్మకాండలు చేసే అర్హత ఉండదు. వాళ్లు తరతరాలుగా శూద్రులుగాను, ఛండాలురుగాను, గిరిజనులుగాను మిగిలిపోవడానికి అదొక కారణం.

పవిత్రత అనేది బ్రాహ్మణులకి ఓ రక్షణ కవచంలాంటిది. అందువల్లే లైంగిక క్రీడ బ్రాహ్మణులని కల్మషమొనరించదు – కల్మషమొనరిస్తుందా? బ్రాహ్మణ మహిళల విషయంలో వాస్తవంగా 'మాయ' స్వభావం విభిన్నమైనది. అందువల్లే బ్రాహ్మణులతో సంబంధం పెట్టుకోవడం – అది రహస్యపూరిత లైంగిక సంబంధమైనప్పటికీ పవిత్ర కార్యంగానే భావించబడుతుంది. ఈ ఆలోచనతో గోవిందన్ నాయర్ తనకు తాను తృప్తి చెందాడు. తన మనసులో వుండిపోయిన తన భార్య కోపరూపాన్ని తొలగించుకోవడానికి అతను రోడ్డుపైకి వచ్చాడు. ఓ బ్రాహ్మణ యువకుడు 'సంబంధం'లోకి ప్రవేశిస్తే అది ఒక్క కేరళకే కాకుండా ప్రపంచానికంతటికీ దీవెన లాంటిదని అనిపించిందతనికి. ఈ శుభవార్త తన స్నేహితుడైన శంకరన్ నాయర్ చెవిలో వేద్దామని అతని ఇంటివైపు అడుగులు వేశాడు గోవిందన్.

కొన్ని రోజుల తర్వాత గోవిందన్ పెరటి గుమ్మం వైపు విలాసంగా బయలుదేరాడు నంబూద్రి. అప్పుడే తీసిన పొడవు చేతుల చొక్కా ధరించాడు. అలా నదురుగా కనిపించడానికి కొంత ఇబ్బంది పడ్డాడతను. దారినపోయే పరిచయస్తులు ఎవరైనా పలకరిస్తారన్న భయంతో. అతను కేవలం తృతీయశ్రేణి 'ముండు' (లుంగీ) ధరించాడు. నాయర్‌లందరి ఇళ్లలో వుండే విధంగా గోవిందన్ నాయర్ ఇంట్లో కూడా ఓ గది వుందని, అది ప్రత్యేకించి 'అందుకే' ఉద్దేశించబడిందని అతనికి తెలుసు. గదిలో ఎవరో వున్నారనటానికి సంకేతంగా పాదరక్షలు గది బయటే వదిలేశాడు. చెప్పులు గది బయట వదిలేస్తుండగా ముందు ముందు చాలా కాలం ఇలాగే చేయాల్సి వుంటుందన్న ఆలోచన కలిగిందతనికి. పేదవారైనా వాళ్లు తమ పరిధిలో గదిని అలంకరించి వుంచడం గమనించాడతను.

నిర్ణీత సమయానికే అలంకరించబడిన ఆ గదిలో పాదం మోపింది సీతామహాలక్ష్మి. విచిత్ర వేషధారణలోకాక పరిమిత వేషధారణలో 'ముండు' ధరించిందామె.

కంటికి అశ్రద్ధగా దిద్దిన కాటుకలో ఆమె తల్లి అయిష్టత వ్యక్తమౌతుంది. ఆమె ధరించిన 'ముండు'గాని, అలంకరణ గాని ఆమె భయాన్ని మరుగుపరచలేకపోయాయి. తన అయిష్టతని సాధ్యమైనంతవరకు కప్పిపుచ్చుకునే ప్రయత్నంలో భాగంగా ఆమె తలదించుకుని నేల చూపులు చూస్తూ తనింట్లో తాను ఉన్నట్టుగాను, ఎలాంటి చెడు తనకి జరగదని తనకి తాను మనసులోనే ధైర్యం చెప్పుకుంది. తలదించుకున్నందువల్ల అప్పుడప్పుడు కళ్లనించి కన్నీటి బొట్లు రాలి కింద పడ్డం చూడగలుగుతోందామె. ఆమె దుఃఖిస్తోందన్న విషయం నంబూద్రికి కోపం తెప్పించినా సంయమనం కోల్పోకూడదనుకుంటూ తనని అదుపులో పెట్టుకున్నాడు. ఆమెను ఎట్టి పరిస్థితుల్లోను బలవంతం చెయ్యవద్దని తన అన్నలు ముందే హెచ్చరించారు. భక్తులు సమర్పించే వాటిని వాళ్ల చేతులనించి దేవుళ్లు బలవంతంగా లాక్కోవాల్సిన అవసరంలేదు. కోపంగా చూడ్డం, సర్వనాశనం అవుతారని బెదిరించడం లాంటివి ఈ సందర్భంలో చాలా చక్కగా పనిచేస్తాయి. తనకున్న అధికారాలు తనకి తెలుసు. ఒక్క మాటతో ఆమెని నాశనమొనరించగలడు. యవ్వనంలోని అసహనంతో దాన్ని చెడగొట్టాల్సిన పనిలేదు. ఎన్నడూ లేని విధంగా అతని రక్తం సలసల మరుగుతోంది.

నంబూద్రి మాట్లాడేందుకు ఉపక్రమిస్తూ "భయపడకు. నాలాంటి మనిషి దొరకడం నిజంగా నీకు దేవుడిచ్చిన వరం. నేను నంబూద్రిని, ఈ భూమిమీద దేవుణ్ణి. నేను నిన్ను 'సంబంధం' రూపేణా ఎంచుకోవడం నీ అదృష్టం. నేను వేదాలు మొత్తం క్షుణ్ణంగా చదివాను. భారతం, రామాయణం కూడా. గీత ఇంకా వాత్స్యాయనుడి 'కామసూత్ర'లో కూడా నాకు అధికారం వుంది. నువ్వు ఏ మాత్రం భయపడాల్సిన పనిలేదు. అనుభవం గలవాడిని" అన్నాడు నంబూద్రి గర్వంతో మొహం మెరుస్తూండగా. నంబూద్రి తన ఎడం చేత్తో ఆమె చుబుకాన్ని పైకెత్తి చూశాడు. ఆమె కళ్లలోంచి నీరు.

నంబూద్రికి అంతా అయోమయంగా వుంది. నంబూద్రి కొంత కలవరపాటుకు గురయ్యాడు. 'అసలు ఆడాళ్లు ఎందుకు ఏడుస్తారు? ఏడుపు తన్ని చిరాకుపరుస్తుందని ఆమె భావిస్తోందా? అటువంటప్పుడు దాదాపుగా ఆమె విజయం సాధించినట్లే' అనుకున్నాడతను. ఆమె అతని చేతినించి చుబుకం తప్పించుకుని మణికట్టు వెనకభాగంతో ముక్కు తుడుచుకుంది చిన్నపిల్లలా. వివర్ణమైన ఆమె బుగ్గల్ని పొగిడేందుకు ఒక్క క్షణం ఆగాడతను. కోమలమైన ఈ గులాబీరంగు పుష్పాన్ని ఉత్పన్నం చేయడానికి నంబూద్రి రక్తం విస్తారంగా నాయకుల బురదతో కలిసింది. అటువంటప్పుడు కళ్లు ఉబ్బితే ఏముంది, శరత్కాలంలో రాలిన ఆకుల్లా బుగ్గలు పాలిపోతే ఏముంది? ఆమెని మొదటిసారి

చూసినప్పుడు పాలుగారే బుగ్గలతో కళ్లలో మెరుపు తొణికిసలాడింది. ప్రధానంగా ఆమెని ఓ జింకపిల్లలా భావించాడతను. కానీ ఆమె ఈ రోజు ఓ పెద్దపులి అన్న భావన కలుగుతోంది. పెద్దపులి, జింకపిల్ల రెండింటి కలయికతో వున్నట్లుగా వుందామె.

సీత మౌనంగా వుండిపోయింది. తర్వాత పరిస్థితి ఏంటన్నది పిన్న వయసులోనే విన్న ఆమెకి తెలుసు. ఆమెకి ఓ పెద్దమ్మ కూతురు ఉంది. తనకన్నా ఏడేళ్లు పెద్ద. ఓ బ్రాహ్మణ యువకుడితో 'సంబంధం' ఏర్పడింది ఆమెకి. అతను ఇలాంటి నంబూద్రి కాదు. అయినా అతను స్థానికంగా వుండే శంకరమఠంలో ఇప్పటికీ పురోహితుడిగా వున్నాడు. ఒకరోజు ఆ యువతి సీతతో అంది, అతను తనని ఓ ఆట బొమ్మగా భావించాడని, ఆ 'సంబంధం' ద్వారా తనకి ఇద్దరు పిల్లలు కలిగారని, వాళ్లు తన కండల్ని చీల్చుకుని జన్మించారని. ఇప్పుడు తను నంబూద్రి ఎదురుగా నిలబడ్డంతో ఆమె అన్నమాటలు సీత మదిలో మెదిలాయి.

"ఇక ప్రారంభిద్దాం" ఆకస్మికంగా అంటూ నంబూద్రి 'కామసూత్రలో చదివిన వాటిని ప్రాక్టికల్‌గా ఆచరణలో చూడాలని నాకు చాలా ఆతురతగా వుంది. మనం రెండో అధ్యాయంతో మొదలుపెడదాం : ఆలింగనం, చుంబనం, నఖ, దంతక్షతాదులు ఇంకా లెంపకాయకొట్టడం, సమాగమం ఇక పడుకో' అన్నాడు.

ఒళ్ళంతా మంచుగడ్డలా అయిందామెకి. అతను కొంతసేపు నిరీక్షించిన తర్వాత "నీకసలు సిగ్గు శరం ఉందా? పడుకో? నా చేత బలవంతం చేయించకు" అన్నాడు.

అంతే, కళ్లలో నిండుకుంటున్న నీళ్లని కిందకి కారకుండా బిగబట్టి ఆపుకునే ప్రయత్నం చేస్తూ ఆమె బెడ్‌వైపు కదిలింది. మోచెయ్యిని బెడ్‌మీద ఆనించడానికి కొద్దిగా ముందుకు వంగిందామె. వెంటనే అతను కఠోరంగా ఆమె కట్టుకున్న 'ముండు' ఒక్క ఉదుటున లాగేసి ఆమెని మంచం మీదకి తోసి ఆమె మీదికి లంఘించాడు. అతని చేష్టలతో 'శోభనపు శయ్య' అనే ఒక తంతు చెదిరిపోయింది. తను చదివిన చదువుకి, సంపాదించిన జ్ఞానానికి సార్థక్యం లభించిందని భావించాడతను. అందమైన ఆమె శరీరంపైన సులభంగానే గుర్తులు పడ్డాయి. వివిధ భంగిమలలో రక్తం ఉరకలు వేసేలా ఆనందించాడతను. ఆమె పెనుగులాట పూర్తికాగానే పని పూర్తిచేశాడతను. తన జీవితంలో అంతగా నిర్వహించిన అనుభూతి ఎన్నడూ అతనికి కలగలేదు. రాసకేళి చరమాంకంలో రససిద్ధి కలగగానే అతని మొహంలో 'దేవుడుగా ఉండడం అంటే ఇదే' అనే భావం ప్రతిబింబించింది.

అనుకున్నట్టుగానే ఆ రాత్రి, మరునాడు గడిపాడు నంబూద్రి. కామసూత్ర అధ్యాయాలు, శృంగార భంగిమలు ఒకటొకటిగా చదువుతూ, చూస్తూ ముందుకి సాగాడతను. ఇందుకు సంబంధించి మరిన్ని గ్రంథాలు చదివాడతను. కాలం గడుస్తున్న కొద్దీ ప్రేమ గుర్తులు చెరిగిపోయి వాటి స్థానంలో కొత్త గుర్తులు ఏర్పడినపుడు జరిగినది పరిశీలించడానికి అవకాశం లభించిందతనికి. అతను చెప్పడం కొనసాగిస్తూ "రాముడు కూడా సీతతో ఇదే చేశాడు. ఇంకా విష్ణుమూర్తి లక్ష్మీదేవితో" అన్నాడు. సీతామహాలక్ష్మి నిష్క్రియగా ఉండిపోయింది. ఇటు నుంచి అటు, అటు నించి ఇటు గదిలో తిరుగుతూ పడుకోవడమే తనంతట తాను ఇష్టాపూర్వకంగా చేసిన పని. ఆమె రక్తమాంసాలతో వున్న ఓ యంత్రం మాత్రమే. ఆమె దేహం లాండ్రీగా మారింది. దాని మీద తను కోరుకున్నన్నిసార్లు ఆమె శరీరం ఇస్త్రీ చేశాడు నంబూద్రి. ఆమె అందం కేరళ దేవుడి స్వంత భూమి అందం. నూనెలా నునుపైన ఆమె శరీరం వదులుగా వున్న నల్లని కురుల ఫ్రేంలో బంధించినట్లుగా వుంది. చంద్రబింబంలాంటి మొహం, మెరిసే కళ్ళు. వాటిని తను అనుకున్న విధంగా గుంటలు పడేలా చేయగలడు నంబూద్రి. ఓ నంబూద్రిగా వాటి మీద తనకి సర్వ హక్కులూ వున్నాయి. విడివడేటప్పుడు అతన్ని బాధపెట్టే కుక్క కాదు ఆమె : ఆమె సర్వసుఖాలని పొందే కుక్క.

నంబూద్రి కృష్ణమందిరం అధ్యక్షుడు కావడం వల్ల ఇండియా అంతటా పర్యటించి ఆర్యావర్త సంస్కృతి, కళలు, సంగీతం అధ్యయనం చేయడానికి స్పాన్సర్ చేశారు ఆలయ నిర్వాహకులు. దాంతో నంబూద్రి ఇండియాలో విస్తృతంగా పర్యటించాడు. చిన్నతనంలోనే సంగీతంపై వున్న అనురాగంతో కొద్దిగా కర్ణాటక సంగీతం అభ్యసించడంతో కొంతలో కొంత సంగీత పరిజ్ఞానం అబ్బిందతనికి. అతను చూసిన ఆలయాలలో ఆకర్షణీయమైన ఖజురహో ఇంకా కోణార్క్. అక్కడ రాతి గోడలపైన పవిత్రమైన శృంగార భంగిమలతో కూడిన శిల్పాలలో వాత్సాయనుడు జీవించి వుండడం చూశాడతను.

గణికులని (ప్రాచీన కాలంలో వేశ్యలు) నాగరికుడు రుచి చూసిన అరవై నాలుగు కళలని అక్కడ చూశాడతను. వివిధ భంగిమల్లో స్త్రీ పురుషులని శూద్రులు మలిచారు. అద్భుతమైన పనితనాన్ని ఆ శిల్పాలలో ప్రవేశపెట్టడానికి వాళ్లు ఆత్మని వశం కావించుకుని వాత్సాయన గ్రంథానికి ఒక రూపం కల్పించారు. ఎందుకంటే వాళ్ల స్వంత ఆలోచనలని దేవుడు  నిరాకరించడంతో శూద్ర శిల్పులు కేవలం సాంకేతిక నిపుణులుగా చెప్పబడ్డారు. వాళ్లు ఎన్నడూ కామసూత్ర చదవలేదు. దేవతా సంబంధమైన ఇంకా పిశాచ సంబంధమైన ఏ పుస్తకం చదవడానికి వాళ్లకి అవకాశం లేదు.

కేవలం ఆర్యావర్త దేశంలో మాత్రమే దేవతలు ప్రశంసించిన స్పిరిచ్యువల్ సెక్స్ జీవితం ఖజురహో ప్రతిబింబించింది. ఋగ్వేదం, అందులో వున్న శ్లోకాలు, దేవాది దేవుడైన ఇంద్రుడు స్త్రీలని ప్రేమించిన విధానం – భార్య కాదు – అప్సరసల్ని, తమని తృప్తిపరచడానికి తాము సృష్టించిన అపూర్వమైన వ్యభిచారులని మొత్తం అంతా జ్ఞప్తికి తెచ్చుకున్నాడతను. మందకొడిగా వున్న సీతామహాలక్ష్మితో సంగమిస్తున్నపుడు మనసులో మేనకని, ఊర్వశిని ఆమె స్థానంలో ఊహించుకుంటూ ఉంటాడతను. తానేదో గొప్ప కార్యం సాధించినట్టు. కూజాలా వంపుగా వున్న ఆమె మెడలో ప్రాచీన కాలంలో రాజులకి శుశ్రూషల నొనరించిన అనామిక సౌందర్యవతులను ఊహించుకున్నాడు. ఆమె బాహువులని కదిలించినపుడు తనని ఉల్లాసపరిచేందుకు మనసులో సురభామినులు నృత్యం చేసినట్టుగా ఊహించాడు. తనని తృప్తిపరచడానికి ఆమె సమర్పించుకున్న నగ్నదేహం వాళ్లదిగా మనసులో ఊహించుకున్నాడు. తన ఈ అంతర్దృష్టిని ఆమెతో పంచుకోలేదతను : అది కేవలం తన ఆంతరంగిక వినోదం, ఆనందం కోసం మాత్రమే.

దివ్యమైన ఈ వేశ్యలపైన అరవై నాలుగు కళలకన్నా అధికంగా ప్రయోగించిన దేవుడు తనే. వాత్సాయనుడు కేవలం కొన్ని శృంగార భంగిమలని మాత్రమే పట్టుకోగలిగాడు. వాటినే మళ్ళీ మళ్ళీ గొప్ప ఆలయాలైన ఖజురహో, కోణార్క్‌లలో ఆ పురాతన పారవశ్యపు నాటకాన్ని అభినయింపజేశాడు. ఇంకా చాలా చాలా కనిపెట్టాలనుకున్నాడు. అంతేకాదు, వాటిని లైంగిక సంతృప్తి కోసం పట్టికలో జోడించాలనుకున్నాడు. నిమ్న పదార్థంతో పరిశోధన నిర్వహించాల్సి వచ్చినందుకు బాధపడ్డం తప్ప చేసిందేమీ లేదు. ఎలాగైతేనేమి, వాత్సాయనుడు కూడా ఓ నాగరికుడు భార్యతో ప్రయోగాలు చేయడమనేది నిషేధించాడు. 'శృంగార విషయంలో పరమ అసహ్యమైన, ఏహ్యమైన ఛండాలమై వాటిని కూడా కామశాస్త్రంలో నేను చెప్పాను. చెప్పినంత మాత్రాన అవన్నీ చెయ్యాలని లేదు...' అని తేలికగా వాత్సాయనుడు తప్పించుకున్నాడు. వివాహం అనేది పిల్లల్ని పుట్టించడానికి ఇంకా వివాహిత స్త్రీలు పవిత్రంగా ఉండటానికి. అందువల్ల వాళ్లు అమ్మతనం మీద తమ దృష్టిని కేంద్రీకరించగలరు. ఇంద్రియలోలత్వం కేవలం దుర్మార్గులకి ఉద్దేశించినది.

ఆ విధంగా ఓటి కుండ మంచి సంగీతాన్ని అందించింది, మహిళ వారసుణ్ణి కనాలన్న ఆశతో గాక సంతోషాన్ని కలిగించేదిగా, నాన్నతనం గంభీరంగా మారింది. పిల్లలు కలగడమనేది భగవంతుడిచ్చే అవకాశాన్ని బట్టి వుంటుంది.

నంబూద్రి కుటుంబాల్లోని చిన్న కొడుకుల్లాగా, తన విషయానికి వస్తే, తన పెద్దన్నయ్య కుటుంబం అంతటికి కలిపి స్వర్గంలో స్థానం సంపాదించాడు, కొడుకుని కని – ఆడకుక్క శివశక్తి తన పవిత్రతకి భంగం వాటిల్లకుండా ప్రవర్తించి వుంటే,

నంబూద్రిలలో చిన్న కొడుకులలో వివాహ నిషేధం వలన సంతానోత్పత్తి పనులులేవు. వాళ్లు కేవలం అభ్యుదయంవైపు నడిపించే లైంగిక క్రీడాకారులు. విజ్ఞానం అనేది ఓ శక్తి.

ఆ విధంగా 'సంబంధం' వంశాంకురానికి అవకాశంలేని ఓ కన్సొలేషన్ ప్రైజ్‌గా పేర్కొనవచ్చు. దాంతో తన అంతరంగంలోని అసహనాన్ని ప్రయోగాల పేరుతో సీతామహాలక్ష్మి మీద ప్రయోగించాడు నంబూద్రి. అప్పటికీ మరొక ప్రయోగం మిగిలే వుంది; సీతామహాలక్ష్మి ఆ ప్రయోగానికి ఎంతవరకు అనుమతిస్తుందో అనేది ఓ మిస్టరీగా మారింది. ప్రతిరోజు సమాధానం కోసం వేచి చూశాడు నంబూద్రి. ఆ రోజు రానే వచ్చింది. అతను, బాధలపై తన దైనందిన విచారణ ముగించగానే, విధి తనను అన్ని బాధ్యతలనుంచి విముక్తి చేసినందుకు కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

తాను పుట్టించిన పిల్లల్ని కృతజ్ఞతగల నాయర్‌లు ఎవరైనా చూస్తారు, ఆ పిల్లలు ఎటువంటి ఆస్తిపాస్తులకి, విద్య, ఉద్యోగానికి అర్హులు కానప్పటికీ, వాస్తవానికి ఆ పిల్లలు తినేసిన తన కాలగోటితోనో లేక ముక్కులోని శ్లేష్మంలానో తనకి అల్పులకిందే లెక్క.

రోజులు గడుస్తున్నాయి. ప్రతిరోజు తన కిష్టమైన రీతిలో జరిపించుకుంటున్నాడు నంబూద్రి. సీతామహాలక్ష్మి గర్భవతి అయింది. శరీరం నునుపుతేలి మెరుస్తూ నిండుగా ఉంది. ఆమె అంగాంగాల్లో కలుగుతున్న మార్పులని, ఉచ్ఛ్వాస నిశ్వాసాలని చూస్తూ గర్భిణి స్త్రీ ఏం చేయగలదో ఏం చేయలేదో అణువణువూ పరిశీలిస్తూ ఆమె శరీరం మీద ప్రయోగాలు కొనసాగిస్తూనే వున్నాడు నంబూద్రి. కానీ ఆమె ఏనాడూ విముఖతను ప్రదర్శించలేదు. దాంతో ఆశ్చర్యపోవడం అతని వంతయ్యింది. ఆమె ఎల్లప్పుడూ మౌనంగానే ఉంది. అతన్నించి దూరంగా ఉన్నప్పుడు కూడా. అలా వుండడం ముందు కోపాన్ని ఆ తర్వాత చికాకుని కలిగించాయి నంబూద్రికి. ఒక రోజు పొట్ట ఎంత పెరిగిందోనని ఆలోచిస్తూ గదిలో పచార్లు చేస్తున్నాడు నంబూద్రి. ఇంతలో ఆమెకి ప్రసవం నొప్పులు మొదలయ్యాయి. తన ప్రమేయం లేకుండా నంబూద్రి గదిలోంచి బయటకి రావడమన్నది ఒకే ఒక్క సందర్భం అది. కల్మషకారకమైన శిశువు పుట్టుకతో తనకి సంబంధం వున్న కారణంగా ప్రాయశ్చిత్తం చేసుకోవాలని పాపపరిహారార్థం తిన్నగా గుడిలోకి వెళ్లాడతను. వారం రోజుల తర్వాత అనైతిక సంతానం కలిగినందువల్ల తాయెత్తులతో అతను వెళ్లిపోయాడు. ఆమె కటివలయం వదులైన విధానాన్ని శ్రద్ధగా గమనించాడతను. తను ఆమెని శిక్షించడంవల్ల అవి తడికెలుగా మారాయని భావించాడు. ఆమె స్తనాల నుంచి స్రవించిన పాలు రుచిలో ఆవుపాలకన్నా తక్కువగా వుండడంతో చిరాగ్గా తుపుక్కున ఉమ్మేశాడతను. ఆమె తక్కువ జాతికి చెందినదన్న విషయం సుస్పష్టమే.

ఈ విధంగా రెండుసార్లకన్నా ఎక్కువే జరిగింది. తన ద్వారా ఇద్దరు పిల్లలు ఎక్కువయ్యారు. ఒకరోజు తన పిల్లల్ని చూడాలనిపించింది నంబూద్రికి. అందుకు ఆమె తల అడ్డంగా వూపింది. "ఇంతకీ పిల్లలు కనిపించరేం! అన్నాడు మళ్ళీ మళ్ళీ ఎంతో ఉత్సాహంతో. మళ్ళీ తల అడ్డంగా వూపిందామె. దాంతో ఈడ్చి దవడమీద కొట్టాడు. అలా కొట్టడంలో తనకి కొంత ఉపశమనం కలిగినట్లయి మళ్ళీ గట్టిగా కొట్టాడు. 'ఈసారి నేనొచ్చేసరికి పిల్లలు ఇక్కడుండాలి' అని చెప్పి వెళ్ళిపోయాడు. మరునాడు యధాప్రకారం మంచంమీద అతని కోసం వేచిచూస్తూ గదిలో ఒంటరిగా వుందామె. పిల్లల ప్రస్తావన రాలేదు.

సంవత్సరాలు గడచిపోయాయి. తన చిన్న కొడుకు పదేళ్ల ప్రాయానికి వచ్చుంటాడు అనుకున్నాడు నంబూద్రి. ఎవరి దగ్గరా తన పిల్లల గురించిన ప్రస్తావన తీసుకురాలేదతను. గత కొద్ది సంవత్సరాలుగా తనకి తెలియకుండానే సీతామహాలక్ష్మి పట్ల తన ప్రవర్తన క్రూరత్వం నించి ఉపేక్ష దశకు చేరుకుంది. తను కూర్చునేందుకు సౌకర్యవంతమైన కుర్చీలా ఉందామె. తనామెని ఎంత బాధపెట్టినా, ఎంత కోపగించుకున్నా ఏదో ఒకరోజు ఆమె తనని క్షమించి కొంతసేపైనా పిల్లలని చూడనిస్తుందన్న ఆశతో వున్నాడతను. చెప్పాలంటే జీవితంలో తను చేసింది పెద్దగా ఏమీలేదు. గుడిని పర్యవేక్షించడం, వివాదాలు వెన్నుపోట్లు పొడవడంలాంటి వాటిల్లో పాల్గొనడం చేశాడు. నిత్యం గుడిలో దేవుడికి నివేదించిన వాటిల్లో తన వాటా రాబట్టుకోవడం, శివశక్తి జీవితం నరకప్రాయం చేయడం, సిద్ధాంతాల గురించి వృద్ధులతో ఆడంబరంగా చర్చించడం ఇంక తన కుటుంబాన్ని దానిని కర్మకి దాన్ని వదిలేయడంలాంటివెన్నో చేశాడు. ఖచ్చితంగా చెప్పాలంటే, అతను ఎప్పుడూ చూడని ఈ ముగ్గురు పిల్లలే తను తయారుచేసిన తరగని విలువైన వాళ్లు. వారే తన స్మృతి పథంలోంచి జారిపోయి ప్రస్తుతం హాస్యాస్పదమైన తన జ్ఞాన పిపాస యొక్క అనుకోని ఉత్పత్తులు.

ఇప్పుడు ఈ నిమ్న జాతి ఆవు తన దూడలని తనకి కనబడనీయకుండా దాస్తోంది. తనకేమీ పట్టలేదన్నట్టుగా.

భారమైన హృదయంతో తమిళనాడులోని వేదశాస్త్రి ఇంటికి అతిథిగా వెళ్లాడు నంబూద్రి. 'సంబంధం' గురించిన ఆచార వ్యవహారాల శాస్త్రబద్ధతను వేదశాస్త్రిని అడగాలనుకున్నాడు. కానీ అది తన స్వంత విషయం కూడా కావడంతో వేదశాస్త్రితో చర్చించడానికి సిగ్గుపడి చివరి క్షణంలో ఆ ప్రయత్నం విరమించుకున్నాడు నంబూద్రి. ముఖ్యంగా తను నోటిని అదుపులో వుంచుకోవాల్సిన అవసరముందని అకస్మాత్తుగా అనిపించిందతనికి. తన బిడ్డలని చూడాలని తహతహలాడుతున్నానని, నాన్నా అని

పిలిపించుకోవాలనుందని  గురువుకి చెప్పాలని అనుకున్నాడు. నిషిద్ధ నాయర్ పిల్లతో స్నేహపూర్వకంగా మసలాలనుందన్న తన కోరికని వ్యక్తం చేయదలుచుకున్నాడు. వేదశాస్త్రికి ఈ విషయంలో ఏ మాత్రం సానుభూతి లేదని భావించిన నంబూద్రి దాన్ని ప్రస్తావించలేదు.

చిరకాలంగా సీతామహాలక్ష్మితో గడిపిన నంబూద్రికి శిలాసదృశంలాంటి రాజీపడిన ఆమె మౌనం కంటే భయంకరమైనది ఏదీలేదని, మార్చాల్సింది కూడా ఏమీలేదని అర్థమైంది.  సీతామహాలక్ష్మి బలమైనది మాత్రమేకాదు, తనకంటే అధిక బలవంతురాలు. ఆమె ఎన్నడూ తనలాగా ఎత్తుగడలు వేయకపోవడం వెనుక వున్న వాస్తవం ఆ విషయాన్ని ధృవపరిచింది. తను ఎన్నడూ ఆమె భావాలని గ్రహించే ప్రయత్నం చేయలేదు. కానీ ఆమె ఎదురుగా వున్నప్పుడు తనకు తాను కర్కశంగా వుండే తల్లిముందున్న పిల్లవాడిలా భావించేవాడు. వేదశాస్త్రి ఇంటినించి తిరిగి వచ్చేశాడు నంబూద్రి. ప్రయాణ సమయంలో తన మీద పడిన దుమ్ము దులుపుకోగానే తన సమస్యకి పరిష్కారదిశగా మదిలో ఓ మెరుపు మెరిసినట్లయింది. ఆమెతో వివరంగా అన్ని విషయాలు మాట్లాడితే ఆమెలోని భయం తొలగిపోగలదన్న విశ్వాసం కలిగిందతనికి. అతను చురుగ్గా తను ధరించిన 'ముండు' లోపలికి తొంగి చూసుకున్నాడు. అతను దిగంబరంగా వుండటమన్నది ఎన్నడూ జరగలేదు. హిందూ అగ్రకులాచార ప్రకారం ఒంటిమీద బట్టతో స్నానమాచరించాడతను. ఇన్ని సంవత్సరాలుగా సీతామహాలక్ష్మితో గడిపినా తన దిగంబరత్వాన్ని ఒక్కసారి కూడా చూడలేదామె. ఇది మంచిగానే తోచిందతనికి. చురుకుదం, తెలివితేటలున్న ఆమెకన్నా తను అధిక నియంత్రణలో ఉన్నాడనిపించింది అతనికి... కానీ ప్రస్తుతానికి తను ఒంటరినన్న భావన కలిగిందతనికి. అతను పొడవాటి 'ముండు' ధరించి గోవిందన్ నాయర్ ఇంట్లో  ప్రత్యేకంగా వున్న ఆ చిన్న గదికి బయలుదేరాడు. కొంత గైర్‌హాజరీ తర్వాత తనని చూడగానే  సీతామహాలక్ష్మి తప్పక సంతోషిస్తుందని అతని ఆశ.

ఎప్పటిలా సీతామహాలక్ష్మి మంచం మీద పడుకొని వుంది. ఘనీభవించిన మంచులాంటి నిశ్శబ్దాన్ని ఛేదించడమెలాగో తెలియక అతను ఆమెతో యథాప్రకారం సెక్స్‌లో పాల్గొన్నాడు. ఈసారి సాధారణం కన్నా కొంచెం అధిక శ్రద్ధతో ఆమెని గమనించాడు. శరీర సౌష్టవంలో యేమీ మార్పు లేదు.

కాయకష్టం చేసే అలవాటుండటంతో ఆమె శరీరం చక్కగా దృఢంగా తయారైంది. ఆమె రొమ్ములు గతంలోలాగే దృఢంగా వున్నా వాటి అందాలు మరింత పొంగి చనుగుబ్బలు మరింత ఉబ్బినట్టుగా వున్నాయి. తలలో ఒకట్రెండు పండు వెంట్రుకలు వచ్చాయి. తన ఎంపికలో ఎటువంటి లోపమూ లేనందుకు సంతోషించాడు. ఇప్పుడు ఆమె వయస్సు ఎంత వుండవచ్చు? యాభై-యాభై ఐదు? తనకన్నా నాలుగేళ్లు చిన్నది. కదా? తను

ఆమెని గాయపరిచే ప్రయత్నం చేసినప్పటికీ రూపం ఏ మాత్రం చెక్కుచెదరలేదు. ఓసారి కిందికి చూసుకున్నాడు నంబూద్రి. 'ముండు' దగ్గర కొవ్వు ముడతలు పడి చర్మం వదులై అల్లల్లాడుతున్నట్టుగా గమనించాడు. ఆమెకన్నా తనకే చీకటి ఛాయలు అధికంగా వున్నట్టుగా అనిపించిందతనికి. ఇవేవీ గతంలో గమనించలేదతను. ప్రతికూల ఆలోచనలు చేయడానికి ఇది సమయం కాదని దీర్ఘంగా నిశ్వసిస్తూ ఆమె పక్కన పడుకున్నాడు : ఆమె కదల్లేదు మెదల్లేదు. అతను మంచం మీంచి లేచాడు. ఆమె మొహం చూడకుండా అతను మాట్లాడలేకపోయాడు. అతను నెమ్మదిగా గొంతు సవరించుకుని 'ఎలా ఉంది జీవితం సీతా?' అని మాత్రమే అనగలిగాడు. ఆమె నుండి సమాధానం కాదు గదా కనీసం చలనం కూడా లేదు. తన మాటలు ఆమెకి వినిపించాయో లేవోనన్న సందిగ్ధంలో పడి 'నాతో జీవితం ఎలా వుందని అడిగాను సీతామహాలక్ష్మి?' అంటూ వేళ్ళతో గిచ్చాడు.

అప్పుడు చూసింది అతనివైపు. అతను ఎన్నడూ ఆమెని నువ్వు నువ్వు అనడం తప్ప మరే విధంగానూ పిలవలేదు.

'ఏం చెప్పాలనుకుంటున్నావు?' అడిగిందామె.

'నేను అడిగిన ప్రశ్నకి సమాధానం చెప్పు' అన్నాడతను దిగ్భ్రాంతిగా.

ఒక్కసారి ఈసడింపుగా అతనివైపు చూసి,

'ఏం చెప్పమంటావు. నా బతుకు కుక్కకన్నా హీనంగా మారింది. మురుగు కాలువలో పడి వున్న కుక్కలావుంది నా బతుకు, క్షణక్షణం హింసలతో జీవితం నరకప్రాయమైపోయింది. నా యజమాని కౌగిలించుకునే సమయంలో కుఁయి కఁయి మనకుండా కృతజ్ఞతతో తోకాడిస్తూ అతని ముందు మోకరిల్లుతాను."

నోటమాట రాక మౌనంగా ఉండిపోయాడతను. చాలా నిర్లక్ష్యంగా ఉన్నాయావిడ హావభావాలు.

అతను మళ్లీ మాట్లాడే ప్రయత్నం చేశాడు. "ఇన్ని సంవత్సరాలుగా మనం కలిసి జీవిస్తే నీకేమీ పట్టనట్టు వున్నావు?" అన్నాడు.

తలపైకెత్తి చూశాడతను. ఆమె చూపుల్ని భరించలేకపోయాడు. "నువ్వు ముగ్గురు పిల్లల్ని కనిచ్చావు" అంటూ నెమ్మదిగా స్వరంతో "నేను వాళ్లని చూడొచ్చా?" అని అడిగాడు.

"వాళ్లు నిన్ను అసహ్యించుకుంటారు".

"ఎందుకని? వాళ్లకి జన్మనిచ్చాను. నన్నే అసహ్యించుకోవడానికి వాళ్లకి ఎంత ధైర్యం?"

"ఎందుకంటే వాళ్ళు పప్పీలు అయ్యుంటే గనక ఆ పప్పీల్ని చూడ్డానికి తక్కువ శ్రద్ధ కనపరిచేవాడివి కావు."

"అది నిజం కాదు. వాళ్లని చూపించాల్సిల్సిందిగా నిన్ను మరీ మరీ అడిగాను. ఇన్నాళ్లూ నువ్వు చూపించనే లేదు. ఇప్పుడు నాకు వ్యతిరేకంగా వాళ్ల మనసుల్లో విషబీజాలు నాటుతున్నావు.

"నువ్వు వాళ్ల దగ్గర వుంటావా? కాళ్ళ మధ్య తోకలు పెట్టుకుని తచ్చట్లాడే కుక్కలు కూడా వాటి పిల్లలు ప్రమాదంలో పడ్డప్పుడు పళ్లను బయటపెట్టి తోకలు ఎత్తి ఇకిలిస్తాయి."

"సీతా నన్ను కూడా ద్వేషిస్తున్నావా?"

"అవును, నువ్వంటే ద్వేషమే. నిన్ను గర్హిస్తున్నాను. నువ్వు ఓ తుచ్ఛుడివి. వెన్నెముకలేని స్వార్ధపరుడివి. ప్రపంచానికి భయపడతావు. ఈ గదిలో అయితే నీ బందీతో నువ్వు హీరోవి. అది బాధపడ్డం చూసి క్రూరమైన సంతృప్తి పొందుతూ నిన్ను నువ్వు గొప్పగా భావించుకుంటావు. నువ్వు ఏం చేసినా అరవకుండా మౌనంగా ఎందుకున్నానో తెలుసుకోవాలనుందా? అయితే విను. నువ్వు నా బాధపై కడుపు నింపుకోవడానికి వచ్చావని నాకు తెలుసు. అందుచేత నువ్వు ఆకలితో మాడిపోవాలని కోరుకున్నాను."

గొంతులో కసి వినిపించింది.

ఆ మాటలు నంబూద్రి చెవుల్లో పిడుగుల్లా దూరాయి. కళ్లలో నీరు ఉబికింది నంబూద్రికి. "నువ్వు ఈ రకంగా ఆలోచిస్తావని నేను అనుకోలేదు. నా సమయమంతా ఇక్కడే గడిపాను. రోజూ నీ వద్దకు వచ్చాను. ఏ భర్త అయినా తన భార్యతో అలా ఎలా అనగలడు? నేను విశ్వాసపాత్రుణ్ణి కానా?"

"అవును, నువ్వు విశ్వాసపాత్రుడివే. రోజూ ఉదయం గది గుమ్మం దగ్గర కాపలా వుండే ఆడకుక్కని తన్నేటంత విశ్వాసపాత్రుడివి."

"మంచిది" అంటూ వెళ్లడానికి లేస్తూ నంబూద్రి "ఇప్పుడేం చేయాలని నీ ఆలోచన" అన్నాడు.

తనకి గుర్తున్నంతవరకు మొదటిసారిగా ఆమె నిలబడ్డం చూశాడతను. అప్పుడు గమనించాడు ఆమె పొట్టిగా వుందని. కానీ కల్పనలో ఎందుకోమరి పొడవుగా వున్నట్లనిపించింది.

"నేను దక్షిణపు 'సతి' అవుదామని నిర్ణయించుకున్నాను" అందామె స్పష్టంగా, తత్తరపాటు లేకుండా.

నంబూద్రిలో కొద్దిగా కదలిక వచ్చింది. "నువ్వనేది నేను చచ్చిపోతేనా?" ఎకసక్కెంగా అంటూ నంబూద్రి "నువ్వు మరింతగా ప్రేమించు, అప్పుడు చూస్తాను" అన్నాడు వ్యంగ్యంగా.

"నువ్వు చచ్చినా చావకున్నా నేను సతినవుతాను."

"ఏం మాట్లాడుతున్నావు? అసలు నీ ఉద్దేశమేంటి?" అని గట్టిగా అరుస్తూ నంబూద్రి "మనకి కనీసం పెళ్లి కూడా కాలేదు. అటువంటప్పుడు నువ్వు సతి ఎలా అవుతావు. నేను ఇంకా బతికే వున్నాను. థాంక్ యూ" అన్నాడు.

"పెళ్లి కాకుంటే ఏంటి? 'సంబంధం' అంటే ఏంటి? అయినా నువ్వు బాధపడవల్సిన పనిలేదు. నీది కాదు, నా జీవితానికి నేనే చితి పెట్టుకుంటాను. నా జీవితం. నువ్వు రాకున్నా ఏముంది. నేను జీవచ్ఛవాన్ని. ఇలాంటి జీవితం కొనసాగించడంలో అర్థంపర్థం లేదు. నాకు నేనే వితంతువుని. నేను సతినౌతాను."

"ఇలాంటి పనికిమాలిన మాటలు నేనెప్పుడూ వినలేదు. కుక్కచావు చావాలనుందా?" కోపంగా అనుకుంటూ ద్వారం దాటి గబగబా బయటికి వెళ్లిపోయాడు నంబూద్రి.

ఇంకెప్పుడూ సీతామహాలక్ష్మిని కలవకూడదనుకున్నాడు నంబూద్రి. వరండాలో కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడతను. తన అన్న మరణించిన తర్వాత తన వదిన శివశక్తి సతీసహగమనం చేయనందుకు కోపంగా వున్నాడతను. అలా చేయకపోవడంతో తను చాలా ఇబ్బందులు పడ్డాడు! మరీ ఇతర ఆలోచనలు లేకుండా అన్నగారి ఆధ్యాత్మిక ఆనందాన్ని కాపాడ్డం కోసం ఆమెని పగలూ రాత్రీ కాపలా కాయాల్సి వచ్చింది.

ఇప్పుడు ఓ శూద్ర మహిళతో తనకి కేవలం 'సంబంధం' అన్న ఒప్పందం ఏర్పడింది. వసతి ఏర్పాటుకన్నా కొంచెం ఎక్కువగా, శారీరక బాంధవ్యం లాంటిది. తన పేరు మీద సతి అవ్వాలని కోరుకుంటోంది. వేదశాస్త్రి చెప్పింది నిజమే : ప్రపంచం నరకంలోకి దిగజారుతోంది. అన్ని సంకేతాలూ అమంగళకరంగా గోచరిస్తున్నాయి. అవన్నీ నుదుటిపైన కదలాడుతున్నాయి. అతని కనుగుడ్లులాగుతున్నాయి. బ్రాహ్మణులకి చెడు సంకేతం. ఇప్పుడు తనేం చెయ్యాలి? దగ్గర దగ్గర అరవయ్యోపడిలో పడ్డాడతను. దూషించే బ్రిటిష్ రాజ్యంలో ప్రభుత్వోద్యోగులు రిటైరై తోట పనులు చేపట్టారు. తన వయస్సున్న వ్యక్తులకి ఈ సెక్సువలే తుఫాను విసిగిస్తుంది. మహిళలు లేరు : బెడ్‌రూమ్ విషయాల్లో వాళ్లు ఎన్నడూ అలసిపోయినట్టు కనిపించరు. వాళ్లకి సెక్సు కేవలం శారీరకమైంది

మాత్రమే కాదు. అది ఒక రాజకీయ ప్రపంచంలాంటిది. రాజకీయాలు. అవును, వృద్ధులకి అది మంచి స్థానం, ప్రపంచాన్ని వెనక్కి నెట్టడానికి. ఇప్పుడు జాతీయ సరుకు జనరంజకంగా మారింది. ప్రార్థనలు, మీటింగులు, సందు చివర్లో సభలూ సమావేశాలు. మంచి పాండిత్యం, నాయకత్వం పటిమ ఉన్న తనని తప్పక స్వాగతిస్తారు?

అవును. ఆలోచనలతో కూడిన జీవితాన్ని తను చాలాకాలం నించి నిర్లక్ష్యం చేశాడు. ఆర్యావర్త సంక్షేమం కోసం గంభీరమైన వ్యక్తులతో పాటు, తనలాంటి వ్యక్తులతో కలిసివుండాలన్న తన మనస్సులోని ఆలోచనలని చాలా కాలం నుంచి నిర్లక్ష్యం చేశాడతను. తనకి తెలుసు అటువంటి వ్యక్తులు వున్నట్టుగా : వాళ్లని ఇప్పుడు అన్వేషించి వాళ్లలో ఒకడిగా తను చేరాలి, లేదా ఆధ్యాత్మిక జీవితం గడపాలి. అది మరీ సంతోషదాయకమైనది, ఆనందకరమైనదీనూ; బ్రిటిష్‌వాళ్లు ఎవరిని ఎప్పుడు ఎందుకు నిందిస్తారో తుఫాను లాంటి ఈ కాలంలో తెలియదు.

'కుక్క చావు చస్తే చచ్చింది సీతామహాలక్ష్మి' అనుకున్నాడు నంబూద్రి.

స్నానం చేయడానికి లేచాడు నంబూద్రి. ఒంటికి కొబ్బరి నూనె పట్టించాడు. సూర్యనమస్కారాలు చేసి పవిత్రమైన మామిడాకులతో ఒకటి రెండు బొట్లు నెత్తిన చల్లుకున్నాడు. ఆ తర్వాత కొత్త సిల్క్ 'ముండు' ఇంకా తనకి ఇష్టమైన హాఫ్ షర్ట్ ధరించి సిల్క్ అంచుతో వున్న అంగవస్త్రం భుజం మీద వేసుకున్నాడు. ఉడెన్ శాండిల్స్ వేసుకోవడంతో అతని వేషధారణ పూర్తయింది. గుడికి బయల్దేరాడు. దారినపోయే మనుషులు నమస్కరించారు. తను వాళ్లకి ప్రతి నమస్కారం చేశాడు. అతను ధరించిన హాఫ్ షర్టుని చూసి దూరాన్నించే మనుషులు అతన్ని గుర్తుపట్టారు.

నంబూద్రి ఓ సందు మలుపు దగ్గరకి చేరుకోగానే కొంచెం దూరంలో దాసన్‌ని చూశాడు. దాసన్ ఛండాలుడు, అంటరానివాడు. దాసన్ నంబూద్రిని గమనించినట్టున్నాడు. పరుగులంఘించాడు. అతను దరిదాపు నగ్నంగా వున్నాడు. ఆమోదించబడ్డ ఫ్యాషన్‌లో కానీ ఎన్నడూ లేని విధంగా నంబూద్రి వ్యాకులపడ్డాడు. చెడ్డ శకునం. అశుభం. ఈ రోజు తన రాజకీయ ఉరవడిలో ముందే దుశ్శకునం అనుకున్నాడు నంబూద్రి. దేవుడి నామాలు స్మరించుకుంటూ ముందుకు సాగాడతను.

శ్రీకృష్ణ ఆలయం చాలా పెద్దది. ఈ ఆలయానికి ఏడాదికి వచ్చే ఆదాయం ఐదు లక్షలకు పై మాటే. బ్రిటిషర్స్‌కి వ్యతిరేకంగా జరిగే ఫ్రీడం స్ట్రగుల్‌కి ఆలయం విరాళాలు కూడా ప్రకటిస్తుంది. గర్భగుడికి వెళ్లే దారిలో బంగారు కమాను వుంది. అక్కడే నీలి రంగులో పెయింట్ చేసిన పెద్ద శ్రీకృష్ణుని శిల్పం వుంది, ఒక కాలిపైన

మరొకకాలు వాలుగా వుంచుకొని రాధ మీద వంగి నిలుచున్న భంగిమలో. వివిధ రకాల అంచులతో వున్న ఎరుపు, నీలం రంగు చీర పెయింటింగ్‌తో రాధ శిల్పం తెల్లని మోహముతో కూడిన కృష్ణుడిని ప్రేమ అర్థిస్తున్నట్టుగా వుంది. కృష్ణుడు ప్రేమ దేవుడు, యుద్ధ దేవుడు : అతను సృష్టించిన వాటిలో ఆ రెండూ ముఖ్యమైన విషయాలు. క్షత్రియ కుటుంబంలో పుట్టి శూద్రుల (యాదవ) గొల్ల చావిడిలో పెరిగిన కృష్ణుడు రెండోతరానికి చెందిన శక్తివంతమైన దేవుళ్లయిన విష్ణు వంశానికి చెందినవాడు. వైదిక పురుషులు దర్శించిన అతను ధర్మాన్ని స్థాపించడానికి జన్మించాడు. అతను అన్నాడు, 'సంభవామియుగే యుగే' (నేను ప్రతి యుగంలోను అవతరిస్తుంటాను) అతను భగవద్గీతను రచించాడు – జాతీయవాద హిందూ ధర్మానికి సంబంధించిన పుస్తకమది. అహింసకి ఆయుధంగా ఆ గ్రంథం ఉపయోగించాడు గాంధీ. అంతేకాదు, తన ఉద్యమంలో భాగంగా రామరాజ్య స్థాపన కోసం రాముని వాఙ్మయాన్ని దేశమంతటా వ్యాప్తి చేశాడు. కృష్ణుడు యుద్ధభూమిలో ఆ పుస్తకం కూర్చాడు, యుద్ధ ప్రతిపాదన మంచి కోసమేనని. రాముడు భార్య శీలాన్ని అగ్ని ప్రవేశం చేసి నిరూపించుకోమన్నాడు. ఏదైతేనేమి, నంబూద్రి రాముడికంటే ఎక్కువగా కృష్ణ భక్తుడు.

నంబూద్రి కుడికాలుపెట్టి గుళ్లోకి ప్రవేశించాడు. అతని కోసం ప్రవేశద్వారం దగ్గర ఎదురుచూస్తున్న వాయిద్యకారులు అతను గుళ్లోకి ప్రవేశించగానే పెద్దగా సందడి చేశారు. నూనెరాసి దువ్విన తలమీద పూలు చల్లారు. నంబూద్రి సూటిగా కృష్ణుడి కళ్లలోకి చూస్తుంటే అక్కడున్నవాళ్లంతా నంబూద్రి కళ్లలోకి చూస్తున్నారు. గుడి మొత్తం బ్రాహ్మణులతోను, నాయర్‌లతోను, మీనన్‌లతోను వారి వారి కులాల ననుసరించి నిండిపోయింది. వారి సామ్రాజ్యవాద వ్యతిరేకతా భావం వల్ల ఈ కులాల మధ్య ఒక నూతన ఆధ్యాత్మిక సంబంధం పెరుగుతోంది.

ఓ కొత్త హిందూమతం అంతా కలిసి కూర్చోవడంతో స్థాపించబడింది. అంతా కలిసి తినడం, త్రాగడంలోకాదు ముస్లింలు, క్రిస్టియన్‌లు దేవభూమికి చెందిన ప్రజలని గుళ్లో శూద్రులతో కలిసి కూర్చోవాల్సిందిగా ఒత్తిడి చేశారు. లేకుంటే... రైతులు, దుకాణదారులు డబ్బు ఇవ్వడంగాని హిందూ ధర్మాన్ని అనుసరించడంగాని చెయ్యరు.

నంబూద్రి తిన్నగా గర్భగుడిలోకి ప్రవేశించాడు. అక్కడున్న పురోహితుడు కేరళ పద్ధతిలో ఏమీ మాట్లాడకుండా అంకితభావంతో నమస్కారం చేశాడు. కొన్ని క్షణాల తర్వాత గబగబా మళయాళం, సంస్కృతం కలగాపులగంగా శ్లోకాలు వల్లించాడు. ఆ ఆధ్యాత్మిక ఉచ్ఛారణ భావయుక్తంగాను, స్పష్టంగాను లేదు. అయితే స్పష్టత అనేది హిందూ మతంలోని ఆచారం కాదు. వేగం : పుస్తక సహాయమన్నది లేకుండా అంతా వేగమే : అక్కడున్నది అదే. హిందూ పూజారి భగవంతుడి మధ్య అదో పవిత్ర వాక్ప్రవాహం;

క్షత్రియ – శూద్ర భగవంతుడైన కృష్ణుడు బ్రాహ్మణ పురోహితుడి మధ్య – ఏ శూద్రుడూ ఛండాలుడూ ప్రదర్శించడానికి వీలులేని దేవుడితో పలికిన మాటలు. వాళ్ల మధ్య ఓ నిగూఢమైన రహస్యం పవిత్రంగా ఏర్పాటుచేయబడింది.

నంబూద్రి గడ్డకట్టిన వాడిలా, కాముక భంగిమలో రాధాకృష్ణుల శిల్పం దగ్గర నిలబడ్డాడు కృష్ణుడిని వరం అడగాలన్నట్టుగా. రాధని కాదు. ఎందుకంటే రాధ వరాలనిచ్చేది కాదు. నంబూద్రి రెండు చేతులూ జోడించి దండంపెడ్తూ ప్రార్థించాడు : "ప్రభూ నాకు ధైర్యం, కపటం ప్రసాదించు, నవ్వు కదనరంగంలో యుద్ధం – శాంతి, ప్రేమ – కామం ప్రక్రియల్లో చూపిన విధంగా కాలం మారుతోంది. మహిళలు పురుషుల మీద తిరగబడుతున్నారు. 'సంబంధాలు' సతులు కావాలనుకుంటున్నాయి. అంటరానివాళ్లు షర్టులు ధరించాలనుకుంటున్నారు. కృష్ణా, నీ రథచక్రాలు ఈ నిమ్నజాతి పిశాచాల మీంచి సాగడం ఆగిపోవడంతో ఇవన్నీ జరుగుతున్నాయి." నంబూద్రి వెనక్కి తిరిగి అర్జునుడి రథాన్ని కృష్ణుడు తోలుతున్న పెద్ద పెయింటింగ్‌ని చూశాడు. కళ్లాలు భగవంతుడి చేతుల్లోను, బాణం ఇంకా విల్లులు ఆ భగవంతుడి భక్తుడైన సోదరి భర్త చేతిలో వున్నాయి. నంబూద్రి మళ్లీ ప్రార్థించాడు.

"ప్రభూ, నాకు ధైర్యం, స్థైర్యం, తెగువ ప్రసాదించు, అర్జునుడికి ప్రసాదించినట్టుగా – నాకు గీతోపదేశం చెయ్యి, కురుక్షేత్ర యుద్ధారంభంలో అర్జునుడికి బోధచేసినట్టుగా. బ్రిటిష్ క్రిస్టియన్‌లని స్వాతంత్ర్య సమరంలో మేము ఓడించాలి. అదే సమయంలో ప్రజల స్వాతంత్ర్యం వర్ణధర్మ పరిధిలోనే సాగాలి. సంపదలు, సుఖసంతోషాలతో కూడిన మా స్వర్ణయుగాన్ని మేము తిరిగి పొందాలి. ముస్లిం పాలనలోను, క్రిస్టియన్‌ల పాలనలోను మేము అనేక రకాల ఇబ్బందులు పడ్డాము. దయచేసి మమ్మల్ని విముక్తి కావించు, ఇండియన్స్‌గా చెప్పుకునే ఇతరులని విముక్తి చేయకుండా."

ఆ తర్వాత తిన్నగా వెళ్లి తన కోసం కేటాయించిన సీట్లో కూర్చున్నాడు నంబూద్రి. బయట బ్యాండుమేళం వాయించడం మొదలయింది. పురోహితుడు ఉచ్ఛరిస్తున్న శ్లోకాలు శబ్ద తీవ్రతని రెట్టింపు చేశాయి. అగరు పరిమళం, ధూపంతో గుడి నిండిపోయింది. శబ్దం, ధూపం కృష్ణుడికి ఇష్టం. రాధ సన్నిధిలో వున్నప్పుడు కృష్ణుడు వాటిని కోరుకుంటాడు. దేవుడి కళ్లు ప్రకాశవంతంగా వున్నాయి. తన మీద వేసిన కృష్ణుడి చేతులు రాధకి ధైర్యానిస్తున్నాయి.

కొంతసేపటి తర్వాత గుడిలోంచి బయటకి వచ్చాడు నంబూద్రి. తిన్నగా అధ్యక్షుడి గదిలోకి వెళ్లి ఆధ్యాత్మిక శక్తితో కూడిన తన కుర్చీలో ఆశీనుడయ్యాడు. ఫైల్ తీశాడు.

సదస్సుకి ఆలస్యంగా వచ్చిన వారి పేర్లు నోట్ చేశాడు. చాలా పనులు పెండింగ్‌లో వుండడంతో విచారం వెలిబుచ్చాడతను. ఆంగ్లేయులకి వ్యతిరేకంగా జరిగే ఉద్యమాలలో తనలాంటి నంబూద్రీలు చాలామంది చిన్న చిన్న గ్రూపులకి సారథ్యం వహిస్తున్నారు, ఎందుకంటే బ్రిటిష్ వాళ్లు క్రిస్టియానిటీని వ్యాప్తి చేస్తున్నారు. కేరళ క్రిస్టియన్ అవుతోంది. క్రిస్టియన్ కావడమంటే బ్రాహ్మణ కుటుంబాలని నిరోధించడమే. క్రిస్టియన్‌లు, ముస్లింలు నడిపించే కేరళ రెస్టారెంట్ మెనూలో నెమ్మది నెమ్మదిగా బీఫ్‌ని చేర్చడం మొదలైంది. తమిళనాడులో కల్లుగీత కార్మికుడైన 'నాడార్లు' తమని అంటరానివాళ్లుగా జమకట్టడాన్ని గురించి తిరుగుబాటు మొదలుపెట్టారు. వాళ్ల స్పిరిచ్యువల్ విముక్తికి క్రిస్టియానిటీలోకి మార్పిడి జరగడం ఒక మార్గం. కేరళలోని 'ఇజవాలు' కూడా అంటరాని కల్లుగీతకారులే. వాళ్లు సామాజిక సంస్కర్త నారాయణ గురు నాయకత్వంలో తిరుగుబాటు చేస్తున్నారు. నారాయణగురు పేరు చెబితే నంబూద్రికి ద్వేషం ఎక్కువ. నిమ్న జాతుల ఆధ్యాత్మిక పూజ కోసం నారాయణగురు శివపూజని ఎంచుకున్నాడు. ఆదిశంకరాచార్యులు ఓ శైవుడు అన్న విషయం మర్చిపోయినట్టున్నాడతను.

నంబూద్రి శ్రీకృష్ణ దేవాలయ ట్రస్టు మీటింగ్ పెట్టాలని నిర్ణయించాడు. అందులో ఎనమండుగురు సభ్యులున్నారు. వాళ్లలో ఐదుగురు బ్రాహ్మణులు, ఒక నాయర్, ఒక మీనన్ వున్నారు. ఒక బ్రిటిష్ అధికారి కూడా వున్నాడు. కానీ అతడు ఎప్పుడూ ట్రస్టు మీటింగ్‌కి హాజరవ్వలేదు. బోర్డ్ ఆఫ్ ట్రస్టీస్‌లో సభ్యుడిగా బ్రిటిష్ అధికారి 1870లోనే నియమించబడ్డాడు. ప్రభుత్వంతో ఎటువంటి విభేదాలు కలగకూడదన్న ఉద్దేశంతో, నంబూద్రి ఆధ్యాత్మిక శక్తి సంతరించుకున్న తన సీట్లో కూర్చున్నాడు. అతనికి కుడివైపు తమకి కేటాయించిన సీట్లలో బ్రాహ్మణ సభ్యులు కూర్చున్నారు. కొంచెం దూరంలో వున్న బెంచీమీద నాయర్, మీనన్ సభ్యులు కూర్చున్నారు, నంబూద్రీని మిగతా బ్రాహ్మణులని ఎట్టి పరిస్థితుల్లోనూ తాకకుండా ఉండేలా, నంబూద్రి సీటు పక్కనే అదే ఎత్తులో ఇంకో కుర్చీ ఖాళీగా వుంది. అది బ్రిటిష్ అధికారి కోసం ఉద్దేశించినది. ఆ కుర్చీవైపు నంబూద్రి ఎర్రబడ్డ కళ్లతో మిర్రిమిర్రి చూస్తూ "మనం ఈ క్రిస్టియన్ కుర్చీని తొలగించాలి" అన్నాడు.

సభ్యులంతా మౌనం దాల్చారు.

"వాళ్లు మన సంస్కృతిని నాశనం చేశారు. చర్చీలు కట్టడానికి వాళ్లు సహకరిస్తున్నారు" అన్నాడు నంబూద్రి గుర్రుగా.

బెంచీ మీద కూర్చున్న మీనన్ అన్నాడు, "ఆ కుర్చీ తొలగిస్తే వాళ్ళు మన దేవాలయంపైన ఆంక్షలు విధించే అవకాశముంది. నిజానికి మీకు తెలిసిందే, అదే

మీ నాన్నగారు మరణించే వరకూ ఛైర్మన్‌గా కొనసాగారన్న విషయం. అంతేకాదు, ఆయన ఎన్నడూ ఆ బ్రిటిష్ అధికారి ఎదురుగా కూర్చునే సాహసం కూడా చేయలేదు. అలాంటిది మీరు చరిత్రాత్మక, సాహసోపేత చర్య తీసుకుంటున్నారు".

"నేను బీఫ్ తినే క్రిస్టియన్ పక్కన కూర్చోను" అరిచినట్టుగా అన్నాడు నంబూద్రి.

వాళ్ళు తీర్మానాన్ని ప్రవేశపెట్టి, ఆమోదించి, ఆ కుర్చీని తీసి వేయించారు. అదేసమయంలో మరో మూడు విషయాలను గురించి కూడా వాళ్లు చర్చించారు. కానీ అందరి మొహాలలో భయాందోళనలు చోటుచేసుకున్నాయి. బ్రిటిష్ వారి పాలనలో ఓ బ్రిటిష్ అధికారి కుర్చీని తొలగించడమా! నంబూద్రి కూడా కొంచెం భయపడ్డాడన్న విషయం వాస్తవమే. ఎందుకంటే ఆ సదస్సులో మిగతా విషయాలపైన నిర్ణయాలేవీ తీసుకోలేదు ఆయన. తన రాజకీయ జీవితారంభంలో ఇదొక కీలక పరిణామంగా భావించాడు నంబూద్రి. అతను కుర్చీ నుంచి లేచి నిలబడంతో అక్కడ వున్నవాళ్లు కూడా సవినయంగా లేచి నిలబడి గౌరవపూర్వకంగా శిరస్సు వంచి నమస్కరించి వెళ్లిపోయారు.

మరుసటి ఆదివారం నంబూద్రి స్పిరిచ్యువల్ స్నానమాచరించాడు. బ్రిటిష్ అధికారి కుర్చీని తొలగించినందుకు ఎటువంటి దుష్పరిణామాలు కలగకూడదని అతను ఆదిశంకరుల గుడికి వెళ్లాలని నిర్ణయించుకున్నాడు. అతని కనురెప్పలు అసంకల్పితంగా అదురుతున్నాయి. మౌనాన్ని ఆశ్రయించడానికి నడక మొదలుపెట్టాడతను. అలా బయట నడుస్తున్నప్పుడు ఓ దివ్యమైన శక్తి ప్రవేశిస్తున్నట్లనిపిస్తుంది నంబూద్రిలో. ప్రజలు శిరస్సు వంచి నమస్కరిస్తారు. దారి పొడవునా ఎక్కడచూసినా జనం రకరకాల ఫ్యాషన్స్‌లో వున్న అందమైన దుస్తుల్లో సంతోషంగా కనిపిస్తున్నారు. స్త్రీలు అందమైన చీరలు, బ్లౌజులు ధరించారు. పొడవాటి జుట్టు భుజాలమీద వేలాడుతోంది. వీధులన్నీ అలంకరించబడి వున్నాయి. అతను ముందుకుసాగుతున్నాడు. ఇంతలో ఎదురుగా వస్తున్న ఎద్దొకటి యించుమించు అతన్ని రాచుకుంటూపోయింది. ఎద్దులు తోకల్ని ఊపినట్టుగా ఎద్దు తాటించిన తోకతగలడం అతని జీవితంలో ఇదే మొదటిసారి. అతను తృళ్లిపడి ఒక్క గెంతు గెంతాడు. ఎద్దు... తోకతో కొట్టడమా... అదీ ఓ నంబూద్రీని! అతని కెందుకో అపశకునంలా అన్పించింది. అతని మనసేదో కీడు శంకించింది. ఏం జరగబోతోంది! నంబూద్రిలో వణుకు పుట్టింది. వీధులు విద్యుత్కాంతులతో ధగధగా మెరిసిపోతున్నాయి. తనవంక ఎవరూ చూడటం లేదు. అందరూ సమిష్టిగా విచిత్రంగా పాటపాడుకుంటూ వూరేగింపుగా నడుస్తున్నారు. అది ప్రజలు పాడుకునే పాట అని నంబూద్రికి ఎన్నడూ తట్టలేదు. పైగా మళయాళంలో బిగ్గరగా పాడుతున్నారు.

మనుషుల్ని సమానంగా సృష్టించాడు దేవుడు
వాళ్లని తన ప్రతిరూపంగా సృష్టించాడు దేవుడు
పాపులను రక్షించటానికి ఏతెంచాడు జీసస్
అందరిని సమానంగా చేయడానికి వచ్చాడు జీసస్

నంబూద్రి ఆగి ఆగివెళ్తున్న ఊరేగింపు వైపు ఒక్క క్షణం చూశాడు. వాళ్లంతా ఊరేగింపుగా సెయింట్ థామస్ చర్చిలోకి వెళ్తున్నారు. పురుషులు, స్త్రీలు పాడుతున్న పాట విన్న నంబూద్రికి తల తిరుగుతున్నట్లనిపించింది. రంగురంగుల విద్యుద్దీపాలు... సెయింట్ థామస్ చర్చి... మనుషులంతా సమానమే... అందరిని సృష్టించింది ఆ ప్రభువే... మనమంతా ఆయన రూపాలమే... ఈ దేవుడు ఎలాంటి వాడు? నంబూద్రి తల తిరుగుతోంది. ఇది కేరళయా లేక ఇజ్రాయెలా? జీసస్ తన తలపైన కూర్చున్నట్లనిపించింది నంబూద్రికి. అతను కళ్లు మూసుకుని సెయింట్ థామస్ చర్చి గేటు దాటుకుని ముందుకువెళ్ళిపోయాడు, అంటరాని ఈ ప్రభువు తన మెదడులో ఎక్కడ ప్రవేశిస్తాడోనని. అతను పళ్లు పటపటా కొరుకుతూ అనుకున్నాడు : ఈ బ్రిటిషర్లు, బీఫ్ తినే క్రిస్టియన్ బ్రిటిషర్లు, దుష్టపాలన తీసుకురావడమేకాదు, బ్రాహ్మణుడు ఛండాలుడు మధ్య భేదాన్ని వర్గీకరించలేని ఓ చెడ్డ ప్రభువుని తీసుకువచ్చారు. రేపు ఈ బ్రిటిషర్లు వెళ్లిపోయినా ఈ అస్పృశ్య ప్రభువు ఇక్కడే వుంటాడు, ఆర్యావర్తం గాలిని, నీటిని మలినపర్చడానికి.

శరీరమంతా తూట్లు పొడిచినట్లయింది నంబూద్రికి. చేతులు వణికాయి. తల తేలిపోతోంది. అతను ముందు చూసుకుంటూ త్వరితగతిన నడవసాగాడు. ఇంతలో ఓ చేయి అతన్ని వెనక్కి లాగినట్లనిపించింది. ఏవో అదృశ్యహస్తాలు చర్చిగేటు లోపలి నుంచి దూసుకువచ్చి తన బాహువుల్ని, భుజాల్ని పట్టి లాగినట్లయింది. ఎవరో తనను గట్టిగాపట్టుకుని ఆపుతున్నట్లనిపించింది. అతను ప్రతిఘటించాడు. అంతే, ఆ తర్వాత అకస్మాత్తుగా ఓ గావుకేక పెట్టి నేలమీద పడిపోయాడు. తలలో విపరీతమైన బాధ కలుగుతోంది. వెంటనే లేచి కాళ్లకి బుద్ధి చెప్పి వచ్చిన దారినే పరుగులాంటి నడక సాగించాడు. ఇంతలో జీసస్ తనని పేరు పెట్టి పిల్చినట్లనిపించింది. శ్రీ కృష్ణ ఆలయానికి చెందిన ట్రస్టీ అధిపతి ఏదో పూనకం వచ్చిన వాడిలా పరుగులు పెట్టడం అక్కడే వున్న కొందరు గమనించారు. అతను ఎక్కడికి వెళ్తున్నట్టు? చర్చిలోకా? సెయింట్ థామస్ చర్చిలోకి? చర్చి మెయిన్ గేటు సమీపించాడు నంబూద్రి. అక్కడ అందరూ తనవైపే చూస్తున్నారు. తను ఒక అంటరానివాడి ఇంట్లోకి ప్రవేశిస్తున్నట్లనిపించింది నంబూద్రికి. చేతులతో ముఖం కప్పుకుని గేటులోపల ఎడమ పాదం పెట్టాడు నంబూద్రి. కడుపులో మెలితిప్పుతున్న బాధ, హృదయ కవాటాలు స్వాధీనం తప్పినట్లనిపించింది.

*కొందరు యువకులు అదేపాట పాడుకుంటూ అతని పక్కనించి వెళ్లారు.*

*దేవుడు మనుషులందరినీ ప్రతిరూపంగా పుట్టించాడు.*

*దేవుడు అందరినీ ఒకేలా సృష్టించాడు.*

నంబూద్రి బెరుకు బెరుగ్గా లోపలికి ప్రవేశించాడు. కాళ్లు ముందుకుసాగాయి. కానీ హృదయం వెనక్కి లాగుతోంది. జీసస్, ఆదిశంకరాచార్యులు తన మస్తిష్కంలో ఒకరికొకరు ఎదురెదురుగా వుండి వాదులాడుకుంటున్నట్టుగా అనిపించిందతనికి. కృష్ణుడు ఆదిశంకరాచార్య పక్కన నిలబడ్డాడు. వాళ్ల మాటలు నంబూద్రికి వినిపిస్తున్నాయి. జీసస్ అన్నాడు, 'ప్రజలను వారి పాపముల నుండి రక్షించుటకు నేనవతరించాను' – అంటరానితనం ఇంకా విచక్షణాపూరిత పాపాలనించి పరిశుద్ధాత్ములు కావడానికి కూడా'. అయితే కృష్ణుడు, ఆదిశంకరాచార్యులు కూడా పాపులేనా? ఆలోచనలో పడ్డాడు నంబూద్రి. అతను చర్చిలోకి ప్రవేశించాడు. చర్చి పాటతో ప్రతి ధ్వనించింది.

*సమానత్వం గల ప్రభువుని కీర్తించుడి*

*మానవత్వం గల ప్రభువుని కీర్తించుడి*

*ఆమేన్, ఆమేన్, ఆమేన్, ఆమేన్*

పాస్టర్ చేతిలో పుస్తకం వుంది. సభలో వున్నవారికి తను చదువుతున్న పేజీ నంబరు, పేరా చెబుతున్నాడు పాస్టరు. అతను నంబూద్రిలా 'ముండు' ఇంకా హాఫ్ షర్టు ధరించాడు. అతని వెనకాల శిలువమీద ఏసుక్రీస్తు తలవాల్చి నిలబడి వున్న కర్రబొమ్మ వుంది. గోచీ ధరించాడు జీసస్. చేతివేళ్ల గోళ్ల నించి చిందుతున్న రక్తపు బొట్లు వున్నాయి.

"జీసస్ మనందరి కోసం మరణించాడు" అన్నాడు పాస్టర్. మహిళలు కొందరు ఏడుస్తున్నారు. పురుషులు చేతులెత్తి "ఓ ప్రభువా, నువ్వు మా కోసం మరణించావు. ప్రభువుని కీర్తించుడి, ప్రభువుని కీర్తించుడి!" అన్న మాటలు హాలులో ప్రతిధ్వనించాయి.

ఈ పవిత్ర గ్రంథాలేంటి? ఆ విధంగా ఎవరు చదవగలరు?

దేవుడు ఎక్కడైనా అంత సులభమైన భాషలో మాట్లాడతాడా, అది కూడా వచనంలో? దేవుడు వచన రూపంలో ఎలా మాట్లాడతాడు?

దేవుడికి సంస్కృత శ్లోకాలు మాత్రమే తెలుసు. ప్రార్థన అనేది గానంలా ఉండాలి. వేగం... వేగం.. వేగం.. దేవుడు ఏమన్నాడో అందరూ తెలుసుకోవడానికి ఈ విధంగా ఎలా అనుమతించారు? దేవుడు దేవుడే. దేవుడు పురోహితుడితో మాత్రమే మాట్లాడాలి.

దేవుడి సేవకోసం దేవుడులాంటి పురోహితుడు వేగంగా ఆ మాటలని ఉచ్ఛరించాలి. నంబూద్రి తల తిరుగుతోంది. ఖాళీగా వుండే బల్ల కోసం వెతికాడతను. అక్కడలేదు. కడుపులో నరాలు బిగపెడ్తున్న భావన. పేగులు పట్టు తప్పుతాయేమో ననిపించిందతనికి. అలాంటిది ఏదయినా జరిగితే 'ముండు' తడిసిపోతుంది. కుట్టిన డ్రాయరు ధరించడం అతనికి అలవాట లేదు. ముండులోపల అంతా దిగంబరమే. అతను సిగ్గుతో అవమానంతో చితికిపోయాడు. ఇబ్బంది కలిగించే పరిస్థితి తీసుకురావద్దని తనలోతాను శరీరాన్ని వేడుకున్నాడు నంబూద్రి.

అతను జాగ్రత్తగా బెంచీ చివరి అంచున ఎవరినీ తాకకుండా వుండేలా కూర్చున్నాడు. ఇంతలో ప్రార్థనా సమావేశం ప్రారంభం కావడంతో అతని మనసు నెమ్మదించింది. కడుపులో మెలితిప్పడం తగ్గింది. అక్కడున్న వాళ్లందరినీ దృష్టాంతాలు ఇవ్వాల్సిందిగా కోరాడు పాస్టర్. ఓ మహిళ లేచి నిలబడి "నా పిల్ల జ్వరంతో బాధపడింది. నేను జీసస్‌ని ప్రార్థించాను. ఆ పిల్ల కోసం పాస్టర్ ప్రార్థన చేసిన తర్వాత పిల్లకి స్వస్థత చేకూరింది" అంది.

ఒక గుడిలో ఇలాంటి దృష్టాంతాలు ఎందుకో నంబూద్రికి అర్థం కాలేదు.

వెంటనే అందరూ కోరస్‌గా పలికారు, "ఆ పిల్ల ఆరోగ్యం కోసం, చదువుకోసం మనం ప్రార్థన చేద్దాం. ఓ ప్రభువా బిడ్డని రక్షించు. స్కూల్లో ప్రవేశపెట్టు. దానికీ నీవు చేయగలిగినదంతయూ చేయుము." వాళ్లంతా ఆ శిశువు సంక్షేమం కోసం ఎందుకు ప్రార్థిస్తున్నారోనని నంబూద్రి ఆశ్చర్యపోయాడు. వాళ్లు ఆ పిల్ల తల్లిండ్రుల పట్ల పెద్దగా ప్రాముఖ్యత కనబర్చలేదు. వాళ్లు చాలా పేదవారిగా కనిపిస్తున్నారు. బహుశా వాళ్లు అంటరానివాళ్లు కూడా అయివుండొచ్చు. ఇది ఏ రకమైన స్థానం? పూజ నిమిత్తం ఆ పిల్ల తల్లిదండ్రులు ఎలాంటి విరాళం ఇవ్వలేదు. అయినా వీళ్లందరూ ఆ పిల్ల కోసం ప్రార్థన చేస్తున్నారు.

అదే సమయంలో మరో వ్యక్తి లేచి నిలబడి "నా పేరు పరయ్య. నేను తమిళనాడుకి చెందినవాణ్ణి" అన్నాడు.

నంబూద్రి అతన్ని చూసి నిర్ఘాంతపోయాడు. ఈ మనిషి కొంపదీసి ఆ పరయ్యనేనా. వేదశాస్త్రి ఇంట్లో చర్చించిన వ్యక్తి ఇతనేనా అనుకుంటూ ఆశ్చర్యపోయాడు నంబూద్రి. ఆ వ్యక్తి చెప్పడం కొనసాగించాడు, "అగ్రకులాలవాళ్లు నా మీద దాడి చేశారు. నన్ను చంపాలని చూశారు. జీసస్ ఆస్పత్రి నన్ను కాపాడింది. కానీ మళ్లీ ఆ అగ్రకులాలవాళ్లు నన్ను చంపాలని చూస్తున్నారు. వాళ్లు ఆయుధాలతో, తుపాకులతో వచ్చి ఆస్పత్రిని ధ్వంసం చేశారు. ఆ భయంకరమైన రాత్రి నా భార్య చచ్చిపోయింది.

పిల్లలతో ఎటుపోవాలో తోచలేదు. అదే ప్రాంతానికి చెందిన పాస్టర్ ఒకరు మమ్మల్ని లోపలికి తీసుకుపోయాడు. తెల్లవాళ్లు ఇంకా కొందరు తమిళులు కలిసి నడిపిస్తున్న బోర్డింగ్ స్కూల్లో నా పిల్లల్ని చేర్పించాడు. నన్ను చర్చిలో కాపలా కోసం, ప్రభు సేవలో పెట్టాడు. అందరూ కోరస్‌గా అరిచారు, “ఆమేన్, ఆమేన్, ఆమేన్”. పాస్టర్ అన్నాడు, “మనమంతా పరయ్య రక్షణ కోసం, దీర్ఘాయుష్షు కోసం ప్రార్థన చేద్దాం. అతని భార్య ఆత్మకి శాంతి కలుగుగాక. అతని పిల్లలకి గౌరవపూరక విద్య లభించుగాక”. ఆ తర్వాత అందరూ ఒకరి చేతులని మరొకరు పట్టుకుని నిల్చున్నారు. మహిళలంతా తలలు కప్పుకున్నారు. పురుషులు చేతులు పైకి ఎత్తి “ప్రభువు ఈ ఆత్మని హింసనించి కాపాడుగాక, మాతోపాటు జీవించేందుకు సాయపడుగాక” అన్నారు. పాస్టర్ అక్కడున్న వాళ్లందరినీ పరయ్య తిండి కోసం, ఆశ్రయం కోసం తోడ్పడాల్సిందిగా కోరాడు. వాళ్లలో చాలామంది చేతిలో కాయిన్లుంచుకుని ముందుకు చాచారు. వలంటీర్లు వాటిని సేకరించి పాస్టర్‌కి అందించారు.

సమావేశం ముగిసింది. నంబూద్రి శక్తినంతటిని కూడదీసుకుని చర్చిలోంచి బయటికి వచ్చాడు. ఇది క్రిస్టియన్ల చర్చికాదు. ఛండాలుర చర్చి అనుకున్నాడు నంబూద్రి మనసులో. ఏం చేయాలో తోచలేదు. శరీరంలో అంటరానితనం ప్రవహిస్తుండగా భారమైన హృదయంతో ఇంటి దారిపట్టాడు నంబూద్రి.

నంబూద్రి ఇల్లు జనంతో నిండిపోయింది. బంధువులు, కుల పెద్దలు, హితులు ఇంకా ఆలయ కమిటీ సభ్యులతో అక్కడంతా గందరగోళంగా వుంది, ఇంట్లో ఏదో శవం వున్నట్లుగా. ఆ కోలాహల ధ్వని మధ్యన విశాలమైన మంచంమీద పడుకుని వున్నాడు నంబూద్రి. అతను మరణించలేదు గాని దరిదాపుగా అదే పరిస్థితిలో వున్నాడు. కళ్లు తెరుస్తూ మూస్తూ సంధి ప్రేలాపన చేస్తూ ఓ విధమైన సుషుప్తావస్థలో వున్నాడు. అతనికి ఏమైందో ఏమిటో ఎవరికీ తెలియదు. వేద పండితులు కొందరు ఇల్లంతా ధూపాలతో శబ్దాలతో నింపుతూ పూజలు చేశారు. ఆయుర్వేద పండితులు కొందరు ఓషధులతో చికిత్స చేశారు, వరండాలన్నింటినీ పదార్థాలతో వెగటు పుట్టించే వాసనలతో. అయినా నంబూద్రి పరిస్థితిలో ఏమాత్రం మార్పు గోచరించలేదు. ఇంటి ముందున్న వ్యక్తులు కొందరు గుసగుసలు పోయారు. ఎవరో బిగ్గరగా మాట్లాడితే ‘ష్... గోడలకి చెవులుంటాయి. జాగ్రత్తగా వుండాలి. మనం వాళ్ల ప్రభుత్వంలో వున్నాం. బ్రిటిష్ రాక్షసులు గోడ పక్కనే నక్కి ఉండొచ్చు. ఓ క్రిస్టియన్ దయ్యం నంబూద్రిని పట్టుకుంది. అతనికి ఏమైనా జరగొచ్చు...’ అంటూ వారిని వారించారు. అప్పుడప్పుడే నంబూద్రి ఇంటి పరిసరాలలో వున్న కొబ్బరి చెట్లు కూడా వాటి ఆకుల ఒరిపిడి ఎవరికీ వినిపించనంత నిశ్శబ్దంగా ఒకదానికొకటి గాలి వార్తలు చెప్పుకుంటున్నాయి.

ఆ గలాభా మధ్యన నంబూద్రి బంధువులు నీరవ నిశ్శబ్దంతో వున్నారు.

ఆ ఇంట్లో చురుకైన వ్యక్తి ఒకే ఒక్కరున్నారు. ఆమె వితంతువైన నంబూద్రి వదిన శివశక్తి. ఆమె మొహంలో అసాధారణమైన వెలుగు ప్రస్ఫుటమవుతోంది. ఆమె కూడా సాధారణ వ్యక్తులలాగే అక్కడ స్వేచ్ఛగా తిరుగుతోంది. తన చేతులతో మరిదికి కొబ్బరినీళ్లు తాగిస్తోంది. ఆకుపచ్చని కొబ్బరి బొండాం నీటిలో కల్లు లక్షణాలు వుండడంతో నంబూద్రి సంప్రదాయంలో ఆ నీరు తాగడం నిషిద్ధం, ప్రాచీన కాలపు 'సోమం'లా. సోమం వాస్తవంగా ఆర్యుల సంప్రదాయంలో ఒక స్పిరిచ్యువల్ డ్రింకు. కానీ ఆదిశంకరాచార్యులవారు దాన్ని నిషేధించారు. బ్రహ్మ మొదలు ఇంద్రుడి వరకూ గల హిందూ దేవతలందరూ సోమపానం చేసేవారే. కానీ ఆది శంకరాచార్యులు స్వచ్ఛమైన బ్రాహ్మణులలో ఆ ఆచారాన్ని వలదన్నారు. నంబూద్రి హిందూయేతరుడైన కారణంగా జబ్బుపడ్డంతో ఆయుర్వేద పండితులు కొబ్బరినీటిని బ్రాహ్మణులు, నంబూద్రీల వరకు ఔషధీయ డ్రింకుగా పునర్నిర్వచించారు. ఎవరైనా అనారోగ్యానికి గురైనపుడు అసాధారణ పరిస్థితులలో కొబ్బరినీరు తీసుకోవచ్చని, స్వస్థత చేకూరగానే దాన్ని మళ్లీ ముట్టుకోరాదని సూచించారు ఆయుర్వేద పండితులు. ఇంట్లో కుటుంబ సభ్యులు ఎవరూలేని సమయంలో వితంతువు అయిన శివశక్తి పవిత్ర డ్రింకు ఈ కొబ్బరినీరేనన్న విషయం ఎవరికీ తెలియదు. ఇప్పుడు అదే కొబ్బరినీరు తన 'పాపరహిత' మరిదికి కూడా ఔషధమయింది. శివశక్తి స్వయంగా తన చేతులతో నంబూద్రికి ఆ డ్రింకుని ఇస్తుంది.

ఏదో తెలియని కపట శక్తి నంబూద్రీని తన గుప్పెట్లో ఉంచుకుందని నగరంలో వదంతి దావానంలా వ్యాపించింది. వైదిక ఆధ్యాత్మిక శక్తిగాని, ఆయుర్వేద ఔషధశక్తిగాని అతనికి స్వస్థత చేకూర్చలేకపోతోంది. ఏదో దుష్టశక్తి నంబూద్రీని అనుసరిస్తోందని కొన్ని ముఖ్యమైన బ్రాహ్మణ కుటుంబాలలో గుసగుసలు మొదలయ్యాయి. నంబూద్రి నమ్మశక్యంగాని అభిలాషని వ్యక్తపరిచాడు, తను చర్చికి వెళ్లి స్వస్థత పొందాలని వుందని. తొలిసారి అతను చర్చికి వెళ్లిన విషయం అతని బంధువులకిగాని, ఆలయ ధర్మకర్తలకిగాని ఏ ఒక్కరికీ తెలియదు. అతనిలో ఏం ప్రవేశించిందో ఎవరూ చెప్పలేకపోతున్నారు.

దినదినానికి నంబూద్రి పరిస్థితి క్షీణిస్తోంది. దాంతో కుటుంబ సభ్యులలో నిరాశ చోటు చేసుకుంది. అతని ఆరోగ్యం గురించి శివశక్తి ఆందోళన చెందింది. ఆమె చేసే శుశ్రూష చూసి ఆమెపట్ల నంబూద్రి ప్రవర్తన ఇప్పుడు మరోవిధంగా ఉంది. ఇంట్లో అందరికన్నా ఆమె శాంతంతో నంబూద్రికి సహాయకారిగా వుంది. ఆమె చేతులు మృదువైనవి. ఇప్పుడు జీసస్ తన చుట్టూ గాలిలో పరిభ్రమిస్తున్నట్టుగా అనిపిస్తోంది నంబూద్రీకి. కానీ క్రిస్టియన్ – అంటరానివాడిగా మారడానికి అతను భయపడ్తున్నాడు. ఈ అవమానాన్ని తను ఎలా భరించగలడు? తెలిసినవాళ్ళందరూ తనని తప్పించుకుని

తిరుగుతారు. ఆ ఉదాసీన ఉంపుడుగత్తె సీతామహాలక్ష్మి తనని చూసి నవ్వుకుంటుంది. ఆలయ ధర్మకర్తృత్వం నుంచి తను తప్పుకోవాల్సి వస్తుంది. ఆలయ అధికారులు తన దగ్గరున్నదంతా లాగేసుకుంటారు.

ఒకరోజు ఉదయం తన మంచం దగ్గరికి శివశక్తిని పిలిచాడు నంబూద్రి. 'వదినా' అంటూ అతి కష్టంమీద పలికాడు. నేను ఎన్నడూ నిన్ను సరిగ్గా చూడలేదు. అందుకు విచారిస్తున్నాను. ఇప్పుడు నా గురించి అందరికన్నా ఎక్కువగా నువ్వే ఆందోళనపడుతున్నావు. నాకు చావాలని లేదు. ఎలాగైన బతకాలి. అది కూడా ఓ క్రిస్టియన్‌గా. ఏదో శక్తి ఆ దిశగా నన్ను పురిగొల్పుతోంది చర్చి వైపు, జీసస్ వైపు. కానీ అలా అవ్వాలని నేను కోరుకోవడంలేదు. అంటరానివాళ్ల మధ్యన ఓ క్రిస్టియన్‌లా ఉండాలని నేను కోరుకోలేను. ఆ దేవుడు కూడా అంటరానివాడన్న విషయం నేను ఊహించలేకపోతున్నాను. ఈ దేవభూమిలోగాని, వెలుపలగాని బ్రహ్మణ క్రిస్టియన్ ఎవరైనా ఉన్నారేమో నువ్వు చెప్పగలవా?

ఆ మాటలు వినగానే శివశక్తి దిగ్భ్రాంతికి గురయింది. "నువ్వు... నువ్వు క్రైస్తవాన్ని స్వీకరిస్తావా?" అడిగిందామె నమ్మశక్యం కానట్టుగా చూస్తూ.

"అవును" అన్నాడు నంబూద్రి మొహం పక్కకి తిప్పి. నంబూద్రిలోని అసాధారణ అభిలాష గురించి బ్రాహ్మణ కుటుంబాలు గుసగుసలాడుతున్నాయన్న వదంతిని గురించిన వాస్తవం శివశక్తికి తెలియదు. ఆ ప్రపంచంలో ఎలాంటి వదంతులు, వార్తలు వితంతువుల దాకారావు. నంబూద్రికి జీవన్మరణకి సంబంధించిన ఈ సమస్యపైన వ్యవహరించాల్సిన తీరు శివశక్తికి అంతుబట్టడంలేదు. అది కేవలం నంబూద్రి జీవన్మరణ సమస్య మాత్రమే కాదు, మొత్తం సంస్కృతీ సంప్రదాయాలకి సంబంధించినది. తన అన్న మరణించిన తర్వాత నంబూద్రి తన్ని ద్వేషించడమే కాదు ఆధ్యాత్మిక దోషిగా చూశాడు. మనుషులని మాత్రమే కాదు, ఆఖరికి సూర్యోదయ సూర్యాస్తమయాలని చూడటానికి కూడా ఆమెకు అనుమతిలేదు. ఇంట్లో కారాగారవాసం అనుభవించింది. ఇప్పుడు... ఇప్పుడతను ఈ విధమైన సహాయం తననుండి ఆశిస్తున్నాడు. తలతిరుగుతున్నట్టుగా వుంది శివశక్తికి. ఆ రాత్రి ఆమెకి నిద్ర రాలేదు. నంబూద్రి మాటలు ఆమె చెవుల్లో మాటిమాటికీ మారుమ్రోగుతున్నాయి. ఎన్ని సంవత్సరాలకి తనని వదినా అంటూ పిలిచాడతను. కానీ తను ఏం చేయగలదు? పగలూ రాత్రీ ఆలోచిస్తూనే వుంది ఆమె.

ఆమె కొద్దిగా స్వేచ్ఛావాయువుల్ని పీలుస్తోంది. దానితోపాటు శరీర ధర్మాలు మళ్ళీ మొదలయ్యాయి. తానిలా ఉండి సంవత్సరాలయిందనిపించిందామెకి. ఇంటికి

వచ్చే మళయాళ వార్తాపత్రికని ఇప్పుడు బిడియపడకుండా చదివింది. ఆమె వితంతువు కాగానే వార్తా పత్రికలు చూడడం, చదవడం నిషిద్ధం. ఆ ప్రపంచంలో 'లిఖిత పదం' జీవించి వున్న పురుషుడితో సమానమన్న అభిప్రాయముండేది. అందువల్ల లిఖిత పదానికి తనకి మధ్యన సంబంధం, సాంగత్యం లేదు, క్రైస్తవ దయ్యం తన మరిదిని ఆవహించేంత వరకు.

ఆ రోజు వార్తాపత్రికలో ఒక వార్తాంశం. 'సిరియన్ చర్చిలో జాతి సంఘర్షణ', 'అంటరానివాళ్ల ప్రవేశానికి బిషప్ బెంజమిన్ నిరాకరణ.' శివశక్తి ఆ వార్తాపత్రికని నంబూద్రీకి చూపించింది. బెంజమిన్ చాకో గురించి నంబూద్రి విన్నాడు. కానీ అతని జాతి తెలియదు. "వదినా, నువ్వు అతనితో మాట్లాడే ప్రయత్నం చేయగలవా? ఈ సంగతి నీకూ నాకూ తప్ప ప్రపంచంలోని ఏ వ్యక్తికీ తెలియకూడదు" అన్నాడు నంబూద్రి. ఆధ్యాత్మిక కర్తవ్యాన్ని ఓ శాశ్వత వితంతువుకి అప్పగించడమా, నంబూద్రి కుటుంబంలో పరిస్థితులు నిజంగానే మారుతున్నాయి.

నంబూద్రి ఆరోగ్యం క్రమక్రమంగా క్షీణిస్తోంది. మనిషి చాలా పీక్కుపోయాడు. ఒకరోజు గోవిందన్ నాయర్ ఇంటి నుంచి వార్త అందింది. సీతామహాలక్ష్మి, పిల్లలు కనిపించడంలేదని, ఒకవేళ వాళ్లు ఎక్కడికి వెళ్లారన్న విషయం తెలిసినా ఎవరూ చెప్పే సాహసం చేయలేకపోతున్నారని. నంబూద్రికి ఇప్పుడు వీటి గురించి ఆలోచించే శక్తి లేదు. అతను వెంటనే గోవిందన్ నాయర్‌కి లేఖ రాశాడు. 'నేను మా ఒప్పందం రద్దు చేసి 'సంబంధం' తెంపేసుకుంటున్నాను. సీతామహాలక్ష్మిని విడుదల చేస్తున్నాను. ఆమె తన ఇష్టప్రకారం ఎక్కడికైనా వెళ్లవచ్చు విడుదలకి సంకేతంగా. నన్ను ఇక ఏ మాత్రం పీడించవలసిన పనిలేదు' లేఖ రాయటం పూర్తికాగానే శివశక్తిని పిలిచి ఆ లేఖని తోటమాలి కొడుకుతో గోవిందన్ నాయర్‌కి పంపాల్సిందిగా కోరాడు. ఆ తర్వాత తన భుజాల మీంచి పాపపు భారం దిగిపోయినట్లుగా భావించాడు నంబూద్రి. ఆ 'సంబంధం' తనకి సుఖసంతోషాలని, శాంతిని ఇవ్వలేదని గ్రహించాడు నంబూద్రి. తన కోరిక తీరినట్లనిపించిందేగాని పరిపూర్ణమైన సంతృప్తి కలిగించింది కాదు. అది రక్తమాంసం కండలతో కూడిన ఓ అసభ్య శారీరక కలయిక మాత్రమే. పైగా తను ధైర్యం కోల్పోయేలా ప్రవర్తించింది సీతామహాలక్ష్మి. సతి గురించి ఆమె మాట్లాడిన వెర్రిమొర్రి మాటలని తను తెలివిగా వదిలించుకున్నాడు. తను చావాలన్న కోరికను మరుగుపర్చడం తప్ప ఈ సతికి ప్రేరణ మరేముంటుంది? అలాంటి కఠినమైన సహచరి లేకుండా కూడా తను ఆ పని చేయగలడు అనుకున్నాడు నంబూద్రి. ఒకరోజు నంబూద్రి మంచం మీద

మాగన్నుగా వున్నప్పుడు శివశక్తి కొబ్బరినీళ్ల గ్లాసుతో వచ్చింది. ఆమె పరిశుభ్రమైన దుస్తులు ధరించింది. నుదుట ఓ చిన్నపాటి హిందూ తిలకం కనబడేట్టు పెట్టుకుంది. నంబూద్రి కళ్లు తెరచి చూశాడు. ఆమెలో వచ్చిన ఆకస్మిక మార్పు చూసి ఆశ్చర్యపోయాడతను.

"ఏంటి ఇదంతా?" అడిగాడు నంబూద్రి.

"నేను బిషప్ బెంజిమిన్ చాకోని కలవడానికి వెళ్తున్నాను. బొత్తిగా వితంతువులా కనిపించడం క్రిస్టియన్‌లకి ఇష్టం వుండదు. వాళ్లు మహిళా వితంతువుల్ని నమ్మరని విన్నాను" అంది సమాధానంగా.

నంబూద్రి మౌనంగా గ్లాసు అందుకుని కొబ్బరినీళ్లని కొద్ది కొద్దిగా ఎంగిలి చేశాడు.

ఆ రాత్రి పదిన్నర గంటలకు జీపువచ్చి నంబూద్రి ఇంటి ముందాగింది. జీపు వెనక సీట్లో కూర్చున్న శివశక్తి దిగి గేటు దగ్గరకి వచ్చి నిల్చుంది. జీపులో డ్రైవరు పక్కన విలాసవంతమైన ముందు సీట్లో కూర్చున్న బిషప్ చాకో తటాలున దిగి ఆమెని అనుసరించాడు. డ్రైవరు జీపుని ఇరవైగజాల దూరంలో నిలిపాడు. రాత్రి సమయం, అక్కడంతా నిశ్శబ్దంగా వుంది. కొబ్బరి ఆకుల చప్పుడు తప్ప చిన్న శబ్దం కూడా వినిపించడంలేదు. అది నంబూద్రిల వీధి కావడంతో కుక్కలు పెద్దగా లేవు.

నంబూద్రి బెడ్‌రూంకి బిషప్‌ని తీసుకువెళ్లింది శివశక్తి. బిషప్ ఆధ్యాత్మికత ఉట్టిపడే వస్త్రధారణలో మెడలో క్రాస్‌తో తన బెడ్‌రూమ్‌లో అడుగుపెట్టగానే మౌనంగా రెండు చేతులూ జోడించి నమస్కరించాడు నంబూద్రి.

"హెల్లో, హౌ ఆర్ యూ మిస్టర్ నంబూద్రి?" అడిగాడు బిషప్ ఇంగ్లీషులో కుర్చీలో కూర్చుంటూ.

"ఇదిగో ఇలా వున్నాను. థాంక్యూ. హిందువు ఇంటికి వచ్చినందుకు బిషప్" బలహీనంగా బదులిచ్చాడు మలయాళంలో నంబూద్రి శరీరాన్ని బిషప్ వైపు తిప్పి.

లేదు, లేదు. మీ వదిన నా దగ్గరికి రావడం చూసి చాలా సంతోషించాను. చూడు, నేను కూడా నంబూద్రీ కుటుంబం నుంచి వచ్చినవాడినే – చారిత్రాత్మకంగా చెప్పాలంటే కొన్ని తరాల క్రితం మా పూర్వీకులు క్రిస్టియన్ మతం పుచ్చుకున్నారు" అన్నాడు బిషప్ తమ వంశాన్ని గురించి ఒకింత గర్వంగా.

"ఏంటి, నిజమా?" అడిగాడు నంబూద్రి మొహం కళకళలాడుతుండగా.

"అవును. అవును." అన్నాడు బిషప్.

"బిషప్, జీసస్ నన్ను ఆవహించాడు.

నాకు ఇప్పుడు రెండే రెండు మార్గాలున్నాయి. క్రిస్టియన్‌గా మారడం లేక చావడం" అన్నాడు నంబూద్రి.

"లేదు, మిస్టర్ నంబూద్రీ. జీసస్ మహిమాన్వితుడైన దేవుని కుమారుడు. ఆయన ఎన్నడూ హిందూ పిశాచాల్లా ఎవ్వరినీ ఆవహించడు అంటూ ఒక్క క్షణం ఆగి "నువ్వు గనక దేవుణ్ణి ప్రార్థించి ఆయన వద్దకు చేరితే అది వేరు" అన్నాడు బిషప్ స్వరం మార్చి.

"నేను క్రిస్టియన్‌గా మారాలనుకుంటున్నాను బిషప్. కానీ ఈ బ్రాహ్మణులు, అంటరానివాళ్ళు ఒకటిగా అయ్యే వ్యవహారం ఏంటి? దేవుడు అందరినీ ఒకేలా సృష్టించాడు" అనే నినాదానికి అర్థం ఏమిటి?" అడిగాడు నంబూద్రి ఆతురతగా.

"మిస్టర్ నంబూద్రీ నిమ్నకులస్థులని, అంటరానివాళ్లని మీరంతా రాజకీయాలలోకి వచ్చేలా ప్రోత్సహించారు. ఇప్పుడు వాళ్లు మతపరమైన సమానత్వంతోపాటు రాజకీయ అధికారం కోరుతున్నారు. విలయమ్‌కేరీ లాంటి కొన్ని మిషనరీలు అతన్ని దిగువ జాతికి చెందజేస్తూ క్రిస్టియానిటీని, జీసస్‌ని తక్కువ స్థాయికి తీసుకువెళ్తున్నారు. జీసస్ రాజులకే రారాజు, దేవుని కుమారుడు. మీలో ఏ విధంగానైతే పవిత్ర ఆర్యుల, బ్రాహ్మణుల రక్తం ప్రవహిస్తుందో అదేవిధంగా సిరియన్ క్రిస్టియన్‌లైన మేము జీసస్ పీఠం అప్పగించేందుకు ఇష్టపడం. అంతేకాదు, అంటరానివాళ్లని, వనవాసీలని వివాహం చేసుకోవడాన్ని అంగీకరించం. నేను వున్నది జీసస్ పవిత్రతని కాపాడ్డానికి, వర్ణధర్మాన్ని రక్షించడానికే. అంటరానివాళ్లని మా చర్చిలోకి నేను ఎన్నటికీ అనుమతించను. ఆ కారణంవల్ల నువ్వు సందేహించాల్సిన పనిలేదు. ఈ దేవభూమి జీసస్ భూమి. అంటరానివాళ్లు ఎవరూ జీసస్‌ని తాకలేరు. కేరళ ధర్మాలు కేరళకి వున్నాయి. సిరియన్‌లమైన మేము వాటిని కాపాడతాం" అంటూ తన వాక్చాతుర్యాన్ని ముగించాడు బిషప్.

బిషప్ మీద మంచి నమ్మకం కుదిరింది నంబూద్రీకి. తను సొంత మనిషిని కలిసినట్టుగాను, తనకి ఓ ఆధ్యాత్మిక గురువు లభించినట్టుగాను భావించాడు నంబూద్రి.

బిషప్, ఈ సంగతేంటో చెప్పండి. కొందరు అంటారు, జీసస్ పుట్టిన తర్వాత 'మొదటివారు చివరివారవుతారు, చివరివారు మొదటివారవుతారని' ఇది జీసస్ దృక్పథం అని. దీని అర్థం ఏంటి? అంటే భారతీయులంతా క్రిస్టియన్‌లుగా మారతారని, బ్రాహ్మణులు చివరివారు, అంటరానివాళ్లు మొదటివారు అవుతారనా?"

లేదు, లేదు. ఇలాంటి అప్రామాణిక, అనైతిక వాదనల్ని అంటరాని ధర్మకర్తలు కొందరు ప్రస్తావిస్తారు. అటువంటివి నమ్మకు. ఈ దేశంలో నిజమైన క్రిస్టియన్‌లం మేమే. ఆర్యుల, ఆదిశంకరాచార్య భూమిలోని ఈ అంటరాని వాళ్లని జీసస్ ఆశీర్వదిస్తాడని అనుకోను. క్రైస్తవాన్ని భారతీకరణ చేసేపని కొనసాగుతోంది. దీన్ని భారతీయ క్రైస్తవం అంటారు. ఇలాంటి విషయాలతో నువ్వు హైరానా చెందకు. దేవభూమి సంస్కృతి కాపాడ్డానికి ఇక్కడ నేను వున్నాను" అధికారంతో నమ్మబలికినట్లు అంటూ బిషప్ "నేను నీ ఆరోగ్యం గురించి ప్రార్థన చేస్తాను. దయచేసి జీసస్ దగ్గరకిరా. నీకు స్వస్థత చేకూరుతుంది" అంటూ ముగించాడు బిషప్ "స్వర్గంలోని ఓ ప్రభువా, ఈ మనిషిని కాపాడు. ఉన్నత వంశీకుడైన ఈ నంబూద్రీని అస్వస్థత నుండి స్వస్థత పరచు. అతని ధర్మం కాపాడి నీ చెంతకు చేర్చుకో. మానవులంతా ఒకటేనన్న అతని ఆదుర్దాని విడుదల చేయుము. అంటరానివారిని నంబూద్రీలు స్పృశించేలా చేయుము. అతని ఆతురతని విడుదల కావించుము. నీ ఆజ్ఞ మారదని, ప్రపంచమంతా ఏకత్వంతో సమబద్ధం గావింపబడిందని, రక్షింపబడ్డవారు, దూషింపబడ్డవారు నీ కృపకు పాత్రులయ్యేదరని ఇతనికి మరల మరల నమ్మకం కలిగింపుము.'

త్వరగా కోలుకోవాలని నంబూద్రీని ఆశీర్వదించాడు బిషప్. "మళ్లా నేను నిన్ను చర్చిలో కలుసుకుంటాను" అంటూ బిషప్ నంబూద్రి నుండి సెలవు తీసుకున్నాడు. బిషప్ జీపులో ఎక్కి వెళ్లిపోయాడు. నంబూద్రి రెండు చేతులూ జోడించి దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు. ఆశ్చర్యకరంగా తలలో ఛాతీలో నెప్పులు తగ్గి స్వస్థత చేకూరినట్లయింది నంబూద్రికి. నిజంగా దేవుడు, ఏ దేవుడైతేనేం తన పక్కనే వున్నాడనుకున్నాడు నంబూద్రి.

# 3

# తిలక్ భావి నిబంధనావళి

**తి**లక్ తన ఇంటి వరండాలో కూర్చున్నాడు. అతని అనుచరగణం అతని చుట్టూ నేలపైన కూర్చున్నారు. ఇల్లు సున్నపు రాయితో నిర్మించబడింది. ఆ వరండాలో సుమారుగా రెండు వేలమంది తేలిగ్గా కూర్చోవచ్చు. తిలక్ శారీరకంగా చాణక్యుడిగా పేరుగాంచిన ఋషి కౌటిల్యుని తలపిస్తాడు. అతన్ని చూడగానే నిజంగా ముని అయిన కౌటిల్యుడే ప్రత్యక్షమయ్యాడా అనిపిస్తుంది. పండితుడైన అతని తండ్రి అతనికి ధర్మాలంకార చాణక్యుడు అని పేరుపెట్టడానికి అదొక కారణం. అయితే భేదం ఒక్కటే. తిలక్ మీసం, ఇంటిపేరు. అందరూ అతన్ని డి.సి. తిలక్‌గా పిలుస్తారు. అతని 'చరిత్ర గృహం' తిలక్ భవన్‌గా పేరుగాంచింది.

నాగర్‌పూర్ అంటే 'అతని ఇల్లే చిరునామా'గా చెప్పుకుంటారు ప్రజలు. తిలక్ చెప్పే 'భరతఖండం' సమీపంలోని అన్ని పెద్ద నగరాలని కలుపుతూ నాగర్‌పూర్ 'సెంట్రల్ ఇండియా'లో ఉంది. వేదశాస్త్రి ఇంట్లో సమావేశం జరిగినప్పటి నుంచి అతని ఆధ్యాత్మిక ధోరణితో అసంతృప్తిగా వున్నాడు తిలక్. నేటి విపత్కర పరిస్థితుల్లో ఆర్యధర్మం, వర్ణధర్మం పరిరక్షించటానికి పాత తరం ఆలోచనారీతులు సరిపడవు.

తనచుట్టూ వున్నవారిని ఆశ్చర్యపరుస్తూ తిలక్ ఏదో గొణిగాడు. సమావేశం త్వరలో మొదలవుతుంది. అతడు 1920లోని తన భావాలని ఇప్పుడు 1930లో పేర్చుకోసాగాడు.

ఉత్తర-పశ్చిమ భారత్‌లో ఇస్లాం విస్తరిస్తోంది. తిలక్ పూర్వీకులైన చిత్‌పవన్ బ్రాహ్మణ వంశీయులు గోవాలోని కొంకణ తీరం నించి వచ్చారు. 16వ శతాబ్దిలో కొంకణ నిష్ఠాగరిష్ఠ బ్రాహ్మణ రాజ్యం పోర్చుగీసు క్యాథలిక్ మతంవారి బెదిరింపులతో

వచ్చేసింది. బ్రాహ్మణ సంస్కృతిలో భాగం అయిన బాల్యవివాహలు, వైధవ్యం ఇంకా బహుభార్యాత్వం వంటి మతాచారాలపైన పోర్చుగీసు రాజు, అధికారుల ప్రోత్సాహంతో దాడి జరిగి బలవంతంగా ప్రార్థనల ఆచారంతో భర్తీ అయింది. నిజంగా అది చావుదెబ్బ. బ్రాహ్మణుల జీవితం మత విశ్వాసాలపైన ఆధారపడివుంది. లేకపోతే ప్రజలు వాళ్ల సేవలకి ఇచ్చే విలువ ఏముంటుంది? 'గోండు' మత్స్యకారులు, శూద్రులు, అంటరానివారు ఇంకా గిరిజనులు భయంతోను, ప్రలోభాలతోను హిందువుల చేతుల్లోంచి జారిపోయి క్రిస్టియన్‌లయ్యారు. ఇప్పుడు అగ్రకులాల మహిళలు క్రాస్ – అండ్ – స్కర్ట్ నాగరికతతో ప్రేరేపించబడుతున్నారు.

ఈనాటి సమావేశంలోని అంశాలు తిలక్ మదిలో రూపుదిద్దుకోసాగాయి. తన దేశం అయిన కొంకణ ప్రాంతపు జ్ఞాపకాలు అతని కళ్లముందు ఒకదాని తరువాత మరొకటి సినిమారీలులా తిరగసాగాయి. అది భగవంతుడు చేసిన పర్యాటకాభివృద్ధి వైఖరి లాంటిది. తిలక్ గొంతు సవరించుకుని స్వచ్ఛమైన మరాఠీలో చెప్పడం మొదలుపెట్టాడు. "కొంకణ్ అడవి ఘాట్ అందాలని, పర్వతసానువులని వదిలి వస్తూంటే నా తల్లి భారత్‌ని కోల్పోయినట్లయింది. జీడిపప్పు మీద వచ్చే ఆదాయం, ఆర్థిక వ్యవస్థపైన మనకున్న అధికారాలని పోర్చుగీసు క్రిస్టియన్‌లు అపహరించారు. మన కొంకణ ఫలాలన్నీ బీఫ్, బిర్యానీ తినేవారి వద్దకు వెళ్లిపోయాయి. మూలపురుషుల ఆర్యులమైన మనం స్వంతగడ్డపైనే నిరాశ్రయులయ్యాం. గురువులకే గురువులు, పండితులలో కెల్లా పండితులు పశ్చిమ భారత్‌లోని మహారాష్ట్రకి పారిపోయారు. విదేశీయులు – అన్యులు మన ప్రాచీన జన్మ హక్కు హరించారు. వాళ్లు మన భూముల్ని, ఉద్యోగాల్ని, గ్రామాలని లాక్కున్నారు. అదో కథ : తర్వాత చెప్తా" అన్నాడతను ప్రాయశ్చిత్త ధోరణితో బాధగా. సుదీర్ఘ విరామం తర్వాత అతను చెప్పడం కొనసాగించాడు, "చూడండి ఇప్పుడు పరిపాలిస్తున్న క్రిస్టియన్‌లు మనకి శత్రువులు అని చెప్పడంలో ఎలాంటి సందేహమూ లేదు. వాళ్లు బీఫ్ తినే విదేశీయులే. కానీ మన ప్రబల శత్రువులు అత్యధిక సంఖ్యాకులైన ముస్లింలు, శూద్రులు, అంటరానివారు. ఇస్లాంలోకి మహాప్రస్థానంలా వెళ్ళే ముందరే మన నాగరికతకి జన్మస్థానం అయిన అఫ్ఘనిస్తాన్ గడ్డంవున్న మతాంధుల ముస్లిం దేశంగా మారిపోయింది. అఫ్ఘనిస్తాన్ భరత ఖండంనించి వెడలిపోయింది. అయినా అది మన హిందూ జాతిలో ఒక భాగమే, రెండు వేల సంవత్సరాలకి పూర్వం. వేదాలు పుట్టిన వర్ణ ధర్మంలో నాభిలాంటి – సెంటర్ పాయింట్ అయిన మన నాగరికతకి జన్మస్థానం అది. ఇప్పుడు ఏ సమయంలోనైనా వాయువ్య సీమ ముస్లింలు దాన్ని పాకిస్తాన్ అంటూ పిల్చే సాహసం చేస్తారు. ఇంకా తూర్పు బెంగాల్, నిజాం రాజ్యం అయిన హైదరాబాదు పూర్తిగా ఇస్లాంలో

కలిసిపోతుంది. అవి రక్తమోడుతున్న మన తల్లి అవయవాల్లా భరతఖండం నించి చీలిపోతాయి" అనగానే గుంపులో దిగ్భ్రాంతి గొలిపే సంకోచం ఏర్పడింది. తిలక్ గర్జిస్తున్నట్లుగా అన్నాడు, "ఈశాన్యంలోని ఆదివాసీలు మూకుమ్మడిగా క్రైస్తవమతంలోకి మారుతున్నారు, ఎలుకలు బీటలువారిన వడ్లు తిన్నట్లుగా దక్షిణాన అంటరానివాళ్లు, శూద్రులు పెళ్లికాని తల్లికి పుట్టిన కొడుకుని ప్రార్థిస్తున్నారు, వివాహం చివరి ధర్మం కూడా వాళ్లని వదిలిపోయేలా. బ్రిటిషర్లు బ్రిటిషర్లే. కానీ నా మాటలు గుర్తుంచుకోండి. ఏదో రోజు వాళ్లు ఈ దేశాన్ని వీడిపోయే రోజు వస్తుంది. ఆ తర్వాత సంగతేంటి అన్నదే సమస్య. వాళ్లు వెళ్లిపోయిన తర్వాత మన భరత ఖండాన్ని ఏ మతం పరిపాలిస్తుంది? హిందూ మతమా, ఇస్లామా లేక క్రైస్తవమా? మన ముందున్న సవాల్ ఇది. ఇది మనందరిని హైరానా పెట్టే, బాధపెట్టే విషయం – ఆర్యుల రక్తం ప్రవహించే మనవారిలో."

అక్కడున్న వారిలో కలకలం రేగింది. గుసగుసలు మొదలయ్యాయి. అక్కడవున్న రెండోతరం నాయకుడైన ఇందిరేష్ అన్నాడు, మనం సగం ముందు తోలు తొలగించిన అంగంతో వున్న వ్యక్తుల్ని ఎదుర్కోవడం ఎలా? వాళ్లు మన దేవాలయాలలోకి ఎద్దుల్ని ఎగదోస్తున్నారు. ఆవులని వధించి మాంసం కోసం వాటిని కబేళాలకి తరలిస్తున్నారు. ఇది జటిలమైన సమస్య".

అందరిలోనూ పిన్న వయస్కుడూ, ఇటీవలే ఆక్స్‌ఫర్డ్ నుంచి తిరిగి వచ్చిన దండేకర్ అన్నాడు "మనం జాగ్రత్త పడాల్సిన సమయం ఆసన్నమయింది. ఆక్స్‌ఫర్డ్ కేంద్రంగా వుండే బ్రహ్మజ్ఞాన సొసైటీ, సొసైటీ ఫర్ డివైన్ నాలెడ్జ్, మన సొంత సైనిక పాటవంతో మనం మన సమీప శత్రువులైన బ్రిటిషర్స్‌ని పారద్రోలాలనే అభిప్రాయానికి వచ్చింది. దివ్య జ్ఞానంతో అంకితభావం కలిగిన సొసైటీ ఈ విషయంలో తప్పుచేయదు. మనం ఈ ముందు తోలు తొలగించుకున్న వాళ్లని, బీఫ్ దిగమింగేవాళ్లని అంతం చేయడానికి ఆయుధాల్ని తయారుచేసుకోవాలి." ఈ కుర్రాడి పూర్తి పేరు దండనీతి దండేకర్. బ్రహ్మజ్ఞాన సొసైటీ వారు ప్రేమతో డిఎన్‌డి అని పిలుస్తారు.

చర్చ సరైన దిశగా సాగటం లేదన్నట్టుగా తిలక్ నైరాశ్యంతో పళ్లు పటపట నూరాడు. ముఖ్యమైన విషయాలని ఈ మూర్ఖులు పక్కదోవ ఎందుకు పట్టిస్తారు? శ్లోకాల్ని తప్పులు లేకుండా అనర్గళంగా చదవడంలో వీళ్ల తల్లిదండ్రులు శిక్షణ ఇవ్వడంలో ఉపేక్షించివుంటారు. అలా చేసి వుండకపోతే అవసరమైన విషయాలలో వీళ్లలో ఏకాగ్రత కొరవడేది కాదు. తన భార్య వైష్ణవేశ్వరిని పిలిచి అందరికీ టీ ఇవ్వాల్సిందిగా ఆదేశిస్తూ "ఇక్కడ శూద్రులెవరూ లేరు. అందరికీ గ్లాసుల్లో పోసి తీసుకురావచ్చు" అన్నాడు భరోసాగా తిలక్.

“టీ… మనం బ్రిటిష్ టీ తాగుతామా, ఇప్పుడు, తిలక్?” అన్నాడు ఆశ్చర్యంగా బ్రాహ్మనిజంలోని మానసిక, శారీరక దుర్భలురైన పాతతరం వృద్ధులకి ప్రాతినిధ్యం వహిస్తున్న, అందరికన్నా వృద్ధుడైన పుండరీక దేశాయ్.

“ఓహో! అలాగయితే మీరు మజ్జిగ పుచ్చుకోండి దేశాయ్‌జీ” అన్నాడు తిలక్ సాంత్వనగా.

మరో నాయకుడైన దేశ్‌పాండే వాళ్ల అజ్ఞానానికి ఒకింత చిరాకుపడి ఆకస్మికంగా అన్నాడు, “వేదాలలో టీ కూడా కాఫీలాంటిదేనని చెప్పబడింది. కానీ వాటిని తీసుకువచ్చింది క్రిస్టియన్‌లు, ముస్లింలు అన్న ఉద్దేశంతో మనవాళ్ళు వాటిని తాగడం మానేశారు. మనం వేదాలని చదవాలి. మళ్లీ మళ్లీ చదివి అర్థం చేసుకోవాలి. గోమూత్రం నుంచి కాఫీ, టీల వరకు ప్రతీ విషయాన్ని వాస్తవంగా గ్రహించాలి.”

ఈ వివాదం ఎరుగని వైష్ణవేశ్వరి అక్కడున్న వాళ్లందరికీ ‘టీ’ సర్వ్ చేసింది. అన్నట్టుగానే దేశాయ్‌కి మజ్జిగ ఇచ్చింది. వంట కోసం మడిగా తడిబట్టలు కట్టుకోవడంతో అవి శరీరానికి అతుక్కుపోయి ఆమె ఏ దారిగుండా వచ్చిందో అక్కడ నేల మీద నీటి చుక్కలు ఏర్పడ్డాయి. మజ్జిగ గ్లాసు అందుకుని దేశాయ్ అన్నాడు, “గుజరాత్ బ్రాహ్మణులు పూర్తి శాకాహారులు. నిజానికి టీ మాంసాహార డ్రింక్ అని వీళ్లకి తెలియదు. ప్రతి ముస్లిం బిర్యానీ, ముఖ్యంగా బీఫ్ బిర్యానీ తిన్న తర్వాత స్ట్రాంగ్ టీ తాగటం లేదా? బహుశా ప్రాచీన కాలంలో బ్రాహ్మణులు బీఫ్ తిని వుండొచ్చు. ఇప్పుడు కొందరు శూద్ర వ్యక్తులు బలవంతపెడ్తున్నట్లుగా. వాళ్లు టీ కూడా తాగారేమో. ఆధునిక బ్రాహ్మణులు ఆ దురలవాట్లని పూర్తిగా అధిగమించి శాకాహారులయ్యారు.” ఈ విషయాలని బిగ్గరగా అనలేకపోయాడు దేశాయ్. టీ తాగకూడదని దాన్ని వదిలెయ్యాలన్నప్పుడు అక్కడున్న యువకుల్లో గట్టి వ్యతిరేకత వ్యక్తమయింది.

టీలు, మజ్జిగతో సమావేశం ముగిసేసరికి భానుడి ప్రతాపం అధికమయింది. మధ్య భారతంలో వేసవి కాలాలు ఎడారి ఎండలని తలపిస్తాయి. రోడ్డు మీద రిక్షా తొక్కేవాళ్లు ఎండ వేడిమి భరించలేక చొక్కాలు, ఇంకా తలలపైన కప్పుకున్న వాటిని తీసేశారు. విదర్భలోని ఈ ప్రాంతాన్ని ‘శవాల దిబ్బ’గా చెప్పుకుంటారు. ఇక్కడ పేదలు వాళ్లు స్రవించే చెమటని చప్పరించాల్సిందే. ఎందుకంటే మంచినీళ్లు కేవలం సంపన్నులకే పరిమితం. తిలక్ ఇంట్లో మంచినీళ్లు తగినంతగా వుంటాయి : సిటీలోని వాటర్ వర్క్సులో మంచినీటి సరఫరా విభాగపు అధికారి అతని అల్లుడే.

ఎదురుగా వున్న మైదానంలో గాడిదలు ఓండ్రపెడ్తున్నాయి. అవి గాడిద పాటలుగా ప్రసిద్ధి. వాటికి తోడు కుక్కలు కూడా మొరుగుతూండడంతో ఆ స్వరాలు మరింత పెరిగాయి. ఓ భారీ కుక్కల గాడిదల కచేరీలా వుందక్కడ. తన ఇంటి చుట్టూ ఈ జంతువులు వుండడాన్ని అసహ్యించుకుంటాడు తిలక్. కానీ అతను నిస్సహాయుడు. జంతువుల సంగీతంతో సభకి అంతరాయం ఏర్పడింది. అవి పొద్దం ముగించేవరకు తిలక్ సహనంతో నిరీక్షించాడు. ఆ తర్వాత అతను చెప్పడం కొనసాగించాడు : "ఈ ఆధునికయుగం ఏమిచ్చిందో చూడండి. పూర్వకాలంలో బ్రాహ్మణుల కోసం ప్రత్యేకించి పవిత్ర గ్రామాలు వుండేవి. ఈ పాడుయుగం మన మీద ఉదయించేదాకా శూద్రులకి, అంటరానివాళ్లకి వాళ్ల స్థానమేదో వాళ్లకి తెలుసు : వాళ్లు ఎక్కడ నివశించాలో, వాళ్ల బస్తీలేవో వాళ్లకి తెలుసు. కానీ తామే బ్రిటిషర్స్ అన్నట్టుగా భావిస్తారు ఈ ముస్లింలు. వాళ్లు బ్రిటిషర్స్‌కి అధికారాన్ని అప్పగించారు. అందుకని పాలకులకి వాళ్లు 'పెద్దన్న'లు. దాంతో అహంకారంతో వాళ్లు మన పవిత్రతని అతిక్రమించారు. వాళ్లు మన గ్రామాలలో భూములు, ఇళ్లు కొనుగోలు చేశారు. ఇప్పుడు మీరు చూడవచ్చు, ముస్లింలతో పాటు కుక్కలు గాడిదలు కూడా బ్రాహ్మణుల కాలనీలలో కూడా జీవించేందుకు వచ్చాయి. ఇప్పుడు భారతావని కుక్కల గాడిదల పాలవుతోంది. భవిష్యత్తులో అది భ్రష్టుపట్టడం ఖాయం."

"ఒకసారి గనక బ్రిటిషర్స్ వెళ్లిపోతే ప్రధానంగా ముస్లింలకి మనకి కొట్లాటలు జరుగుతాయి" అన్నాడు పుండరీక దేశాయ్ ప్రధానమైన విషయాలను ప్రస్తావిస్తూ.

"అప్పుడు వాళ్లకి నాయకుడిగా ఎవరుంటారు?" అడిగాడు సర్కార్ ఆదుర్దాగా, సమస్య గంభీరతని గుర్తిస్తూ.

"ఆ విషయంతో మనకి సంబంధంలేదు. ముస్లిమేతరులలో, క్రిస్టియనేతరులలో ఎవరు భారత్‌ని ముందుకు నడిపిస్తారనేదే మన ముఖ్యమైన ఆందోళన" అంటూ ఇందిరేష్ "గతంలోనే మన దేవుళ్లని, నాగరికతని దూషిస్తూ 'స్లేవరీ' (బానిసత్వం) అన్న పేరుతో ఓ శూద్రుడు పుస్తకం రాశాడు. బ్రిటిషర్లు అమెరికాలోని ఓ అంటరానివాడికి ఆర్థికసాయం అందిస్తున్నారు. ఎన్నో విడ్డూరాలు జరుగుతున్నాయి" అన్నాడు.

"ఇలాంటి వాటికి బ్రిటిషర్స్ కుట్రలు భారీగా తోడ్పడుతున్నాయి" అన్నాడు దండేకర్, ఇలాంటి విషయాల గురించి సాధికారికంగా దిగుమతి చేసుకున్న తెలివితేటలతో అతను మాట్లాడ్డం కొనసాగిస్తూ "వాళ్లు మన ఐక్యతని అస్థిరపరచడానికి ఏమైనా చేయగలరు... ధనాన్ని, ఆయుధాలని కూడా మన శత్రువులకి అందించగలరు" అన్నాడు.

"నిశ్శబ్దం! అందరూ నిశ్శబ్దంగా వుండాలి! ఇప్పుడు క్రిస్టియానిటీతోను బ్రిటిషర్స్‌తోను ఆందోళన వద్దు. మనం విజయం సాధిస్తే భారతీయ క్రిస్టియన్‌లు ఎప్పటికీ మన పాదాల దగ్గరే వుంటారు. మనం తొలుత చేయాల్సిందేమంటే వాళ్లకి ముస్లింలతోగల అనుబంధాన్ని విడదీయడం. ఎందుకంటే వాళ్లు క్రిస్టియన్‌లని ఎగదోస్తారు. వారు వాళ్లకి వెన్నుదన్ను. వాళ్లు మన మీద దాడిచేయడానికి ముందే మనం వాళ్ల అవయవాల్ని నరికిపారేయాలి" అంటూ మండిపడ్డాడు తిలక్ గుంపుని తీవ్రంగా చూస్తూ.

"ఇప్పుడు మనం ఏం చెయ్యాలి? త్వరగా తేల్చండి" అన్నాడు దేశాయ్ అసహనంతో ఊగిపోతూ. "ఈ యువకులకి విషయం రాబట్టడానికి తొందరెక్కువ. వృద్ధులు చాలాసార్లు టాయిలెట్‌కు వెళ్లి వస్తారనే గ్రహింపు లేదు" అనుకున్నాడు మనసులో తిలక్.

మనం ఒక సంస్థని స్థాపించాలి. అది సామాజిక కార్యకర్తల సమూహం బిచ్చగాళ్లకి గొంగళ్ళు పంచినట్లు స్వయం 'సంరక్షకం'గా ఉండాలి.

అది వాస్తవ రూపం దాల్చాలి. సమరశీల సమాహార నిర్మాణం. ఆ దిశగా యువకులని చైతన్యపరచాలి. అందుకు గట్టి కృషి చేయాలి. ముస్లిమ్‌ల, క్రిస్టియన్‌ల బలాబలాల్ని గమనించండి. వాళ్లు పిల్లలకి పిన్నవయసునుండే జిహాద్ ఇంకా మతయుద్ధాలు గురించి బోధిస్తారు. చంపడానికి చావడానికి సిద్ధపడ్తారు వాళ్లు! మనం మాత్రం కూర్చుని మాట్లాడుకుంటాం. కొన్ని యుగాలుగా మనం దేవుడిని నమ్ముకుని యున్నాం; పళ్లు, పూలు దేవుళ్లకి నివేదిస్తున్నాం. వాస్తవానికి ఇవేవీ సరిపోవు. మనం రక్తాన్ని చిందించి నివేదన చేయాలి. మన విలువలు నిరూపించుకోవాలి!" అంటూ తిలక్ ప్రజాస్వామ్యానికి ఎముకను ఎరవేసినట్లుగా భుజాలు ఎగరేశాడు. అందరూ కలిసి భరత్‌ఖండ్ ప్రొటెక్షన్ సంఘ్ (బిపిఎస్) అనే పేరు నిర్ణయించారు.

"మంచిది, బాగుంది. నాకు సమ్మతమే" అంటూ తిలక్ "జాగ్రత్తగా వినండి, మనం ఎవరిని రక్షించడానికి అమితంగా కష్టపడాలి?" అన్నాడు.

"సీనియర్ సిటిజన్స్" అన్నాడు దేశాయ్ ఆశాజనకంగా. తిలక్ అతని వంక చూశాడు. దేశాయ్ అసౌకర్యంగా చూశాడు.

"లేదు, లేదు. ఈ భరతఖండంలో ముస్లింలు ఇంత అధిక సంఖ్యాకులు ఎలాగయ్యారో నీకు తెలుసా? వాళ్లు ఏ మహిళనీ వెంటతెచ్చుకోలేదు. అంటే దాని అర్థం వాళ్లు ఒకరితో ఒకరు పడుకుని పిల్లల్ని పుట్టించారనా? కాదు. వాళ్లు మహిళల్ని తీసుకుపోయారు, మన మహిళల్ని. అవును, బ్రాహ్మణ స్త్రీలని కూడా. నోరూవాయీ లేని ముందోలు తొలగించిన వాళ్ల అంగాన్ని వాళ్లలో ప్రవేశపెట్టి సంకర జాతిని పుట్టించారు."

"బ్రాహ్మణ స్త్రీలా!" అన్నాడు దేశ్‌పాండే పాలిపోయిన మొహంతో.

"అఫ్‌కోర్స్" అన్నాడు నెమ్మదిగా తిలక్.

"ఇక్కడికి వచ్చిన ముస్లింలు అఫ్ఘన్‌లు, తురుష్కులు చెట్టు బెరడులాంటి తెల్లని చర్మం, దృఢమైన శరీరాలు, పొడవైన ముక్కులు, నల్లని జుత్తు గలవారు. అంతేకాదు, వాళ్లు సంపన్నులు, పొడవైన వారు, ఉన్నతస్థానంలో వుండే వ్యక్తులు. సొగసైనవారు. అలాంటి వాళ్లు అసహ్యకరంగాను, నల్లగాను వుండే ద్రావిడుల్ని, శూద్రుల్ని ఛండాల స్త్రీలని ప్రేమించినట్లు వాళ్లతో కలసి జీవించారని అనుకుంటున్నావా? వాళ్లు సాధారణంగా అందమైన స్త్రీలనే ఎంచుకుంటారు. ఆ స్త్రీలు ఎవరనుకుంటున్నావు?" అడిగాడు తిలక్.

వెంటనే అక్కడ వున్నవాళ్లంతా తిలక్ మొహంలోకి దిగ్భ్రాంతిగా చూశారు. ఎవరూ మాట్లాడలేదు. కానీ వాళ్ల కళ్లు ఏదో భయంకర విషయాన్ని చెప్పాలను కుంటున్నట్టుగా సూచిస్తున్నాయి. ఆ విషయాన్ని గంభీరమైన వాళ్ల ఆత్మలనించి గ్రహించవచ్చు. అది వాళ్ల కడుపులో నరాల్ని బిగపెట్టింది. వాళ్ల మహిళల గురించిన ఆలోచన రాగానే ఒక్కసారిగా భయం, ఆందోళన మొదలైన గుండెలు జారిపోయాయి. వాళ్ల తల్లులు, చెల్లెళ్లు, కూతుర్లని గురించి ఆలోచించసాగారు. ఇంతలో ఎవరో గొణుగుతున్న శబ్దం వినిపించింది. దండేకర్ మొహం జేగురించింది. కళ్లు ఎర్రబడ్డాయి. "ఎందరు భరతమాతలు... మదర్ ఇండియాలు... తప్పని పరిస్థితుల్లో... తప్పని పరిస్థితుల్లో ఆ రాక్షసుల ముందు తోలు తొలగించిన అంగాలు... ప్రతీకారం తీర్చుకోవాలి... ప్రతీకారం తీర్చుకోవాలి... ప్రతీకారం తీర్చుకోవాలి. ఒక్కటే మార్గం ప్రతీకారం... ఒకే ఒక్క మార్గం ప్రతీకారం... దీనికి బదులు చెల్లిస్తారు వాళ్లు... దీనికి బదులు చెల్లిస్తారు వాళ్లు.

సమావేశం ఆ రోజుకి ముగిసింది.

జహంగీర్‌పూర్ గ్రామం నాగర్‌పూర్ నుండి సుమారు నలభై కిలో మీటర్ల దూరంలో వుంది. అది ఒక సాధారణ గ్రామం. ఆ గ్రామంలో ఐదు వందల ఇళ్లు వున్నాయి. వాటిలో ప్రతీ మూడోది ముస్లింలది. మిగతావాటిలో అధిక భాగం శూద్రులకి, 'మహర్' అనే దళిత కులానికి చెందినవి. ఆ గ్రామంలోని వ్యవసాయ భూముల్లో ఎర్ర మిర్చి, ముతక జొన్నలు ముఖ్యమైన పంటలు. అక్కడ నాలుగు బ్రాహ్మణ కుటుంబాలు, రెండు బనియా కుటుంబాలు కూడా వున్నాయి. వాళ్లు గుజరాత్ నుండి వలస వచ్చినట్లుగా చెప్పుకుంటారు. వాటిలో ఒక్క బ్రాహ్మణ కుటుంబం తప్పించి మిగతావి ధనిక కుటుంబాలే. విష్ణుదేవ్ దేశ్‌ముఖ్ ఆ గ్రామంలో ప్రధాన భూస్వామి. అతని కుటుంబం నాగర్‌పూర్‌లో నివాసముంటుంది.

ఆ గ్రామంలో ఓ ఇరుకైన వీధి వుంది. మట్టి రోడ్డు. వర్షాకాలంలో వీధి బురద బురదగా మురుగునీటితో నిండిపోతుంది. దాంతో అక్కడి వాళ్లు రోడ్డువారగా నడుస్తారు. వానాకాలంలో ఆ గ్రామానికి రావాలంటే దేశ్‌ముఖ్ కుటుంబం చిరాకుపడుతుంది. వేసవి కాలంలో మాత్రం వాళ్లు అక్కడ కొంత సమయాన్ని గడుపుతారు. దేశ్‌ముఖ్ ఒక్కడే వ్యాపార నిమిత్తం రోజూ బస్సులో కూడలి దాకా వచ్చి అక్కణ్ణించి వేగంగా వెళ్లడంలో శిక్షణ పొందిన ఎడ్ల బండిలో ఎక్కి తన ఊరు వెళ్తుంటాడు.

జహంగీర్‌పూర్‌లో చెట్లకన్నా కుక్కలు ఎక్కువ. కొత్తవాళ్లని చూడగానే కుక్కలు పళ్లు బైటపెట్టి భౌభౌమని మొరుగుతూ వాళ్లని చుట్టుముడ్తాయి. 'డెడ్లీ డాగ్ విలేజ్'గా పేరు పొందిన ఆ గ్రామాన్ని ప్రభుత్వ అధికారులు ఎన్నడూ సందర్శించిన దాఖలాలు లేవు. ఆ గ్రామంలో రామాలయం, శుక్రవారం శుక్రవారం  రద్దీగా ఉండే మసీదు ఉన్నాయి. అవి జనాలతో కిటకిటలాడతాయి. ముఖ్యంగా వేసవికాలంలో. ఎందుకంటే వేసవి కాలంలో పొలం పనులు పెద్దగా వుండవు. చుట్టుపక్కల గ్రామాల నించి కూడా ప్రార్థనల కోసం ఎందరో ప్రజలు తరలివస్తారు. ఆ రోజు వచ్చిన వాళ్లకి పండగే. ఆ రోజు బిర్యాని వండుకుని ప్రార్థన ముగిసిన తర్వాత మసీదు చుట్టుపక్కల కూర్చుని తింటూంటారు. మసీదులో చిన్న దర్గా కూడా వుంది. మసీదుకి అనుబంధంగా చిన్న మదర్సా వుంది. అది స్థానికంగా వుండే పీర్ సాహెబ్ ఆధ్వర్యంలో నడుస్తుంది. మసీదు ఆధ్వర్యంలో తన చిన్న సైజు ఇంటిలో ఆడపిల్లలకి ట్యూషన్లు చెప్పడానికి జహనారాబీ అనే మహిళని ఏర్పాటుచేశారు.

రామాలయంలో పాఠశాల అంటూ ఏదీ లేదు గాని ఆలయ పురోహితుడు ఖాళీ సమయంలో పిల్లలకి సంస్కృతం బోధిస్తాడు. ఆలయం అన్ని కాలాలలోను పూజలు అర్చనలంటూ జనాలతో నిండిపోతుంది. సీతారాముల కళ్యాణం రోజు మరీ రద్దీగా వుంటుంది. రాముడు కేవలం హిందువుల దేవుడు. హిందూ బ్రాహ్మణ కుటుంబాలు రాముడి వివాహ వేడుకల్ని ఘనంగా నిర్వహిస్తారు. కానీ శ్రీరామచంద్రుడు పుట్టిన రోజు వేడుకలంటూ ఎన్నడూ ఘనంగా జరుపుకోలేదు. ఆయన వర్ధంతి రోజు కూడా ఎవరికీ తెలియదు. మరి సీతారాముల కళ్యాణానికి అంత ప్రాముఖ్యత ఎందుకని? పురాతన కాలంలో సీతకన్నా రాముడికి ప్రాధాన్యత తక్కువ అని తెలియజేయడానికి అది ఓ సంకేతం మాత్రమే. మరెందుకోసం సీతని తెచ్చుకోవడానికి రాముడు దేశంలో మూలమూలలా తిరిగి యుద్ధం చేయాల్సి వచ్చింది? రాజుకు రూపాయికి పదిమంది పెళ్లాలు దొరుకుతారు. సీత భూమిలోంచి వచ్చింది. భూమి అంటే అది. భూమి లేకుండా

రాజు పాలించలేడు, బానిసలు లేని యజమాని అసలు యజమానే కాడన్నట్టుగా. తన రామరాజ్యానికి రాజు శ్రీరామచంద్రుడు. కానీ సీత రామరాజ్యం. తిలక్ ఈ విషయాన్ని అర్థం చేసుకున్నాడు. ఈ విషయాన్ని రాముడు కూడా అర్థం చేసుకున్నాడు. మహిళల్ని రక్షించాలి. తమ అమాయకత్వాన్ని తమ బాగోగుల్ని వీధిన పడేసే ప్రమాదకర హక్కుల్నించి శూద్రులు రక్షింపబడాలి.

ఆ గ్రామంలోనే వున్న బలరాం, భార్య సక్కూబాయి కలకలగానే మిగిలిపోయింది. ఆ కులంవాళ్లు గతంలో ఎన్నడూ కూడా అటువంటి కల నెరవేర్చుకోలేదు. తమ బిడ్డ సరస్వతిని బాగా చదివించాలని కలగన్నారు వాళ్లు.

బలరాం పండ్ల వ్యాపారి. సక్కూబాయి ఓ చిన్నపాటి పొలంలో పనిచేసిన తర్వాత తీరిక సమయాల్లో కూలి పనిచేస్తుంది. ఆమె అన్ని పనులూ చేస్తుంది. చెత్త ఊడ్చడం, శుభ్రం చేయడం, ఎవ్వరూ తాకడానికి కూడా ఇష్టపడని వాటిని ఎత్తిపారేయడం లాంటి పనుల్ని కూడా చేస్తుంది. నిమ్నకులస్థులైనప్పటికీ వాళ్లు అంటరానివారికన్నా అధికులే. తన కూతురికి చదవడం, రాయడం వస్తుందన్న ఉద్దేశంతో ఆ పిల్లకి చదువుల తల్లి అయిన సరస్వతి పేరు పెట్టాడు బలరాం. ఆ పిల్లకి ఐదేళ్లు నిండడంతో ఏదో విధంగా స్కూలుకి పంపాలని నిర్ణయించాడు బలరాం. ఆ రోజు చుట్టుపక్కల గ్రామాలలో పళ్లు అమ్ముకుని ఇంటికి తిరిగివస్తుండగా రామాలయంలో పిల్లలకి పాఠాలు చెప్తూ గుడిపూజారి కనిపించాడు. బలరాం గుళ్లోకి వెళ్లి “పండిట్ జీ, నాకూ ఓ కూతురుంది. దాన్ని స్కూల్లో వేద్దామనుకుంటున్నాను. దయచేసి దానికి కూడా చదువు చెబుతారా? మీరు అడిగినంతా ఇస్తాను” అన్నాడు.

పూజారి అతనివైపు చూశాడు. చెమటతో తడిసిన భుజాలు, చౌకపాటి కౌపీనం, ఖాళీ బుట్టతో ఎదురుగా నుంచున్నాడతను. “నీదే కులం?” అంటూ అతనివంక తీక్షణంగా చూస్తూ పూజారి. “నీ పెళ్లాం ఈ చుట్టుపక్కల శూద్రదానిలా ఊడ్వడం నేను చూడలేదా?” అన్నాడు.

“నాది పండ్ల వ్యాపారం”

పూజారి చూపు కళ్ల నుంచి మెదడులోకి జొరబడి అక్కడ ఏముందో తెలుసుకుంటున్నట్టుంది. అతని నుదురు, బుగ్గలు ఊదా రంగులోకి మారాయి. రాబోయే తుఫానుని ఎదుర్కోవడానికి సిద్ధపడ్డాడు బలరాం. పూజారి అసహజ నిశ్శబ్ద స్వరంతో “నేను ఈ గుళ్లో పండిట్‌ని. గుడి పూజారిని. అన్నిటినీ మించి బ్రాహ్మణుడిని. నేను శూద్రులకి, ఛండాలురకి, కుక్కలకి గాడిదలకి పాఠాలు చెప్తాననుకుంటున్నావా? అయినా

నిన్ను లోపలికి ఎవరు రానిచ్చారు? నీ కులం తక్కువ – కూతురు – ఆడపిల్ల, ఈ కుక్కపిల్లకి చదువు చెబుతానో లేదోనని అడగమన్నదెవడు? బయటికి పో! పో బయటికి. గుళ్లోంచి బయటికి పో; అపరిశుభ్రమైన నీ పాదాలని నా నేలమీంచి తొలగించు!" అన్నాడు.

బలరాం కోపంతో వణుకుతూ అవమానంతో కృంగిపోయి గుళ్లోంచి ఇంటికి పరుగుపెట్టాడు. ఇంట్లోకి వెళ్లేసరికి సక్కూబాయి జొన్న రొట్టెలు చేస్తూ కన్పించింది. తను పూజారితో మాట్లాడిన విషయం, పూజారి తనపైన పిచ్చిగా అరిచిన విషయం మొత్తం జరిగిందంతా సక్కూబాయికి పూసగుచ్చినట్లు వివరించాడు బలరాం.

"ఎందుకలా?" అంటూ సక్కూబాయి "నెల రోజుల క్రిందటే గుడిదగ్గర అంతా శుభ్రం చేసి గుడికి సున్నాలు వేయడంలో సహాయపడ్డాను. వారం వారం అందరూ గుడి దగ్గర తిని పడేసినవి ఊడ్చి శుభ్రం చేస్తాను. గుళ్లో తింటారు, గుడివెనక విసర్జిస్తారు. అవి కూడా ఎత్తి శుభ్రం చేస్తాను. ఆ గాడిద చాకిరీకి ఆ లావాటి పురోహితుడు ఎన్నడూ పైసా విదల్చడు. ఇప్పుడు నా బిడ్డకి చదువు చెప్పనంటాడా? ఆ గుళ్లోని దేవుడు ఎవరికోసం? వాళ్లందరినీ అక్కడే పవిత్రమైన ఆ బ్రాహ్మణ ఛండాలపు కంపులోనే కూర్చోనీ" అంది బాధగా.

ఓ వారం రోజుల తర్వాత స్థానిక భూస్వామి దేశ్‌ముఖ్ బలరాంని పిలిపించాడు. కూతురికి గుళ్లో చదువు చెప్పమంటూ పూజారిని అడిగే సాహసం చేసినందుకు తిట్టిపోశాడు. బలరాం కోపంగా నిరుత్సాహంతో ఇంటికి తిరిగొచ్చాడు. అతని మొహం చూసిన సక్కూబాయి జరిగిన విషయం గ్రహించడంతో 'ఏం జరిగిందని' బలరాంని అడిగే అవసరం లేకపోయింది.

కొన్ని రోజులు గడిచాయి. ఆ రోజు సక్కూబాయి మసీదు దగ్గర ఊడ్చి శుభ్రం చేస్తోంది. మసీదుకి చెందిన ప్రధాన ముల్లా పీర్ సాహెబు ఆమెని చూశాడు. చాలాసేపటివరకు ఆ మొహం గమనించిన ముల్లా "ఏం జరిగిందని" అడిగాడు. పీర్ సాహెబ్‌కి జరిగినదంతా వివరించింది సక్కూబాయి. తమ బిడ్డ కోసం తాము కన్నకలలు, తన భర్తకి జరిగిన అవమానం అన్నీ వివరంగా పీర్ సాహెబ్‌కి చెప్పింది. పీర్ సాహెబ్ దయాపూర్వకమైన చిరునవ్వు నవ్వి బాధపడవద్దని సాంత్వనగా పలికాడు.

"నువ్వు మీ పిల్లని జహనారా బీ దగ్గరకి ఎందుకు పంపించవు? మసీదు పక్కనే ఆమె ఇల్లు. ఇదిగో ఈ చెట్ల ఆకుల మధ్య నుంచి ఆమె గదిని నువ్వు చూడొచ్చు. పేద ముస్లిం కుటుంబాలు తమ పిల్లల్ని ఖురాన్ నేర్చుకోడానికి చదవడానికి అక్కడికి

పంపుతారు. జహనారా బీ ఎనిమిదో క్లాసు వరకే చదువుకుంది. ప్రాథమిక స్థాయిలో నీ పిల్లకి కూడికలు – తీసివేతలూ, రాయడం, చదవడం నేర్పగలదామె. అయితే ఇదంతా నువ్వు ఇష్టపడితేనే."

చేతిలో చీపురు వుందన్న విషయం కూడా మర్చిపోయి పీర్ సాహెబ్‌ని చూసి నోరు వెళ్లబెడుతూ "నా బిడ్డని ముస్లిం టీచర్ దగ్గరకి పంపడమా? ఇది సాధ్యమయ్యే పనేనా?" అంది సక్కూబాయి.

ఆ మాటలకి సక్కూబాయి వంక సంభ్రమాశ్చర్యాలతో చూశాడు పీర్‌సాహెబ్. నీ బిడ్డ చదవాలనుకుంటే సమయం ఎందుకుండదు? రోజుకు కొన్ని గంటల సమయం చాలు. నీ ఇల్లు ఎంత దూరం? ఓహో! స్వీపర్ల కాలనీలో ఉంటావనుకుంటా. ఫరవాలేదులే, దూరమనిపిస్తే నీ బిడ్డని తీసుకురావడానికి హుస్సేన్‌ని పంపుతాను" అంటూ గట్టిగా కేకపెట్టి హుస్సేన్‌ని పిలిచాడు పీర్ సాహెబ్.

మెరుస్తున్న కళ్లతో సుమారు ఏడు లేక ఎనిమిదేళ్ల పిల్లాడు చేతిలో పుస్తకంతో క్లాసు రూంలోంచి బయటికి వచ్చాడు సిగ్గుపడుతూ. సక్కూబాయి చూసింది. పరిశుభ్రమైన తెల్లటి కుర్తా పైజమా ధరించాడతను. తలపై లేసుతో అల్లిన తెల్లటోపీ వుంది. పీర్ కొద్దిగా వంగి కుర్రాడి భుజాలపైన చేతులుంచి "వీడే హుస్సేన్. మంచి పిల్లాడు. ఒక్క క్షణం నువ్వు వెళ్లాలనుకుంటే జహనారా బీ దగ్గరకి తీసుకువెళ్తాడు" అన్నాడు పీర్ చిరునవ్వు నవ్వుతూ. "నేను నీతోపాటు జెనానాలోకి (స్త్రీలకి ప్రత్యేకంగా కేటాయించిన ముస్లింల గృహభాగం) రాలేను. నీకు తెల్సిందే. నువ్వు జహనారా స్కూలు ఇష్టపడి, కోరుకుంటే హుస్సేన్ రోజూ నీ పిల్లని ఆమె ఇంట్లో దించుతాడు. తర్వాత భద్రంగా నీ ఇంటి దగ్గర దింపుతాడు. అతను చిన్నవాడే కావచ్చు. కానీ అతనొక ముసలి తలను తన భుజాలపై మోస్తున్నాడు. జహనారా బీ స్కూలు పట్ల, పిల్లల పట్లా అమితమైన శ్రద్ధా, అభిమానాలు కలది. నీ పిల్లని కూడా మిగతా పిల్లల్లాగే చూస్తుంది. దేవుడు అనుగ్రహిస్తే నీ పిల్ల ఇక్కడ వున్న పిల్లలందరిలో కెల్లా మంచి పేరు తెచ్చుకుంటుంది" అన్నాడు  పీర్ సాహెబ్.

తన బతుకంతా ఆకాశం కింద బహిరంగంగా బతకాల్సిరావడం, ప్రపంచానికి తనకి మధ్యన ఒకే ఒక పల్చని చీర తెరలా నిలిచి వుండడంతో సక్కూబాయికి ఒకింత భయంగానే వుంది జహనారాబీని కలవడానికి. గుమ్మానికి అపరిచితమైన పర్దా, అజ్ఞాతంలాంటి చిన్న చిన్న వసారాలతో వున్న జహనారా బీ ఇంట్లో ఆమెతో ఎలా వ్యవహరించాలో తెలియడంలేదు సక్కూబాయికి. పరదా తొలగించుకుని ఆమె లోపలికి

వెళ్లింది. ఇంటి వెనక ఆవరణలో ఓ పక్కగా వుండే స్కూలు గది దగ్గర గాలీ వెలుతురు ధారాళంగా వున్నాయి. జహనారా బీ మధ్య వయస్కురాలు. తలవెంట్రుకలు కొప్పులో బంతిలాచుట్టుకుని గంభీరంగా వుంది. సక్కూబాయిని చూడగానే ఆమె పిల్లల్ని బయటకి పిల్చింది నమస్కరించడానికి. తనపట్ల ఆ పిల్లల ఆదరణ చూసి జహనారా బీ బుగ్గలు ఎరుపెక్కాయి. సల్వార్ కమీజ్ చద్దర్‌తో వున్న ఆ బాలికలు ముచ్చటగా అందంగా వున్నారు. నది వొడ్డున అలల చిహ్నాలుగా (వంకరటింకర) అరబిక్ అక్షరాలు రాసివున్న పలకల్ని గర్వంగా చూపించారు ఆ బాలికలు. సక్కూబాయికి తల తిరిగినట్లయింది. ఇంటికి వెళ్లి తన గుడిసెలో కుదుటపడేంతవరకు ఎలాంటి ఆలోచన చేయలేదు సక్కూబాయి. తన చీర చెరగుని రెండు చేతులతో గట్టిగా అదిమిపట్టి "నేను చేసిన పని ఏంటి?" అనుకుంది ఆమె. "నా పిల్లని మ్లేచ్ఛులతోను, ద్వేషించే హిందూయేతరులతోను కలిసి చదవాలని కలలు కంటున్నానా. నా మనిషికి కోపం వస్తే? ఎలా సహించగలను? అతను సరస్వతిని కొడితే? లేదు, లేదు అలా జరిగితే వీధిలోకి పరుగెట్టి అందరూ చూసేలా ఏడ్చి గీపెడ్తాను" అనుకుంది ఆమె.

బలరాం ఇంటికి వచ్చాడు. సక్కూబాయి వణుకుతున్న కంఠంతో తను చేసిన పని చెప్పి భర్త పాదాలవంక చూస్తూండిపోయింది. బలరాం ఆమె దగ్గరకంటా వచ్చి మృదువుగా చుబుకం కింద చేతులు వుంచి పైకి ఎత్తి 'నువ్వు మంచి పని చేశావు' అంటూ "లోకులు ఇదే విషయం మీద రకరకాల వ్యాఖ్యానాలు చేస్తారు. కానీ మన సరస్వతికి అక్షర జ్ఞానం అబ్బుతుంది. వాళ్లు మనల్ని వేలెత్తి చూపిస్తారు. కానీ సరస్వతి మస్తిష్కంలోని అక్షరాలని తొలగించలేరు. నాకు తెలుసు, మన పిల్ల ఉర్దూ ఇంకా ఇతర దేశాలకు సంబంధించిన ఎన్నో విషయాలు నేర్చుకుంటుంది. మన పిల్ల మనల్ని అలక్ష్యం చేసినా, మర్చిపోయినా ఏం ఫరవాలేదు. మంచి జీవితం గడపడానికి దానికి ఇది ఒక మంచి అవకాశం, మనలా చెత్త జీవితం కాకుండా. సక్కూ ఏంటి ఏడుస్తున్నావా. ఏడవకు సక్కూ. మనం ధైర్యంగా వుండాలి. మనం ఎదుర్కోవాల్సిన గండాలు ఇంకా చాలా వుంటాయి. మనం పీర్ సాహెబ్‌కి కృతజ్ఞతలు చెప్పాలి. నాకు డబ్బులు వచ్చినప్పుడు మసీదుకి వెళ్లి కోడిపెట్ట నిచ్చుకుందాం" అన్నాడు.

మసీదు – దర్గా బలరాంకి, అతని మంచితనానికి మరో దేవాలయం లాంటిది; అది శూద్రుల దేవుడి ఆలయం. అక్కడ భక్తులు వాళ్లు తినే పదార్థాలనే దేవుడికి నివేదిస్తారు. అక్కడ ఎలాంటి దైవికమైన ఆహారపు ఏర్పాట్లు వుండవు. శూద్ర దేవుడికి ప్రీతికరమైంది చికెన్. నిస్సందేహంగా దర్గాలోని దేవుడు కోడిపెట్టతో సంతోషిస్తాడు. హిందూ దేవుళ్ళు బ్రాహ్మడు లేక శూద్రుడు లంచాల పట్టికతో వుండే ప్రభుత్వ గుమాస్తాలలాంటి

వాళ్లు. ఎంతగా సమర్పించుకుంటే అంతగా మొహం వికసిస్తుంది, ఎంత ఎక్కువగా ఇస్తే ఫైలు అంత వేగంగా కదులుతుంది. ఎంత ఎక్కవగా సమర్పించుకుంటే అంత వేగంగా సంతకమవుతుంది. ఒకవేళ అదృష్టం బాగుంటే జీవిత కాలమంతా మాఫీ అవుతుంది. భేదం ఒకటే. అదేమిటంటే ముఖ్యంగా బ్రాహ్మణ దేవుళ్లకి మాంసం అవసరంలేదు; వాళ్లు శూద్ర దేవుళ్లకంటే అధికంగా ఎంచుకుంటారు, చిన్న గుమాస్తాల్లా ప్రీతికరమైనవాటినే స్వీకరిస్తారు. ప్రార్థనలు ముఖ్యం కాదు: అవి వ్యవహార స్వరూపానికి మారువేషం వేసే అలంకారాలు మాత్రమే.

ఆ విధంగా బలరాం కుటుంబంలో ఓ సరికొత్త జీవితం ఆవిష్కరించబడింది. చూసే వాళ్లకి ఆ పిల్ల ఏ సందులోనో ఊడ్చి శుభ్రం చేయడానికి వెళ్తోందనుకోవాలన్నట్టుగా ప్రతి రోజూ  ఉదయం చంకలో చీపురు, చేతిలో పుస్తకాల సంచితో బయలుదేరుతుంది.

స్వీపర్స్ కాలనీ చివర చేతిలో చాదర్‌తో ఆ పిల్లని కలుస్తాడు హుస్సేన్. ఆ పిల్లపైన, చీపురుపైన చాదర్ అడ్డుగా వుంచి పుస్తకాల సంచీ తను పట్టుకుంటాడు. ఆ విధంగా ఇద్దరూ కలిసి అగ్రవర్ణాల ఇళ్లని దాటుకుని మసీదు సమీపంలోని ముస్లిం ప్రాంతానికి చేరుకుంటారు. సరస్వతి గంతులేసుకుంటూ జహనా బీ ఇంటి పరదాని జరిపి లోపలికి వెళ్తుంది. పీర్ సాహెబ్‌తో కలిసి హుస్సేన్ తన క్లాసు రూంకి వెళ్తాడు. మళ్లీ ఇంటికి తిరిగి వెళ్లేటప్పుడు ఈ విధంగానే చేస్తారు. సక్కూబాయి, బలరాంలలో కొంగ్రొత్త ఆలోచనలు చోటుచేసుకున్నాయి. ఆ పిల్ల తమ కోసం ఇతర దేశాల నుంచి డబ్బులు, కానుకలు తీసుకువస్తుందని అనుకుంటుంది సక్కూబాయి. అలాగే వాళ్లు తమ జీవితంలో ఉర్దూ మాట్లాడుకుంటున్నట్టుగా తలపోస్తారు. 'ముష్కిల్' ఉర్దూ పదం. నిరంతరం వాళ్లకి ఉర్దూ పదాలు ఎదురయ్యేవి. ఖూన్ 'రక్తం', కసూర్ 'నేరం' హాజత్ 'పోలీస్ లాకప్' దరోగా 'ఇన్‌స్పెక్టర్'. "చూడు ముసిలోడా? మనలని, మన జీవితాలని ఉర్దూ పరిపాలిస్తోంది. కానీ మనకి కనీసం 'సవాల్' తెలియదు 'జవాబ్' తప్ప" అంది సక్కూబాయి బలరాంతో.

కానీ ప్రశ్న జవాబు రెండూ తెలిసిన సక్కూబాయి ఆనందం స్వల్పకాలికమే. అందరి తల్లులులాగే ఆమె కూడా బాధపడసాగింది. ఆమె దృష్టిలో విషయ జ్ఞానం ఒక శక్తి కాదు. సుడిగాలి అగ్రకులాల వారి వంట ఇళ్లలోను, మరుగుదొడ్లలోను, గోశాలలోను దుమ్మూ దూగరా ఊడ్చివేసినట్టుగా తనేంటో తన పనేంటో మనుషుల దృష్టిలో పడకుండా వున్నంతకాలం వేధింపులు లేకుండా తాము జీవించగలమని సక్కూబాయికి తెలుసు. దెబ్బలుపడ్డ బడ్డ కుక్కే అరుస్తుంది.

సరస్వతి తన పని తను ధైర్యంగా, ప్రశాంతంగా చేసుకుంటోంది. చురుకైన పిల్ల. చాలా తెలివైంది. ఏది చెప్పినా ఇట్టే నేర్చుకునేది. క్లాసులో మిగతా ఆడపిల్లలకన్నా మెరుగ్గా వుంది. పిల్లలు చదివే ఖురాన్‌లోని మాటలకి అర్థాలు తెలుసు. ఒకరోజు స్కూల్ నుండి రాగానే తన కొంగు పట్టుకొని స్కూల్ విశేషాలు, ఆ మాటలు పొల్లుపోకుండా తనకి చెప్తుంటే సరస్వతి నోటి మీద వేలు పెట్టి ఊరుకోమన్నట్టు సూచించింది సక్కూబాయి. ఆ తర్వాత చదివినవాటి గురించి ఎన్నడూ చెప్పలేదు సరస్వతి. కడపటి క్లాసు పాస్ అవగానే సరస్వతికి మరింత బోధించవలసిందేమీలేదని జహనారా బీ ప్రకటించగానే పీర్ సాహెబ్ ఓ చిన్న గాజు పెండెంట్ సరస్వతికి బహుమతిగా ఇస్తూ 'నువ్వు ఈ ఎర్రటి చిన్న గాజుముక్కలా చాలా ప్రకాశం గలదానివి' అంటూ పీర్ సాహెబ్ 'నాకు తెలుసు. నువ్వు ఎల్లప్పుడు దీనిలాగే ప్రకాశిస్తావు' అన్నాడు.

ఇప్పుడు సరస్వతికి పదేళ్లు వచ్చాయి. తల్లికి వంటపనిలోను, పొలంపనిలోను తోడుగా వుంటోంది. హుస్సేన్ రెండు సంవత్సరాల ముందే చదువు ముగించి దగ్గర్లోని ఓ గ్రామంలో సైకిల్ మెకానిక్‌గా పని చేస్తున్నాడు. సైకిల్ షాపు చాలా పెద్దది. చాలా మందికి ఉపాధి కల్పిస్తోంది. హుస్సేన్‌కి ఇప్పుడు పన్నెండేళ్లు వచ్చాయి. సరస్వతి స్కూలు చదువు అయిపోయిన చివరి రోజు తను రిపేర్ చేసిన సైకిలు తిరిగి ఇచ్చేయడానికి తన ఊరికి పంపాల్సిందిగా యజమానితో చెప్పి బయలుదేరాడు హుస్సేన్. ఆ సైకిలు ఓ కసాయివాడిది. సైకిలు పెద్దది : సీటు ఎత్తుగా వుండటంతో చిన్నవాడైన హుస్సేన్ సీటుపైన కూర్చోలేకపోయాడు. శరీరాన్ని కొద్దిగా వంచి పెడల్సు, ఫ్రేం అడ్డకమ్మీల మధ్యలో గల త్రిభుజాకార ఖాళీలోంచి ఓ కాలితో పెడలు వేస్తూ రెండో కాలుని మరో పెడల్ మీద వేసి ఎత్తుగా వున్న సీటుపైన మోచేతిని ఆనించి మరో చేత్తో బలంగా హేండిల్ పట్టుకుని పెడల్స్ మీద అధిక భారం వేసి తొక్కసాగాడు. అప్పటికే కొంత ఆలస్యమైంది : మొత్తానికి స్కూలు నించి ఇంటికి వెళ్తున్నప్పుడు సరస్వతిని కలిశాడు. సరస్వతి చూపించిన అందమైన పెండెంట్‌ని చూసి సంతోషించాడు. ఆమెని సైకిలుపైన ఎక్కించుకుని ఆమె ఇంటివైపు తీసుకువెళ్తుండగా విస్మయంతో కూడిన ఆనందంతో సైకిలుపైన ఊగుతూ బిగ్గరగా అరిచింది సరస్వతి. ఆ తర్వాత ఇంటి గేటు వరకు ఆమెని తీసుకువెళ్ళి దింపి వెళ్లిపోయాడు, సైకిల్‌ని సొంతదారుకి అప్పగించి సూర్యాస్తమయంలోపల తిరిగి వచ్చేయాలన్న ఉద్దేశంతో.

సైకిళ్లు తీసుకువెళ్లే సమయంలోను మళ్లీ తిరిగి అప్పజెప్పే సమయంలోను ఇంకా తల్లి ఊడ్చే సమయంలోను తరచూ హుస్సేన్ సరస్వతి కలుసుకుంటుంటారు. తల్లి తన పనుల్లో హడావుడిగా వున్నప్పుడు సరస్వతిని యథాలాపంగా కలుస్తాడు హుస్సేన్. తను తిరిగి అప్పజెప్పాల్సిన సైకిలు ముందు సరస్వతిని కూర్చోబెట్టుకుని దూరంగా

పనిచేసుకుంటున్న తల్లి దగ్గరకి తీసుకువెళ్లి కిందికి దించుతాడు. రకరకాల సైకిళ్లు, వాటి నమూనాలు తెలుసుకునే స్థాయికి ఎదిగింది సరస్వతి – హీరో, బియస్ఏ, అపోలో, అట్లాస్ సైకిళ్లపైన వున్న అక్షరాలని చేతుల్తో తడిమి వాటి అర్థం ఏమిటా అని ఆశ్చర్యపోతారు వాళ్లు. అలా కొన్ని సంవత్సరాలు గడిచాయి. వాళ్లు బాగా పొడవయ్యారు. ఇప్పుడు పెద్ద పెద్ద బైకులు నడపడంలో ఎలాంటి ఇబ్బంది కలగటంలేదు హుస్సేన్‌కి.

హుస్సేన్ కష్టపడి పనిచేస్తాడు. సైకిళ్లు బాగు చెయ్యడంలో చెయ్యి తిరిగిన పనివానిగా పేరుంది. తన వర్క్‌షాపులో హుస్సేన్ నమ్మకంగా నిజాయితీగా పనిచేయడంవల్ల యజమానికి ప్రీతిపాత్రుడయ్యాడు.

సైకిళ్ల బట్వాడా కోసం ఓ కుర్రాడిని పెట్టుకున్నాడు షాపు ఓనరు. ఇప్పుడు స్వాధికారంతో షాపు ఓనర్ని ఏదైనా కోరవచ్చనుకున్నాడు హుస్సేన్. ప్రతిరోజూ సాయంత్రం ఏడుగంటలకల్లా పని ముగించుకుని ఇంటికి వెళ్ళేందుకు అనుమతించాల్సిందిగా ఓనర్‌ని అడగడం మొదలు పెట్టాడు. ఏదో కారణం చెబుతూ ఏడు గంటలకల్లా వదిలేయమని అడగడం మొదలుపెట్టాడు. అందుకు అయిష్టంగానే ఒప్పుకున్నాడు ఓనరు. దాంతో తన ఇంటికి సరస్వతి ఇంటి మీదుగా చుట్టూ తిరిగి వెళ్లాలని నిర్ణయించుకున్నాడు హుస్సేన్. అక్కడే వున్న కోనేరు దగ్గరకి ప్రతి రోజు సాయంత్రం సరస్వతి వస్తూంటుంది. అక్కడ వాళ్లిద్దరూ కలుసుకుని దగ్గర్లోనే వున్న తోటలలోకి, పొలాలలోకి వెళ్లి నీడ పట్టున పక్కపక్కన కూర్చుని మాట్లాడుకుంటారు. ఒక్కోసారి మసీదు పరిసరాలలో కలుసుకుంటారు. వాళ్లు అక్కడ కలిసి మాట్లాడుకోవడానికి కొందరు వ్యక్తులు వాళ్లకి ఏకాంతాన్ని కల్పించారు. పీర్ సాహెబ్ వాళ్ళని ఇబ్బందికర చూపులతో గమనించాడు. ఒకరోజు జాగ్రత్త అంటూ పీర్ సాహెబ్ హెచ్చరించాడు హుస్సేన్‌ని.

"ఎందుకని?" అన్నాడు హుస్సేన్.

"ప్రేమించుకోడానికి ఇది తగిన సమయం కాదు" అన్నాడు పీర్ సాహెబ్ తల అడ్డంగా ఊపుతూ.

హుస్సేన్ మొహం వివర్ణమైంది. వెంటనే సైకిలు ఎక్కి వెళ్లిపోయాడు.

ఒకరోజు కోనేరు దగ్గరకి సరస్వతి రాలేదు. పొలంలో చేను కోసేయడంతో సరస్వతి కోసం ఎక్కడ వేచి వుండాలో అర్థం కాలేదు హుస్సేన్‌కి. భారమైన హృదయంతో నడుస్తున్నాడు. మాటిమాటికి పీర్ సాహెబ్ మాటలు మదిలో మెదులుతున్నాయి. నడుస్తున్న వాడల్లా ఒక్కసారి వెనక్కి తొంగి చూశాడతను.

సరస్వతి ఇల్లు చీకటిగా వుంది; లోపల దీపంలేదు.

అతను ఇంటి చుట్టూ తిరిగాడు. వంట గదిలో మంద్రంగా కాంతి పరుచుకుని వుంది. అతను అటువైపు వెళ్లాడు. అక్కడ వున్న కంచె దగ్గర సన్నగా ఏడుపు వినిపించింది. సరస్వతి నేలపైన కూర్చుని వుంది. హుస్సేన్ ఆమె పక్కన మోకాళ్ల పైన కూర్చుని 'ఏమయింది' అంటూ గొణిగినట్టుగా అడిగాడు. ఆమె రెండు చేతులూ అతని మెడ చుట్టూ వేసి "ఎందుకు వచ్చావు? ఇంటికి వెళ్లిపోవాల్సింది" అంది. హుస్సేన్ భావోద్వేగంతో ఆమెని పట్టుకుని 'నేను వెళ్లలేను' అంటూ 'బాధగా వుందా? ఎందుకు ఏడుస్తున్నావు?' అన్నాడు హుస్సేన్. తన మెడ చుట్టూ వేసిన చేతులు విడిపిస్తూ.

'స్టుపిడ్!' అంటూ కస్సుమంది సరస్వతి. "స్టుపిడ్ బాయ్, నిన్ను ప్రేమించేలా ఎందుకు చేశావు? ఇప్పుడు ఏం చేద్దాం?' అంది.

"నువ్వేమంటున్నావో నాకు అర్థం కాలేదు."

"అది సీక్రెట్. నువ్వు ఇటువైపు రాకుండా వెళ్లిపోతావనుకున్నాను. అలా వెళ్లిపోయుంటే మనం స్నేహితులుగా వుండిపోయేవాళ్లం. కానీ మనం అలా కాదు అవునా? నువ్వు వెనక్కి వచ్చావు".

"అవును. నేను వచ్చాను" అన్నాడతను కించిత్తు కోపంగా.

"నువ్వు ఇబ్బందుల్లో వున్నా, నీకేమైనా అయినా నిన్ను వదల్ను. నాకు తోచినంతలో నీకు సాయపడదామనుకున్నా."

ఆ మాటలకి సరస్వతి బిగ్గరగా నవ్వుతూ తన రెండు చేతులూ అతని మెడ చుట్టూ వేసి కళ్లతోనే పలకరించింది.

"మనం పెళ్లి చేసుకుందాం" అన్నాడు హుస్సేన్.

"నీకేమైనా పిచ్చిపట్టిందా? ఆ భూస్వామి మా నాన్నని ఏం చేస్తాడో తెలుసా? ఇంకా ఊర్లో జనాలు : వాళ్లు మనల్ని శిక్షిస్తారు."

"అయితే ఎక్కడికైనా పారిపోదాం. ఏం జరిగిందో ఎవరికీ తెలియదు. ఎక్కడ ఉన్నామో కూడా తెలియకుండా మనం ఇక్కడ నుంచి దూరంగా సిటీకి వెళ్లిపోదాం. నాకు రిపేర్లు చేయడంవచ్చు. నీకూ కష్టపడ్డం అలవాటే. అదీగాక అందరికీ స్వీపర్స్ అవసరం వుంటుంది.

సరస్వతి నెమ్మదిగా తలవూపుతూ "అలా చేస్తే మా అమ్మానాన్నలు తట్టుకోలేరు. వాళ్లకి సమస్తం నేనే. నా కోసం వాళ్లు ఎంతగానో కష్టపడ్డారు. వాళ్లని వదిలిరాలేను" అంది.

"సరే అయితే" అంటూ హుస్సేన్ భుజాలని ఎగరేసి "మనం ఇక్కడే వుందాం. నువ్వు మీ అమ్మా నాన్నకి ఈ విషయం చెప్పు. నేను మా వాళ్లకి చెప్తాను. ఒకవేళ మీ వాళ్లు ఒప్పుకోకపోతే నాతో వచ్చేస్తానని ప్రామిస్ చేయి అన్నాడు.

"ప్రామిస్ చేస్తున్నా... అలాగే అంటూ సరస్వతి "కానీ వాళ్లకీ ఓ అవకాశం ఇవ్వాలి. ఆ మాత్రం బాధ్యత నాకుంది" అంది.

మర్నాడు ఉదయం ఇంట్లో పని పూర్తి కాగానే తల్లితోపాటు బయటకి వెళ్లింది సరస్వతి. గుడి పరిసరాలలో శుభ్రం చేస్తుండగా అక్కడ ఎవ్వరూ లేకపోవడం గమనించి నెమ్మదిగా కంగారు కంగారుగా హుస్సేన్ గురించి, సైకిళ్ల గురించి భవిష్యత్ ప్రణాళికని గురించి తల్లితో చెప్పింది సరస్వతి.

"ఆ ముస్లిం! అయ్యో! సరస్వతీ!"

"స్కూల్లో హుస్సేన్ నాకన్నా సీనియర్. మంచివాడు. మాటమీద నిలబడే మనిషి. మిగతా విషయాలేమీ తెలియవు. అతన్ని పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను" అంది సరస్వతి.

సక్కుబాయి అన్ని విషయాలని బలరాంకి చెప్పింది. అతను పొగాకుని చిన్న వుండలా చేసి కింది పెదవి కింద పెట్టుకుని "వాళ్లు పెళ్లి ఎలా చేసుకుంటారు? మన పెళ్లా, వాళ్ల పెళ్లా" అంటూ గుర్రుమన్నాడు.

ఆ పని చిక్కుతో కూడినట్లనిపించింది బలరాంకి. ముస్లిం వివాహ విధానమైన 'నిఖా' ఏర్పాటు చేయాలని మాత్రమే సూచించాడు హుస్సేన్ తండ్రి. వివాహం దయాళువైన పీర్ సాహెబ్ ఆధ్వర్యంలో నిరాడంబరంగా, క్లుప్తంగా జరిగింది. 'సరస్వతి' కాస్తా 'ముంతాజ్'గా మారింది. పెళ్లికి దగ్గరివాళ్ళు మాత్రమే హాజరయ్యారు. సరస్వతి తల్లిదండ్రులు, హుస్సేన్ తల్లిదండ్రులు, అతని ఇద్దరు తమ్ముళ్ళు, ఇద్దరు చెల్లెళ్లు. వాళ్లు సరస్వతిని ఆలింగనం చేసుకున్నారు. హుస్సేన్ చెల్లెలు సరస్వతికి బంతిపువ్వు ఇచ్చింది. వాళ్ల నుదుటిపైన ముద్దుపెట్టి ఆశీర్వదించాడు పీర్‌సాహెబ్. 'నా బెస్ట్ స్టూడెంట్స్' అంటూ గర్వంగా పలికాడు పీర్‌సాహెబ్. తన కొత్త పేరుతో సరస్వతి ప్రమాణపత్రంలో ఉర్దూలో అలవోకగా సంతకం చేయడం చూసి పీర్‌సాహెబ్ కళ్లు మెరిశాయి. తర్వాత పీర్‌సాహెబ్ ఇంట్లో చికెన్ బిర్యానీ, పంచదార రొట్టె బిళ్లలతో చిన్న విందు ఏర్పాటయింది.

కొత్త కుటుంబ సభ్యులతో తన ఇంటికి వెళ్లింది సరస్వతి, త్వరలోనే చూసేందుకు వస్తానని వృద్ధ తల్లిదండ్రులకి చెప్తూ.

మసీదు చదువు. వెంటనే మసీదు పెళ్లి. మసీదు పేరు. హిందూ సరస్వతి ముంతాజ్ బీ గా మారింది.

ఆ వేళ శుక్రవారం. ఎప్పటిలా మసీదులో ప్రార్థనలు చేసే రోజు. మసీదు గేటు దగ్గర చాలామంది జనం గుమిగూడి ఉన్నారు. అక్కడ నేల మీద హుస్సేన్ నగ్నంగా నెత్తుటి మడుగులో పడున్నాడు. దవడపళ్లు వూడిపోయి తలచుట్టూ చెల్లాచెదురుగా పడివున్నాయి. ఓ కన్ను ఊడి వేలాడుతోంది, ఒరలోంచి పేలిపోయినట్టుగా. నుజ్జునుజ్జయిన వక్షస్థలం మధ్యలో గుంతలా ఏర్పడింది, ఏదో బలమైన దాంతో బాదినట్లు. తొలగించిన అతని మర్మావయాలు పొట్టమీద వున్నాయి. ముస్లింలు ఆ శవాన్ని మౌనంగా చూసి వెళ్లిపోయారు. హుస్సేన్ తల్లిదండ్రులు ఇంట్లో మూర్ఛబోయారు. రోదన – చిన్న పిల్లాడి ఏడుపు, ఇంటిపై కప్పు దాటి పైకి వెళ్లాయి.

మసీదు ముందర ఎర్రని అక్షరాలతో ఒక బ్యానర్ వేలాడుతోంది, అసభ్యకర పదజాలంతో.

"ముందు తోలు తొలగించిన జననాంగం హిందూ యువతిని పెళ్లి చేసుకునే సాహసం చేస్తే ఇదే గతి పడుతుంది."

బలరాం ఇల్లు నిశ్శబ్దంగా వుంది. రోడ్డు వారగా నడుస్తూ వెళ్తున్న జనాలు సరిగ్గా మసీదు దగ్గరవున్న బ్యానర్‌లాంటిదే అక్కడా చూస్తున్నారు. దాని మీద ఈ విధంగా రాసి వుంది :

"ముంతాజ్ బీ వారంలోగా సరస్వతి కాకపోతే తన భర్తకి పట్టిన గతే ఆమెకీ పడ్తుంది."

దాని కింద ఎవరో గజిబిజిగా రాసిన రాతలు ఈ విధంగా కనిపించాయి.

"శూద్రుడు ఎవరైనా ప్రపంచంలో అక్షరాలు చదివితే వాడికి సరస్వతి అనబడే ముంతాజ్ బీ లాగా శిక్షపడుతుంది".

మరుసటి రోజు స్థానిక మరాఠీ పత్రికలు పతాక శీర్షికలుగా ఈ విధంగా ప్రచురించాయి :

"హిందూ యువతితో లేచిపోయిన ముస్లిం శవమై తేలాడు (చెలరేగిన మతకలహాలు)."

గ్రామాలలో చిన్న చిన్న కరపత్రాలున్నాయి. వాటిలో ఇలా రాసి వుంది :

"ఇండియాలోని ముస్లింలకి, శూద్రులకి, గిరిజనులకి హెచ్చరిక. అంతా మా నియంత్రణలోనే వుండాలి. ఎవరూ చదవడానికి వీల్లేదు. మతమార్పిడి ఉండకూడదు. సమానత్వం గురించి మాట్లాడకూడదు. మార్పు అసహజం. పైన అధికారంలో ఎవరు వున్నా కింద నియంత్రణాధికారమంతా మాదే. ఇది భగవదాజ్ఞ. వాళ్ల అవతారం వాళ్లు కోరుకున్న విధంగా వాళ్ల కిష్టమైన చోట. సంభవామి యుగే యుగే."

నాగర్‌పూర్ పాత నగరంలో జుమ్మా మసీదు అండర్ గ్రౌండ్‌లో ఉన్న స్టోరేజ్‌రూంలో సుమారు ఇరవై మంది వున్నారు. నగరంలోని విశిష్ట వ్యక్తి యూసుఫ్ అలీఖాన్ సమావేశానికి అధ్యక్షుడు. సంక్షోభ సమయంలో అందరూ ఎదురుచూసే వ్యక్తి ఆయన. వాళ్ల ముందున్న బల్ల వార్తా పత్రికలతోను, ఫిర్యాదులతోను నిండిపోయింది. అక్కడ వున్న మిగతావాళ్లు వాటి మీద వాలిపోయినట్టు మోచేతులు బల్లపైన ఆనించి చదువుతున్నారు. వాళ్ళు తలలు వేలాడేసి కూర్చున్నారు. ఏదో జటిలమైన సమస్యని పరిష్కరించేదిశలో వున్నట్టుగా. ఒక సమయంలో వాళ్లలో ఒకరు తలఎత్తి అన్నాడు, "ఖాన్ సాహెబ్ నాకు విషయం అర్థమైపోయింది." యూసుఫ్ అలీఖాన్ "చెప్పు ఫక్రుద్దీన్" అన్నాడు అతనివంక చూస్తూ.

ఇటీవల అలీగఢ్ ముస్లిం యూనివర్శిటీలో ఫక్రుద్దీన్ ఇస్లామిక్ స్టడీస్‌లో మాస్టర్స్ డిగ్రీ చేశాడు. మంచి ఉత్సాహం, ఉరకలెత్తే వయసు. కాస్త ఉద్వేగ స్వభావం. అతను అతిగా ఆతురపడతాడనిపించింది యూసుఫ్ అలీఖాన్‌కి. కానీ ఫక్రుద్దీన్ చాలా చురుకైనవాడు. ఈ తరహా పనిలో తెలివితేటలు అబ్బడం అంత తేలికకాదు.

ఫక్రుద్దీన్ దీర్ఘంగా ఊపిరి తీసుకుని అన్నాడు. "అసలు ఇదంతా నిమ్న జాతికి చెందిన పిల్లని హిందువుల స్కూల్లో చేర్చుకోకపోవడంవల్ల జరిగింది. తల్లిదండ్రులు ఆ పిల్లని ఆడపిల్లల మదర్సాలో చేర్చారు. అక్కడ ఆ పిల్ల హుస్సేన్‌ని కలవటం జరిగింది. వాళ్లు స్నేహితులయ్యారు. తరచూ కలుసుకోసాగారు. చివరికి ప్రేమలో పడ్డారు. తల్లిదండ్రుల అనుమతితో పెళ్లి చేసుకున్నారు." వెంటనే ఫక్రుద్దీన్ తనకుతాను వీపుమీద చరుచుకున్న భావన కల్గింది. 'ప్రేమలో పడ్డారు' అన్న అపవిత్ర పదాల గురించి తొట్రు పడలేదు. అతను తన నాయకుడు కోరుకున్నట్టుగా నిష్పాక్షికంగా వివేకవంతంగా బుద్ధిశాలిగా వుంటాడు.

"అతని మర్మావయవాలని వేరుచేసి పొట్టమీద ఎందుకు ఉంచినట్టు?" అడిగాడు పదిహేడేళ్ల వయసున్న షేక్ అసద్ ఎర్రబడ్డ కళ్లతో. ఫక్రుద్దీన్ అతని వంక జాలిగా చూశాడు. షేక్ అసద్‌కన్నా హుస్సేన్ ఒక సంవత్సరం పెద్ద.

"హిందువులు శుద్ధి పొందలేదు" అన్నాడు ముందు తోలు తొలగించే ఉర్దూ పదాన్ని ఉపయోగిస్తూ. ఆ విధంగా వాళ్లు పవిత్రీకరణకు చిహ్నం కోసం అదేపనిగా ఆలోచిస్తుంటారు.

అది నీకు ఈ వయసులో అర్థంకాదు.

"ఫరవాలేదు, చెప్పండి" అంటూ హమ్‌జా మహ్మద్ "ఆ కుక్కలు ఏం చేశాయో అతనికి తెలియాలి" అన్నాడు.

ఫక్రుద్దీన్ అతని వంక చూస్తూ "హమ్ జా మహ్మద్ ఆ విషయం గురించి తర్వాత చర్చిద్దాం, కానీ షేక్ అసద్ హిందూ పురుషులు స్త్రీలకి దాసులన్న విషయం నీకు తెలుసా. వాళ్ల మహిళలు సిగ్గూ ఎగ్గూ లేకుండా రోడ్లపైన నగ్నంగా సంచరిస్తారు. హిందూ స్త్రీల జుట్టు, పొట్టలు, కాళ్లూ చేతులూ విపరీతమైన శక్తిగలవి. పురుషులు గనక క్రమశిక్షణ లేని, నిర్వహణ సామర్థ్యంలేని మహిళలతో అధిక సమయం గడిపినట్లయితే వాళ్లు వాళ్లకి కీలుబొమ్మలుగా మార్తారు. శుద్ధి కాని పురుషులు మిక్కిలి చెడ్డవాళ్లు. అందుకనే వాళ్లు మన మహిళల మీద మనకున్న అధికారం చూసి అసూయపడ్తారు" అన్నాడు.

"అవును" అన్నాడు వృద్ధుడయిన షహరియార్. "హిందూ పురుషులు అంగాలు కలిగిన మహిళల్లాంటివాళ్లు. హిందూ ప్రౌఢ యువతులు మనల్ని పెళ్లి చేసుకోవాలను కుంటారని నువ్వు ఎందుకు ఆలోచిస్తావు?" అంటూ ఆ వృద్ధుడు మొరటుగా నవ్వుతూ తలమీంచి టోపీ తీసి బుర్రగోక్కున్నాడు.

ఫక్రుద్దీన్ అతనివంక ఉరిమి చూశాడు.

యూసఫ్ అలీ వాస్తవం అనేది నిజాయితీగా వుండాలన్న ఉద్దేశంతో "బలవంత మార్పిడి ఉందా?" అంటూ "ఈ విషయం నిర్ధారించే ముందు మనం వాస్తవం తెలుసుకోవాలి" అన్నాడు.

"లేదు" అన్నాడు ఫక్రుద్దీన్. హిందూ వార్తాపత్రికలు కూడా దీన్ని ఉటంకించాయి. అమ్మాయి, ఆమె తల్లిదండ్రులు పెళ్లికి అంగీకరించారు. సిద్ధాంతాల గురించి వాదించే సాహసానికి ఒడిగట్టే జహంగీర్‌పూర్‌లోని తెలివిమాలిన మూర్ఖుడు పీర్‌సాహెబ్ పెళ్లి జరిపించాడు. మాస్టర్, నీకు గుర్తుందా? ఆమె తన పేరుని ముంతాజ్‌బీగా మార్చుకోవడానికి ఒప్పుకుంది. ఆమెగాని, ఆమె తల్లిదండ్రులుగాని ఇప్పుడు ఎక్కడ వున్నారో తెలియదు."

"హుస్సేన్, నీకు పూర్తి నమ్మకముందా, ఆ కుర్రాడు, అతని తల్లిదండ్రులు తెలియక తప్పు చేశారని? పెళ్లి నాటికి ఆమె గర్భవతా?"

"ఆ విషయం తెలియదుకాని పెళ్లి మాత్రం సంవత్సరం క్రితం జరిగింది. పిల్లల ప్రస్తావన లేదు కాబట్టి బహుశా కాకపోవచ్చు."

యూసుఫ్ ఆలీఖాన్ పెదవి కర్చుకున్నాడు. "మంచిది, మనం దీన్ని అవకాశంగా వాడుకోవచ్చు ఫక్రుద్దీన్. మన కరపత్రం నమూనా తీసుకువెళ్లి జహంగీర్‌పూర్‌లోని సంఘటనల్ని ప్రతిబింబించేలా సవరించి తీసుకురా. ఐదువేలు అచ్చు వేయించు. షేక్ అసద్, వెనకాల స్టోర్ రూంలోకి వెళ్లి ఏభై తల్వార్లు, ఇరవై కత్తులు తీసుకురా. సాయంత్రం ప్రార్థన అయిన వెంటనే వాటిని మనవాళ్లకి పంచు. వీలైనంత రక్తం చిందించు. సాధ్యమైనన్ని తలకాయల్ని లేపెయ్. కానీ మానభంగాలు, పురుషుల మర్మావయవాలని వేరు చేయడంలాంటివి వుండకూడదు. అల్లాహ్ కానీ, ఖురాన్ కాని అలాంటివాటిని అనుమతించవు.

ఉద్రేకంతో ఒళ్లు జలదరించింది ఫక్రుద్దీన్‌కి. షేక్ అసద్ కళ్లలోని భావాలని అర్థం చేసుకున్నాడతను. షేక్ అసద్ రక్తం ఉద్వేగంతో పరుగులెత్తుతోంది. యూసుఫ్ అలీఖాన్ మృదువుగా అన్నాడు, "అల్లాహ్‌కి చెందిన ఈ భూమి నించి ఇస్లాంని పారద్రోలాలనుకుంటున్నారు వాళ్లు. మిగతా ప్రపంచాన్ని సృష్టించినట్లే అల్లాహ్ ఈ రాజ్యాన్ని కూడా సృష్టించాడు. ఈ దేశం అల్లాహ్‌కి చెందినది. అన్నీ అతనివే. జాతి, కులం, మతానికి సంబంధించి ఎలాంటి రాజ్యం లేదు. ప్రతీ ముక్క అల్లాహ్‌దే. ముస్లింలు అల్లాహ్ మనుషులు. ఈ హిందువులు కఫిర్‌లు (ముస్లిమేతర వ్యక్తులు). మీరు భగవంతుని చేతులు. మీరు వాస్తవాన్ని వాళ్లకి తెలియజేస్తారు.

ఈలోగా కుర్తా, పైజమాలు ధరించి తలపైన టోపీలతో ఇద్దరు విద్యార్థులు టేబుల్ మీదున్న వార్తాపత్రికలు తీసేసి దానిమీద తెల్లటి టేబుల్ క్లాత్ పరచి మూడురకాల బిర్యానీలు : బీఫ్, చికెన్, మటన్ ఏర్పాటుచేశారు. ఫక్రుదీన్ మినహా తక్కిన వాళ్లంతా తలొక ప్లేటు తీసుకుని కావాల్సిన పదార్థాలని వీలైనంత ఎక్కువగా చేతులతో తీసుకున్నారు. పదార్థాలని వాళ్లంతట వాళ్లే ప్లేటులో నింపుకోవడం చూసి ఫక్రుదీన్ చిరాకుపడ్డాడు. అన్నిటిలోకి బీఫ్ బిర్యానీ బాగుంటుందన్నాడు. ఆ డిష్‌లతోపాటు ఆనియన్ సలాడ్, పెరుగువంటి పదార్థాలు కూడా ఉన్నాయి.

అక్కడంతా క్లీన్ చేయడానికి పిల్లలు వచ్చారు. యూసుఫ్ అలీఖాన్ కుటుంబం కోసం వంట చేసే పురుషులు భోజనం తయారుచేశారు. మసీదు పరిసరాలలోగాని మైదానంలోగాని ఒక్క మహిళా లేదు. యూసుఫ్ అలీఖాన్ చివరగా ఓ పెద్ద ముక్క నోట్లో పెట్టుకుంటూ "మనం ఒకే ప్లేట్లో తింటాం, ఒకే రక్తంలా జీవిస్తాం" అని ప్లేటుని ఓ కుర్రాడి చేతికి ఇచ్చాడు. భోజనానంతరం బ్రెడ్ ఇంకా జీడిపప్పుతో తయారైన 'షాహీతుకడా' స్ట్రాంగ్ టీతో పాటు వున్నాయి.

"గడ్డి తినే హిందువులు ఒక చోట కూర్చోవడం గాని, కలిసికట్టుగా తినడంగాని చేయరు. కానీ మనల్ని చంపాలనుకుంటే మాత్రం ఏకమవుతారు. మన ప్రతాపం ఏంటో వాళ్లకి చూపించాలి" అంటూ గుర్రుమన్నాడు హమ్‌జా మహ్మద్.

సమావేశం ముగిసింది. సన్నద్ధం కావడానికి కొందరు, ఫలితాలు తెలుసుకునేందుకు వార్తలు చూసేందుకు కొందరు ఇలా ఎవరిదారిన వాళ్లు వెళ్లిపోయారు.

ఆ రోజు శుక్రవారం. మధ్య భారతంలో శుక్రవారం మార్కెట్ రోజు. నాగర్‌పూర్‌లో వారాంతపు మార్కెట్ జనంతో కిటకిటలాడుతుంది. చుట్టుపక్కల గ్రామాల నుంచి వందల కొద్దీ జనం పెద్దఎత్తున తరలివస్తారు. కూరగాయలు, బట్టలు, ధాన్యం, పశువులు, గొర్రెలు, మేకలు ఒకటిగాదు, సమస్తం ఆ వారాంతపు మార్కెట్‌లో అమ్మకానికి వుంచుతారు. సమాచారం ఇచ్చి పుచ్చుకుంటారు. ప్రజల వినోదార్థం మైదానంలో సంచార ప్రదర్శకుల ప్రదర్శనలుంటాయి. ఆ రోజు మార్కెట్ కిటకిటలాడుతుంది. జనాలు నడవడం కూడా గగనమే. పిల్లలు, మహిళలు చేసే ధ్వనులతో వాతావరణం నిండిపోతుంది. మార్కెట్ మొత్తం ధూళి పరదా కప్పినట్లుంటుంది. మొహాలు కూడా కనబడనంత దట్టంగా వుంటుంది ఆ ధూళి.

పశువులని తీసుకువచ్చే వ్యాపారులు, జనాలు, నోరుతెరవడం మాట్లాడ్డం కష్టమవడంతో చేతులతో సైగలు చేసుకుంటారు. ఎవరైనా మాట్లాడాలనుకుంటే ముక్కు దగ్గర, నోటి దగ్గర టవల్ అడ్డుపెట్టుకుని మాట్లాడాల్సి వస్తుంది. ఆ కోలాహలంలో ఎవరేమంటున్నారో తెలియడం లేదు.

కేకలు, పెద్దపెట్టున శబ్దాలు... హాహాకారాలు. అకస్మాత్తుగా అక్కడ చుట్టూ ఒకటే అరుపులు, గోల... తోపులాట.

జనాలు ఒక్కసారిగా భయభ్రాంతులకు గురయ్యారు. ఊపిరాడక పరుగెత్తుతున్నారు. బాధల రోదనలు, ఆక్రందనలు, పశువుల అరుపులు. దుప్పటిలోంచి కత్తులు దూసుకువచ్చినట్లు వచ్చాయి. ఆవులు, గేదెలు, కుక్కలూ విలవిలా తన్నుకుంటూ

చనిపోతున్నాయి... చంపుతున్నారు... చంపుతున్నారు... పరిగెత్తండి... పరిగెత్తండి... దేవుడా రక్షించు... రక్షించు... రక్షించు. ఒకరినొకరు చంపుకోవడాలు. ఎవరు చంపుతున్నారో, ఎందుకు చంపుతున్నారో అర్థం కావడంలేదు. ఒక్క గంటలో మార్కెట్ అంతా ఖాళీ అయిపోయింది. అక్కడ రేగిన దుమ్ము – ధూళి ఎర్రగా మారింది. ఎటువైపు చూసినా భయానక దృశ్యాలే.

కొద్దిసేపటికి పోలీసులు బ్రిటిష్ అధికారులతో జీపుల్లో చేరుకున్నారు. మార్కెట్లోను, రోడ్డుపైన, బయట ఎవరూ కనిపించకూడదంటూ బిగ్గరగా ప్రకటనలు చేశారు. నాగర్‌పూర్ అంతటా కర్ఫ్యూ విధించారు. కనిపిస్తే కాల్చివేత ఉత్తర్వులున్నాయి. సాయంత్రానికల్లా గ్రామంలో వదంతులు వ్యాపించాయి. ముస్లింలు హిందువుల్ని చంపేశారని, ఎంతమందో తెలియదని, ఇంకా చాలామందిని చంపడానికి ముస్లింలు వ్యూహాలు పన్నారని కథలు కథలుగా చెప్పుకున్నారు.

మరుసటిరోజు స్థానిక వార్తా పేపర్లలో వార్త వచ్చింది. 'మార్కెట్‌లో జరిగిన అల్లర్లలో పదిమంది మరణించారు. ఇరవై మందిని అరెస్టు చేశారు.' మార్కెట్‌లో అరాచకం సృష్టించినవాళ్ళు కరపత్రాలు జారవిడిచారు. అందులో 'తలకి తల... ఒక పురుషాంగానికి రెండు తలలు' అని రాసి వుంది. ఏ వర్గం వారు ఎవరిని చంపారో పత్రికలలో రాయలేదు. వాళ్ల మౌనమే వదంతులు వ్యాపించడానికి కారణమయ్యాయి. ముస్లింలు హిందువుల్ని హతమార్చారు. ఇంకా చాలా మందిని చంపుతారు.

చనిపోయిన ఆ హిందువులెవరు? ఈ ప్రశ్న ఎవరూ అడగలేదు. ఎందుకంటే ఇక ప్రజలు ఏమాత్రం ప్రజలు కారు. వాళ్లు చిహ్నంగా మాత్రమే మిగిలిపోయారు. వాళ్లు పశువుల కాపర్లు, కూరగాయల వ్యాపారులు, కార్పెంటర్లు, చెప్పులు కుట్టేవాళ్లు, స్వీపర్లు, తాపీ మేస్త్రీలు. ఈ హిందువులు ఎవరు? నగరాల్లోని నిమ్న జాతులు వుండే ప్రాంతాల్లోను, గ్రామాలలోను ఎవరు హిందువు ఎవరు ముస్లిం అన్నదానికి అంతగా ప్రాముఖ్యత ఏముంది? పేదరికమే వాళ్ల మతం. పేదరికం, కుంగుబాటు, అతి తక్కువకి ఎక్కువ కష్టపడి పనిచేయడం, అంటురోగాలు, అనిశ్చితి, చట్టుబండలయిన కోరికలు, సుఖాన్ని వంచించే వ్యసనాలు ఇంకా దగాచేసే వినోదాలు. అక్కడ ఆచారం లేదు, ఆహారం లేదు. అగ్రకులాలు నిమ్నకులాలతో పంచుకునే మతపరమైన వ్యవధిలేదు.

'మహర్' కులస్థుడైన జొగాండే పొరుగున వున్న మధుతో జరిగిన సంఘటనల్ని గురించి చర్చిస్తున్నాడు. 'ముస్లింలు చంపాలనుకుంటున్న ఆ హిందువులెవరు?' అడిగాడు జొగాండే.

'బార్‌జీలు, సేర్‌జీలు – పురోహితులు, వ్యాపారులు' అన్నాడు మధు.

"మార్కెట్‌లో మరణించింది శూద్రులు, మనవాళ్లు అని విన్నాను. మరణించిన వాళ్లలో బ్రాహ్మణుడు గాని, బనియాగాని లేరని విన్నాను. బార్‌జీలు, సేర్‌జీలు వారాంతపు మార్కెట్‌కి ఎందుకువెళ్తారు? వాళ్లు ప్రతీది ధనవంతుల మార్కెట్లో కొంటారు. ఆ వారంతపు మార్కెట్లు మన వాళ్లవి, కింది తరగతికి చెందిన నిమ్నకులస్తులవి, పేదవాళ్లవి" అన్నాడు జొగాండే.

"వాళ్లు ఒక్కళ్లనొకళ్లు చంపుకుంటారా" అన్నాడు మధు. జొగాండేతో ఏకీభవిస్తూ చిన్నబుచ్చుకున్న ముఖంతో.

వాళ్లు నిష్క్రమించారు. తిలక్‌లాగాను, యూసఫ్ అలీఖాన్‌లాగానూ లేకుండా, వారు వెనక్కి తిరిగితే కనిపించేది పేరు ప్రతిష్టల్లేని, ఇంకా అప్పుడప్పుడు తిండిలేమివల్లనూ కలిగే విరక్తి.

ఆ రోజు ఆదివారం. క్రిస్టియన్‌లకి పవిత్రమైన రోజు. తిలక్ ఇంట్లో రహస్య సమావేశం జరుగుతోంది. ఈసారి సమావేశానికి ఓ కొత్త సభ్యుడు హాజరయ్యాడు. అతను జహంగీర్‌పూర్‌కి చెందిన భూస్వామి దేశ్‌ముఖ్. 'సర్కార్' బదులు అతను అక్కడవున్నాడు. మరో సభ్యుడు దండేకర్ హాజరవ్వలేదు. అతని గైర్హాజరీ గురించి చర్చించడానికే ఈ సమావేశం ఏర్పాటయింది.

"అతన్ని ఎప్పుడు అరెస్టు చేశారు?" అడిగాడు తిలక్ ఘనీభవించిన మంచుకన్నా చల్లదనంతో.

"నిన్నరాత్రి" అన్నాడు దేశ్‌పాండే సమాధానంగా.

"బ్రిటిష్ అధికారులకి భారతీయ సాంప్రదాయక న్యాయం తెలియదు. ఓ బ్రాహ్మణ యువకుణ్ణి, అందులోనూ ఆక్స్‌ఫర్డ్ గ్రాడ్యుయేట్ అయిన భావిభారత నాయకుడిని ఎలా అరెస్టు చేస్తారు?" అని మళ్లీ అంటూ తిలక్ "వాళ్లు అతడ్ని అర్ధరాత్రి ఓ క్రిమినల్‌లా ఎలా తీసుకుపోతారు?" అన్నాడు.

అందరూ మౌనంలో పడ్డారు. భరతఖండంలో ఓ బ్రాహ్మణుడు జైలుకి వెళ్లిన దుష్కృత్యం పట్ల ప్రతి ఒక్కరూ మౌనంగా వుండిపోయారు.

"అతనికి బ్రాహ్మణుడు వండిన భోజనం పెడ్తున్నారా?" అడిగాడు తిలక్, దేశ్‌ముఖ్ వంక చూస్తూ.

"అందుకు మాకు అనుమతి లభించింది. వాళ్లు అతనికి ప్రత్యేక అనుమతి ఇచ్చారు. దాని గురించి వాకబు చేయడానికి నా మనుషుల్ని పంపించాను" అన్నాడు దేశ్‌ముఖ్.

"మనల్ని గురించిన విషయాలేవీ బైటకి పొక్కకుండా చూశావా?" అడిగాడు తిలక్ మరోసారి దేశ్‌ముఖ్ వైపు చూస్తూ.

దేశ్‌ముఖ్ తలూపాడు. కుర్చీ చేతులపైన ఆనించిన తిలక్ చేతులు వణికాయి.

"ఆ యువకుడు ఒట్టి మూర్ఖుడు. ఆ గొడవల్లో తలదూర్చవద్దని చెప్పాను. నీ మనుషుల్ని జాగ్రత్తగా మసలుకోమని చెప్పాల్సింది అతను. కొట్లాటలు జరిగిన చోటుకి అతను వెళ్లకుండా వుండాల్సింది."

"నేను అతడ్ని హెచ్చరించాను కూడా" అన్నాడు దేశ్‌ముఖ్.

"తన చేతులని ముస్లిం మైలతో మలినం చేసుకోవద్దని అతనికి చెప్పాను."

తిలక్ ఇబ్బందిగా కదిలాడు.

"ఆ బ్రిటిషర్స్ దగ్గర సాక్ష్యం ఏం వుంది?"

"చాలా తక్కువనే చెప్పాలి. వాళ్లు సంఘటనాస్థలికి వచ్చేసరికి అంతా అయిపోయింది. బ్యానర్లు కూడా లేవు. దండేకర్ దుస్తులపై రక్తపు మరకలు లేవు. మన పాంప్లెట్ ఒకటి అతని చేతిలో వుంది.

"అతను.. అతను బ్రిటిష్ అధికారి ముందు ధైర్యం కోల్పోయాడు. ఒక్కసారిగా కరుణించమని లొంగిపోయాడు."

"ఎందుకని.. చెప్పాడా?"

"తను హంతకుడని, చాలా హత్యలు చేశాడని అన్నాడతను."

తిలక్ వేగంగా ఊపిరితీస్తున్నాడు. "ఈ బ్రిటిషర్లు తమ తెలివితేటలతో అతని మెదడుని పాడుచేశారు. క్రూసేడ్ అంటే ఏంటో వాళ్లు మర్చిపోయారు. అప్పుడు ఏం జరిగింది?"

"వాళ్లు అతనితోపాటు నా మనుషులని కూడా తీసుకుపోయారు. వాళ్లంతా తన సేవకులని, అమాయకులని, వాళ్లని విడిచిపెట్టవలసిందిగా దండేకర్ ఆ అధికారి

ముందు ప్రాధేయపడ్డాడు. అప్పుడు ఆ అధికారి వాళ్లందరి పేర్లు నోట్ చేసుకుని విడిచిపెట్టాడు. వాళ్లు అక్కణ్ణించి తిన్నగా నా దగ్గరకి వచ్చారు; ఆ విధంగా నాకీ విషయాలన్నీ తెలిశాయి."

"అయితే ఇప్పుడు వాళ్లు అతన్ని ఇంటరాగేట్ చేస్తున్నారన్న మాట?"

దేశ్‌ముఖ్ మొహం కళావిహీనమైంది. "అవును జహంగీర్‌పూర్ పోలీస్ స్టేషన్‌లో అనుకుంటాను."

పుండరీక దేశాయ్‌కి ఊపిరి ఆగినంత పనయ్యింది.

"మరి నువ్వు అడ్డుపడలేదా?" అడిగాడు తిలక్.

దేశ్‌ముఖ్ ఓ క్షణం ఆగి అన్నాడు, నాకు తెలియదు అతను ఏం చెప్పాడో. ఒకవేళ అతను మీ పేరుగాని, గురూజీ పేరుగాని, మనవాళ్ల పేర్లు గాని బయటపెడితే జాలి చూపడం కూడా బహుశా ప్రమాదమేమో!

అతను చివరి మాటలు మింగేయటంతో అక్కడ కొన్ని క్షణాలు మౌనం రాజ్యమేలింది.

"మనం ఎంతవరకు కాదనగలం?" అంటూ ఇందిరేష్ వణుకుతున్న కంఠంతో "అతనికి ఎవరెవరి పేర్లు తెలుసు?" అన్నాడు.

"భయపడడానికి ఇది సమయం కాదు" అంటూ బిగ్గరగా అరిచాడు తిలక్ అందరూ ఉలిక్కిపడేలా. వాళ్లు చూస్తూండగానే తిలక్ నెమ్మదిగా లేచి "నేను ఆ బ్రిటిష్ అధికారిని చూడటానికి వెళ్తున్నాను. దేశ్‌ముఖ్, ఆ గ్రామంలోని నరకద్వారానికి వెళ్లడానికి వాహనం ఏర్పాటుచెయ్యి" అన్నాడు.

"రేప్పొద్దున అతన్ని నాగర్‌పూర్ తీసుకురావడానికి వాళ్లు వెళ్తారు. బ్రిటిష్ చట్టం ప్రకారం వాళ్లు అతడిని కోర్టులో ప్రవేశపెట్టవలసి వుంటుంది, నిందారోపణ చేయడానికిగాని, విడిచి పెట్టడానికిగాని."

"సరే మంచిది. అయితే నేను రెడీ అవ్వాలి. జాగ్రత్తగా విను. నేను లేని సమయంలో నువ్వు చెయ్యవలసిన పని ఇది."

ఈ రోజు మంగళవారం. హిందువులు ఉపవాసం ఉండే రోజు. పండగ సీజన్ కావడంతో వినాయకుడి గుడి కోలాహలంగా ఉంటుంది.

ప్రజలు పెద్ద సంఖ్యలో ఆలయాన్ని సందర్శిస్తారు. కొబ్బరికాయలు, బట్టలు, భక్తితో తలనీలాలు సమర్పించుకోవడం, ఆహారం, డబ్బు సమర్పించుకోవడం లాంటివి చేస్తుంటారు భక్తులు. భక్తులు సమర్పించుకునేవాటి విలువ సుమారు పదివేల రూపాయల దాకా వుంటుంది. పురోహితునితో కూర్చుని పుస్తకాలు తిరగేస్తున్నాడు తిలక్. కొద్దిగా అసహనంతో వున్నాడతను. చికాకు పుట్టించే ఇలాంటి చిన్న చిన్న విషయాలు తొలగిపోతేగాని ఈ సమావేశపు ప్రధానాంశాలు చర్చకు రావు. అతను ఓ యువకుడ్ని సైకిలు మీద వెళ్లి పురోహితులందరిని రమ్మనమని పురమాయించడంతో చుట్టుపక్కల వున్న గుడిపూజారులంతా అక్కడ వున్నారు. ఆ రోజుల్లో పురోహితుల కుటుంబాలలో కొందరికే సైకిళ్లుండేవి; పిల్లలు ఆ అసాధారణ యంత్రం దగ్గర గుమిగూడారు. సమావేశం చాలా ముఖ్యమైనది.

సమయం రాత్రి పదిగంటలు. తిలక్ ఒక్కడికే రిస్ట్‌వాచీ వుంది, ఏకైక అరుదైన వస్తువు. అంతా ఉపవాస దీక్ష విరమించి ఆధ్యాత్మిక విందు ఆరగించడానికి కూర్చున్నారు. మంత్రోచ్ఛారణ ఎంత వేగంగా వుందంటే 'మూడో చెవి' కూడా ఉన్నవాడే వాటిని గ్రహించగలడు. ముస్లిం దేవుడయినా, క్రిస్టియన్ దేవుడయినా ఆ జెట్ స్పీడ్ శ్లోకాలతో ఏమీ చేయలేడు. భోజనాలు వడ్డించేముందు అక్కడ నీళ్లు చిలకరించి శుద్ధిగావించారు. ఎందుకంటే దైవ దర్శనం కోసం మలిన శూద్రులు చాలామంది వచ్చారు. వాళ్ల అడుగులకి గుడి మైలపడి వుండొచ్చు.

"ఇక్కడకి శూద్రుల్ని అనుమతించకూడదు. మలిన జీవులు" అంటూ గొణిగాడు పురోహితుడు.

పురోహితుడు అన్నది తనకు వినబడనట్లు నటించాడు తిలక్. గొణిగిన పూజారి శాంతించాడు. గత ఎంతోకాలంగా తిలక్‌కి ఈ గుడితో అనుబంధం వుంది, శూద్రుల్ని అనుమతించే విషయంలోను, పండుగ పబ్బాలొచ్చినప్పుడు వాళ్లని చేర్చుకునే విషయంలోను గుడిలో వాళ్లకి కూడా స్థానం కల్పించాలన్న ఉద్దేశంతో. కొందరు బ్రాహ్మణులు సణిగారు. కానీ వాళ్లు త్యాగం చేయడానికి సిద్ధం కావాలని తిలక్ ఈ రాత్రి వాళ్లకి చెప్పదల్చుకున్నాడు. ఈ రాత్రి మళ్లీ అదే విషయం చర్చించాలి.

భోజనం చేసిన తర్వాత తిలక్ దృష్టి గణేశ్‌పైన పడింది. గణేశ్ హిందూ ఉపగణంలోకి కొత్తగా ప్రవేశించాడని, వర్తకులకి, వ్యాపారస్తులకి అకస్మాత్తుగా కలిమి ఔన్నత్యం కల్పించిన దేవుడని కొందరు నాస్తిక పండితులు సమర్థిస్తారు. అది అర్థంలేనిది. గణేశ్ ఆహారపుష్టి, కండపుష్టి గల దేవుడు. ఆర్జనోపాయ దేవుడు. విఘ్నాలని తొలగించే

దేవుడు. గణేశ్ నిమ్నవర్గాలకి సాయపడేలా కొన్ని సంవత్సరాల పాటు తిలక్, అతని సోదరులు కృషి చేశారు. ఇప్పుడు గ్రామాలలోని శూద్రులు గణేశ్ పండుగ తమ విమోచన దినంగా జరుపుకుంటారు. 'గణపతి' అనేది మధ్యయుగాలలోని భారతీయ సామ్రాజ్యాల కంటే ముందున్న తెగల నాయకులైన రాజ్యాధిపతులకివ్వబడ్డ ఒక బిరుదు.

ఆ రాజ్యాధిపతులు శూద్ర బానిసలనే ఉంచుకున్నారు. గణేశ్ వాళ్ళకి స్వేచ్ఛని ప్రసాదించిన దేవుడు; గణేశ్ వాళ్లకి విముక్తి కలిగించినవాడు; గణేశ్ ఇంకా ప్రథమ సార్వభౌముల సామ్రాజ్యసేనలు. అందుకని తిలక్ వాళ్లకి బోధించాడు. మేము మిమ్మల్ని గత భయంకర బానిసత్వం నించి విముక్తిగావించడాన్ని ఈ పండుగ గుర్తు చేస్తుంది. ఇప్పుడు మీరు హిందువులు. బానిసలు కారు. ఈ విషయంలో గణేశ్ మిమ్మల్ని అనుగ్రహిస్తాడు."

ఇది తొమ్మిది రోజుల పండుగ. మొదటి రోజు గణేశ్ విగ్రహాన్ని మండపంలో ప్రతిష్ఠిస్తారు. తొమ్మిదో రోజు గణేశ్ విగ్రహాన్ని నీటిలో నిమజ్జనం చేస్తారు. ఈ తొమ్మిది రోజులూ పెద్ద ఎత్తున దానాలు సమర్పిస్తారు. పండగ పోకిరీల ఊరేగింపులో సాగి నదిలో గాని చెరువులోగాని గణేశ్ నిమజ్జనంతో పూర్తవుతుంది. నిమజ్జనం మరుసటి రోజు చెరువులు తటాకాలు చచ్చిన చేపలతో, నానిపోయిన గడ్డిపోచల కుప్పలతో, బురదతో, కసవుతో నిండిపోతాయి. పూజలు బహిరంగ ప్రదేశాలలో పందిర్లలో ప్రత్యేకంగా నిర్మించిన మండపాలలో జరుగుతాయి. ఏ దేవాలయం కూడా అపవిత్రం చేయబడలేదు. అది హిందూమతానికి ఆవల జరిగే ఒక హిందూ కర్మకాండ.

ఇదీకాక తిలక్ తన పర్యవేక్షణలో శూద్ర దేవాలయాలు చాలామటుకు హిందూ దేవాలయాలుగా పరివర్తన చెందడం, స్థానిక దేవతా విగ్రహాలని ఏదో ఒక హిందూ దేవుళ్లతో కలిపివేయడం, శూద్ర పురోహితుల స్థానంలో బ్రాహ్మణులని నియమించడం ఆ తర్వాత జన బాహుళ్యాన్ని హిందూయిజం పరిధిలోకి తీసుకురావడం లాంటివెన్నో గమనించాడు. ఆ సంప్రదాయం ప్రకారం పాలతో తయారైన తీపి పదార్థంతో విందు పూర్తయింది. ఆ తర్వాత సమావేశం ప్రారంభమయింది.

"మీ కందరికీ తెలుసు. నాగర్‌పూర్ మార్కెట్‌లో జరిగిన భయంకర సంఘటనలు, దాంతోపాటు దౌర్జన్యంతో జహంగీర్‌పూర్‌లో చెలరేగిన హింసాకాండ" అంటూ మొదలుపెట్టాడు తిలక్.

"దౌర్జన్యం ఏంటి? సైకిల్ రిపేర్ చేసే ఆ కుర్రాడిని చంపటమా?" అడిగాడు ఓ పురోహితుడు.

"కాదు" అని నెమ్మదిగా అంటూ అతనివైపు చూసి తిలక్ "ముస్లింలు ఓ హిందూ యువతిని పెళ్లి చేసుకోమంటూ బలవంత పెట్టడం" అంటూ అతను గుంపువైపు తీక్షణమైన దృక్కులతో చూశాడు. ఎవరూ మాట్లాడలేదు. తిలక్ చెప్పడం కొనసాగిస్తూ "మన హిందూ సోదరులైన పదిమందిని ముస్లింలు చంపేశారు. పది మంది ప్రాణాలు గాల్లో కలిసిపోయాయి. నష్టపోయిన మనవాళ్ల ఒక్కో జీవితానికి వంద జీవితాలు ఋణపడ్డారు ఆ ముస్లింలు" అన్నాడు.

"వందా? అది... అంటూ మరో పురోహితుడు మస్తిష్కంలో ఏమిటేమిటో లెక్కలు వేస్తూ అన్నాడు.

"అదెలా?" అంటూ "మీరు చెప్పేదేమిటి గురూజీ?" అడిగాడు మరో వ్యక్తి.

"వృద్ధిలోకి వస్తున్న బ్రాహ్మణులలో ఒకడిని మ్లేచ్ఛులైన బ్రిటిషర్స్ అపహరించారు" అంటూ తిలక్ "అతని గురించి తెలుసుకుందామని, అతనిపైన అభియోగాలేమైనా ఉన్నాయోమోనని అతన్ని విడిపించాలన్న ఉద్దేశంతో నిన్న కోర్టుకి వెళ్లాను. కానీ ఉత్తచేతులతో తిరిగొచ్చాను" అన్నాడు తిలక్.

"అతని మీద మోపిన అభియోగాలేంటి?"

"ఏమీ లేవు. దర్యాప్తులో అతను పోలీసులకి సహకరిస్తున్నాడని వాళ్లు అంటున్నారు" అంటూ తిలక్ "చట్ట ప్రకారం అతన్ని పట్టుకుంటే తాము ఓడిపోవటం ఖాయమని వాళ్లకి తెలుసు. అందుకని వాళ్లు అతని స్నేహితులుగా నటిస్తున్నారు. దాని అర్థం వాళ్లు అతన్ని బలవంతంగా అదుపులో వుంచుకోవాలనుకోవడం కఠినమైన వ్యవహారం" అన్నాడు పరిహసిస్తున్నట్టుగా.

"మీ ప్రణాళిక ఏంటి గురూజీ?"

తిలక్ అందరివైపు చూస్తూ "శూద్రులని ఆహ్వానించాల్సిందిగాను, వాళ్ల ఉనికి సహించాల్సిందిగాను గతంలో మీకు సలహా ఇచ్చాను. అందుకు మీలోని కొందరు సణిగారు. వాళ్ళ పట్ల వినయంగా వుండాల్సిన అవసరమేంటి, అపవిత్రం చేసిన ప్రమాదాన్ని ఎందుకు కొని తెచ్చుకోవాలని అడిగారు.

ఈ విషయం గురించి ఇప్పుడు ఆలోచించండి. ముస్లింలకి చాలా చేతులున్నాయి; వాళ్లు మార్కెట్‌లో దాడి చేయగలరు, పండి రాలిన ఆకుల్లా శరీరాన్ని

వదిలేయగలరు. మనం పదకొండు వందల సంవత్సరాలు ముస్లిం పాలనలో గడిపాం. అప్పుడు శూద్రులు మన నియంత్రణలో వుండేవారు. ఏ ముస్లిం పాలకుడూ కులం ఇంకా వర్గ ధర్మంలో కలగజేసుకోలేదు. బ్రిటిషర్స్ వేరు. వాళ్లు ఇంగ్లీష్ చదువు కుక్కలకి గాడిదలకి కూడా ఇవ్వాలనుకున్నారు. పూవులు అమ్మే ఆ ఫూలేకి వాళ్లు ఆంగ్లం బోధించారు. వాళ్లు అతనికి డబ్బు, దస్కం ఇంకా అవసరమైన సామాను ఇచ్చి సహాయపడ్డారు. ఇంగ్లాండ్‌లో సూట్లు ధరించి బీఫ్ తిన్న ఆ గాంధీకి వాళ్లు మహాత్ముడని బిరుదిచ్చారు. వాళ్లు అమెరికాలో విద్యాభ్యాసం కోసం ఓ మహర్‌ని పంపారు. నేను ఆ ఛండాలుడి పేరును ఉచ్ఛరించదల్చుకోలేదు. బ్రిటిషర్స్ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల విషయంలో మురికిని చిమ్మారు. వాళ్ల దగ్గర జె.యస్. మిల్ అనే పిచ్చిపట్టిన కుక్క వుంది. అతను 'ఆన్ లిబర్టీ' పేరుతో ఓ చెత్త పుస్తకం రాశాడు. వాళ్లవల్లే స్వేచ్ఛ అన్న ఉన్మాదం దావాలనంలా వ్యాప్తి చెందుతోంది. అయినా ఇప్పటివరకు మనం మనసున్న మనుషులం కావడంతో నిస్సహాయులం. మన చేతులు ఎక్కడవున్నాయి? నేను చెప్తాను, వినండి. శూద్రులు, నిమ్నకులస్థులే మన చేతులూ, సాధనాలు. మనకి ఉపకారబద్ధులుగా వుండేలా మనం వాళ్లని ఆయత్తపర్చాలి. మన ప్రకోపంతో వాళ్లని జ్వలింపజేయాలి. మొదటిది మనం చేశాం. గణేశ్ పండుగలలో వాళ్లని కలుపుకోవాల్సిందిగా ఎందుకు అన్నానో ఇప్పుడు మీరు గమనించండి. మనం చేయాల్సింది వాళ్లకి చూపించాలి. వాళ్లకి పూర్తి అధికారం ఇవ్వాలి.

శాంతి భద్రతలు నిర్వహించే విషయంలో బ్రిటిషర్స్ గర్విస్తారు. వాళ్లలో ఉదారత పెంపొందించే దిశగా భారంవేసే ఆలోచనలో వున్నాను. అసలైన నేరగాళ్లని అధిక మొత్తంలో పట్టుకునేలా చేసి మన బ్రాహ్మణ హీరోని విడుదలయ్యేలా చేయ్యాలి, చిన్న పిల్లాడు పంచదార రొట్టె బిళ్ల కోసం ముత్యంని జారవిడిచినట్టుగా.

అందుకు మీరంతా నాకు ఓ సాయం చేయాలి. శూద్రులకి వాళ్ల లక్ష్యమేంటో మీరు తెలియపర్చాలి. మీరు వాళ్లని ఉద్రేకపర్చాలి. వాళ్లలో ధార్మికతా వేడి పుట్టించాలి. మార్కెట్లో చచ్చిపోయింది నిమ్న కులాల కూలీలు, చిరు వ్యాపారులు. వాళ్లని ప్రతీకారం తీర్చుకోమని మీరంతా వాళ్లకి చెప్పండి."

"ఆ కుక్కలు మన మహిళలని తీసుకుపోయి వాళ్ల అశుచిని వాళ్లలో ప్రవేశపెట్టారు!" అంటూ కస్సుమన్నాడు ఓ పురోహితుడు. మరో వ్యక్తి బిగ్గరగా అన్నాడు "యువకుడైన ఓ బ్రాహ్మణ హీరోని బ్రిటిషర్స్ జైల్లో నిర్బంధించారు" మరో వ్యక్తి అరిచినట్టుగా అన్నాడు. "మనం మేల్కొనకపోతే భరతఖండం సగం ముస్లింలదిగాను మరో సగం క్రిస్టియన్‌లదిగాను అయిపోతుంది. మన గురించి మన శత్రువులు ఎక్కువగా

మాట్లాడితే నరకానికి పోతారు. ప్రభువైన శ్రీరామచంద్రుడు మనతో వున్నాడు. బ్రాహ్మణ యువకుడెవరూ జైలుకి వెళ్లడానికి వీలులేదు.

"గురూజీ మీరు మా నాయకులు. గురువుగా మీ ఆదేశం ఏమిటి? మా కర్తవ్యం ఏంటి? మమ్మల్నేం చెయ్యమన్నారు? అన్నాడు ప్రధాన పూజారి. అతనికి వంత పాడుతున్నట్టుగా అందరూ తలలు వూపారు. తిలక్ అన్నాడు, "శూద్రులు, అంటరానివాళ్లు చిన్నపిల్లల వంటివారు. వాస్తవంగా వాళ్లకి కావాల్సినవి మిఠాయిలు ఇంకా చిన్న చిన్న వస్తువులు. అవి లభించకపోతే పుస్తకాలు చదివి వాళ్లు ఆలోచిస్తారు. మీరు వాళ్లకి స్వీట్లు, చిన్న చిన్న వస్తువుల్ని ఇచ్చారు. ఇప్పుడు వాళ్లకి చెప్పండి, అయినంత విధేయతగా వుండమని. ఉద్వేగాన్ని నియంత్రణలో వుంచుకోమనండి. ఇంకా వాళ్లకి చెప్పండి, ముస్లిం ఆస్తుల్ని వేటినైనా వాళ్లు ఆక్రమించుకుంటే అవి వాళ్లకే చెందుతాయని" అంటూ తిలక్ వెళ్లడానికి లేచి నిల్చున్నాడు.

"సంభవామి యుగే యుగే" అన్నాడు ప్రధాన పూజారి ఉత్సాహంగా. "మమ్మల్ని రక్షించడానికి ప్రతియుగంలోనూ నువ్వు పుట్టాలి."

దండేకర్ పింగాణీ కప్పులోని టీని సుకుమారంగా చప్పరిస్తూ... ఇన్‌స్పెక్టర్ క్రిస్టోఫర్ విల్లీస్ బ్రౌన్ వైపు పరీక్షగా చూసి "ఈ విషయం నన్ను ఎప్పటికీ కలవరపెడ్తుంది" అంటూ "మీలాంటి వారికి ఇటువంటి పేర్లు ఎందుకు వుంటాయి? అదీగాక మీరు గోధుమరంగులో లేరు" అన్నాడు.

విలియం బ్రౌన్ కనుబొమ్మలు పైకెత్తి "మంచిది. అలాగయితే నీ పేరు దండేకర్. దీని అర్థం 'కర్మని ప్రయోగించే వ్యక్తి' అని నేను భావిస్తాను. పరిహాసం చాలించు. నువ్వు ఆ కరపత్రం చేతిలో వుంచుకుని చేసిందేంటో వివరంగా చెప్పు" అన్నాడు మెల్లగా.

"అందులో విద్రోహమన్నది లేదు" అన్నాడు దండేకర్ కొద్దిగా ఆత్మరక్షణలోపడి తన్ను తాను సమర్థించుకుంటూ. "నేను ఇదివరకే చెప్పాల్సిందంతా చెప్పాను" అన్నాడు.

'హుమ్... ఎవరి మాటల్నీ నేను విశ్వసించలేకపోతున్నాను"– అన్నాడు విలియం బ్రౌన్.

"అసలు నువ్వు ఆ ఇద్దరు భారీ మనుషులతో ఎందుకు వున్నట్టు?" అసహనంగా అడిగాడు విలియం బ్రౌన్.

"ఆ భూస్వామికి చెందినవాళ్లేనా? వాళ్లు నా రక్షణ కోసం వున్నారు. మిస్టర్ దేశ్‌ముఖ్ సానుభూతిపరుడు."

"అందులో ఎలాంటి సందేహం లేదు. కానీ చూడబోతే జహంగీర్‌పూర్ అంతగా ప్రమాదకరమైనది కాదనిపిస్తోంది. ఇప్పటివరకైతే కాదు."

దండేకర్ కప్పు కింద పెడుతుండగా చేతులు వణక్కపోవడంతో కొంత సంతృప్తి చెందాడు. "అది శూద్రులు, ఛండాలురు ఎక్కువగా వున్న గ్రామం. అక్కడ వుండే వాళ్లకి అన్నీ తెలుసు. అందుకనే వాళ్లు నా దగ్గరకంటా వచ్చి నన్ను అపవిత్రం చేయలేదు.

విల్లీస్ బ్రౌన్ కుర్చీ మీద వెనక్కి జేరగిలబడి కుర్చీ శిఖరంపైన వేళ్లని వుంచి "అయితే నువ్వు శూద్రులు, ఛండాలురు వున్న గ్రామంలో వుంటూ అగ్రవర్ణాల వాళ్లకి కరపత్రాలు పంచుతూ వాళ్ల పవిత్రతని గుర్తుచేస్తూ ప్రోత్సహిస్తున్నావన్నమాట. ఆ కరపత్రాలని ఎవరికిస్తున్నావు? స్థానికంగా వుండే పవిత్ర ఆవులకా?" అనడిగాడు విచిత్రంగా.

"ఈ గ్రామంలో నాలుగు బ్రాహ్మణ కుటుంబాలు, రెండు బనియా కుటుంబాలు వున్నాయి."

"అంటే నువ్వనేది గ్రామానికి ఆవలివైపా?"

"ఫర్ గాడ్ సేక్! మ్యాన్, నువ్వు నాపైన అభియోగం ఏదైనా మోపదలచుకుంటే వెంటనే ఆ పని పూర్తి చెయ్యి! అన్నాడు గర్జిస్తున్నట్టుగా దండేకర్.

అలసిన కంఠంతో విలియం బ్రౌన్ మెల్లగా నవ్వి "కాలేజీలో స్నేహితులు నిన్ను దండీ అని పిలుస్తారా? నిజం చెప్పు" అన్నాడు.

"నేనేం నేరం చేయలేదు. నేనేమీ ప్రభుత్వ వ్యతిరేకిని కాను. నా ధర్మం నేను నిర్వర్తించాను. అది నేరమా, రాజ్యపాలనలో కూడానా?"

"ఆ కరపత్రంలో క్రిస్టియన్‌ల గురించి వ్యాఖ్యానాలున్నాయి."

"కాథలిక్కులను ఉద్దేశించా" అన్నాడు దండేకర్ సున్నితంగా. "నేను ఎన్నడూ ఆంగ్లికన్ చర్చి విషయంలో తలదూర్చకూడదని నిశ్చయించుకున్నా" అన్నాడు దండేకర్.

విల్లీస్ బ్రౌన్ తనముందు టేబుల్ మీద వున్న ఫైలులోకి చూశాడు. తన కుడిచేతి చూపుడు వేలిని దాంట్లో కిందనించి పైకి జరిపి తిరిగి మధ్యకి తీసుకువెళ్లి వేలుని ఆపి "దీనితో నీకు ఏదో సంబంధం వున్నట్టుగా ముస్లింలు అనుకుంటున్నారు 'మర్డర్'తో. మరో విషయం. మా హవల్దారు నిన్ను పట్టుకున్నప్పుడు 'నా చేతులు రక్తసిక్తమై ఉన్నాయి ఎర్రగా!' అని నువ్వు బిగ్గరగా అరిచినట్టు చెప్పాడు. ఆ తర్వాత నువ్వు మాట మార్చినట్లు కనిపిస్తున్నావు."

"మేమంతా" అంటూ దండేకర్ "మా మతాన్ని అంతం చేయడానికి అనుమతి ఎవరిచ్చారు, దేవుని రక్తం మా చేతుల్లో వుండగా" అన్నాడు.

"హుమ్... అయితే ఆ హిందూ పిల్ల ఆ ముస్లిం కుర్రాడు పెళ్లి చేసుకోవడం పట్ల నీకు ఎలాంటి భావాలూ లేవన్నమాట. ఆ కుటుంబంలో చేరేందుకు, పిల్లల్ని కనేందుకు, ఆ కుర్రాడితో బెడ్‌షేర్ చేసుకోవడానికి ముంతాజ్ బీకి ఇష్టమే అని నీ భావన..."

"ఏంటా... అసభ్యకరమైన మాటలు!" అన్నాడు దండేకర్ కోపంగా. "మీరు... మీ ఇంగ్లీష్ వాళ్లు గుణహీనులు. మీలో పరిపూర్ణమైన బ్రిటిష్ రక్తం లేదు. రోమన్‌లు, నార్మన్‌లు వచ్చి మీ మహిళల్ని మానభంగం చేసినప్పుడు మీకు కోపం ఎందుకు రాలేదో తెలుసా? లేదు, అలాంటిదేమీ లేదు. మీ నరనరాన రోమన్‌ల, నార్మన్‌ల రక్తం జీర్ణించుకుపోవడాన్ని మీరు గర్వంగా భావిస్తారు. మీకు తెలుసు మీరు కుక్కలకన్నా అధికులేం కాదని. ఉత్తమమైన, సొగసైన పురుషులు వచ్చి మీ మహిళల్ని సంగమించినప్పుడు, మీ పిల్లలకి ప్రశస్తమైన తండ్రులు వుంటారని మీరు సంతోషించారు. మరి మా విషయంలో అలా కాదు. మా రక్తం మాకు గర్వకారణం. ఇటువంటి మానభంగాలని మేము సహించం, మా జాతి గౌరవాన్ని పోగొట్టుకోం!"

ఆ మాటలకి విల్లీస్ బ్రౌన్‌కి కోపంతో పూనకం వచ్చేసింది. వెంటనే హవల్దార్‌కు సైగ చేశాడు. అతను అప్రమత్తమయ్యాడు. "వీడిని సెల్‌లో వేయండి" అంటూ బ్రౌన్. "ఒక్క ఇంచీ కూడా మిగలకుండా బాదండి" అంటూ గంభీరమైన కంఠంతో ఆజ్ఞాపించాడు.

మహారాష్ట్ర అంతటా పూర్వం నించి వస్తున్న గణేష్ ఉత్సవాన్ని పవిత్రంగా నిర్వహిస్తున్నారు. అసాధారణమైన భారీ ఏర్పాట్లు సంతరించుకున్నాయి. గడ్డితోను, బంకమన్నుతోను తయారుకాబడ్డ గణేశ్ ముందు శిరస్సు వంచి దణ్ణం పెట్టుకోవాల్సిందిగా దేశమంతటా సందేశం పంపించారు. మిలమిలా మెరిసే పెయింటింగులతో కూడిన గణేశ్ రూపాలతో వీధులన్నీ నిండిపోయాయి. గణేశ్ పేరు మీద సూక్తుల పుస్తకంగాని, దౌర్భాగ్యపు కొంటె కవితల్లాంటివి లేకపోవడంతో ఆ దేవుడి సందేశం కోసం ఎవరూ కూడా తలలు పగులకొట్టుకోవాల్సిన పనిలేదు. అతని రూపం వీధుల్లోని జన సమూహానికంతటికీ చేరాలన్నదే అన్నిటికన్నా ముఖ్యం. అంతటా శూద్ర యువకుల్ని వినియోగించారు. గుమ్మం గుమ్మం తిరిగి చందాలు సేకరించడానికి కొందరు బృందాలుగా ఏర్పడ్డారు. ప్రాచీన భారత దేశంలోలా గణాలని పాలించే గణపతి ఆహార పదార్థాలని, వస్తువుల్ని బలవంతంగా సేకరించాడు. సేకరించిన డబ్బుని సమీపంలోని దేవాలయాలలో డిపాజిట్ చేయాల్సి వుంటుంది. 'సముచిత ఆర్యుల'తో అకౌంట్స్ కమిటీలను నియమిస్తారు.

తొమ్మిది రోజులపాటు దేవుడు వీధుల్లో వుంటాడు.

అతను శూద్రుల వీధుల్లోకి ప్రవేశించాడు. అంటరాని యువకులు కొందరు వాళ్ల బస్తీలలో కూడా గణేశ్ ప్రతిమలు కావాలని అడిగారు. అందుకు అధిష్ఠానవర్గం నిరోధించాల్సిందిగా సూచించింది. అన్ని కరపత్రాలలోను ప్రభువు గణేశ్‌ని హిందూ దేవుడిగా అభివర్ణించారు. భారత చరిత్రలో హిందూ పురోహితులు కరపత్రాలు అచ్చు వేయించి వీధులలో పంపిణీ చేయడానికి శూద్రుల్ని పంపడం ఇదే ప్రథమం. ఊహించని పరిణామమిది – ఊహించని పరిణామం...

వేలకొద్దీ శూద్ర యువకులు జైలులో వున్న బ్రాహ్మణ యువకుడైన దండేకర్‌కి గౌరవసూచకంగా గణేశ్‌ని ప్రదర్శించడానికి, కీర్తించడానికి జైలు గేటు దగ్గరకి తీసుకువచ్చి గుమిగూడారు. వాళ్ల మాటలు దండేకర్‌కి వినిపిస్తాయో లేదోనని వ్యర్థంగా ఆలోచన చేసిన వాళ్ళు ఆశ్చర్యపోయారు.

*జై గణేశ్ మహరాజ్ కీ జై... గణేశ్ మహరాజ్ కీ జై*

*దేవుడు రాజులకే రాజు అని జీసస్ అన్నాడు.*

*గణేశ్‌ని రాజులకే రారాజుగా చేశాడు తిలక్.*

నినాదాలతో జైలు గోడలు ప్రతిధ్వనించాయి. గుంపులోని ఓ అపరిచిత యువకుడు 'దండేకర్ మహరాజ్‌కీ జై' అంటూ బిగ్గరగా అరిచాడు.

శూద్ర యువకులు గణేశ్‌ని ఓ కొత్త దేవునిగా భావించారు. ఆధునిక యుగం అధిక ఫలప్రదంగా అనిపించింది వాళ్లకి. వాళ్లు ఆ నినాదాన్ని ప్రచండ కంఠధ్వనితో పునరుచ్ఛరించారు మిన్ను విరిగి మీదపడేలా. నాగర్‌పూర్ అంతటా నినాదాలతో కూడిన బ్యానర్లు వెలిశాయి.

*పూజించు... పూజించు... పూజించు...*

*దేహం... దేహం... దేహం... దేహం...*

*దేహం... మెదడు కాదు*

*ప్రతిమ కాదు కల్పన.*

ఈ బ్యానర్లు చూసి శూద్ర యువత ఉత్తేజితమైంది. గుంతలు తవ్వి కర్రలు పాతడం, వాటిపైకి పాకుతూ ఎక్కడం, బ్యానర్‌లని కట్టడం లాంటి పనుల్లో వాళ్లు తమ సాంప్రదాయక పనితనం వినియోగించారు.

కొన్ని బ్యానర్‌లని మెరుగ్గా వున్న చోట కట్టేందుకు పోటీపడ్డారు. వాళ్లు చెట్లపైన, ఇళ్లపైన, శిలలమీద, ఇంకా ప్రవేశమార్గాల దగ్గర బ్యానర్‌లని వేలాడదీశారు. అజాగ్రత్తగా

పార్క్ చేసిన ఎడ్లబండి కూడా తోరణాలతో ఇంటికి తిరిగివచ్చింది. నగరం అంతటా కాషాయ కోలాహలం ఎవరో తొక్కలు కుప్పలు కుప్పలుగా పడేసినట్లుగా. ఇదంతా చూసి నిరక్షరాస్యులైన శూద్రులు చకితులయ్యారు.

*దేహాన్ని నమ్మండి దేవుడి వాక్కుని కాదు*

*ఆధునిక జాతి దేవుడి శరీరం.*

బట్టపైన అద్దకం, పెద్ద పెద్ద అక్షరాలు వాళ్లకి ఎంతగానో సంతృప్తిని చేకూర్చాయి. బ్యానర్ కింద నిల్చున్న ఓ యువకుడు కొత్తగా ఉబ్బిన తన కండరాలని అటూ ఇటూ కదిలిస్తూ ప్రదర్శిస్తున్నాడు. ఈ మధ్యనే హనుమాన్ వ్యాయామశాలలో చేరాడతను. (బిపియస్ స్థాపించిన ఓ జాతీయవాద నేషనలిస్ట్ జిమ్). ఆ యువకుడి కండరాలు ఇప్పుడిప్పుడే కండలు తిరిగినట్టుగా గోచరిస్తున్నాయి.

*కనిపించే సస్పృశ్య దేవుడు వాస్తవం.*

*కనిపించని, అస్పృశ్య దేవుడు అవాస్తవం.*

*నమ్మవద్దు పుస్తకం చదివేవాళ్లని, నమ్మండి కేవలం పుస్తకం గ్రంథస్తం చేసేవాళ్లని.*

*నిర్మించండి... నిర్మించండి... నిర్మించండి... ఒక హిందూ జాతిని.*

“ఆ ముసల్మాన్‌లకి మెదళ్లు లేవు, అందుకనే దేవుడి మెదడుని పూజిస్తారు” అన్నాడు ఓ మత్స్యకారుడి కొడుకైన శివరాజ్. దాన్ని వాళ్లు చూడలేరు అనడంలో ఆశ్చర్యపడాల్సింది ఏమీ లేదు. మన దేవుడ్ని చూడండి : గులాబీరంగు దేహం గుండ్రంగా ఎలా వుందో! నేను మన దేవుడి మొండెం ఇష్టపడతాను. ఆ దేవుడిలాగే మనకీ ముక్కు బదులు మొండెం, దంతాలూ వుంటే మనం ఎవరిమీదైనా దాడి చేయగలం. మన పండితులు నిజంగా గొప్పవాళ్లు. తొమ్మిది రోజులూ భోజనం అద్భుతంగా వుంది. దృఢమైన కండరాలతో పెద్ద పెద్ద ఉదరాలతో మన వీధిని గణేశ్ దీవిస్తాడని ఆశిస్తున్నాను. ఏమో ఎవరు చెప్పగలరు, అదృష్టవంతులమైతే మనకి కూడా భవిష్యత్తులో అటువంటి మొండాలు వస్తాయేమో.”

ఉత్తరాన్నించి నాగర్‌పూర్ వచ్చిన ఓ యాదవ యువకుడు గణేశ్ ప్రతిష్ఠాపన ఉత్సవంలో సహాయమందించడంలో ఉత్తేజితుడై ఇంటికి వెళ్లి తన ఇంటి ముందు

వరండాలో బ్రహ్మాండమైన ఎలుకమీద కూర్చుని వున్న భారీ గణేశ్ విగ్రహాన్ని ప్రతిష్టించాడు. "నా బాల్యం అంతా ఆ చెత్త గేదెలపైన ఎక్కడంతోనే గడిచిపోయింది. అవి నాకన్నా నల్లగా వున్నాయి. జీవితంలో ఒక్కసారయినా ఈ దేవుడిలా ఎలకపైన సవారీ చెయ్యాలి. బ్రాహ్మణ కుర్రాళ్లు విమానాలలో తిరిగితే తిరగనీ. నాకు అనవసరం. దేవుడు గణేశ్‌లా నేను ఎలుకపైన స్వారీ చేస్తాను. మా నాన్న ఈ గొప్ప దేవుడి గురించి ఎప్పుడూ చెప్పలేదు" అనుకున్నాడు.

ఇంతలో 'మహర్' 'మాతంగ' యువకులు కొందరు పరుగెత్తుకుంటూ పందిరి దగ్గరకి వచ్చారు. వాళ్ల చేతులలో పంది చర్మంతో తయారైన డోళ్లు వున్నాయి. దేవుడి ముందు డోలు వాయించాలని వాళ్లకి మంచి ఉబలాటంగా వుంది. ఓ శూద్రుడు వాళ్ల దారికి అడ్డువస్తూ "ఓ పరయ్యలారా, ఇక్కడికి రావద్దు. గణేశ్ హిందువుల దేవుడు. అంటరాని దేవుడు కాదు" అన్నాడు.

"అయితే మా డోళ్ల సంగతేంటి? మేము వాటిని వాయించకపోతే పూజ పూర్తయినట్టుకాదు" అన్నాడు అక్కడే నిల్చున్న ఓ అంటరాని యువకుడు.

"అవును, అవును. మీరు దూరంగా నిలబడి వాయించండి, ఈ పందిరికి దూరంగా. డోలు డోలే.

శూద్రులు చాలామంది గుమిగూడి మాట్లాడుకోసాగారు. "ఈ దేవుడు పరయ్యకి సంబంధించిన దేవుడు కాదు" అంటూ బిగ్గరగా అరిచాడు వాళ్లలో ఒకడు. వాళ్లు డోళ్లు వాయించడం మొదలుపెట్టారు. వాతావరణం ఉద్రేకంగా ఉంది.

ఇంతలో అకస్మాత్తుగా యాభై మంది హిందూ అనుచరులతో అక్కడికి వచ్చాడు తిలక్. వాళ్లు కాషాయదుస్తులు ధరించారు. నుదుటన పెద్ద తిలకం బొట్లు వున్నాయి. తిలక్ చెయ్యిపైకి ఎత్తి "దీని గురించి రాద్ధాంతం చేయకండి. దేవుడికి దూరంగా వున్నప్పటికీ ఆయన మిమ్మల్ని దీవిస్తాడు. గణేశ్ దేవుడు ఈ వీధిలోకి వచ్చాడు. తర్వాత మీ వీధిలోకి వస్తాడు. వెళ్లండి ఇక్కణ్ణించి" అన్నాడు.

డోళ్లు వాయించే వాళ్లలో అందరికన్నా పిన్న వయసులో వున్న యువకుడు "మాకు దేహం వుంది. అది దేవుడు సృష్టించింది కాదా? మా డోలు శబ్దాలు దేవుడికి తాకినపుడు మా శరీరాలు ఎందుకు తాకకూడదు?" అన్నాడు.

తిలక్ అతని వంక ఉదాశీనంగా చూస్తూ "నీ పేరేంటి?" అని అడిగాడు. అతను భయంతో పరుగుతీశాడు. తిలక్ అక్కడే వున్న సహచరుడితో గుసగుసగా అన్నాడు.

“వాడి పేరు తెలుసుకో. వాళ్ల తండ్రి పేరు కూడా తెలుసుకో. వాళ్ల బస్తీలో చర్చి వుందేమో చూడు.” తొమ్మిదో రోజు గణేశ్ ఊరేగింపు మొదలైంది. ప్రభువు గణేశ్ రకరకాల వాహనాల్లో ఆశీనుడయ్యాడు. ఎడ్లబండ్లు, గుర్రపు బగ్గీలు ఇంకా శూద్ర యువకులు బ్యానర్లు తగిలించి లాగుతున్న బండ్లు. బ్యానర్లపైన ఈ విధంగా రాసి వుంది. “దేవుడు ఆశీర్వదిస్తాడు ఈ బండినిలాగే శూద్రులని.” బండి లాగడానికి శూద్ర కుర్రాళ్లు పోటీపడ్డారు. వాళ్లపైన సింధూరం చల్లుతున్నారు, అందుకు ప్రత్యేకించిన టెంట్లలోంచి ఒక బండిలో బ్రహ్మాండమైన ఎలుకమీద కూర్చున్న భారీ గణేశ్ విగ్రహం వుంది. విగ్రహం దగ్గర నలుగురైదుగురు పురోహితులు నిల్చున్నారు. వాళ్లు ఊరేగింపులో భక్తులు సమర్పించే కానుకలు కొబ్బరికాయలు, బియ్యం, కూరగాయలు, డబ్బులు సేకరిస్తున్నారు.

వీధులన్నీ దుమ్ము, సింధూరంతో ఎర్రగా మారాయి. అక్కడక్కడా తాగునీరు అందుబాటులో వుంచారు. కొన్నిచోట్ల పండ్ల ముక్కలు, పంచదార ప్రసాదంగా పంచుతున్నారు. తియ్యని రొట్టెలు, తియ్యటి అన్నం, పులిహోర, చింతపండు రసం బియ్యంతో కలిపి చేసిన ఓ తీపి వంటకం భక్తులకి ఉచితంగా పంచుతున్నారు. శూద్ర యువకులకి స్వర్గమే దిగివచ్చినట్టుగా వుంది. వాళ్లు ఆ విధంగా వీధుల్లో ఎన్నడూ డాన్సులు చేయలేదు. వాళ్లు అన్ని రకాల స్వీట్లు ఎప్పుడూ తినలేదు. కొన్ని కుటుంబాలకి చెందిన ఇళ్లలో అలాంటి స్వీట్లు చేసిన దాఖలాలు చరిత్రలో ఎక్కడా కానరావు. “గణేశ్ మహరాజ్‌కీ జై... జై బోలో గణేశ్ మహరాజ్‌కీ” అంటూ వాళ్లు బిగ్గరగా అరిచారు.

ఇంతలో ఊరేగింపు పొరుగున వుండే ముస్లిం కూడలివద్దకు చేరుకుంది. అకస్మాత్తుగా అక్కడ గందరగోళం చెలరేగింది. ఎవరో గట్టిగా అరిచారు : “ముస్లింలు గణేశ్‌పైన రాళ్లు రువ్వుతున్నారు. చెప్పులు విసురుతున్నారు! చూడండి... చూడండి. ఈలోగా ఎవరో ఓ గేదెని ఊరేగింపులోకి తోలారు. అర్ధచంద్రుడున్న ఆకుపచ్చ జెండాని విసిరారు! ‘దేవుడు మైలపడిపోయాడు... పూర్తిగా అపవిత్రం అయ్యాడు. అయ్యో! దేవుడు అపవిత్రం అయ్యాడు!’ అంటూ అంతటా అరుపులు విన్పించాయి. బండ్లలోను మిగతా వాహనాలలోనూ వున్న పురోహితులు ‘ఎక్కడ? ఎక్కడ?’ అంటూ అరిచారు. కానీ ఆ అరుపులు ఆ రణగొణధ్వనిలో కలిసిపోయాయి. అల్లరిమూకలు తమ పబ్బం గడుపుకునే స్వార్థశక్తులు పొరుగునే వున్న ముస్లింల వైపు సాగారు. సైకిల్ రిపేర్ షాపులు, విడిభాగాలని అమ్మే షాపులు, కిరాణా షాపులు తగలబెట్టారు. మరికొన్ని షాపులు పూర్తిగా నాశనమయ్యాయి. ‘హిందుస్తాన్ హమారాహై! తుర్కిస్తాన్ తుమ్హారాహై’ (ఇండియా మాది, టర్కీ మీది) అంటూ అల్లరి మూకల కేకలు చెవుల్లో పడుతున్నాయి. నినాదాలు రాసిన

వ్యక్తులు బండ్లలో కూర్చున్నారు. నినాదాలు చేసేవాళ్లు బళ్లు లాగుతున్నారు. ఎవరో ఏదో బండిలో నకిలీ నాణేలులా కొత్త నినాదాలు చేయిస్తున్నారు :

*పురుషులు ప్రమాదకరం, మహిళలు చాలా ప్రమాదకరం!*

*కాలుష్య కారక జన్మలు ఆపాలి!*

*మన ఆహార సంస్కృతికి హానికరం బీఫ్ తినే నాలుకలు!*

*అధిక ప్రమాదకరం మహిళలు*

*కాలుష్య కారకాలకి జన్మనిస్తారు వాళ్లు.*

వాళ్లు మహిళల కోసం ఇళ్లలో వెతికారు. పురుషుల కోసం వీధులన్నీ గాలించారు. సంపూర్ణ అన్వేషణ అది. అల్లరిమూకల ఆగ్రహావేశాలు పెల్లుబుకాయి.

గంటసేపు అడ్డూ ఆపూ లేకుండా పోయింది. ఆ చారిత్రాత్మక ఘటనకి సంబంధించి ఒకే ఒక సాక్షి గణేశ్ ప్రభువు; ఇండియాలో ఎన్నడూలేని విధంగా జరిగిన మొట్టమొదటి సంఘటన ఇది. హీరో అయిన బ్రాహ్మణ యువకుణ్ణి విడిపించడానికే ఆ సంఘటన జరిగిందని అనుకున్నారంతా. కానీ తిలక్ ప్రణాళిక దూరదృష్టితో కూడుకుని వుంది. పొరలు పొరలుగా శవపేటికను చుట్టుకునివున్న పీడిత శక్తుల నించి భరత ఖండాన్ని విడిపించే దిశగా ప్రణాళిక రచించాడతను.

ఆ కారణంగానే పది రోజులు నిరీక్షించి తన ప్రణాళిక అమలు చేద్దామనుకున్నాడతను, జైళ్లని జనాలతో నింపేసి దండేకర్‌ని విడుదల చేయించాలన్న ఉద్దేశంతో. అతనికి తెలుసు ఇందుకు ఆ బ్రాహ్మణ యువకుడు ఎంతటి మూల్యం చెల్లించుకోవాల్సి వస్తుందోనని. కానీ తన వీరత్వం అంత చవకబారు సానుభూతిని పొందడం స్వాభిమాని అయిన దండేకర్ ఆశించగలడా? బ్రిటిషర్స్‌తో చాలాకాలం గడిపిన తిలక్ వాళ్ల వాస్తవ రూపం దండేకర్‌కి తెలియజేయాలనుకుని అంచనాలు తారుమారు కావటంతో, పథకం పారకపోవడంతో అపకీర్తిపాలయ్యాడు. భయంకరమైన మారణహోమ దృశ్యాల నుంచి దూరంగా అడుగులు వేసిన తర్వాత తన పథకాలన్నీ ఫలించినట్టుగా ప్రతిబింబించాడు తిలక్. ముందుకుపోయే మార్గం అది : చంపు – చావు భవిష్యత్ ఏర్పాటుకి సంకేతం.

భయంతో కంపించిపోయిన ముంతాజ్ బీ చిన్న వంటింటి గోడ రక్షణలో కుంగిపోయింది. బయట అల్లరిమూకల అరుపులు అసభ్య కదలికలతో. గుండె భయంతో వేగంగా కొట్టుకోసాగింది. ఆమె వీపు మీద వున్న మూట కిందపడింది. తుఫానులాంటి

మనుషుల హింసాయుత అరుపులు, కేకలు, పరుగులు వినిపిస్తున్నాయి. వాళ్లు ఎవరో చెప్పలేదామె. ఎవరిని బయటకు ఈడ్చేందుకు చూస్తున్నారో. హిందువునా, ముసల్మానునా? తను సరస్వతా లేక ముంతాజ్ బీనా. అసలు తను ఎవరు? తన భర్త హుస్సేన్ మరణం తర్వాత తాను ఎవరికి చెందుతుంది? ఏ నేల తన పాదముద్రలని స్వీకరిస్తుంది? గుండెకోత. ఆవేశంగా అరుస్తున్న, మాట్లాడుతున్న ప్రతి ఒక్కరి నోటి మీద తన సున్నితమైన చేతిని వుంచి వాళ్లకి చెప్పాలనిపిస్తుంది, 'ప్రపంచాన్ని బాగుపరచడానికి మార్గం ఇది కాదు' అని.

ఎలాగో అలాగ గుండె చిక్కపట్టుకొని ఆమె తన మూటని తీసుకుని వీధిలోకి పరుగుతీసింది.

క్రిస్టోఫర్ విల్లీస్ బ్రౌన్ టేబిల్ దగ్గరనించి తలపైకి ఎత్తి చూశాడు. ఓ హవల్దార్ సెల్యూట్ చేసి అన్నాడు, "చివరికి నేను సరిగ్గా ఊహించినట్లే జరిగింది!" విల్లీస్ బ్రౌన్ జీపులో ఎక్కి అల్లర్లు జరిగిన ప్రాంతానికి వెళ్లాడు. పెట్రోలింగ్ డ్యూటీలో వున్న అతని మనుషులు ఇళ్లని జల్లెడ పడుతున్నారు. నుదుట తిలకం పెట్టుకుని కన్పించిన ప్రతి వ్యక్తిని చావగొడ్తున్నారు. మరణించినవాళ్లు ఎందరో, గాయపడ్డవాళ్లు ఎందరో వాళ్లు చెప్తున్నారు. 'సర్, మహిళలు చాలామంది వున్నారు. వాళ్లలో కొందరి పరిస్థితి బాగుండలేదు. ఓ మహిళ పిచ్చిగా అరుస్తోంది. ఆమెని వెంటనే అరెస్టు చేయాలి. కానీ ఆమె మానసిక స్థితి సరిగా వున్నట్టు లేదు. ఆమె దేని గురించో బాధపడుతున్నట్టుంది."

"వాళ్లని చూడాల్సిందిగా డాక్టర్ ఇవాన్‌కి చెప్పు. మగాళ్లనందరినీ స్టేషన్‌కి తీసుకురా. క్రూరమైన ఆ మందని ఈ రాత్రికి మన ఆధీనంలో వుంచుదాం. అభియోగాలు మోపుదాం. ఈ రోజు మన పని అదే."

"సార్, మన వద్ద సరిపడా సెల్స్ లేవు. ఆ నట్టోడిని విడుదల చేయమంటారా, అదే ఆ దండేకర్‌ని?"

"నడిచే పరిస్థితిలో వున్నాడా అతను?"

"ఓ బాయ్‌నెట్ దారిలో అతన్ని ఆదుకుంటుంది."

విల్లీస్ బ్రౌన్ ఆవేశంతో ఊగిపోతూ... "అతన్ని ఒక్క తన్ను తన్ని గెంటివేయండి. అతను జిడ్డుగాడైన ఆ బాస్టర్డ్ తిలక్ స్నేహితుడు. ఒక కోర్టు కేసు వాళ్లు మొరగటానికి మరింత విషయాన్ని అందిస్తుంది. అతడు తనకు ఎదురొచ్చేదాన్ని అందిపుచ్చుకున్నాడు."

రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత ఇద్దరు వ్యక్తులు దండేకర్‌ని సెల్ లోంచి లాగి దుమ్ముపేరుకుపోయిన నేల మీంచి ఈడ్చుకొచ్చి రోడ్డుమీదికి నెట్టేశారు. అతను తలపైకి ఎత్తి స్టేషన్ గేటు బయట వున్న లైటు కేసి కళ్లు మిటకరించి మసకబారిన కళ్లతో చూశాడు. ఒక కన్ను బాగా వాచిపోయి కొద్దిగా మూసుకుపోయింది. చీకట్లో చేతులు ముందుకు చాపి నేలని తడుముకున్నాడు.

ఇంతలో ఎవరిదో గొంతు వినిపించింది. లైటు కాంతిని మరుగుపరుస్తూ ఎవరో అతని పక్కన లీలగా కదిలారు. ఎవరా అని పరకాయించి చూసే ప్రయత్నం చేశాడు దండేకర్.

అస్పష్టంగా ఓ స్త్రీ ఆకారం కన్పించింది. ఆమె చేతులు అతని చుబుకం కింద చేరాయి. కలవరంతో కూడిన దుఃఖాశ్రువులు అతని తలపైన పడ్డాయి. కన్నీటి బిందువులు అతని మణికట్టుని తాకాయి.

"నీకు ఈ వ్యక్తి తెలుసా?" అడిగింది ఓ కంఠం. స్వర్గంలోంచి వచ్చినట్టుగా వుంది ఆ స్వరం. తెలీదన్నట్టు తల అడ్డంగా ఊపింది ఆ ఆకారం. అయితే అతని గురించి సమయం వృథా చేయకు. రా ముంతాజ్ బీ, మనం మీ అమ్మానాన్నని వెతకడానికి చేయాల్సిందేమిటో చూద్దాం" అంది ఆ కంఠం.

# 4

# బసు బ్రాహ్మిణ సామ్యవాదం

**బె**నర్జీల బంగ్లా సెంట్రల్ కలకత్తాలోని ప్రధాన కూడలి దగ్గర వుంది. గేటు పక్కన 'ఆర్య భవన్' పేరున్న శిలాఫలకం ఉంది. దాని అర్థం 'శ్రేష్ఠమైన గృహం'. అది 'భద్రలోక్' సంస్కృతికి ప్రతిబింబమైన ఓ గొప్ప కుటుంబానికి చెందిన ఉత్తమ గృహం.

'భద్రలోక్' అనుపమాన బెంగాలీ ఆవిష్కరణ. స్థూలంగా దాని అర్థం 'జెంటిల్‌మన్'. 'భద్ర' పదానికి అర్థం శాంత లేక సాధు. 'లోక్' అంటే మనిషి. ఆ విధంగా 'జెంటిల్ ఉమెన్' అంటే భద్ర మహిళ. కానీ 'లోక్' అంటే ప్రపంచం అని కూడా అర్థం. ఆ భద్రలోక్ సొసైటీ అనేది ఒక రక్షిత ప్రపంచం, భద్ర సమాజ్ – అభద్ర లోక్ నుంచి అప్రమత్తంగా కంచె ఏర్పాటు చేయడం – మరో విధంగా చెప్పాలంటే, ఆసక్తికరంగా 'అభద్రలోక్'కి పర్యాయపదం 'ఛోటా లోక్' లేక 'చిన్న మనిషి'. ఎవరినైనా 'ఛోటా లోక్' అంటే అవమానించబడ్డవాడు. నిజాయితీ లేని పిరికి అసభ్య నాగరికత అని చెప్పవచ్చు. దొంగతనం కోసమో లేక కలహానికి అవకాశం కోసమో ఎదురుచూసే ఓ చిన్న నేరస్తుడి కన్నా కొంచెం ఎక్కువ. ఎవరినైనా ఒకరిని 'భద్రలోక్' (పెద్ద మనిషి)కి సులభమైన అర్థం చెప్పాలంటే సంపన్నుడని చెప్పవచ్చు.

'భద్రలోక్' కులరహితమైనది. ఇక్కడ భట్టాచార్యలు (బ్రాహ్మణులు), సర్కార్ లేక రాయ్ (అగ్ర కులస్తుడెవరైనప్పటికీ), బిస్వాస్ లేక గుహ (కాయస్తులు) లేక గుప్తా (బైద్య)లతో స్నేహపూర్వకంగా వుంటారు. వరేంద్ర బ్రాహ్మణులైన సన్యాల్, లాహిరి లేక బిగ్‌చి లేక 'తక్కువ' బ్రాహ్మణులైన ఠాగూర్‌లు (తక్కువ ఎందుకంటే ఒకప్పుడు వాళ్ళు నిమ్న కులస్తులైన మత్స్యకారులకి పురోహితులు). ఇంకా ఒక శాఖ (బ్రహ్మ సమాజంలో

చేరింది) కనౌజీలకి ఒకప్పటి స్నేహితులు. బెనర్జీలు, ఛటర్జీలలాగా భద్రలోక్ కులస్తులు ఒకరినొకరు వివాహాలు చేసుకునే విషయంలో బొత్తిగా ముందుకు రారు. కానీ లాన్‌లో టీలు త్రాగటం, 'క్రొకె' (కర్ర బంతులతో మైదానాలలో ఆడే ఒక విధమైన ఆట) ఆడటం సంపూర్ణంగా ఆమోదయోగ్యమే. వాళ్ళు ఒకరి భార్యని మరొకరు అపహరించుకుంటారు చిన్నపాటి దూషణతో.

ఆర్యభవన్ బయట అరక్షిత ప్రాంతమైన 'అభద్రలోక్'లో గుర్రపు బగ్గీ డ్రైవర్‌లు, రిక్షాలు లాగేవాళ్ళు పగలు టీ తాగడానికి జమ అవుతారు, రాత్రి తాగుబోతులవుతారు. భద్రలోక్ లేక భద్ర మహిళ ఎవరైనా, ఎపుడైనా కన్పిస్తే బగ్గీ డ్రైవర్లు దుర్వాసుల్లా లేస్తారు. ఆ గందరగోళంలో బగ్గీ సీటు లక్ష్యంగా పెట్టుకుని అందినంతవరకు డబ్బులు గుంజుతారు.

కుటుంబ పెద్ద అయిన బి.ఎన్. బెనర్జీ తన ఒలింపిక్ ఆలోచనలకి భంగం వాటిల్లుతోందని, వాళ్ళ వ్యవహారాలకి అభ్యంతరం చెప్పి కొన్ని సంవత్సరాల క్రితం తన స్టడీ రూమ్స్‌ని ఇంటి వెనకాల వున్న స్థలంలోకి మార్చుకున్నాడు. అది సాధారణంగా 'అందర్ మహల్', 'లోపలి స్థలం', స్త్రీలు – పిల్లలు నివసించడానికి ప్రత్యేకంగా రిజర్వ్ చేయబడ్డ స్థలం. నిజానికి అవి చీకటి కొట్టాలే! బెనర్జీ బాబు విద్వత్తుతో కూడిన మోడరన్ వ్యక్తి. రాబోయే 1930 దశకాన్ని దృష్టిలో వుంచుకుని గోడలలోని బీటలు సరిచేసి కిటికీలు కలపతో భర్తీ చేసే షరతుపైన మహిళలు ఇంటి ముందు భాగంలో నివాసం ఉండేందుకు అనుమతించవచ్చన్నాడు. పర్యవసానంగా అవి గాలి, వెలుతురు లేని గదులుగా మారి ఆ వీధిలోని ప్రజలకి ఆర్యభవన్ ఒక చిడియా ఖానాగానూ (జంతు ప్రదర్శనశాల) లేక శబ్దార్ధ ప్రకారం 'పంజరం' గాను పేరు గాంచింది.

ఆ వీధిలోని వాళ్ళు అనుకున్నట్టుగా బెనర్జీబాబు క్రూరమైన వ్యక్తి కాదు. యువకుడిగా వున్నప్పుడు అతను ఓ ఆదర్శవాది. ఆ సమయంలో ప్రముఖ బెంగాల్ సాహితీవేత్త, మానవతావాది అయిన ఈశ్వర చంద్ర విద్యాసాగర్ ఆలోచనలు అతన్ని ప్రభావితం చేశాయి. బాల్య వివాహాలు, బలవంతపు వితంతుతనాల పట్ల నిరసన తెలియజేశాడు. యువ వితంతువుల దుఃఖవిదారకమైన గాథల్ని విని దుఃఖించాడు, తను ఒక వితంతువు ప్రేమలో పడేవరకు. అతను విద్యార్థి దశలో వున్నప్పుడు జరిగింది ఇది. ఆ వితంతువు ఛటర్జీల ఇంటి ఎదురుగా వున్న ఇంట్లో ఉండేది. ఎవరూ ఆమెని చూసి ఎరగరు. ఆమె జీవించే వుందన్న ప్రచారం మాత్రం ఉండేది. ఎవరైనా సాహసించి చూడాలనుకుంటే తప్పనిసరిగా ఆమె వున్నట్టుగా కొన్ని సంకేతాలు సూచిస్తాయన్న విషయం

కూడా ప్రచారంలో వుంది. అదేమిటంటే ఎవరైనా రహస్యంగా ఆ ఇంటి వెనక్కి వెళ్ళి చెట్టుపైకి ఎక్కి వాళ్ళ పెరట్లోకి తొంగి చూసినట్లయితే తప్పనిసరిగా తెల్లని ముతక చీరలో ఎటువంటి అలంకరణలూ లేని ఓ అమాయకపు ఆకారం గాల్లో వేలాడ్డం గమనించవచ్చు. మృదువైన ఆ నేత చీర బెనర్జీబాబుని ఇబ్బందుల్లోకి నెట్టింది! దానిని శోధించాలని చీర ఆరవేసే సమయంలో ఆమెను అందుకోవాలనుకున్నాడు. కానీ ఉదయం ముందుగానే నిద్రలేచి నిద్రమత్తులో తడబడుతూ నడుస్తూ ఆ చెట్టు దగ్గరకి వెళ్ళేసరికి అతనికి నిరాశ ఎదురయ్యేది. ఒకరోజు అతను కాలుజారి చెట్టు మీద నుండి దభీమని కిందపడి మోచేయి విరగ్గొట్టుకోవడంతో ఇదంతా ఆగిపోయింది. ఇది అతని ఉత్సాహాన్ని చల్లబర్చింది, తన తండ్రి డాక్టర్ కార్ట్‌రైట్‌కి అధిక మొత్తాన్ని చెల్లించాల్సి రావడంతో.

యవ్వనంలో తన అవివేకానికి ఫలితం ఇది. ఆ తర్వాత అతి స్వల్ప కాలంలోనే అతనికి సహజమైన రీతిలో సద్బ్రాహ్మణ కుటుంబ స్త్రీ అయిన దుర్గాదేవితో వివాహమైంది. అప్పుడు ఆమె వయసు పన్నెండు సంవత్సరాల తొమ్మిది నెలలు. ఆమె మేనమామ జూదంలో తన తండ్రి భాగస్వామి (స్టోర్ రూముల్లోను, ఆర్యభవన్ ఆఫీసుల్లోను బెనర్జీబాబు చిన్న తమ్ముళ్ళు చాలామందికి అతను తండ్రి అని పుకార్లు వున్నాయి). అది వాళ్ళని ఆచరణాత్మక కుటుంబంగా చేసింది. డార్జిలింగ్‌లో కొన్ని నెలల పాటు లాంఛనపూర్వకమైన హనీమూన్. రోదించే గ్రామఫోను ముందు సాయంత్రాలు గడిపిన తర్వాత దుర్గాదేవి నలుగురు అందమైన పిల్లల్ని కంది. కూతుళ్ళు లేకపోవడంతో బెనర్జీబాబుకి అపారమైన సంతోషం కలిగింది. తన ఈ సంతోషకరమైన ఆలోచనలతో భార్య ఏకీభవించదేమోనన్న అనుమానం కలిగిందతనికి. పెద్ద కొడుకు బుద్ధదేవ్ ఖాతాలు నిర్వహించే పద్ధతులు, రైతుల నుండి గరిష్ట మొత్తంలో ధనం పిండే మార్గాలు నేర్చుకుంటున్నాడు. రెండోవాడు మహాదేవ్. వట్టి సోమరిపోతు. మూడోవాడు రాందేవ్ మంచి స్కాలర్. ఇకపోతే నాలుగోవాడైన సహదేవ్ చిన్నవాడు. ఏడేళ్ళ వయసువాడు. తనకి తప్ప మరెవ్వరికీ లొంగని ఇలాంటి కఠినమైన వ్యావహారిక పేర్లు పెట్టాడు తన కొడుకులకి బెనర్జీబాబు. మిగిలినవారందరికీ తన కొడుకులు 'కాలూ', 'బిసూ', 'బసూ' ఇంకా 'గులూ'.

క్రూరమైన భూస్వాములుగా బెనర్జీలు ఇతరులతో పోల్చినప్పుడు కొత్తవాళ్ళు. పురోగమిస్తున్న ఈ ఇరవయ్యో శతాబ్దంలో అణచివేతతో కూడిన భూస్వామ్య సంస్కృతి మరుగున పడుతుందనే విషయం వారు అసహనంగా గుర్తించారు. అప్పుడే వారు

మొరటైన ప్రదర్శన తాలూకు చిట్కాలు నేర్చుకోవడానికవసరమైన సాధన సంపత్తిని సమకూర్చుకున్నారు. అది లక్ష్యంగా పెట్టుకుని వాళ్ళు వాళ్ళ హోదా, అంతస్తు మరింత న్యాయబద్ధమైనదిగా, బుద్ధిపూర్వకంగానూ, ఉద్దేశరహితంగాను, వాళ్ళ శత్రువులు, పరిచయస్థులను (వాళ్ళకి స్నేహితులు లేరు) ఆనందింపజేయడానికి ఉత్సవాలు నిర్వహించారు.

ఉదాహరణకి, ఆర్యభవన్‌నే తీసుకుందాం. పెద్ద భారీ నిర్మాణమేమీ కాదది. అది సుప్రతిష్టమైనదే కాక సువిశాలమైంది. ఆ భవనంలో వున్న అన్ని వస్తువులూ పురాతనంగా కనిపించాయి. భవంతి మధ్య ఆవరణలో నున్నగా ఉన్న గుండ్రటి స్తంభాలు సుందరంగా అలంకృతమై వైభవంగా వున్నాయి, ప్రాచీన ఇండియాలోని రాజా విక్రమాదిత్య భవంతిలా ఠీవిగా. ఆవరణకి ఆవలి వైపు చాలా గదులు వున్నాయి. పొడుగాటి కొండ గుహలాంటి ఖైఠక్‌ఖానా లేక ప్రేక్షక హాలు, బ్రహ్మాండమైన 'మహా గని' టేబుల్ వున్న ఒక డైనింగ్ హాలు. బహుశా ఇవన్నీ సందర్శకులని ఆకర్షించడానికి ఉద్దేశించబడిన బెనర్జీ అపూర్వమైన ఆస్తి, కానీ వాస్తవంగా అది వాళ్ళని సంకుచితమైన స్వభావంతో మరుగుజ్జు జాతి మనుష్యులుగా మార్చింది.

అక్కడ ఆఫీసుల కోసం ఒకదాని వెనుక ఒకటి పెద్ద హాళ్ళు వున్నాయి. వాటిలో రెవెన్యూ రికార్డులు వున్నాయి. ఆకస్మికమైన వ్యభిచారుల స్వాగత సత్కారాల కోసం ప్రత్యేకించి గ్రౌండ్‌ఫ్లోర్ వుంది. ఒకవేళ కుటుంబ పెద్ద దీర్ఘకాలిక గృహిణి అవసరం అనుకుంటే వైభవోపేతమైన పై అంతస్తు వుంది. ఇప్పుడు అది పాత ఫ్యాషన్. ప్రస్తుతం అలాంటి సెక్సువల్ సేవలు తాత్కాలికంగా మరోచోటకి మార్చబడ్డాయి. ప్రస్తుతం ఆ స్త్రీల గదిలో మూడో కొడుకు అయిన స్కాలర్ బసు కాలేజీ స్ట్రీట్ నుంచి తిరిగి వచ్చినపుడు తీసుకువచ్చే పెద్ద పెద్ద పాత పుస్తకాలని వుంచాడు. ఆ గది నిండా చిందరవందరగా పడివున్న రకరకాల పుస్తకాలని మిగతా వారెవ్వరూ కనీసం చూడను కూడా చూడరు. బసు కనీసం వాటివంక కనీసం ఓరచూపు చూసే ప్రయత్నం కూడా చేయడు.

ఇవేగాక బెనర్జీబాబుకి విశాలమైన విలాసవంతమైన గదులు వున్నాయి. అతను అక్కడ పడుకుంటాడు, ఇంకా బెనర్జీలను పుట్టించాలన్న కోరిక లేనప్పుడు తన భార్యకి ఉపశమనంగా. ఆ బంగళాలో ముగ్గురు వంటవాళ్ళు వున్నారు. శూద్ర వంటవాడికి ప్రత్యేకంగా వంట గది దూరంగా ప్రహరీ దగ్గర వుంది. అతను బ్రిటిష్ సందర్శకుల కోసం చిత్ర విచిత్రమైన యూరోపియన్ వంటకాలను చక్కగా రుచికరంగా తయారు

చేస్తాడు. ఒరిస్సాకి చెందిన బ్రాహ్మణ వంటవాడు వున్నాడు. అతను కేవలం బెనర్జీబాబు ముసలి తల్లికి తప్ప కుటుంబంలోని మిగవా వారందరికీ వంట చేస్తాడు. మూడో వంటవాడైన భోలా ఆ గ్రామంలోని పురోహితుని కొడుకు. అతను వితంతువులకి మాత్రమే వంట చేస్తాడు. ప్రస్తుతం అతను బెనర్జీబాబు తల్లి ఆహార విషయంలో శ్రద్ధ కనబరుస్తున్నాడు. కుటుంబ పెద్ద అయిన ఆ వృద్ధురాలు మంచం ఎక్కడంతో కొంచెం నూకల గంజి మాత్రమే తీసుకుంటుంది. అయితే ఆ వంటవాడిని అక్కడ వుంచడానికి మరో కారణం కూడా వుంది. ఒకవేళ సిరోసిస్ (కాలేయ సంబంధమైన రోగం) లక్షణాలు కనిపిస్తున్న మహదేవ్ గనుక స్వర్గస్థుడైతే అతని మొదటి భార్యకి వంట చేస్తాడు. బెనర్జీ బాబుకి గనుక ఏదైనా జరిగిన పక్షంలో వెంటనే వంటవాళ్ళ లిస్టులో దుర్గాదేవి కూడా ఉంటుంది.

బెనర్జీబాబు పూర్తి పేరు బిజయేంద్రనాథ్ బెనర్జీ. ఇంగ్లీష్‌లో చెప్పాలంటే బి.ఎన్. బెనర్జీ. వాస్తవానికి సంస్కృతంలో అతని మొదటి పేరు విజయేంద్ర అని వుండాలి, దాని అర్థం జయం పొందినవాడు, ప్రాచీన ఆర్యావర్తంలో దేవదేవుడైన ఇంద్రుడిలా. నాథ్‌కి అర్థం ప్రభువు. మరో విషయం ఏమిటంటే బెనర్జీ అంటే ఏంటో ఎవరూ కూడా నిర్వచించలేకపోయారు. ఆ పదం ఇంగ్లీష్‌లోని బెనిడిక్షన్ పదం నుంచి వచ్చిందని ఆ వ్యక్తి హిందూయిజంకి చెందిన దేవతలందరిచేత ఆశీర్వదించబడినట్టు దాని అర్థం అని బ్రిటిష్ సందర్శకులతో అంటూంటాడు బెనర్జీ. 'బెనర్జీ' పదానికి అధిక ప్రాముఖ్యతనిస్తూ అతను ఆ పదాన్ని ఉచ్చరిస్తాడు. కానీ అతని కొడుకులందరూ ఈ మార్పుని కలిసికట్టుగా వ్యతిరేకిస్తారు. వాస్తవానికి ఆ పేరుకి అర్థం 'బలాన్ని నిషేధించండి' అని బసు నవ్వుతూ బిసుతో అంటుంటాడు. ఎందుకంటే అతని తండ్రి బసు స్కీముల్ని వ్యతిరేకించేవాడు, ప్రపంచంలోని చిన్న చిన్న భాగాలని కాపాడేందుకు.

బసు బెనర్జీ స్కాలర్ అన్నమాటే గాని కాలేజీలో గాని, యూనివర్శిటీలో గాని అతనికి ఎలాంటి పదవి లేదు. అతని పూర్వ అధ్యాపకులు అన్నట్టుగా అతను పదవిలో వుండేవాడే కానీ జమిందారు కొడుకు బ్లాక్ బోర్డు ముందు రోజులు గడపడమా అని తండ్రి అవహేళన చేశాడు. పైగా అది గుమస్తా కొడుకులు చేసే పని అన్నాడు. తను ఎం.ఏ. ఫస్ట్‌క్లాస్‌లో పాస్ అయిన పేరు పాతబడిపోగానే ఒకసారి తన తండ్రి తనతో నువ్వు ధార్మిక శిక్షణ బోధించదలచుకుంటే కింది అంతస్తులోని బైఠక్‌ఖానాని రోజూ వాడుకోవచ్చని సూచించాడు. అది కూడా కేవలం సంప్రదాయ పరాయణులైన వాళ్ళ పిల్లలకి మాత్రమే చదువు చెప్పాలన్న షరతుపైన. అప్పుడు బసు తండ్రితో "మీరు చెప్పే

తరహా పిల్లలకి శాస్త్రాలు చెప్పేదానికన్నా ఆవు పేడ కలిసిన నీళ్ళతో స్నానం చేయడం మెరుగు" అన్నాడు నమ్రతగా. ఆ సమయంలో బెనర్జీ బాబు నుదురు చిట్లించి ఆ మాటలకి అర్థం తెలుసుకునే ప్రయత్నం చేసేలోపలే బసు మీటింగ్‌కి వెళ్ళిపోయాడు. జరిగిన సంఘటన తన తండ్రి మేలు కోరినదైనప్పటికీ తను తండ్రికి నిర్లక్ష్యంగా సమాధానం చెప్పినందుకు మీటింగులో చర్చించాల్సిన విషయంపైన దృష్టి సారించలేకపోయాడు బసు. అదేమిటంటే మార్క్స్ భూస్వామ్య కాలంలో జమ అయిన మూలధనంలా తన బహుమతులన్నిటిని అపరాధ భావనతో త్రోసిపుచ్చారన్న భావన వెంటాడిన బెంగాలులోని జనసామాన్యం ఒకరితో ఒకరు సామరస్యంగా వున్నారా లేదా అన్నది.

ఖాళీ బుర్రలు దయ్యాల కోటలు అన్నది యధార్థం.

"యాన్ ఐడిల్ మైండ్ ఈజ్ ఎ డెవిల్స్ వర్క్ షాప్" అని పాశ్చాత్యం. బెంగాలీ బ్రాహ్మణులు పిశాచాలని నమ్మరు. బౌద్ధులకి వాళ్ళ 'మర'లా, ముస్లింలకి వాళ్ళ 'సైతాన్'లా, ఆత్మలు, సైతానులు నిమ్నకులాల నిష్కారణ భయాలుగా వాళ్ళు భావిస్తారు. కానీ హిందూయిజం ప్రపంచంలో నిజానికి కుమ్మరి, నేత, చర్మకారులు, వడ్రంగి, కమ్మరి ఇంకా ఇతర శ్రామికులు శూద్రులైనపుడు బ్రాహ్మిన్ ప్రక్రియలో 'ఖాళీ బుర్రలు శూద్రుల కోటలు' అనడం సముచితం కాదా? బసు బెనర్జీకి ఈ ప్రశ్నతో సంబంధం వుంది. ఎందుకంటే గత కొద్ది సంవత్సరాలుగా అతను 'దాస్ క్యాపిటల్'ని మధిస్తున్నాడు.

అతను దానిని క్షుణ్ణంగా చదువుతున్నాడు. దాన్ని చదవడానికి చాలా సమయాన్ని వెచ్చించాల్సి వస్తోంది. ముఖ్యంగా మార్క్స్ సిద్ధాంతాలు యూరోపియన్ స్థిరత్వంతో కూడుకున్నవి. అతనికి దాన్ని అనువదించాలన్న భావన కలిగింది. ఇంకా ఈ ప్రాజెక్టులో అతనికి ఎవరి నుండీ ఎలాంటి ప్రోత్సాహమూ లభించలేదు ఒకరి నుంచి తప్ప. అది అతనికి అద్భుతంగా తోచింది; అయితే తనని బాధిస్తున్న విషయం ఒకటి వుంది. ఆ విధంగా అయినట్లయితే 'దాస్ క్యాపిటల్' భావాలు తన చుట్టూ ఓ పటంలా అల్లుకున్నట్లు కన్పిస్తున్నాయి. అతను శూద్ర వంటవాడితో స్నేహపూర్వకంగా మాట్లాడ్డం మొదలుపెట్టాడు. అతని ఇంటి గురించి, ఆచార వ్యవహారాలు, జీవన విధానం గురించి తెలుసుకున్నాడతను. ఆ తర్వాత అతనికి నెమ్మదిగా మార్క్స్ నిమ్నవర్గ భావాలని పరిచయం చేశాడు. తను పూర్వాచారపరాయణ శుద్ధి వైపు మరలకపోతే ఆకలి చావు చస్తానని తన తల్లి హెచ్చరించేంత వరకు. శూద్ర వంటవాడు ఉద్యోగం కోల్పోయాడు. అతనిలానే వుండే తన గ్రామస్తుడు ఒకడు అతని స్థానంలో నియమించబడ్డాడు. ఎవరైనా సులభంగా గుర్తించే ఒకే ఒక తేడా ఏమిటంటే ఈ వంటవాడు సోఫుల్స్ (బ్రెడ్‌తో కూడిన వంటకం) చేస్తాడు కానీ అప్పుడప్పుడు చివర్లు మాడిపోతాయి.

ఇంట్లో గెలవలేకపోవడంతో బసు అధిక సమయం రాడికల్ (అతివాది) సర్కిల్‌లోని స్నేహితులతో గడపసాగాడు. వాళ్ళని వాస్తవ కుటుంబంగా భావిస్తాడతను. డిప్రెషన్‌లో వున్నప్పుడు తప్పనిసరిగా వాళ్ళతో కలసి వుంటాడతను. అతను గుర్రపు బగ్గీ అద్దెకి తీసుకుని కాలేజీ స్ట్రీట్‌లో వున్న ఇండియన్ కాఫీ హౌస్‌కి వెళ్లినపుడు లంచ్ సమయంలో తండ్రిని కలిశాడు. తండ్రితో మాట్లాడుతుండగా అతనికి దుఃఖం తన్నుకు వచ్చింది. మాటల సందర్భంలో తన తండ్రి దక్షిణాన వున్న వేదశాస్త్రి ఇంటికి వెళ్ళిన ట్రిప్పు విజయవంతంగా జరిగిందన్న విషయం అతని మస్తిష్కంలో మెరిసింది. సరిగ్గా ఈ విషయం మాట్లాడే సమయంలో బెనర్జీబాబు అతనికి ఇష్టమైన ఆవాల పేస్ట్‌తో 'హిల్సా' చేపని ఉడికించిన ప్రసిద్ధ డిష్ 'షోర్షె ఐలిష్' తింటున్నాడు. డిష్ నుంచి వస్తున్న ఆవిరిలో పూర్తి వెజిటేరియన్ అయిన వేదశాస్త్రి కనిపించి తన మీద ఆరోపణ చేస్తున్నట్లనిపించింది. బెనర్జీ బాబుకి, వేదశాస్త్రి ఇంట్లో జరిగిన సమావేశంలో తనని గిల్టీగా భావించేలా చేసిన సందర్భం గుర్తుకు వచ్చింది. అయినా సమావేశంలోని మిగతావారికన్నా తనే ఎక్కువ ఆర్థోడాక్స్‌గా భావించాడతను : అది నిజం. అటువంటప్పుడు తనని ఎందుకు అవమానించాలి? ఇది 'మత్స్య న్యాయం' కాదా? ఈ సమాజం సజావుగా నడవడానికి చేపల సిద్ధాంతం.

పెద్ద చేపలు ఎదురుపడిన చిన్న చేపల్ని గుటుక్కున మింగకపోతే, బ్రాహ్మణులు పెద్ద చేపని మింగకపోతే ప్రపంచం తనంతట తాను ఎలా నడుస్తుంది? అప్రియమైన, సందేహాస్పదమైన ఆ క్షణాన పెద్దవాడు అనుభవజ్ఞుడు అయిన బెనర్జీ కొడుకుని చెంపదెబ్బ కొట్టి "ఓ కుల రహిత యూరోపియన్ పుస్తకాల నాస్తిక స్కాలర్, నీ తండ్రి వేదశాస్త్రితో చర్చించిన విషయాలు నీ చెవులకి అపవిత్రంగా సోకాయా" అన్నాడు బిగ్గరగా. బసు పరిహాసంగా శిరస్సు వంచి టేబుల్ దగ్గర నుంచి లేచి వెళ్ళిపోయాడు కోపంగా. వెంటనే తల్లి కలగజేసుకోవడంతో వెనక్కి వచ్చి భోజనం చేసి ఆ తర్వాత బగ్గీ అద్దెకు తీసుకుని తన స్నేహితుల్ని కలుసుకోవడానికి ఆర్యభవన్‌కి వెళ్ళిపోయాడు బసు :

తను ప్రశాంతతను తిరిగి పొందడానికి పాశ్చాత్యతత్వ జ్ఞానం అవసరమనుకున్నాడు బసు. అందుకే అతను కాఫీ హౌస్‌కి రావడం జరిగింది.

జరిగిన సంఘటనతో బెనర్జీ నోరు చేదుగా మారింది. 'హిల్సా' కూడా దాన్ని తొలగించలేకపోయింది. గత రెండు మూడు సంవత్సరాల నుంచి, ముఖ్యంగా కాలేజీ చదువులు ముగిసిపోయి బయటపడిన తర్వాత బసు ప్రవర్తన రోజు రోజుకీ అశాంతిగా మారుతోందని గ్రహించాడతను. బెనర్జీ ఆలోచనలో పడ్డాడు. దీనికి విరుగుడు పెళ్ళి

చేయడం ఒకే ఒక్క పరిష్కారమనిపించింది అతనికి. పెళ్ళి చేస్తే బసు బాగుపడతాడని, భార్యా పిల్లల బాధ్యతలు అడ్డదిడ్డంగా వున్న అతని బుద్ధిని కట్టిపడేస్తాయి. దార్లో పడతాడు అనుకున్నాడతను. ఆ తర్వాత పుస్తకాలలో మునిగితే మునగనీ, సెక్సులోని ఆనందాలు అతని చురుకైన బుద్ధిని గందరగోళపరుస్తాయి. బెనర్జీ అందుకు మానసికంగా సిద్ధపడి సాయంత్రం తమ ఇంటి పురోహితుడిని పిలిచి బసు పెళ్ళి విషయం మాట్లాడాలనుకున్నాడు. కొద్ది వారాలలో దుర్గాదేవి వార్షికోత్సవాలు వస్తున్నాయి. ఆ వేడుకలు, నాటకాలు, సందడి పూర్తి కాగానే తనకి అశాంతిగా వున్న మూడో కొడుకు భవిష్యత్తు వైపు దృష్టి సారించాలనుకున్నాడు బెనర్జీ.

బెనర్జీలు దుర్గా పూజ ఘనంగా నిర్వహిస్తారు. వాళ్ళకి అది పర్వదినం. ఏర్పాట్లు ముందు నుంచీ ప్రారంభమయ్యాయి. విందుకు కావలసిన వస్తువులు, ఇంటి అలంకరణకి సంబంధించిన వస్తువుల్ని దుర్గాదేవి పర్యవేక్షించింది. లాన్‌లో వ్యర్థమైన మొక్కలన్నీ కత్తిరించి శుభ్రం చేశారు. అద్భుతమైన, బ్రహ్మాండమైన దుర్గ విగ్రహం తయారు చేయడానికి ప్రసిద్ధ శిల్పి 'కుమార్ తులి'కి ఆర్డర్ ఇచ్చారు. ఎన్నో బాహువులతో ఆకర్షణీయంగా వున్న మహిళ పెద్ద బల్లెంతో రాక్షసుడిని క్రూరంగా చంపుతున్న రూపంతో పాటు మిగిలిన చేతులలో ఆధ్యాత్మిక ప్రాముఖ్యత కలిగిన వివిధ రకాల ఆయుధాలు ధరించిన రూపంతో వున్న శిల్పం. చనిపోతున్న రాక్షసుడి రక్తం దేవి పాదాల మీద నుంచి పారుతున్నట్లుగా వుండాలని, ఆ సృష్టికర్త నోట్లోంచి నాలుక బైటకి వేలాడేలా వుండాలని శిల్పికి ప్రత్యేకించి చెప్పాడు బెనర్జీబాబు. బెనర్జీబాబు కుటుంబానికి తాంత్రిక సంబంధాలు వున్నాయి. మండపంలో అతని దుర్గాదేవి బలి విధానం నగరమంతటా ప్రాశస్త్యం పొందింది. బద్ధ శత్రువు రక్తం పారుతున్న వేడుక – శూద్ర లేక దళిత శత్రువు. అదీకాక – హిందువుల వేడుక అది.

తన తండ్రి తన పట్ల చేస్తున్న ఆలోచనలు తెలియని బసు సిగరెట్టు పొగతో నిండిన కాఫీహౌస్‌లోకి ప్రవేశించి కొండ గుహలా వున్న దాని చుట్టూ చూశాడు తన గ్రూప్ వాళ్ళ కోసం. బసుని చూడగానే చాలా చేతులు అత్యుత్సాహంతో గాల్లోకి లేచాయి. బసు తరచుగా అక్కడికి వస్తుండటంతో అతను చాలా మందికి తెలుసు. అతను తన సీట్లో కూర్చోగానే స్వంత ఇంటికి వచ్చిన అనుభూతి కలిగిందతనికి. అక్కడంతా సిగరెట్టు పొగ దట్టంగా కమ్ముకున్నప్పటికీ తన తండ్రి అస్పష్ట కులతత్వపు చీకట్లో కాకుండా తన అసలు స్థానం ఇదేనని అన్పించిందతనికి. అక్కడ వున్న వాళ్ళంతా కోరస్‌గా అతనికి అభినందనలు తెలిపారు. అక్కడే వున్న బిజయ్ కుమార్ సన్యాల్ సిగార్ పైపుని స్టైల్‌గా

ఊపుతూ ఉత్తేజకరంగా అధునాతన స(ర్రి)యలిస్ట్ ఆర్టు గురించి మాట్లాడుతున్నాడు. అనిల్ బాధురి ముఖం ముడుచుకుని సిగరెట్‌ని టేబుల్ కింద వుంచే ప్రయత్నం చేస్తున్నాడు. గుంపులోని వాళ్ళందరూ బూర్జువా వినోదాల గురించి చర్చలో అనవసరంగా సమయాన్ని వృధా చేస్తుండటంతో తన్మయ్ వాళ్ళ వైపు తిరస్కార భావంతో చూశాడు.

రజత్‌రాయ్ అన్నీ వింటున్నట్లుగా నటిస్తూ తన ప్రావీణ్యంతో సన్యాల్‌ని దెబ్బకొట్టే అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు, సెకండ్ హ్యాండ్ లండన్ వార్తా పత్రికలని తిరగేస్తూ. సునీతి కుమార్ సేన్ ఎందుకో మరి రహస్యంగా 'పంజికా' (పంచాంగం) తిరగేస్తున్నాడు. ఆ 'పంజికా'లో తిథి, వార, నక్షత్ర, పక్ష మాసాదులతో పాటు వివిధ మత సంబంధిత విషయాలు, గృహ సంబంధిత సలహాలు ఇంకా వాస్తుకు సంబంధించిన అర్ధం పర్ధంలేని విషయాలు చాలానే వున్నాయి. గాయత్రి, అందమైన గాయత్రీరాయ్ అతని వైపు చూస్తోంది. దాంతో బసుకి బుగ్గలు వేడెక్కినట్లు అన్పించింది. బసు చికాకుని గమనించి ఆమె చూపు తిప్పుకుంది. బసు సంభాషణ మీద దృష్టి సారించాడు.

"... ఈ ఆర్ట్ విప్లవానికి సంబంధించినది. అదే స్వయానా ఎర్ర సైన్యం."

'నాన్సెన్స్' అంటూ తన్మయ్ గుహ పళ్ళు నూరాడు. ఆర్ట్ మొత్తం బూర్జువా తరహాకి చెందినది. శ్రామిక వర్గాలు మిగిల్చిన ఆదాయంపైన ఆర్టిస్టులు జీవిస్తారు. వాళ్ళు ప్రకాశించే రంగులతో వుండే పరాన్నభుక్కులు తప్ప మరేమీ కాదు. మేధావులకి కూడా వర్తిస్తుంది ఇది." తన్మయ్ గుహ పోస్టల్ క్లార్క్. మిలియన్‌ల శ్రామికులలో తానూ ఒకడన్న విషయం గుంపులోని వారిని మర్చిపోనివ్వడు తన్మయ్ గుహ.

అయితే స(ర్రి)యలిస్టులు దీని గురించి తర్కించడానికి ఒప్పుకోరని 'టైమ్స్ ఆఫ్ లండన్'లో పోర్టర్ హెడ్లే అంటాడు. అందువలన తప్పనిసరిగా వర్గ పోరాటంతో సంబంధం వుంది?' అందుకు రజత్‌రాయ్ చౌదరి అభ్యంతరం తెలిపాడు.

"ఏంటి నీ ఉద్దేశం?" అడిగింది గాయత్రి.

"మంచిది. కారణం ఏమిటంటే పెట్టుబడిదారీ విధానం ధనికుల వ్యవస్థకి చెందిన అణచివేత..."

"మీ విషయంలో అది సుస్పష్టమే" అన్నాడు చెంపపెట్టులా తన్మయ్ గుహ. అసలు ఈ ఆర్టిస్టులకి డబ్బు ఎవరు ఇస్తున్నారు? నిధులెలా వస్తున్నాయి? నోరులేని పేదవాళ్ళ దగ్గర నుంచి కాదా?

"నాకు తెలిసినంతవరకు వాళ్ళకి ఎవరూ నిధులు ఇవ్వడం లేదు" అంటూ ఖండిస్తూ బసు "నిధి వాళ్ళే సమకూర్చుకుంటున్నారు. ఆంద్రీ బ్రెటన్ ఓ డాక్టర్" అన్నాడు.

"నేను నీకు చెప్పిందేంటి? స్వలాభార్జనే ధనికుల వ్యవస్థ ధ్యేయం.

"అది సమంజసమా?" అంది నెమ్మదైన స్వరంతో గాయత్రి.

గాయత్రి ఓ మహిళా కళాశాలలో టీచర్. తరచుగా ఆమె వాళ్ళ గ్యాదరింగ్స్‌కి వస్తుంటుంది రెండు కప్పుల టీ తాగడానికి. అంతకుమించి ఎన్నడూ తాగదు. మాట్లాడే ముందు ఒకటికి రెండుసార్లు ఆలోచించి మాట్లాడుతుంది ఆమె. అందువల్లే ఇతరులు ఆమె మాటలని వినాలనుకుంటారు ఒక మహిళ తమకి చెప్పేదా అంటూ తరచూ ఆశ్చర్యపోయినా.

గాయత్రి మాటలు బసుని తాకాయి. బసు చెప్పడం కొనసాగించాడు. "అతను బాంబు దాడుల్లో గాయపడ్డ సైనికులకి చికిత్స చేసేవాడు. అతని గర్విష్టి డాక్టర్లలో ఒకడు కాదు."

ఇంతలో "సునీతా!" అంటూ తన్మయ్ అడ్డు తగిలి "నీ చేతిలో వున్నది ఏంటి?" అడిగాడు.

సునీతి కుమార్ అప్పటికే సమయం మించిపోవడంతో తన చేతిలో వున్న పుస్తకాన్ని ఏమాత్రం దాచలేకపోయాడు. డాబుగా వుండి చవగ్గా ప్రింట్ అయిన 'పంజిక'ని తప్పు చేసినవాడిలా చేతిలో గట్టిగా పట్టుకున్నాడు. తన్మయ్ వణుకుతున్న చేతులతో దాన్ని లాక్కున్నాడు.

"పనికిమాలిన చెత్త. బహు చెడ్డ మూఢాచారాల, సంప్రదాయాల తెలివితక్కువ వ్యవహారం! సునీతీ, నాకు తెలుసు నువ్వు సర్వధర్మభ్రష్టుడవని."

"కానీ అది నా భార్య కోసం!" దృఢంగా అని సునీతి కుమార్ "మా చంటాడి అన్నప్రాశన ఎప్పుడు చేయాలో నిర్ణయించమంది మా ఆవిడ. నేను మంచి ముహూర్తం కోసం ఎదురుచూస్తున్నాను" అన్నాడు.

"అన్నప్రాశనా!" అన్నాడు తన్మయ్.

"నువ్వు నీ కష్టార్జితాన్ని ఈ చిల్లరతంతుల మీద ఎందుకు ఖర్చు చేస్తావు! అది నీ బిడ్డని సంతోషపరుస్తుందా?" అన్నాడు తన్మయ్ మళ్ళీ.

"నా భార్యని మాత్రం తప్పకుండా సంతోషపరుస్తుంది" అన్నాడు సునీతి కుమార్.

"ఇక్కడ నేను తన్మయ్‌తో ఏకీభవించాల్సి వుంటుంది" అన్నాడు బసు. ఇవన్నీ పురాతన కాలం నుంచీ వస్తున్న నిరర్థక సాంఘికాచారాలు. నువ్వు ఎటువంటి ఒత్తిడికి గురికాకుండా వాటిని దృఢంగా నిరోధించాలి. 'ప్రపంచాన్ని మార్చాలి' లాంటి మాటలు చెప్పడం సులువే. కానీ మనంతట మనం చిన్నవాటితో మొదలుపెట్టాలి. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ అన్నది అదే.

"ఈశ్వరచంద్ర ఓ బూర్జువా తరగతివాడు!" అన్నాడు తన్మయ్ ఆవేశపడకుండా. "అవును, సునీతీ నువ్వు వెన్నెముక లేనివాడివి. అన్నప్రాశన చేయనని మీ ఆవిడకి చెప్పు."

"కానీ సునీతి భార్యది ఓ విభిన్నమైన నమ్మకం. ఆమె నమ్మకాలకి ఎలాంటి హక్కులూ ఉండవా?" అడిగింది గాయత్రి. అక్కడ వున్నవాళ్ళ కనుబొమ్మలు ముడిపడ్డాయి. "ఆమెని సమాజం భయపెట్టింది" అంటూ బసు "ఎందుకు కాకూడదు? సమాజం శక్తివంతమైంది" అన్నాడు.

"ముఖ్యంగా మహిళల పట్ల" అంది గాయత్రి.

"ఆహా, కానీ మహిళలు కోరుకున్న వాటిని నెరవేర్చుకోడానికి వాళ్ళ మార్గాలు వాళ్ళకి వున్నాయి" అన్నాడు రజత్.

"అవును" అన్నాడు సునీతీ కుమార్ చిన్నబుచ్చుకుంటూ.

"నా భార్య నిజంగా తను అనుకున్నది చేసి తీరుతుంది. నేను ఆమెతో తర్క వితర్కాలతో వాదించగలను.

కానీ ఏదో రకంగా ఆమె గెలుపు సాధిస్తుంది."

"నువ్వు మామూలుగా నిరాకరించు" అన్నాడు అనీల్ బాధురి. అతను మితభాషి.

"నువ్వు మత రహిత అన్నప్రాశన ఎందుకు చేయకూడదు?" అడిగింది గాయత్రి.

"మీ చంటాడికి మొదటిసారి అన్నం పెడుతున్నట్టుగా చెప్పి అందరిని ఆహ్వానించు. అంతే తప్ప పురోహితుణ్ణి పిలవటం, ఆచార వ్యవహారాలంటూ హడావిడి చేయకు. నీకు డబ్బు కూడా ఆదా అవుతుంది" అంది గాయత్రి.

ఆ మాటలకి సునీతి కుమార్ కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"ఎంత గొప్ప ఐడియా! అవును, అది నా సమస్యని పరిష్కరిస్తుంది. థాంక్స్ గాయత్రీ. నేను ఇప్పుడే వెళ్ళి మా ఆవిడకి చెప్తాను. సరే గుడ్‌బై, మళ్ళీ కలుద్దాం."

అందరూ సంతృప్తి చెందినట్టుగా కనిపించారు.

ఒక్క తన్మయ్ మాత్రం స్థిరంగా వున్నట్టు కనిపించాడు. మహిళలు ప్రజా జీవితంలోకి రావడాన్ని అతను సమ్మతించడు. అతను గాయత్రికి మాత్రం అడ్డు చెప్పడు. ఎందుకంటే ఆమె అకౌంట్స్‌ని ఓ దేవతలా వుంచుతుంది. తన భార్య అయితే వంటింటిలోను, పెరట్లోను మౌనంగా గడపడంలోనే తృప్తి పడుతుంది.

వాళ్ళు పార్టీ వ్యవహారాలు మాట్లాడుకోసాగారు. వాళ్ళంతా కమ్యూనిస్టు పార్టీ సభ్యులు. కానీ వారిలో సిద్ధాంత విభేదాలున్నాయి. అయితే సునీతికుమార్, బసు మాత్రం అంటీముట్టనట్టు వుంటారు. రజత్ లాంఛనపూర్వక సభ్యుడు. తన్మయ్ స్థానికంగా ఉండే గ్రూప్ కో-ఆర్డినేటర్. గాయత్రి సెక్రటరీ, ఇంకా కోశాధికారి. ఉన్నతాధికారులకి అనీల్ అస్పష్టంగా గోచరిస్తాడు. మితభాషి అయిన అనీల్ మొదటిసారి ఆ గ్రూపులో కలిసినపుడు అతన్ని పోలీస్ ఇన్‌ఫార్మర్‌గా అనుమానించారంతా. కానీ అతనికి పార్టీకి చెందిన సెంట్రల్ హైకమాండ్ వాళ్ళతో దగ్గరి సంబంధాలున్నట్లుగా వాళ్ళకి ఆ తర్వాత తెలిసింది. అతను వాళ్ళని రహస్యంగా గమనిస్తున్నట్లయితే దానితో ప్రభుత్వానికి ఎలాంటి సంబంధం లేదు.

గుంపు లేచే సరికి చాలా సమయమైంది. "పదండి మీ ఇంటి వరకు మీకు తోడుగా వస్తాను" అన్నాడు బసు. ఇది సాధారణ విషయమే. దాంతో ఆమె అభ్యంతరం చెప్పలేదు.

కొంచెం దూరంలో వున్న 'ధర్మతల్ల' దగ్గర వున్న గాయత్రి ఇంటికి ఇద్దరూ నడక సాగించారు. వాళ్ళు సంతోషంగా ఎన్నో విషయాలని ముచ్చటించుకున్నారు.

"మా నాన్న మూడ్ ఈ రోజు బాగాలేదు" అంటూ మాట్లాడ్డం మొదలుపెట్టాడు బసు. "తన సౌత్ ఇండియా ట్రిప్పు ఎలా జరిగిందని మా నాన్నని అడిగాను. అలా అడగటం అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. రోజు రోజుకీ ఆయనలో నా పట్ల అసహనం పెరిగిపోతోంది. ఎందుకో మరి" అన్నాడు బసు. సంభాషణలు బహుశా ఇలాగే ప్రారంభమవుతాయేమో? తన సమస్యలని ఆమెతో చెప్పుకుంటూడతను. వాటిని విని తనకి తోచిన సలహా ఇస్తుంది ఆమె. "ఆయన నీ జీవితం ఒక దారిన పడేలా చేయాలనుకుంటున్నాడు. నువ్వు ఆయన్ని విసిగిస్తున్నావు" అంది నెమ్మదిగా గాయత్రి.

"హా! ఆయనకి ఇంకా వున్నారు. బాధ్యత గల కొడుకు, 'కలు' సామ్రాజ్యాన్ని హస్తగతం చేసుకోవడానికి సిద్ధంగా వున్నాడు. 'బసు' ఓ పనికిమాలినవాడు, ఆ ముసలాడికి విచారం కలిగిస్తూ బాధపెడ్తున్నాడు. 'గులు' అతనికి ప్రేమపాత్రుడు. అటువంటప్పుడు అతనికి ఇంక నా మీదేముంటుంది?

బసు తిరగబడేతత్వం గలవాడు.

"నీది విశాల హృదయం గాయత్రీ" అన్నాడు బసు. గాయత్రి ఆ మాటకి నవ్వుతూ భుజాలెగరేసింది.

వాళ్ళు ముందుకు సాగుతున్నారు. బసు సాధారణంగా సిటీలోని వీధుల్లో నడుస్తున్నప్పుడు కొద్దిగా అశుభ్రంగా వున్నట్టు భావిస్తాడు కానీ గాయత్రీ దేవి తన ప్రక్కన వుంటే అలాంటి భావన కలగదు. ఆమె ఓ చమత్కారపూరిత ఆకర్షణ గలది. తను ఎక్కడ జీవించాలనుకుంటున్నాడో, తన తల్లి కల్మష నీడల భయం గురించి చెప్పకపోవడం, తన తండ్రి కొత్తవాటిని గురించిన భయాలని తన మనసులో చొప్పించకపోవడం లాంటివన్నీ తిరిగి తెలుసుకునేలా చేసింది. తన పెంపకంలోని మూఢవిశ్వాసాలు, తీసుకున్న నిర్ణయాలు అన్నీ నాన్సెన్స్ అని తన తెలివితేటలు రుజువు చేశాయి. కానీ తన కండలు, పేగులకి తెలిసిందంతా భిన్నమైనది. వాళ్ళు శూద్రుల కప్పులోని టీని జీర్ణం చేసుకోలేరు. అపవిత్రుల ఇంటి ప్రవేశమార్గం దాటుకుని పోలేరు. అందుకు అతను విచారించాడు.

తను వీటిని కొంత మర్చిపోవడం కేవలం గాయత్రి చేసే గారడీ అనుకున్నాడతను. తన ఆలోచనని గాయత్రి ఆ క్షణంలో పసిగట్టిందేమోనని ఒక్కక్షణం ఆమె కళ్ళలోకి చూశాడు బసు. అతను వేళ్ళని తన జుత్తులోకి పోనిచ్చి సిగ్గు అభినయించాడు. కానీ ఆమె తను ఉదయం తీసుకున్న క్లాసు గురించి వివరించసాగింది సున్నితంగా, వినోదభరితంగా.

వాళ్ళు గాయత్రి ఇంటి దగ్గరకి చేరుకోగానే గుడ్‌బై చెప్పుకున్నారు. గాయత్రి ఒంటరిగా వుంటోంది. తోడుకోసం ఓ పనిమనిషిని పెట్టుకుంది. అందుకని ఆమె ఇంటివరకూ వెళ్ళకుండా జాగ్రత్త వహిస్తాడు బసు. సందు మలుపు దగ్గర నుంచుని ఆమె ఇంట్లోకి వెళ్ళి చేతులు ఊపేంతవరకు వేచి వుంటాడు. ఆ తర్వాత ఖాళీగా వున్న గుర్రపు బగ్గీని మాట్లాడి సౌకర్యవంతంగా కూర్చుని తన ఇంటికి వెళ్తాడు. ఈ రోజు బగ్గీ డ్రైవర్‌కి టిప్పు ఇచ్చి గుర్రాన్ని వేగంగా పరిగెత్తించమన్నాడు! ఇంట్లో అందరితో పాటు కూర్చుని డిన్నర్ చేయకపోతే తన తండ్రి నిగ్రహం కోల్పోతాడన్న ఉద్దేశంతో.

సరిగ్గా సమయానికి ఇంటికి చేరుకోగలిగాడతను. కట్లరీ శబ్దాలు, తన తండ్రి లండన్‌లో రెండు వారాలుండి సివిల్ సర్వీస్ పరీక్షల్లో ఫెయిల్ అయిన విచారం తప్ప డిన్నర్ ప్రశాంతంగానే జరిగింది.

భోజనానంతరం స్వీట్ పెరుగు తినడం పూర్తి అయిన తర్వాత బెనర్జీబాబు "బసూ! నా స్టడీరూంలోకి రా.. నీతో మాట్లాడాలి" అన్నాడు. బసు ఆశ్చర్యంతో తండ్రిని అనుసరించాడు. బెనర్జీ బాబు డెస్క్ ముందు కూర్చుంటూ "రామ్ దేవ్, నీకు పెళ్ళి చేయాలని నిర్ణయించాను. మంచి సంబంధం కోసం పురోహితుడికి పురమాయించాను. దుర్గా పూజ అయిన తర్వాత ఓ నెలరోజుల్లో వేడుక జరుగుతుంది. ఇందుకు నువ్వు సిద్ధంగా వుండాలి."

బసు ఒక్కసారిగా నోరెళ్ళబెట్టి ఆ తర్వాత మూశాడు. అది తన కొడుకు ముఖంలో ఎన్నడూ చూడని దృఢమైన రేఖగా గోచరించింది తండ్రికి.

'మంచిది, నాన్నా' అంటు బసు "కానీ అమ్మాయిని ఎంపిక చేసుకునే అధికారాన్ని నాకు ఇవ్వండి" అన్నాడు.

బెనర్జీ బాబు అతని వైపు తీక్షణంగా చూస్తూ "ఎంపిక చేసుకోవడానికి ఏముందని? మన ఇంటి పురోహితుడు హరిలాల్‌ని నువ్వు శంకిస్తున్నావా? మీ అన్నయ్యల పెళ్ళిళ్ళు అతనే చేశాడు. నీ పెళ్ళి ఏర్పాట్లు కూడా అతను చేయగలడు.

"అతను అలాంటి ఇబ్బందులేవీ పడకుండా అతన్ని నేను రక్షిస్తాను. ఈ విషయంలో ఆ పురోహితుడికి మీరు డబ్బు ఇచ్చే పని లేకుండా చేస్తాను. నేను ఇష్టపడే అమ్మాయి ఎవరో నాకు తెలుసు. ఆమె పేరు గాయత్రీరాయ్. ఎం.ఎ. వరకు చదువుకుంది. కాలేజీలో టీచర్‌గా పనిచేస్తుంది. 'ధర్మతల్ల' దగ్గర వుంటుంది. నేను అగ్రహయన మాసం పదో తేదీన ఆమెని పెళ్ళి చేసుకుంటాను. సునీతి కుమార్ 'పంజిక' ప్రకారం ఆ రోజు శుభప్రదమైనది కాకపోవడంతో ఆ తేదీని ఎంచుకున్నాను. నేను మీ అనుమతి లేకుండా పెళ్ళి చేసుకోదలచుకున్నాను కాబట్టి హిందూ పక్షపాతిగా నడుచుకోవాల్సిన అవసరం లేదని భావిస్తున్నాను.

"ఏమిటీ, రాయ్! రాయ్! నువ్వు ఓ కాయస్థని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నావా? ఓ సంపాదనపరురాలు? నువ్వు..." కుటుంబ పెద్ద అయిన బెనర్జీ నోటి వెంట మాటలు రావడం లేదు. మొహం బూడిద రంగులోకి మారింది. శిలా విగ్రహంలా వుండిపోయాడు. బసు గది తలుపులు తీసుకుని బయటికి వెళ్ళిపోవడాన్ని అలానే చూస్తూ వుండిపోయాడు.

మరునాడు ఉదయం బసు ఆలస్యంగా నిద్రలేచాడు. గత రాత్రి జరిగిన సంఘటన పీడకలగా అనిపించిందతనికి. అతను బ్రేక్‌ఫాస్ట్ చేయడానికి కూర్చుంటుండగా అక్కడ ఎలాంటి మార్పు కనిపించకపోవడంతో తన జ్ఞాపక శక్తి మీద సందేహం

కలిగిందతనికి. నిజంగా తను కీలకమైన వంశానుగత అంశం పైన బెనర్జీ పెద్దరికాన్ని తిరస్కరించాడా? రాత్రి జరిగింది నిజమేనా? అసాధారణంగా అన్నలిద్దరూ బ్రేక్‌ఫాస్ట్ చేస్తున్నారు. సాధారణంగా ముందుగా బసు ఆ తర్వాత కలు బ్రేక్‌ఫాస్ట్ చేయడం పరిపాటి. అలాంటిది ఆ ఇద్దరూ ఒకేసారి బ్రేక్‌ఫాస్ట్ ముందు కూర్చోవడంతో బసుకి ఆశ్చర్యం కలిగింది. కొన్ని క్షణాల తర్వాత "బాబాకి బాగుండలేదు. నేను వెళ్ళి డాక్టర్‌ని తీసుకురావాలి" అన్నాడు కలు.

"బాగా లేదా?" బాధగా అంటూ బసు "ఏం జరిగింది?" అని అడిగాడు.

"కడుపులో నెప్పిగా ఉందంటున్నాడు. కొద్దిగా బార్లీ నీళ్ళు కలిపి ఇచ్చింది మృదుల." మృదుల కలు భార్య. "రాత్రి బాగా పొద్దుపోయేంతవరకు ఆయన నిద్రపోలేదు" అన్నాడు కలు బసు వైపు ఉదాసీనంగా చూస్తూ.

"ఓ అలాగా" అన్నాడు బసు. "అది వినాలంటేనే బాధగా వుంది" అన్నాడు. బసు వెక్కిళ్ళు పడుతున్నట్లుగా అనిపించింది. 'ప్చ్'... అంటూ కలు పెదాలు చప్పరించాడు.

వర్ష రుతువు చివరి రోజు కావడంతో ఉదయం మేఘాలతో మందకొడిగా వుంది. బెనర్జీబాబు ఇంట్లో అంతా సందడిగా వుంది. ఇత్తడి పూజా సామాగ్రి మెరుగు పెడుతున్నారు. పెరట్లో స్టాండ్స్‌పై వున్న ఇత్తడి దీపాలని వరుసగా పేర్చి, ఊకతోను చింతపండుతోను రుద్దుతున్నారు. ఆ వాసన బసుకి చిరాకనిపించింది. గొడుగు తీసుకుని బయటకి వెళ్ళిపోయాడు. ఇప్పుడు అతనికి స్నేహపూర్వకంగా మాట్లాడే వ్యక్తుల అవసరం ఎంతైనా వుంది.

బసు కాఫీహౌస్‌కి రాగానే ఎవరూ కనిపించకపోవడంతో ఎవరూ రాలేదనుకున్నాడు. సరిగ్గా అప్పుడే ఓ కార్నర్‌లో వార్తాపత్రిక తిరగేస్తూ గాయత్రి కన్పించింది. బసు గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. ఆమె ఒంటరిగా వున్నప్పుడు కలుసుకోవడానికి తను సిద్ధంగా లేడన్న విషయం అతనికి తెలుసు. కానీ మరోవిధంగా ఆలోచించినవాడై అదృష్టాన్ని ప్రసాదించిన ఈ క్షణాన్ని వదులుకోకూడదని అనుకున్నాడు. అతను గాయత్రి కూర్చున్న టేబుల్ దగ్గరకు వెళ్ళి కుర్చీ వెనుక చేతులేసి "కూర్చోవచ్చా" అన్నాడు నవ్వుతూ. పరిచితమైన గొంతు వినబడటంతో తలెత్తి చూసింది గాయత్రి. ఇప్పుడు గాయత్రిని చూస్తే అందంగా లేదనిపించింది అతనికి; కనీసం తన తండ్రి, ఇతర కుటుంబ పెద్దలు ఆమోదించేటంతటి అందంగా కూడా లేదని అనిపించింది. ఆమె చక్కనైంది కాదు. మొహం గుండ్రంగా లేదు. కళ్ళు పెద్దవిగా లేవు. అన్నిటినీ

మించి ధనికులకు పుట్టిన చతురతతో స్వయంతృప్తి గల స్త్రీగా కనిపించడం లేదు. అందుకు ప్రతిగా ఆమె నుదుటిపైన గీతలు స్పష్టంగా గోచరిస్తున్నాయి. కళ్ళద్దాలు తీసిందేమో ముక్కు మీద రెండు పక్కలా మచ్చలు కన్పిస్తున్నాయి. అయినప్పటికీ ఆమె నవ్వుతున్నప్పుడు చూపులు ఆ విధంగా వుంటాయని తను ఎన్నడూ గుర్తించలేదు. గాయత్రిని ఆ విధంగా పరీక్షించాల్సిన అవసరం లేదు. మాట్లాడేటప్పుడు తనలోకి తాను వెళ్ళిపోతుందామె. అయినా తన హృదయంలో స్థానం ఏర్పరచుకున్నది ఆమె మొహం కాదు, ఆమె మనసు.

"వాళ్ళు రావడానికి లేట్ అయినట్టుంది" అంటూ ఆమె "నువ్వు వచ్చినందుకు సంతోషం. ఒంటరిగా కూర్చోవాలంటే చిరాకు" అంది.

అతను నవ్వుతూ "నువ్వు ఒంటరిగా కూర్చున్నావన్న ఆలోచన నేను ద్వేషిస్తాను. నీ అంతట నువ్వు అస్పష్టంగా వుండే ప్రయత్నం చేస్తున్నట్టుగా గమనించాను" అన్నాడు.

ఈ మాటలకి ఆమె ముఖంలో మబ్బు తెర దాటుకుని వెళ్ళినట్లనిపించింది బసుకి. తను అనుచిత ప్రసక్తి తీసుకువచ్చాడని అతనికి తెలియదు.

"అయితే ఈ యుద్ధం గురించి నీ అభిప్రాయం ఏంటి? ఆ గంభీర వాతావరణాన్ని తేలిక పరచడం కోసం టాపిక్ మార్చే ప్రయత్నం చేశాడతను.

"నేనేమనుకుంటున్నానో తెలుసా" అంటూ ఆమె "యుద్ధాలు మానవ జాతిని చిన్నాభిన్నం చేసే ప్రభంజనం" అంది.

"కానీ ఈ యుద్ధం భిన్నమైనదని ఒప్పుకుంటావా? ఆ హిట్లర్ బ్రిటిషర్స్‌కే కాదు, మన అందరికీ శత్రువు.

ఆమె పల్చగా నవ్వి అంది. "ఇప్పుడు అతను స్టాలిన్‌తో విభేదించాడనడంలో ఏమాత్రం సందేహం లేదు."

బసు ఆమె వంక మెచ్చుకోలుగా చూస్తూ "ఒక విధంగా దాన్ని సాహసం అనవచ్చు. లేదా అవివేకం అనవచ్చు. ఒక్కోసారి పెద్దగా వ్యత్యాసం అంటూ ఏమి ఉండదు" అన్నాడు. "బేరర్!" అని పిలిచి వాళ్ళు కాఫీ ఆర్డర్ చేశారు.

ఆమెకి విషయం ఎలా చెప్పాలో తెలియక తికమకపడ్డాడు బసు. ఇప్పుడు ఆమె తన ఎదురుగా వుండటంతో గుండె గొంతుకలో కొట్టుకులాడింది. అనుకోకుండా తండ్రి ముందు ఆమె పేరుని బయటపెట్టిన ఆవేశం ఇప్పుడు తనకి ఉపయోగించదు. తన తొందరపాటుతనానికి చింతించాడు బసు.

అతని కళ్ళలోకి చూసిన ఆమె... అతని మనసు ఏదో సంఘర్షణకి లోనవుతున్న విషయాన్ని గమనించింది.

"ఏమైంది, అలా వున్నావు?" అడిగింది.

"నాన్నగారు నా పెళ్ళి ప్రస్తావన మొదలుపెట్టారు" అని కింద పెదవి కర్చుకున్నాడు. ఆ విషయం బయట పెట్టాలని అనుకోలేదతను.

"ఓహో!" అంటూ ఖాళీ కప్పుని ఇటూ అటూ కదుపుతూ ఆమె.

"అందువల్ల నీకు వచ్చిన ఇబ్బంది ఏంటి?" అంది.

"ఎందుకంటే నేను పెళ్ళి చేసుకోవాలని ఇష్టపడే అమ్మాయి ఒప్పుకుంటుందో లేదోనని" అన్నాడు బసు. ఓ వింతైన దుస్సాహసం అతని రక్తాన్ని వేడెక్కిస్తోంది.

"నీ అంతట నువ్వే ఎంపిక చేసుకున్నావా? అయితే మీ నాన్న ఆదర్శ భావాలు కలిగిన మనిషన్న మాట."

"లేదు, అతను బాగా ముసలివాడు. నీ సంగతేంటి?"

"మా నాన్నా? మా నాన్న ఎప్పుడో చచ్చిపోయాడు. నీకు తెలుసనుకున్నాను. కలరా. 1939లో."

"అవును, ఆమె ఒకసారి ఈ విషయం తనతో అన్నట్టు గుర్తుకు వచ్చింది బసుకి. ఇంతలో కాఫీ వచ్చింది. ఆమె కప్పు నోటి దగ్గర పెట్టుకుంటూ కప్పు అంచు మీంచి అతని వైపు చూస్తూ "అయితే ఆ అమ్మాయి ఎవరు?" అదేమైనా రహస్యమా?" అడిగిందామె.

బసు నవ్వుతూ "అది రహస్యమే కానీ నీ నుంచి కాదు."

"నిజంగానా? ఆమె నాకు తెలుసా?"

"నిజానికి బాగా తెలుసు."

ఆమె అతని వంక చూస్తుండటంతో ఆమె చేతులు సన్నగా వణకడం గమనించాడతను. అయినప్పటికీ కాఫీ కప్పు చప్పుడు కాకుండా టేబుల్ మీద పెట్టిందామె. ఆమె ముఖం వర్షం కురిసే ముందు మబ్బులా నల్లగా మారింది.

"నువ్వంటున్నది...?" అంది ఆమె రొప్పుతూ.

"లేదు, నేను ఎలా...?" అది క్రూరమైనదని అతనికి తెలుసు. కానీ ఏదిఏమైనా ఈ ఆట అతన్ని ఉత్సాహపర్చింది. నేను రంజనిని ఇష్టపడుతున్నానని ఎలా అనుకోగలవు?"

రంజని ఊరి శివారు ప్రాంతంలో స్కూలు నడుపుతున్న ఓ మహిళ. అప్పుడప్పుడు వాళ్ళ మీటింగ్‌లకి హాజరవుతుంది. "లేదు.. అంతకన్నా నీకు బాగా తెలిసిన మరో మనిషి."

ఆమె కనుబొమ్మలు ముడిపడ్డాయి. "ఆహా, నేనే ఊహించాలని అనుకుంటున్నావా? అయితే సరే, అది... ఊ... మైత్రేయి?" మైత్రేయి ఓ సామాజిక కార్యకర్త. అప్పుడప్పుడు ఆమె గ్రామాల్లో పంచి పెట్టడానికి ఆహారం, పాత బట్టలు డొనేట్ చేస్తూంటుంది. ఆమె శూన్యదృక్కులతో చూస్తూ "నన్ను ఆలోచించనివ్వండి. నేను దానికన్న మంచి మార్క్సిస్ట్‌ని."

"అయితే మంచిది. కమల కాకపోవచ్చు. అవునా?" గాయత్రి వుండే సందు మొదట్లో కమల టీ స్టాల్ నడుపుతుంది. "వేడెక్కుతోంది" అంటూ పళ్ళికిలించాడతను.

"అలాగయితే నువ్వు సాధారణ ప్రజల నిజమైన స్నేహితుడివి" అంది ఆమె ఎగతాళిగా. "నీకు తెలిసినదానికన్నా ఎక్కువే" అన్నాడతను నవ్వుతూ.

"ఓహో? అయితే నీ స్త్రీ తక్కువదా?"

"నా కన్నా తక్కువే. కానీ కేవలం ప్రపంచం దృష్టిలో మాత్రమే."

"అయితే ఆమె ఓ అరుదైన నిధి అయ్యుంటుంది."

"ఆహా నిజమే. ఆమె ఓ నిధి, ఒకవేళ ఆమె ఒప్పుకుంటే ఆమె నాకన్నా తక్కువ అనుకున్న వాళ్ళందరికీ అది అబద్ధమని నిరూపిస్తాను.

నేను ఆమెని జీవితంలోని కష్టాల్లోంచి పైకి తీసుకువచ్చి సమాజంలో ఆమెకి ఒక గౌరవప్రదమైన స్థాయిని కల్పిస్తాను.

గాయత్రి నవ్వుతూ "అది నీ దయార్ద్ర హృదయానికి నిదర్శనం. కానీ సీరియస్‌గా చెప్తున్నాను. నేను ఈ ఆటలో అలసిపోయాను. సూటిగా చెప్పు. నువ్వు ఇష్టపడ్డ అమ్మాయి ఎవరు?" అంది.

ఈసారి ఆమె అవాక్కయింది. చూపులు గిరుక్కున మరల్చుకుని తన బ్యాగ్ తీసుకుని లేచింది. విభ్రాంతితో ఆమె వంక చూశాడు బసు. "నేను ఏదైనా అంగీకరించేదాన్ని" అంటూ గాయత్రి "అనాలోచిత నిర్ణయం, వినసొంపుగా లేని విషయం, నిరాలోచన విషయాలు ఏదైనా నేను అంగీకరించేదాన్ని, ఈ ఒక్క విషయం తప్ప. నువ్వు నన్ను పరిహసించావు బసూ, అవమానించావు. దయచేసి నన్ను అనుసరించకు" అంది.

ఈ హఠాత్పరిణామానికి బసు నిశ్చేష్టుడయ్యాడు. "వెళ్ళిపోకు గాయత్రీ వెళ్ళిపోకు. ఇది ఆట మాత్రమే" అన్నాడు. కానీ అప్పటికే ఆమె టేబుళ్ళ వరుసల మధ్య నుంచి వేగంగా బయటికి వెళ్ళిపోయింది. ఆమె వెనకే వేగంగా బయటికి వెళ్ళాడు బసు. అక్కడున్న జనాలని చూసి అతని తల తిరిగింది. ఆమె కనిపించలేదు. కిటకిటలాడుతున్న జనసందోహం మధ్య నుంచీ దోవ చేసుకుని అంతలోనే హఠాత్తుగా ఎలా మాయమైంది? అనుకున్నాడతను. అతను రిక్షా మాట్లాడి ఆమె ఇంటికి వెళ్ళాడు. అతను అక్కడికి చేరుకునేసరికి ఇంటికి తాళం వేసి వుంది. ఆమె ఇంకా ఇంటికి రాలేదా లేక తనకన్నా ముందే వచ్చి వెళ్ళిపోయిందా అన్నది బసుకి అర్థం కాలేదు. గుమ్మం దగ్గర వున్న మెట్ల పైన కూర్చున్నాడతను. పరిశుభ్రమైన తెల్లని ధోతీకి... అభద్ర దుమ్ము అంటుకుంటుందేమోనన్న విషయం లెక్క చేయకుండా. ఇప్పుడేం చేయాలి? తను ఆమెకి కోపం తెప్పించడమే కాదు. తన తండ్రితో కూడా తన పరిస్థితి ఇరకాటంలో పడ్డట్టయింది. ఇలాంటి ఇబ్బందికరమైన పరిస్థితిలో ఇరుక్కోవాల్సి వస్తుందని తనెప్పుడూ అనుకోలేదు. ఏ యువతి కోసమైతే తను బెనర్జీ కుటుంబాన్ని రొంపిలోకి లాగాడో అదే యువతి ఇప్పుడు తనని కోరుకోవడం లేదని కుటుంబ పెద్ద, వృద్ధుడు అయిన బెనర్జీతో ఎలా చెప్పాలి? అయితే ఆ దిగులు ఐదు నిమిషాల్లో తొలగిపోయింది ఆమె ఇంక ఎన్నటికీ వెనక్కి తిరిగి రాదన్న ఆలోచన రావడంతోను అది తన మంచికే అన్నట్టుగా.

దుమ్ము, ధూళితో అపరిశుభ్రంగా వున్న ఆ వీధి అకస్మాత్తుగా తనని చూసి పళ్ళికిలించినట్లనిపించింది బసూకి. అతను గబగబా అక్కణ్ణించి బయటపడి ఇంటికి వెళ్ళడానికి ఓ బగ్గీని మాట్లాడుకున్నాడు.

బసు సమావేశాన్ని పరీక్షించాడు. సుమారు అరవై మంది వరకూ వున్నారక్కడ; తను ఎన్నడూ చూడనంత అభివృద్ధి. వాళ్ళు నవీన్ సన్యాల్ ఉపన్యాసం వినడానికి వచ్చారు. నవీన్ సన్యాల్ సింఘ్ భూమికి చెందిన ఓ ప్రచండమైన యువ ప్రచారకుడు. ఉపన్యాసాలివ్వడంలో దిట్ట. సింఘ్ భూమిలో ఆదివాసులని క్యాడర్లుగా విభజించే పని నిర్వహిస్తున్నాడతను. అతనిలో కొత్త కొత్త ఆలోచనలు ఎన్నో వున్నాయి. ప్రజలని మంత్రముగ్ధుల్ని గావించే ఉపన్యాసకుడతను. అతని మాటలు వినడం బసూకు ఇదే మొదటిసారి.

ఉపన్యాసకుడిని సభలోని వారికి పరిచయం చేయడానికి పోడియం వద్దకు చేరుకున్నాడు బసు.

'కామ్రేడ్స్' అంటూ ఆరంభించాడు బసు.

బెంగాల్‌లోని పశ్చిమబంగ ఆదివాసీల గురించి కామ్రేడ్ సన్యాల్ అనుభవాలు, పార్టీ పరిధిని విస్తరించడంలో విజయవంతమైన అతని విధానాలు తెలుసుకోవడానికి మనం ఇక్కడ సమావేశమయ్యాం. మార్క్స్ సిద్ధాంతాన్ని గ్రామీణ బెంగాల్‌లో సంఘటితపర్చడానికి ఆయన చేసిన ఎన్నో గొప్ప గొప్ప పనులను గురించిన కథలు మీరు వినే వుంటారు. ఇప్పుడు వాటిని స్వయంగా ఆయన మాటల్లోనే మీరు వింటారు..

కామ్రేడ్ సన్యాల్...

ఉపన్యసించడానికి ఆతురతతో పోడియం పైకి ఎక్కాడు కామ్రేడ్ సన్యాల్. అతను సన్నగా వున్నాడు. లోతైన మెరిసే కళ్ళు. స్వరం బిగ్గరగా వుంది. ఉపన్యాసంలో వేగం వుంది. వింటానికి వృద్ధులు కొంత ఇబ్బంది పడ్డారు.

ప్రియ సోదర, స్నేహిత కామ్రేడ్స్' అంటూ మొదలుపెట్టాడు ఆయన.

"నేను ముందుగా మీకందరికీ చెప్పవలసిన విషయం ఒకటుంది. నేను మాట్లాడే విషయాలు నా స్వంత అనుభవాలు కావు. శ్రామికులు ఇంకా బాధపడ్తున్న మానవ జాతిలో భాగంగా నేను బాగా పరిశీలించి పరిశోధించిన సత్యాలు మీకు చెప్తాను.

అందువల్ల నేను మాట్లాడేదంతా నా స్వంత అభిప్రాయమన్న విషయం, ప్రాముఖ్యత చాలా స్వల్పమైంది. ప్రియమైన స్నేహితులారా, మీలో ఒకడిగా ఈ రోజు నేను ఇక్కడికొచ్చింది 'ఆకలి' గురించి చర్చించడానికే. నిజం చెప్పాలంటే ఆకలి మానవుడి అంతిమానుభూతి. ఇంత పెద్ద సంఖ్యలో గుమిగూడిన మీలో ఎవ్వరూ కొంతవరకైనా ఆకలిని అనుభవించి వుండరు. నాతో సహా. ఆకలి అనుభవించినవాడికి గాని దాని బాధ తెలీదు. అది తెలియాలంటే పేదవాడిగా పుట్టాలి."

ధాటిగా ఉపన్యసించిన ఆయన ప్రసంగానికి మంత్ర ముగ్ధులయిన కొందరు వ్యక్తులు 'హియర్' , 'హియర్' అంటూ ప్రశంసించారు. ఓ వ్యక్తి 'వాహ్, వాహ్' అన్నాడు. అందరి కళ్ళూ ఆ వ్యక్తిని చూడ్డంతో అతను సిగ్గుపడ్డట్టు కనిపించాడు.

"ఎటువంటి ప్రజానీకం ఆకలిగొన్నవారిగా జన్మిస్తారు?" అంటూ కామ్రేడ్ సన్యాల్ చెప్పడం కొనసాగించాడు. "అసలు ఎందుకు మన సమాజంలో ఆహారం పండించే రైతులకి, నేత పనివారికి, నీడనిచ్చే తాపీ మేస్త్రీలకి, పాత్రలు శుభ్రం చేసేవాళ్ళకి, మన పరిసరాల్ని శుభ్రపరిచే పారిశుధ్య పనివాళ్ళకి, ఇంకా జీవితంలో అత్యవసరమైన నీటిని

మోసేవాళ్ళకి అవమానం కలిగించే రీతిలో వైరుధ్యం ఎందుకు ఏర్పడింది. వాళ్ళు ఆకలి బాధతో అలమటించేవాళ్ళు." పేదలైన శ్రామికుల గురించిన ఆలోచన రావడంతో బసు కళ్ళు చెమ్మగిల్లాయి, సౌకర్యవంతమైన జీవనం కోసం శ్రమించినా ఆ ఫలాలని అనుభవించడానికి ఎప్పటికీ అనుమతించబడని ఆచార వ్యవహార నిబంధనలతో. నిజంగా ఇది దుష్ట సంప్రదాయ విధానం అనుకున్నాడు బసు.

"చాలా సమయాల్లో" అంటూ మొదలుపెట్టాడు కామ్రేడ్ సన్యాల్, "ఇది మనకి అరుదుగా కన్పిస్తుంది. ఎందుకంటే మనం స్కూలుకి వెళ్ళింది మన చుట్టుప్రక్కల జరిగే అన్యాయాలని చూడ్డానికి కాదు. కానీ కామ్రేడ్స్, ఇది ఎంతోకాలం వుండదు. బెంగాల్‌లోని రోడ్ల పైన, పొలాల్లోను సంపద సృష్టించేవాళ్ళు మరణిస్తున్నారు. తిండి కోసం నూలు వడకడానికి, బట్టలు నేయడానికి, పొలం దున్నడానికి వాళ్ళు చాలా బలహీనంగా వున్నారు. తమ దగ్గరున్నది తినేశారు వాళ్ళు. ఇప్పుడు వాళ్ళ గుండెల్లో దాచుకున్న సొమ్ముతో మార్కెట్లో ధాన్యాన్ని కొనలేకపోతున్నారు. ఇది దుర్భిక్షం. నా ప్రియమైన మిత్రులారా, అదేంటో మీకు ఎన్నటికీ తెలియదు. ఎందుకంటే మార్కెట్లో సులభంగా ధాన్యం లభ్యమయ్యే సమయంలో నెలలో రెండు బాటిల్స్ తక్కువ కాకుండా విదేశీ మద్యం కొనడమే కాక మీరు ఏ విధంగా చితికిపోయారో ఏకరువు పెడ్తారు."

"వాళ్ళు మరణిస్తున్నారు, కామ్రేడ్ సేన్" అన్నాడు సన్యాల్. 'నా ఈ చేతులతో నేను నా ప్రాణ స్నేహితుడిని ఖననం చేశాను. బెంగాల్ అంతటా క్షామం నెలకొంది. పేదలు పశువుల స్థాయికి పడిపోయారు. కానీ వాళ్ళ కథలు విని మీరు చలించిపోకండి. ఇప్పుడు నా దగ్గర స్వయానా బ్రిటిషర్స్ తయారుచేసిన గణాంకాల దొంతర వుంది. గ్రామీణ జనాభాలో మూడో వంతు వచ్చే సంవత్సరం మరణించే అవకాశం వున్నట్టుగా ఈ గణాంకాలు తెలియజేస్తున్నాయి. మీకు అర్థమైందా? ఇలా జరుగుతుందని పాలకులకి తెలుసు. గతంలో కరువు కాటకాల్ని పరిశీలించినట్టుగా దీన్ని కూడా వాళ్ళు పరిశీలించారు. ఏం జరుగుతుందన్నది వాళ్ళకి తెలుసు. అందుకు వాళ్ళు ఏమైనా చేస్తున్నారా? లేదు, ఎందుకంటే బర్మాలో వున్నవాళ్ళ సైనికులకి తక్కువ రకం బియ్యం అవసరం. యుద్ధ సమయంలో బెంగాల్ రైస్‌కి చెందిన చిన్న వడ్ల గింజ కూడా వాళ్ళు మళ్ళించలేదు.

"కానీ మనం అక్ష రాజ్యాల శక్తులతో పోరాడాలి" అన్నాడు వెనుకనించి ఎవరో.

"మనం సోషలిస్టులం. వాళ్ళు జాతీయ సోషలిస్టులు. రష్యా వాళ్ళని ఎదుర్కొంటోంది. తటస్థ దేశమైన పోలెండ్‌కి వ్యతిరేకంగా వాళ్ళు కలహం ఆరంభించారు. కాని పోలెండ్ బెంగాల్‌ని పోషించదు. వాళ్ళతో మనకి ఎలాంటి ప్రాంతీయ విభేదాలూ

లేవు. అటువంటప్పుడు ఎదుర్కోవాల్సిన అవసరం మనకేముంది? ఇంకా జపనీయులు? వాళ్ళు మనలాగా వరి అన్నం తినే ఆసియన్‌లు. మీరు పశ్చిమ దేశానికి చెందిన తెల్లవాడితో పరిపాలించబడుతున్నారా లేక తూర్పున వుండే ప్రాచ్య దేశీయులతో పరిపాలించబడుతున్నారా?

"అసలు మనం ఎవరిచేతో ఎందుకు పరిపాలించబడాలి?" అంది గాయత్రి.

"అయితే నువ్వు సుభాష్ చంద్రబోస్ పట్ల సానుభూతి గలవాడివిగా భావిస్తాం" అన్నాడు అనీల్ బాధురి సన్యాల్‌తో. అతను కామ్రేడ్ సన్యాల్‌ని ఎగాదిగా చూడ్డంతో అతని కళ్ళద్దాలు తీక్షణంగా మెరిశాయి.

"నేను కేవలం నా శ్రామిక తమ్ముళ్ళ పట్ల సానుభూతి వ్యక్తపరిచాను. వాళ్ళు ఎందుకు చావాలని నేను అంటున్నాను. అందువలన బ్రిటిష్ దళాలు అడవి మార్గంలో వుండగా వాళ్ళని మేపవచ్చు.

"కానీ, అక్ష రాజ్యాల శక్తులని వ్యతిరేకించడంలో ఓ నియమం ఇమిడి వుందని నువ్వు అంగీకరించాలి. వాళ్ళు చెప్పేది అదే. వాళ్ళ జాతి ఆధిక్యం గురించి, మిగిలిన జాతుల కీడు గురించి ఇంకా అవి ప్రమాదకరమని?"

"ఖచ్చితంగా ఎలా?" అని నవ్వాడు కామ్రేడ్ సన్యాల్. "నువ్వు మాత్రం అలాంటి ఆధిక్యత ప్రదర్శించడం లేదా. ఓ మత్స్యకారుడిని గుళ్ళోకి రానివ్వకుండా ప్రతీసారి ఆపుతున్నావు. క్షురకుడు ఒకసారి వాడిన గ్లాసుని మరొకసారి ఉపయోగించడం లేదు. ప్రతిసారి బండి తోలేవాడి నీడ నీ మీద పడి దాటిపోయినపుడు ఆ నీడ కూడా అపవిత్రం అనుకుని నీడని కూడా సహించలేని స్థితిలో నువ్వు నీట మునగడం లేదా?"

"మరి ఇది కూడా అలాంటిది కాదా?" అంటూ పెద్దగా అరిచాడు రజత్‌రాయ్ చౌదరి. గత నెల వార్ టైం స్పెషల్‌లో స్టీవెన్ బెక్స్ లీ రాశాడు. జర్మనులు, ఆర్యన్‌లు అన్న విషయం అసత్యమని, వాళ్ళు తప్పుడు ఇంకా దుర్మార్గమైన పరిశోధనా క్రమంలో వాళ్ళ సైద్ధాంతిక సూత్రాలతో వాళ్ళ అభిలాష మేరకు శాస్త్రాలని తప్పక అర్థం చేసుకున్నారు. మనం నిజమైన ఆర్యులం. వాళ్ళు కాదు. ఆధిపత్యం గురించిన వాళ్ళ హక్కు తప్పుడు పాండిత్యం మీద ఆధారపడింది.

"అంతా గందరగోళంగా వుంది" అన్నాడు కామ్రేడ్ సన్యాల్ అప్రసన్నమైన ఏకాగ్రతతో. "అంటే... మనం నిజమైన నాజీలమనా నువ్వనేది."

"కామ్రేడ్, కామ్రేడ్స్" అన్నాడు బసు నెమ్మదిగానే అయినా దృఢస్వరంతో అందరినీ తనవైపు ఆకర్షించేలానూ, తను చెప్పేది వినాలన్న ఉద్దేశంతోనూ. "మనం ఇక్కడ సభని సమావేశపరచింది ఆదివాసుల్ని చైతన్యపరచడంలో కామ్రేడ్ సన్యాల్ సాధించిన విజయాలని గురించి వినడానికి. ఈ సమావేశంలోని చర్చనీయాంశం మర్చిపోకూడదు" అన్నాడు బసు.

"థాంక్యూ కామ్రేడ్" అంటూ సన్యాల్ "నేను మీ అందరికీ చెప్పదల్చుకున్నది ఏమిటంటే మనం కులాల గురించి చర్చించకుండా వర్గం గురించి చర్చించడంలో ఎలాంటి అర్థమూ లేదు. కులం ఇండియా వర్గం. కులం ఇండియా జాతి. ఒకవేళ ఆ రెండింటికీ మనం వ్యతిరేకం అయితే కులానికి కూడా మనం వ్యతిరేకం అవ్వాలి. కమ్యూనిస్టులుగా ఈ విషయాన్ని చర్చించడం మన విధి అని భావిస్తాను నేను. ఆ తర్వాతే మనం ఆదివాసీల గురించి మాట్లాడాలి. వాళ్ళు హిందూ విధానంలో భాగం కాదు, కానీ నువ్వు వాళ్ళని హిందూ సాంఘిక వ్యవస్థలో నిరంతరం అమర్చడానికి వాళ్ళలో అట్టడుగున ఓ కొత్త కులాన్ని కల్పించి క్రమానుగతంగా ద్వేషాన్ని రగిలిస్తున్నావు.

"ఈ పిచ్చికూతలు నేను వినదల్చుకోలేదు" కసిరినట్టుగా అన్నాడు రాయ్ చౌదరి. 'మనం కామ్రేడ్ సన్యాల్‌ని మనతో మాట్లాడేందుకు అతను తన ఆలోచనలని సవరించుకున్న తర్వాత, తనలో స్పష్టత కలిగిన తర్వాత పిలవాలని నా ఆలోచన. ప్రస్తుతం అతను చెప్పిన విషయాలు కొన్నే అయినా అవి ఈ సమయంలో విలువైనవే కాక పనిలో తలమునకలుగా వుండే ప్రజల భాగస్వామ్యంతో కూడినవి."

అప్పుడే ఓ మిరాకిల్ జరిగింది. గాయత్రీరాయ్ చౌదరి భుజంపై చెయ్యి వేసింది. అది కేవలం యాదృచ్ఛిక చర్య. కానీ ఎక్కడో పొడిచినట్లయిన కామ్రేడ్ రాయ్ చౌదరి గొర్రెలా ఒక్క గెంతు గెంతాడు. గాయత్రి సహనశీలిగా, స్నేహితురాలిగా నవ్వుతూ కామ్రేడ్ రాయ్‌చౌదరి వైపు చూసింది. తనలో తాను గొణుక్కుంటూ తన సీట్లో కూర్చున్నాడతను.

ఆ తర్వాత ఉపన్యాసాన్ని కొద్దిసేపే విన్నాడు బసు. అతను ఆకర్షణ గొలిపే ఆ క్షణం గురించిన ఆలోచనలో మునిగిపోయాడు. ఆ క్షణం వెండి తెరలాంటి తన మనోఫలకం మీద మాటి మాటికీ కదలాడుతోంది నేపథ్య సంగీతంతో. ఆమె నిజానికి మహారాణిలా వుంది. మాటలు శాసించే ధోరణిలో వున్నా సున్నితంగా, నమ్రతగా వున్నాయి. ఓ నిజమైన భద్ర మహిళ! ఆ సంఘటన జరిగిన తర్వాత ఆమెగాని, తను గాని కాఫీ హౌస్‌లో చిన్న మాట కూడా అనుకోలేదు. రెండు వారాలు గడిచాయి. ఈ మధ్యలో ఆ విషయం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా తనను తాను నిందించుకున్నాడు

బసు. మిగతా గొంతులు తనని తాకుతూ పోయాయి. అవన్నీ కులాన్ని ఖండిస్తూ గర్జించాయి. ఎంతటి నయవంచకులు! వాళ్ళ వాళ్ళ పిల్లల్ని చెప్పులు కుట్టే వారికిచ్చి పెళ్ళిళ్ళు చేస్తారా? తన్మయ్ గుహ అన్నిచోట్లా కామ్రేడ్స్‌ని సమర్థించడానికి మహిళల కర్తవ్యం గురించి మాట్లాడిందంతా నాన్సెన్స్. ఎందుకంటే కమ్యూనిజం బూర్జువా తరహా వివాహాల సాహస ప్రభావాన్ని సమర్థిస్తుంది. కామ్రేడ్ గుహ ఈ వ్యాఖ్యానం చేసినపుడు గాయత్రి పెదాలు విరవడం తను గమనించాడు. ఓ గొప్ప శ్రేయస్సు బసులో అలలా తోసుకువచ్చింది. అలాంటి స్త్రీ తప్పనిసరిగా తనని పూర్తిగా తిరస్కరించలేదు తను తెలివితక్కువ వ్యాఖ్యలు చేసినప్పటికీ. తను వాళ్ళ ప్రాంతంలోని వ్యత్యాసాలని అంత కఠోరంగా గుర్తు చేయకుండా వుండాల్సింది. అలా మాట్లాడినందుకు తనని తానే మందలించుకున్నాడు. తను మరోసారి ప్రయత్నించాలి. అది మాత్రమే వాస్తవం. కాఫీ హౌస్‌కి త్వరలో మళ్ళీ వెళ్ళాలని భావించాడు బసు.

దుర్గా పూజ రావటమూ, వెళ్ళిపోవటమూ కూడా జరిగిపోయింది. బసుకి ఆ పండగ పెద్దగా రుచించలేదు. ఈసారి ఆ పండగ కేవలం తన కుటుంబంతో తనకున్న బేధాభిప్రాయాలని బహిర్గతపర్చింది. పెళ్ళి సన్నాహాలు మొదలైనాయంటూ దగ్గరివాళ్ళు మాట్లాడిన మాటలు అతను సహించాడు.

బసు విచారించాడు. తన తండ్రితో మొదటిసారి సంభాషణ తర్వాత మళ్ళీ తన వివాహం గురించిన ప్రసక్తి ఆయన తీసుకురాలేదు. ఆ ముసలి గొర్రె మళ్ళీ ఏం ఎత్తుగడ వేస్తోందో? తన తండ్రి ఎటువంటి అరుపులు అరవకపోవడం, అబ్బిరిదిబ్బిరిగా మాట్లాడ్డం ఇప్పుడు చేయకపోవడంతో తను చేసిన దానికి బసు విచారించాడు. కనీసం తనున్న పరిస్థితి తను తెలుసుకుని వుండాల్సింది.

కాళీ పూజ దగ్గర పడుతోంది. దాని తర్వాత వెంటనే 'భ్రాత్రి ద్వితీయ' వస్తుంది. ఆ రోజు బెంగాలీ సిస్టర్స్ అందరూ వాళ్ళ సహోదరులని ఆశీర్వదించి వాళ్ళు చిరాయువులుగా వుండాలని దీవిస్తారు. బసు గాయత్రిని తప్పించుకుంటున్నాడు, నుదుటి పైన వున్న చందనం పేస్ట్‌తో ఆమె తనని చంపుతుందేమోనన్న భయంతో. ఆ తర్వాతి పండగల పిదప వచ్చే మధురమైన రుతువులతో వాతావరణం పొడిగా వుండి, ఆకాశం నీలవర్ణానికి మారిన తర్వాత తను ఆమెని కలిసి మాట్లాడాలని అనుకున్నాడతను.

పార్టీ కోసం పూర్తి సమయాన్ని వెచ్చించేవాళ్ళు చల్లదనంతో కూడిన వాతావరణాన్ని అవకాశంగా తీసుకుని దేశాన్ని చుట్టి రావాలనుకోవడంతో సిటీలో పార్టీ పనులు ఇప్పుడు చురుకుగా సాగటం లేదు. బసు బాధ పడలేదు. ఎందుకంటే తనకి

తెలుసు. గాయత్రి ఉద్యోగానికి అతుక్కుని వుందన్న విషయం. అంతేకాదు, ఈ మందకొడి వాతావరణం తను ఆమెతో మాట్లాడి పనులు చక్కబెట్టుకునే అవకాశం కల్పిస్తుందన్న సంగతి కూడా తనకి తెలుసు. వాస్తవానికి ఒకరోజు కరువు సహాయం చేయడానికి సన్యాల్ పెద్ద మూటతో స్టేషన్‌కి వెళ్తున్నప్పుడు తను కలిశాడు. అప్పుడు తను తన ఎడమచేతి చూపుడు వేలికి వున్న ఉంగరం తీసి సన్యాల్ చేతిలో వుంచాడు.

"వాళ్ళకి ఆహారం కొనేందుకు" దీనిని ఉపయోగించండి. 'వాళ్ళు' అంటే ఎవరో చెప్పవలసిన అవసరం లేకపోయింది బసుకి.

సన్యాల్ దగ్గర నుంచి బయటపడగానే తనకున్న వాక్పటుత్వం పట్ల, తనకున్న పరిజ్ఞానం పట్ల బసుకి సందేహం కలిగింది. తను రెక్కలున్న చిన్న దేవదూత గదిలోంచి బయటపడగానే తను గాయత్రితో మాట్లాడవలసిన విషయాలని మదిలో బేరీజు వేసుకున్నాడు. అదేం పెద్ద విషయం కాదు గానీ ఇందులో ఆమె తప్పు వుంది. ఆమె అర్థం చేసుకున్నది చాలా స్వల్పం. అయినప్పటికీ తను అలా మాట్లాడటం అమర్యాదకరం అని అర్థం చేసుకున్నాడు. ఇందుకు ప్రతిగా ఆమె ప్రవర్తన ఎంత అన్యాయంగా వుందో సుతిమెత్తగా ఆమెకి తెలియజెప్పే మార్గం అన్వేషించాలని అనుకున్నాడు. అసలు తనలాంటి అంతస్తు గల వ్యక్తి ఓ మెట్టు దిగి తక్కువ స్థాయికి వెళ్ళాలనుకునే వ్యక్తి ఆమెకి ఎక్కడ లభిస్తాడు? ఆమె ఉద్యోగస్తురాలు. బ్రాహ్మణ స్త్రీ కాదు. అయినా ఆమె పట్ల తనకి ప్రతికూల అభిప్రాయం లేనప్పుడు ప్రపంచం ఆమెని ఎలా చూస్తుందోనన్న విషయం తనకి తెలుసు. ఇప్పుడు ఈ ఆలోచనా ప్రవాహంలో దాగి వున్న శిలలు తన ప్రణయ నావ కింద అడ్డుపడి అవి ఏర్పరచిన వాడిని కారణంగా చూపుతుందా? శ్రమతో కూడిన ఆమె జీవితానికి, ఏకాంతానికి తను సంపదని, సర్వస్వాన్ని త్యాగం చేసి ఆమెకంటూ ఓ స్థాయిని కల్పించడం తనకి సాధ్యమయ్యే పనేనా? సభల్లో ఆమె మాట్లాడిన మాటలు, ఆమె చదివిన గ్రంథాలు, స్పష్టమైన ఆమె ఆలోచనలు ఎలా వున్నప్పటికీ ఆమె స్త్రీయే. ఒక స్త్రీకి నుదుటన సింధూరం రక్షణ కవచం లాంటిది. అది పరిహసించే ప్రపంచాన్ని అధిగమిస్తుంది.

"నేను ప్రతిపాదించేది కూడా అదే అనుకున్నాడు బసు. భద్రత. భద్ర ప్రపంచంలో ఓ స్థానం. నిజానికి చెప్పాలంటే అంతకన్నా ఎక్కువే. నేను ఆమె కోసం సమాజాన్ని, కుటుంబాన్ని, ఇంకా నా తల్లిదండ్రులని కూడా ఎదిరించడానికి సిద్ధపడ్డాను. ఆమె కోసం నా ఇంటిని కూడా వదిలేయదల్చుకున్నాను..." అనుకున్నాడు బసు.

బసు గది మధ్యలో నిల్చుని కింద ఎరుపు వర్ణంలో రెక్కలు కలిగిన దేవదూత చిత్రాన్ని తీక్షణమైన చూపులతో చూశాడు. నిజంగా తండ్రి తనని బైటకి గెంటేస్తే! ఏం చెయ్యాలి? ఎక్కడికెళ్ళాలి? ఎలా బ్రతకాలి? అకస్మాత్తుగా తన మదిలో గాయత్రి పేద మొహం తను చూసిన విధంగా కాక మరో విధంగా చతురస్రంగా – తనెన్నడూ చూసి వుండలేదు. కానీ బహుశా పీడకలలు వచ్చినపుడు తనకు తాను ఇరుకైన పడక మీద చాచుకుని పడుకున్న సమయంలో చూసి వుంటాడు. అర్థం లేదు! డబ్బు కోసం యువ దంపతులు ఏం చేయాలి? తను... తను వాళ్ళు ఇవ్వజూపిన టీచర్ ఉద్యోగం అంగీకరించాలి. తను కూడా ఆమెలాగే ఉద్యోగం చెయ్యాలి. శరీరంలో ఓ రకమైన భయం పాకినట్లయింది బసుకి. కానీ వెనకాలే దాని దృఢత్వం వీడినట్లయింది. చాలా మంచిది. తను ఎల్లప్పుడూ పేదవారిని చూసి అసూయ చెందేవాడు. వాళ్ళ జీవితాలు నిరాడంబరమైనవి. దుర్గంధభూయిష్టమైన ఆమె అంధకారం కోసం తను తన విలాసాలని, ప్రకాశవంతమైన తన ఇంటిని వదులుకోవాలనుకున్నాడు. బసు తన టేబుల్ దగ్గర దృఢచిత్తంతో కూర్చుని 'దాస్ క్యాపిటల్' తెరిచాడు. జీవిక కోసం తను చదవాల్సింది, నేర్చుకోవలసింది ఎంతో వుంది. రజకులు, వాటర్‌మెన్ ఇంకా రిక్షావాళ్ళలాగా తను గోచీ బిగించి తన మదిలోని పొలం దున్నడాన్ని కల్పనలో ఊహించుకున్నాడు బసు.

బసు గుర్రపు బగ్గీ కోసం చేత్తో సైగ చేశాడు. వెంటనే చటుక్కున వెనక్కి గెంతాడు.

తన చేతిలోంచి గుడ్డ మూట జారి కాళ్ళ మీద పడినట్లనిపించింది! అతను తల వంచి కింద వున్న శవం మొహాన్ని చూశాడు. అది పురుషుడిదీ కాదు స్త్రీదీ కాదు. ఆ తర్వాత కేక పెట్టి డ్రైవర్ ఆసరా లేకుండా తనంతట తాను బగ్గీలో ఎక్కాడు. పెద్దగా శబ్దం చేస్తూ బండి కదిలింది.

'రోజూ ఇలా చాలానే వుంటాయి' అన్నాడు బగ్గీ డ్రైవర్. ఈ గిరాకీ పిచ్చాపాటీ మాట్లాడే గిరాకీ అని డ్రైవర్‌కి తెలుసు. బసుతో మాట్లాడటానికి డ్రైవర్ ఇష్టపడ్తాడు.'

"అవును" అన్నాడు బసు వినీవినబడనట్లుగా. "నేను వాళ్ళకి డైమండ్ రింగ్ ఇచ్చాను" అంటూ బసు వీధిలో మరిన్ని మూటల్ని చూడాల్సి వస్తుందని మొహం తిప్పుకున్నాడు.

కాఫీ హౌస్ అంతా ఖాళీగా వుంది. తెలిసినవాళ్ళు ఒక్కరూ లేరు. గాయత్రిని గురించిన అన్వేషణ ఫలించలేదు. బసు కొంత కలత చెందాడు. గాయత్రి పనిచేస్తున్న కాలేజీకి వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు బసు. అక్కడికి వెళ్తే ఆమె సెలవు మీద వున్నట్టు తెలిసింది. బసు ఆమె ఇంటికి వెళ్ళాడు. ఇంటికి లావుపాటి కప్ప తాళం వేలాడటం చూసి విస్తుపోయాడు.

బసు తిరిగి వెళ్ళిపోవడానికి వెనక్కి తిరుగుతుండగా 'హే' అన్న శబ్దం వినిపించింది.

ఆమె పనిమనిషి 'మినోతి'. వృద్ధాప్యం మీద పడిన మనిషి. గాయత్రి ఇంట్లో పార్ట్ టైం పనిచేస్తుంది. ఆమె కిర్రు కిర్రుమని శబ్దం చేస్తూ కోలాహలంగా బసు దగ్గరకి వచ్చి ముందుకు వంగి గోడను ఆసరాగా చేసుకుని నిల్చుంది. 'ఎవరూ, నువ్వా' అంది బిగ్గరగా బసు వంక చూసి. బసు ఆమె వైపు విసుగ్గా చూశాడు.

"ఆమె వెళ్ళిపోయింది. ఎప్పుడు వస్తుందో తెలియదు. ప్రతీ ఆదివారం ఎప్పుడైనా ఓసారి వచ్చి చూస్తుండమని చెప్పి వెళ్ళింది" అంది.

"ఎక్కడికి వెళ్ళింది?"

"చెప్పలేదు. ముఖ్యమైన పని వుంది. వెళ్ళి తీరాలి అని చెప్పి వెళ్ళిపోయింది. నాకు రూపాయల కట్ట కూడా ఇచ్చింది. ఓ నెల రోజులలో గనుక తను రాకపోతే తన కోసం రావద్దని చెప్పి వెళ్ళింది" అంది దృఢంగా.

"ఆమె ఒంటరిగానే వెళ్ళిందా?" అడిగాడు బసు తప్పు చేశానన్న ఉద్వేగంతో.

"అనుకుంటా" అంది మినోతి బసుని సంకుచిత దృష్టితో చూస్తూ.

"ఇదంతా  నా తప్పే! అయ్యో ఇన్ని రోజులు ఎందుకు నిరీక్షించాను? ఆమె... ఆమె సంతోషంగా కన్పించిందా?"

"చాలా"

"అయితే అంతా ఆఖరైనట్టే" అనుకున్నాడు బసు.

"నేను ఇక పార్టీ పనిలో పడాలి" అనుకున్నాడు బసు.

భారీ గేటు తీసుకుని ఇంట్లోకి అడుగుపెడ్తూ. ఇక పర్యటనలు చేయాలి. ఓహో హరి! నాతోపాటు వంటవాణ్ణి తీసుకు వెళ్ళాలి. లేదు, బాబా ఒప్పుకోడు. నాకోసం ఓ కొత్త వంటవాడిని మాట్లాడుకోవాలి, ముఖ్యంగా నా టూర్స్ నిమిత్తం. వ్యవస్థకి సంబంధించిన 'నాయబ్' (గవర్నర్)ని అడిగి తెలుసుకోవాలి. 'అభద్రలోక్'లో పరివర్తన తెచ్చేందుకు నేను వున్నప్పుడు 'భద్రలోక్' జమిందార్లు ఏయే గ్రామాల్లో వున్నారన్న విషయం. అయినా వాళ్ళతోనే ఎందుకు మాట్లాడాలి? వాళ్ళ యజమానులు మరింత చెడ్డ అంధకారంలో జీవిస్తున్నారు. ఎవరైనా ఒకరు యజమానికి విశదపరిస్తే బానిసల జీవితాలు బాగుపడవా? ఎందుకంటే ఫ్యూడలిజం అంతరించే క్రమంగా మారింది, ఇంకా తార్కికమైన భౌతికవాదం, భవిష్యత్ కాలపు భౌతికవాదం.

అప్రసన్నతతో బసు నుదుట ముడుతలు పడ్డంతో డ్రాయింగ్ రూం దాటగానే విగతజీవిలా మారాడు. తండ్రి అతని కోసం మెట్ల దగ్గర వరండాలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. తనతో ఏదో చెప్పాలని అతను మధనపడుతున్నట్లు బసు గ్రహించాడు.

"కంగ్రాట్స్, మై సన్!" అంటూ తండ్రి "నువ్వు నాకు రమణీయమైన ఆట చూపించావు. కానీ చివరగా నువ్వు దొరికిపోయావు" అన్నాడు.

తండ్రి మాట్లాడిన మాటలు సందర్భానుసారంగానే వున్నాయి. కానీ తండ్రి స్వరం కుతంత్రంగా లేదు. ముసలి గొర్రె ఏం ఆలోచిస్తోందో? అనుకుంటుండగా తండ్రి బసు భుజాలపైన చేతులు వుంచి "నువ్వు నాకు సరియైన సంకేతాలు ఇచ్చావు" అంటూ తన స్టడీ రూంలోకి తీసుకువెళ్ళాడు. "కేవలం కొన్ని రోజులే పట్టింది గెస్ వర్క్‌కి. ఎస్ మై సన్, నీ పెళ్ళి నిశ్చయం అయింది. మరో ఐదు రోజుల్లో జరుగుతుంది. ఏర్పాట్లు పూర్తయ్యాయి. గెస్ట్‌లందరినీ ఆహ్వానించాను. మనం బహుమతులు ఇచ్చిన వాళ్ళని, మనం తీసుకున్నవాళ్ళని అందరినీ ఆహ్వానించాను. అమ్మాయి మావయ్య రామేంద్రనాథ్ చక్రవర్తి లండన్‌లో నా బెస్ట్ ఫ్రెండ్. నాతోపాటు ఐపిఎస్ పరీక్ష రాశాడు. నేను కనుగొనడమే ఆలస్యం. మిగతావన్నీ సులువుగా అయిపోయాయి. ఆమె బాగా చదువుకుంది. చక్కగా వుంటుంది. మంచి తెలివితేటలున్న పిల్ల అని వాళ్ళ మావయ్య చెప్పాడు. ఇప్పటి మహిళలకి కావాల్సిన ఆధునిక పద్ధతి అదే కదా."

"బాబా!" అని ఉద్వేగంతో అరిచాడు బసు. "ఇలా చేయడానికి మీకు అధికారం లేదు! నేను ఎన్నడూ ఇలా చేయమని మీతో అనలేదు!"

బెనర్జీ బాబు మొహం నల్లబడింది. "ఏంటి, నువ్వనేది ఏంటి. నేను చేసిన ప్రయత్నమంతా బుగ్గిపాలు కావల్సిందేనా? నీకు నువ్వే అమ్మాయిని ఎంపిక చేసుకున్నావు కదా."

"నేను ఎంపిక చేసుకున్నది ఆ అమ్మాయినా?" అన్నాడు బసు. అతని మొహం అకస్మాత్తుగా చల్లబడింది. "గాయత్రి గురించా మీరు మాట్లాడేది?" అన్నాడు బసు.

బెనర్జీ బాబు అతని వంక చూస్తూ "పుస్తకాల పురుగైన నువ్వు ఒట్టి మూర్ఖుడివి, బసూ... ఆ విషయం మీ అమ్మని అడిగి తెలుసుకో. అవును, నిజమే మనం మాట్లాడుకుంటున్నది గాయత్రి గురించే. ఆమెని పెళ్ళి చేసుకుంటానని నువ్వు అనలేదా? లేక నేను తప్పుగా విన్నానా? లేక నీ మనస్సులో వున్నది మరో గాయత్రీరాయా?

"కానీ" అంటూ బసూ సణుక్కుంటూ... "ఆమె బ్రాహ్మణ స్త్రీ కాదు. మీకు అది ఆమోదమని చెప్తున్నారా?" అన్నాడు.

"ఆమె బ్రాహ్మణ స్త్రీ కాదని ఎలా అనుకున్నావు? ఆమెని అడిగావా నువ్వు? ఓరి.. మూర్ఖుడా, ఆమెది చక్రవర్తుల కుటుంబం. కొన్ని శతాబ్దాల క్రితం బెంగాల్‌లోని నవాబుకి సేవ చేసినందుకు గాను వాళ్ళకి 'రాయ్' అన్న బిరుదునిచ్చారు. గౌరవనీయమైన సంపన్న బ్రాహ్మణ కుటుంబం వాళ్ళది. నువ్వు ఆమెని కలుసుకుంటావని అనుకుంటున్నాను."

"అలాంటప్పుడు ఆమె మురికివాడలో నివసిస్తూ నటించాల్సిన అవసరం ఏమొచ్చింది?"

బెనర్జీ బాబు భుజాలెగరేస్తూ "ఆమె మావయ్య ప్రగతిశీల భావాలని నేను నిరసిస్తాను. కానీ ఆ విషయం తెలిస్తే నువ్వు దిగ్భ్రాంతికి గురవుతానని ముందు జాగ్రత్త కోసం ఆమె ఈ ఉత్తరం నీకు అందజేయమని కోరింది" అంటూ బెనర్జీబాబు "ఇది చదువు" అని ఓ కవర్‌ని బసు చేతుల్లో వుంచాడు. బసు సంకోచిస్తుండగా చదవమని ఉత్సాహపరిచాడు బెనర్జీబాబు.

గోప్యత అనేది మంచిదే కానీ, అతను కుటుంబమంతటికీ ఎంతో ముఖ్యమైనదేదీ తన కొడుక్కి ఇవ్వజూపలేదు.

తండ్రి డెస్క్‌లోంచి పేపర్ నైఫ్ తీసి కవరుని కసితో ఓపెన్ చేశాడు బసు. ఉత్తరాన్ని మడత విప్పి చూశాడు.

డియర్ ఫ్రెండ్, అని మొదలయింది.

నేను ఎవరినో తెలిసిన తర్వాత నువ్వు సంభ్రమాశ్చర్యాలకు గురి అవుతావని అనడంలో ఎలాంటి సందేహం లేదు. నేను వంచకినని, నీతో కుత్సితంగా వ్యవహరించానని ఇన్ని రోజులూ నువ్వు ఆలోచిస్తూ వుండొచ్చు. కానీ అలా కాదు, నామీదా, నా మాటల మీదా పూర్తి నమ్మకం ఉంచాల్సిందిగా కోరుకుంటున్నాను. ఎందుకంటే ఇదేమీ అసత్యం కాదు. ఆ సమయంలో నేను గడిపిన జీవితం, నీ కోరిక ప్రకారమే నేను అలా వుండాల్సి వచ్చింది. ఇందుకు ఓ సంవత్సరం పాటు నా కుటుంబం అనుమతించింది కూడా. అందుకు వాళ్ళకి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను. ఎందుకంటే వాళ్ళ అంగీకారం లేకపోతే నిన్ను కలిసి వుండేదాన్ని కాదు. కానీ విధిని మనం ఎన్నటికీ తప్పించుకోలేము. నీలాగే నేను కూడా 'భద్రలోక్'కి చెందిన దానినే. నీ అభిలాష మేరకు ఆ ప్రపంచంలో నీ సభ్యత్వాన్ని గురించిన నీ నిర్ణయమే నా నిర్ణయం కూడా. ఆ విషయంలో మనిద్దరమూ ఒకటే. అందువల్ల నువ్వు ఒకసారి ఆలోచించు మై ఫ్రెండ్, విధిని ఎదుర్కోవడం నీకు

ముఖ్యమా. (అది ఓ సాహసకృత్యం... అందుకు నువ్వు సిద్ధపడవని భావిస్తాను) లేక నీ దుస్థితిని అర్థం చేసుకునే, నీ కుల అన్యాక్రాంత భావాలని గౌరవించి, వాటిని పంచుకుని ఇంకా నువ్వు, నీ కుటుంబం, నీ స్నేహితుల చుట్టూ జీవించడానికి ఇంకొకరిని కోరుకుంటావా? నీ తండ్రి నీ కోసం ఓ అజ్ఞాన పుష్పాన్ని ఎన్నుకోవడం కన్నా నీ జీవితం నాతో పంచుకోవడం మంచిదన్న ఆలోచన నీకు తట్టడం లేదా?

సంఘీభావంతో,

గాయత్రి

బసు చేతులు కంపిస్తుండగా ఆ ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చింపేశాడు. కొడుకు భుజం మీదుగా ఆ ఉత్తరం చూసిన బెనర్జీ బాబు "ఆమె అంటే నీకెందుకంత కోపం?" అన్నాడు మృదువుగా. "నేను ఆ కుటుంబాన్ని సమర్థిస్తాను, కలకత్తాలో ఓ విశ్వసనీయ కుటుంబం అది. ఒకటి , రెండు చిన్నపాటి అపవాదులు, టోలీగంజ్‌లో శాంతపరచి దూరంగా ఉంచబడ్డ క్రైస్తవ శాఖ, కొద్దిపాటి అవివేక పనులు, ఎవరి వంశ వృక్షంలో వుండవు? ఇంకా ఆమె, బాగుంది. నేను ఆమెను చూశాను. నీకు సరైన ఈడూ జోడు... అన్నాడు బెనర్జీబాబు.

బసు దీర్ఘంగా నిశ్వసిస్తూ... "ఇన్ని రోజుల నుంచి నేను అనుకున్నాను.. నేను ఎంత మూర్ఖుడిని. తను ఎంతగా నవ్వుకుందో... అందుకేనేమో మొహం తిప్పుకుంది. అవును మొహం పక్కకు తిప్పుకుని నవ్వుకుంది. ఇప్పుడు నాకు నిజం ఏంటో తెలిసింది."

"నువ్వు అవేమీ పట్టించుకోకు. అయితే నువ్వు ఆమెని పెళ్ళి చేసుకుంటున్నావు."

బసు మొహం పాలిపోయింది. వాడిపోయినట్లయింది. "లేదు నాన్నగారూ..." అన్నాడు బసు.

"ఏం ఎందుకని ? నువ్వామెని ముందే ఇష్టపడ్డావుగా."

"ఆమె ఓ అబద్దాలకోరు నాన్నగారూ!"

"అబద్ధాలా... నీతో ఎన్ని అబద్ధాలాడింది? ఎన్నడైనా ఆమె గత జీవితం గురించిన పూర్తి సమాచారం అడిగే ప్రయత్నం చేశావా నువ్వు. పోనీ కనీసం తెలుసుకోవాలన్న ఆసక్తి కనబరిచావా? లేదా? నాకు తెలుసు. నువ్వు అలా చేయలేదని. అంతే కదా మై సన్? మంచిది. ఇది చాలా మంచి సంబంధం. మనవాళ్ళందరికీ తృప్తినిస్తుందని ఆశిస్తున్నాను. నీకు మంచి తెలివితేటలు వున్న అమ్మాయి దొరికింది. మనింటికి ఐశ్వర్యవంతురాలైన కోడలు వస్తుంది. దీన్ని వ్యతిరేకించడానికి నాకు ఎలాంటి కారణం కనబడ్డం లేదు" అంటూ బెనర్జీబాబు బసు భుజాల మీద సుతారంగా తట్టాడు.

"లుక్ సన్, సిద్ధాంతాలు జీవితాలని బాగుపర్చవు. ఈ వ్యవస్థని బాగు చేయాలనుకోవడం అంత సులువు కాదు. నీకు నేను సంపూర్ణమైన స్వేచ్ఛనిచ్చాను. చిన్నతనంలో కలలు గన్న స్వేచ్ఛ. అందుకు కృతజ్ఞతగా వుండు, పరిస్థితులు మరింత చెడుగా వుండేవి."

కాఫీ హౌస్ అంతా ఖాళీ అయిపోయింది. రాత్రి పార్టీలో మిగిలిపోయిన వాళ్ళు మాత్రమే వున్నారు. ఒక కార్నర్‌లో బసు, గాయత్రీ వున్నారు. ఈసారి చీరకొంగుని తల మీద కప్పుకుంది ఆమె. ఓ పక్కకి తిరిగి కూర్చుంది.

"నన్ను చూడ్డానికి ఒప్పుకున్నందుకు థాంక్స్" మృదువుగా అంటూ గాయత్రి "నువ్వు కోపంగా వున్నావని అర్థమయింది. కానీ నా కోణంలో కూడా చూసే ప్రయత్నం చెయ్యి. ఎన్నడూ దీని గురించి నేను బేరాలాడలేదు... మనకోసం... జరగాలి.. ఒక సంవత్సరం పాటు నేను నేనుగా జీవించాలని, ఆ తర్వాత నా కుటుంబ ప్రపంచంలోకి వెళ్ళిపోవాలనుకున్నాను. నా మామలతో నేను బేరమాడిన విషయాలు ఇవి" అంది.

"ఇలాంటి పనులు చేయడానికి ఏ కుటుంబం మాత్రం అనుమతిస్తుంది?" బసు ఆలోచనలో పడ్డాడు. ఈ విషయంపైకి చెప్పడాన్ని నిరోధించుకున్నాడు. అందుకు బదులుగా అన్నాడు, "నువ్వు ముందే చెప్పాల్సింది."

"ఓకే. అవును. చెప్పాల్సింది. కనీసం మన పరిచయం పెరిగిన తర్వాత అయినా చెప్పాల్సింది. కానీ ఎందుకనో సందర్భం రాలేదు. అదీగాక ఈ విషయం నీకు ఎలా చెప్పాలో అర్థం కాలేదు. నన్ను తక్కువ అంచనా వేస్తావేమోనని భయపడ్డాను" అంది గాయత్రి. మేలిముసుగు తల మీది నుంచి కొంచెం కిందకి జారింది.

ఆమెలాంటి వర్గం, స్థానం గల స్త్రీ చేయాల్సింది చేయకపోవడంతో ఆమె ప్రవర్తన పట్ల, ఆమె పట్ల తను కలత చెందినట్టుగా గ్రహించాడతను.

"నాకు తెలిసిన, నేను ఎరిగిన గాయత్రి ఎక్కడుంది? అన్నాడు బసు తన సంవేదనలని ఆమెకి వినిపించాలన్న ఉద్దేశంతో. ఆ ప్రశ్నకి గాయత్రి తల ఎత్తి అతని వంక తీక్షణంగా చూసింది.

"ఆమె ఇంకా ఇక్కడే నా హృదయంలోనే వుంది, నీకోసం ఇక్కడే వుంటుంది ఆమె, ప్రపంచం మరోలా నటించమన్నప్పటికీ. నీకేమైనా విభిన్నంగా వున్నట్టు కన్పిస్తోందా?

నువ్వు ఎప్పటికీ అదే వ్యక్తివా – ఇక్కడ నాతో, ఆర్యభవన్‌లో మీ నాన్నతో?"

మొహం పూర్తిగా వేడెక్కినట్లన్పించింది బసుకి. "కనీసం నువ్వు బ్రాహ్మణ స్త్రీవని నాకు చెప్పి వుండాల్సింది. నన్ను ఫూల్‌ని చేశావు. అక్కడేమో మా నాన్నని అలక్ష్యం చేశాను, వేల సంవత్సరాలుగా వున్న అంధకారాన్ని దెబ్బకొట్టే విధంగా.

దానికి ఇదీ ఫలితం! నేను ఎల్లప్పుడూ ప్రయత్నించే ఓ గొప్ప పనిని నువ్వు ఎందుకు పాడుచెయ్యాలి?"

"ఓ! ఐయామ్ సారీ!" అంది గాయత్రి నెమ్మదైన స్వరంతో. "నేను తెలుసుకోలేకపోయాను. నాకోసం నువ్వు త్యాగం చేస్తావని అనుకోలేదు."

"ఓహ్, నాన్సెన్స్. బసు కాఫీ కప్పు పైకి ఎత్తి మందమైన తెల్లని పింగాణీ అంచుని చూస్తూ "నువ్వు ఆ విధంగా వంచకురాలివి గాయత్రీరాయ్. ఇంతకాలం నువ్వు ప్రతికూల ప్రపంచంలో అడుగుపెట్టగలిగే ధైర్యవంతురాలివి అని అనుకున్నాను. కానీ నువ్వు ఆడిందంతా నాటకం. అది నాకు చాలా చిరాకన్పించింది. ఇదే నేను నీకు చెప్పేది. నేనేమిటో నాకు తెలుసు. నేను గతంలో చదివిన కాలేజీలోనే ఉద్యోగానికి అప్లై చేశాను. మా నాన్నతో దెబ్బలాడి ఇల్లు వదిలేస్తాను. నేను నేనుగా జీవిస్తాను. గ్రామాలకి వెళ్ళి సన్యాల్‌లతో కలిసి పని చేస్తాను. నీ మూర్ఖపు అగ్రవవర్గాల, అగ్రకులాల పురాణ కథలు నాకు అవసరం లేదు. నీవేంటో నాకిప్పుడు తెలిసింది. నా పట్ల ఆకర్షణ పోగొట్టుకున్నావు. నిన్ను నేను సోదరిగా ఆదరిస్తాను తప్ప ప్రేమికురాలిగానో, కామ్రేడ్‌గానో కాదు."

ఆమె కొద్ది క్షణాలు తలదించుకుని మౌనంగా వుండిపోయింది. బసు కాఫీ తాగడం పూర్తయింది. అతను ఆమె మొహం చూడలేదు. "అయితే మన పెళ్ళి జరగదా?" అడిగింది గాయత్రి మంద్రమైన స్వరంతో..

"ఎన్నటికీ జరగదు. నాలో ఇప్పుడు గ్రహింపు కలిగింది. నేను పెళ్ళి చేసుకోబోయేది ఓ భావాన్ని : ఇతరమైన భావాన్ని. ఆ ఇతరమైనది నువ్వు కాదు. నువ్వె ఓ భద్ర మహిళవి. ఇంతే కథ సమాప్తం."

"అవును, కానీ, నిర్ణయం తీసుకునేముందు మరొక్కసారి ఆలోచించి అడుగు ముందుకు వెయ్యి బెనర్జీ" భావరహితమైన చిన్న గొంతుతో అంటూ గాయత్రి" "రోడ్డు పైన బిచ్చగాళ్ళు ఎదురుపడ్డప్పుడు నువ్వు అకస్మాత్తుగా ఆగిపోతావు. వాళ్ళు నిన్ను డబ్బులు ఇచ్చేలా చేస్తారు. నువ్వు బురదగుంటని దాటడానికి వెనుక ముందులాడతావు. వీధి ముగింపు దాటి ముందుకు నడవాలంటే ముందు వెనుకలాడతావు. నా చిన్నపాటి సంస్థని చూసి భయంతో వణికిపోయావు. నేను నీ చూపుల్ని చూశాను. అందులోకి నేను ప్రవేశించాలనుకున్నప్పుడు నన్ను నువ్వు పరిశీలించిన తీరు. నువ్వు కేవలం మెత్తగా పొడిపొడిగా వున్న అన్నం తిని మృదువైన కాటన్ దుస్తులు ధరిస్తావు.

నువ్వు బుద్ధుడివి కావు. లెనిన్‌వి కావు. నువ్వు ఆర్యభవన్ వదిలి ఎప్పటికీ రాలేవు. ఎందుకంటే, నీ తండ్రి కన్నా మరో మంచి వ్యక్తి నీకు లభించదు. నువ్వు ఆయన ప్రాణివి.

ఈ పెళ్ళి ఆలోచన ఆయనది. నువ్వు దీని బీజం ఆయనకి అందించావు. అది మొలకై, మొక్కై ఆయనతో పాటే పెరుగుతూ వచ్చింది. ఇప్పుడు నిర్ణయం ఆయన చేశాడు. నువ్వు పుట్టినందుకు నీ ప్రపంచాన్ని ఆయన శాసిస్తున్నాడు. అందుకని, ఓ నా ప్రేమికుడా, నువ్వు నన్ను పెళ్ళిచేసుకోవాలి. నేను నా భావావేశాలని నీకు నివేదించాను. నీ ఆలోచనల్ని పంచుకున్నాను. కానీ నువ్వు వాటిని కొట్టిపారేశావు. పరుషంగా మాట్లాడావు. ఓ మర్యాదపూర్వకమైన ఒడంబడికని నేను నీకు ప్రతిపాదించాను. నువ్వు ఓ దురహంకారివి. నువ్వు నన్నెప్పటికీ అర్థం చేసుకోలేవు. మంచిది, మై డియర్ విప్లవకారుడా, ఎలాంటి ఆప్షన్స్ నీకు ఇక లేవు. నన్ను పెళ్ళి చేసుకొని మంచి జీవితం గడపడమా లేక నన్ను నిరాకరించి బలివ్వడం కోసం తీసుకెళ్ళే దూడలా నీ తల్లి చూసిన సంబంధాల్లో ఒకరిని వివాహమాడి పనిలో తలమునకలై వుండే నీ భార్య అడుగులకి మడుగులొత్తుతూ 'అందర్ మహల్' జీవితంలో స్థిరపడ్డమా ఏది కావాలి?"

బసు శిలాసదృశ్యుడయ్యాడు. ఆమె మాట్లాడిన ప్రతీ మాట తనని బ్లేడు కోసుకున్నట్లుగా తాకుతోంది. ఆ ఉత్తరం చదివినప్పటి నుంచి అతడిని ఏదో దుశ్శకునం ఆవరించినట్లయింది. ఎందుకంటే అందులో వున్నవన్నీ వాస్తవాలే. అవన్నీ ఇంతకుముందు తనకి తెలిసినవే. తను తన తండ్రికి కొడుకు. తన తల్లి తండ్రికి ప్రియమైనవాడు. వాళ్ళు జీవించినంత కాలం తన ఎనభయ్యవ ఏట కూడా తను పిల్లాడే. చట్టబద్ధమైన యుక్త వయసు తన సీనియర్‌లంతా ప్రతిఫలం పొందిన తర్వాతే వస్తుంది. అటువంటప్పుడు, వృద్ధాప్యంలో తను అనుకున్నది చేయగలడు, తన కలల్ని నెరవేర్చుకోగలడు. అనుకున్న విధంగా తను చిన్నవారిని పాలించగలడు. అంతవరకు తన భవిష్యత్తు తన తండ్రి ప్రణాళికలకి తాకట్టు పెట్టినట్టే. ఈ ప్రేమ వ్యసనం మధ్య దాని అధీనంలో వుంచుకున్న ఓ చిన్నపాటి స్థలం ప్రతిపాదించబడింది. అది ఎంత చిన్నదంటే బలమైన, సత్తువ గల వ్యక్తి దానిని చూసి నవ్వుతాడు. కానీ బసు బలవంతుడు కాడు.

"సరే, మంచిది" అన్నాడు బసు గంభీరంగా. "నువ్వు ఆ విధంగా మాట్లాడితే నేను చెప్పడానికి ఏముంది? నువ్వు చెప్పిందే నీతి, ధర్మం, న్యాయం. ఒక విధంగా

గాయత్రీ రాయ్ ఎల్లప్పుడూ నిన్ను ఒకవేళ బాధపడేలా మాట్లాడి వుంటే నన్ను క్షమించు. నేను ఆశించినంత న్యాయబద్ధంగా లేకపోయినా నువ్వు మంచి ఉద్దేశమే కనబరిచావు. కానీ నా అహం దెబ్బతింది. నువ్వన్నట్టుగా మనం నాగరీకులం. మన భవిష్యత్తుని మనం జాగ్రత్తగా, తెలివిగా ప్లాన్ చేసుకోవాలి" అన్నాడు బసు.

"నువ్వు అర్థం చేసుకోగలవు" అంది గాయత్రి ఎలాంటి గెలుపు సూచనలు లేనప్పటికీ. ఓ బసూ, నీతో నిజాయితీగా ఉండటం వల్ల కలిగే ఉపశమనం ఏంటో నీకు తెలుసు. నేను నిన్ను మోసగించానన్న నీ ఆలోచన నా గుండెల్ని పిండేసింది. ఈ విధంగా మనం మాట్లాడుకోవడం ఆనందంగా వుంది. కానీ ఇప్పుడు నేను మా అమ్మా నాన్నల దగ్గరకి వెళ్ళిపోవాలి. నీ పెళ్ళి అయ్యేదాకా నువ్వు నన్ను చూడకు, కలుసుకోకు. ఆ తర్వాత మన జీవితాలు మళ్ళీ మనవే.

'ఎప్పుడూ ఎలా వున్నామో అలాగే' అన్నాడు బసు చిన్నబుచ్చుకున్న మొహంతో. జేబులో నుండి కొన్ని కాయిన్స్ తీసి వెయిటర్ కోసం బల్ల మీద వుంచాడు. 'భళా ప్రపంచాన్ని మార్చేందుకు, భళా వ్యవస్థని వ్యతిరేకించేందుకు, భళా హిందూ సమాజంలోని సాంప్రదాయక దుష్కర్మలని ఎదుర్కొనేందుకు, భళా దళితులతో భుజం భుజం కలిపి నిలిచేందుకు' చివరికి ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

కాఫీ హౌస్ లోంచి బయటకు వచ్చిన తర్వాత తన భుజం అకస్మాత్తుగా అదురుతుండటం గమనించి ఆశ్చర్యపోయాడు బసు.

# 5

# కృష్ణమూర్తి సమన్యాయం

**కృ**ష్ణమూర్తి, అప్పారావు ఇంకా శ్రీనివాసరావు జోగుతున్న బెంగుళూరు నగరంలోని కృష్ణమూర్తి ఆశ్రమంలోని సమావేశపు హాలులో వరండాలో కూర్చున్నారు. అక్కడంతా అగరు పొగల పరిమళం నిండిపోయింది. ప్రతి బుధవారం సాయంత్రం సరస్వతీ పూజ కాగానే కృష్ణమూర్తి అనుయాయులు, కవులు, రచయితలు మండువాలో ధ్యానం చేసినందువల్ల కలిగిన ప్రయోజనాలని చర్చించడానికి ఆయన ఆశ్రమం ఓ వేదిక. ఈ సమావేశానికి ఓ వేలుపులా కృష్ణమూర్తి అధ్యక్షత వహిస్తాడు. వాళ్ళందరూ ఆధ్యాత్మిక దుస్తులు ధరించారు. పరిశుభ్రమైన తెల్లని కుర్తాలు శరీర పై భాగంలోను, నడుము నుండి పాదాల వరకు కాషాయ లుంగీలు వాళ్ళ గురువులా. పై బట్టలు పవిత్రతని సూచిస్తే, క్రింది బట్టలు త్యాగానికి చిహ్నాలుగా పురుషులు మాత్రమే వుండే ఆ ఆశ్రమంలో చాలా విశిష్టమైనవిగా భావిస్తాడు కృష్ణమూర్తి. ఆయన వేదాంతం, తాత్వికతలాంటి అంశాలతో తన ఆలోచనలని పండించుకుని ఆధునిక హిందూయిజంలో తాత్విక గురువుని దర్శించడం వల్ల అతని సంస్థ 'ఆచార్య కుటీర్'గా పిలవబడుతుంది. ఆశ్రమం సిటీ నుంచి దూరంగా ఆకులు, చెట్లతో నిండిన శివారు ప్రాంతంలో వుంది. బ్రిటిష్ పెన్షనర్‌లకి వీలైనంత దూరంగా, వాళ్ళు ఉష్ణమండల వాతావరణానికి ఇంకా వాళ్ళ పని ముగిసిన తర్వాత ఇంటికి వెళ్ళేముందు చిన్న పెగ్గులకి అలవాటుపడ్డంతో అందుకు ప్రతిగా వాళ్ళ మూలాలని బెంగుళూరులోని సమశీతోష్ణ వాతావరణం ఇంకా శాంతియుత వాతావరణం వుండటంతో అక్కడ నిలిపారు. నిజానికి ఆ ప్రాంతంలోని స్వచ్ఛమైన గాలి ధ్యానానికి అనుకూలంగా లౌకిక చింతన లేకుండా హృదయాన్ని ఉత్సాహంగా వుంచుతుంది. ఆశ్రమం నెలకొల్పిన తర్వాత కృష్ణమూర్తికి దేశమంతటా

ఎందరో  శిష్యులు ఏర్పడ్డారు. ఇంగ్లీష్, కన్నడ, తెలుగు భాషలని అనర్గళంగా మాట్లాడగలడు. దానికి తోడు మంచి ధారణ శక్తి, చక్కని వాక్చాతుర్యమూ, కవిత్వం పట్ల అభిరుచి వుండటంతో ఈ మూడు భాషలలో కవితలు, వ్యాసాలు, పుస్తకాలు, ఇంకా వార్తా పత్రికలలో ఆర్టికల్స్ రాస్తాడతను. కేవలం సంస్కృతభూయిష్టంగా వుండటాన్ని ద్వేషిస్తాడతను. కాని అది సంస్కృత శ్లోకాలని తన ఇంగ్లీష్ ఉపన్యాసాలలోను, కన్నడ, తెలుగు ఉపన్యాసాలలోను ఉటంకించడాన్ని ఆపలేకపోయింది. తెలుగు అతనికి గుండెలకి దగ్గరగా వుండే భాష. విశాలమైన హిందూయిజం పరివృత్తంలో ఆధునిక బ్రాహ్మణులు సముద్రాలని దాటి ప్రపంచవ్యాప్తంగా పరిఢవిల్లాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుందని అతని ప్రగాఢ విశ్వాసం. ఎన్నో దేశాలు చుట్టి వచ్చాడు. యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా అతనికి అత్యంత ఇష్టమైన దేశం. సముద్రాల అవతల ఇవతల అతనికి అశేషమైన శిష్య సంపద ఉంది. అప్పుడప్పుడు వాళ్ళు అతన్ని చూడ్డానికి రావడమో, లేక వాళ్ళు రాసిన వ్యాసాలు కవితలు పంపడమో చేస్తుంటారు. వాటినన్నిటిని శ్రద్ధగా పరిశీలించి తన శిష్యుల్ని ప్రోత్సహించాలన్న ఉద్దేశంతో ప్రాచీన భారతీయ సాహిత్యం యొక్క గొప్ప సంప్రదాయాలని అనుసరించే రీతిలో ప్రతీ దానికి విమర్శతో కూడిన సమాధానాలు చిన్న చిన్న స్లిప్పుల మీద రాసి పంపిస్తాడు. వాటిల్లో ప్రతీ ఒకటి తను నిర్మించాలనుకున్న కళాత్మక గుడికి ఒక్కో ఇటుక లాంటిది.

కృష్ణమూర్తి కూడా ఓ జాతీయవాది, జాతీయత భావాలతో కూడిన తన ఆలోచనలకి అనుగుణంగా అతను చేతల మనిషి కావడం, కవికుండాల్సిన భావోద్రేకం ఉండడంతో  ఆలోచించడానికి అమితంగా ఇష్టపడ్డాడు. అందుకుగాను అతను ఎంచుకున్న ఆయుధం కలం. చిన్నా, పెద్దా భక్తులు ఇంకా ప్రపంచ విద్యార్థులు ఆశ్రమంలో అతని చుట్టూ వుంటారు. ఆశ్రమంలో వాళ్ళ పని రాయడం. గొప్ప కవితాత్మక సంప్రదాయమైన రచయితల బ్రహ్మచర్యం పునరుద్ధరించడమో లేక వాళ్ళు వెనుదిరిగి వెళ్ళిపోవడమో చేశాడు కృష్ణమూర్తి. కృష్ణమూర్తి సహవాసులైన చాలామంది తమ పూర్తి సమయాన్ని రచనకి వెచ్చించేవాళ్ళు. కొంతకాలం నుంచి మంచి రచయితలైన కొందరు కృష్ణమూర్తి యొక్క శాస్త్రీయమైన, విశేషమైన శక్తి, ఆశ్రమవాసులకి వుండవలసిన విధంగా సృష్టించలేకపోతున్నారు. అయినా అక్కడ ఆయనతో పాటు ప్రతిభ గల వ్యక్తులు కొందరు వున్నారు. ఆ వ్యక్తుల్లో శ్రీనివాసరావు, అప్పారావు కూడా వున్నారు. అప్పారావు ఒకప్పుడు రాడికల్ నాటక రచయిత; యవ్వనంలో నాటకాలు వేయడంలో అందరికంటే ముందుండేవాడు. ధూర్త లక్షణాలతోను, ప్రతీకాత్మక లక్షణాలతోను ప్రభుత్వాన్ని విమర్శిస్తూ

అతను దుస్సాహసవంతులైన యువతీ యువకులతో కలిసి ప్రభుత్వాన్ని ధిక్కరించాడు తండ్రి అస్తవ్యస్త పనులతో ప్రభుత్వోద్యోగం కోల్పోయేంతవరకు. అప్పారావుకి జరగబోయే వివాహం నిష్ఫలమైంది. దాంతో మరీ కటువుగా మారాడతను. నిరాశా నిస్పృహలతో కూడిన వేదనతో తన దురదృష్టానికి కుమిలిపోతూ విదేశీ విద్యల వలన తన దేశంలోని విద్యావేత్తలకి సముచిత గౌరవం దక్కడం లేదని వేదనాభరితమైన 'బాడ్ బ్లాంక్' పద్య కృతిని రచించాడు. అది ఓ స్థానిక తెలుగు వార్తా పత్రికలో వచ్చింది. అది కృష్ణమూర్తి దృష్టిలో పడింది. పరిహాస ప్రసంగంలో అతనిలో దాగి వున్న ప్రతిభని, దానితోపాటు సరియైన ఆదర్శ భావ సుగంధం తెలుసుకున్నాడు కృష్ణమూర్తి. వెంటనే కృష్ణమూర్తి నూట ఎనిమిది స్వీట్లతో ఆహ్వానం పంపాడు ఆచార్య కుటీరంలో తనని కల్సుకోవాల్సిందంటూ. "ఇది తప్పుగా అర్థం చేసుకోబడ్డ కళాకారులకి ఆశ్రయం" అంటూ కృష్ణమూర్తి "ఈ మ్లేచ్ఛులు మన సంప్రదాయాల మీద ఉమ్మేసినంత కాలం మన తప్పులు, పొరపాట్లు మనం ఆలోచించుకుని మన నైపుణ్యాన్ని అత్యంత పవిత్రతతో అభ్యసించాలి. మనకంటూ ఓ రోజు వస్తుంది మై ఫ్రెండ్. నువ్వు రోజూ ఉదయాన్నే నిద్రలేచి పూజ చేసి రాయడం మొదలుపెట్టు. మిమ్మల్ని నేను కోరేది అంతే" అన్నాడు.

శ్రీనివాసరావుది ఓ విభిన్నమైన కేసు. అతను సహనం గల కవి. ఓ విధురుడు (భార్య చనిపోయినవాడు). సుప్రసిద్ధ పాత్రికేయుడు. తన పధ్నాలుగు సంవత్సరాల కూతురి పెళ్ళి చేసి దివాళా తీశాడు. తండ్రిలాగే లీల కారు నలుపు. పొట్టి, గుండ్రటి దేహం, మెల్లకన్ను. జన్మ సమయపు నక్షత్ర యోగం బాగుండలేదు. ఆమె వివాహం కోసం శ్రీనివాసరావు కూడగట్టిందంతా ఖర్చు చేయాల్సి వచ్చింది. ఆ తర్వాత అతను వరకట్న విధానాల గురించి వరుసగా ఆవేశపూరిత వ్యాసాలు తన పత్రికలో రాశాడు. ఆదిలో తెలుగు ప్రజలు వివాహం చేసుకోవడానికి అధికారాన్ని తెలిపే అనుమతిగా కన్యాశుల్కం ఇచ్చే సంప్రదాయం వుండేదనీ, వాళ్ళు నార్త్ ఇండియన్స్‌ని అనుకరించే ముందు విపరీతంగా కట్నాలు ఇవ్వడం లాంటివి వుండేవని తన వ్యాసాలలో ఉటంకించాడతను. ఆ ఆర్టికల్స్ చదవగానే అగ్నిపర్వతంలోని లావాలా విరుచుకుపడ్డాడు కృష్ణమూర్తి. శ్రీనివాస్ ఆలోచనలని, అభిప్రాయాలని జాబులు – జవాబులు శీర్షికలో పిరికితనంతో కూడిన దిగజారుడుతనంగా నిరసించాడతను. "ఈ 'కన్యాశుల్కం' బుర్రలు లేని మహిళల తలపైన శుల్కం, అందులోనూ మన పిల్లల్ని, బ్రహ్మదేవుడు సంతతి వారిని శుల్కం ఇచ్చి కన్యను తెచ్చుకోవడం బట్టలు తొడిగి వేషం వేసే వ్యభిచారం తప్ప మరేమీ కాదంటూ" గర్జించాడు. దీన్ని మనం ఏమాత్రం సహించకూడదు. పుట్టుకతో

పురుషుడైన వ్యక్తి స్త్రీకి శుల్కం ఎందుకు ఇవ్వాలి. అతను రక్తాన్ని పిల్లల్ని పుట్టించడానికి గర్భంలో పెట్టుబడిగా పెడ్తాడు వాళ్ళు ఆర్యావర్త యశస్సుని ఇనుమడింపచేస్తారన్న ఉద్దేశంతో. కాని అందుకు భిన్నంగా మళ్ళీ అదే కన్యాశుల్కం కోసం మరోసారి ధనం ఇవ్వడం.

పర్యవసానం అంతంలేని విధంగా పురుషులు స్త్రీలకి వరుస చెల్లింపులు, ఒక సామాజిక బెదిరింపుతో లాక్కోవడం, ఇంతే కాక పురుషుడు తన జీవితాన్ని ధారపోయాలి.

ఆవు కన్నా తక్కువ ఉపయోగపడే ఆ జీవి పోషణ కోసం ఇంకా అతని సంపదని నగలు, వస్తువులంటూ ఆడంబరాలకి వృధా వ్యయం చేస్తుంది. నీచమైన ఈ వాడుక వల్ల తమ సంపదని సమాజ దిద్దుబాటుకి ఉపయోగిద్దామన్న ఆలోచన వున్నవారు అందుకు బదులు కొద్ది కొద్దిగా వ్యర్థం చేయడానికి బలవంతం చేయబడతారు.

పరుషమైన మొదటి మాటలకి భంగపడ్డ శ్రీనివాసరావు మరునాడు వెలువడిన వార్తాపత్రికలో తన వ్యాఖ్యానాలని వెనక్కి తీసుకుంటున్నట్టు ప్రకటించాడు. ఆ సమయంలో ఆ ప్రకటన సంచలనాత్మకమయింది. కానీ ఫలితం మాత్రం పెద్దగా ప్రాచుర్యం పొందలేదు. ఇన్ని రకాల ఇబ్బందుల తర్వాత వారం రోజుల్లో శ్రీనివాసరావు కూతురి ఏభై మూడేళ్ళ కొత్త భర్త గుండె పాడవ్వడంతో మరణించాడు. శ్రీనివాసరావుకి తగిన శాస్తి జరిగిందని భావించారంతా. ఇంతకు రెండింతలు కృంగిపోయిన శ్రీనివాసరావు నికృష్ట అర్జీదారుడు కృష్ణమూర్తి దయాదాక్షిణ్యాల కోసం కూతురితో సహా ఆయన పాదాల మీద పడ్డాడు. శ్రీనివాసరావు తన కూతుర్ని బృందావనం పంపించే షరతు పైన కృష్ణమూర్తి శ్రీనివాస్‌ని క్షమించేందుకు సిద్ధపడ్డాడు. పవిత్ర భూమి బృందావనానికి సాలవృక్షం ఆకుల్లా వాడుకుని విసిరి పారేయడానికి వితంతువులు పంపబడతారు. కానీ కృష్ణమూర్తి కనికరించేంతవరకూ శ్రీనివాస్ కంటనీరు ఆగలేదు. పెద్దమనిషి కోపం వదిలి దయాళుడై వుండటానికి నిర్ణయించుకోవడంతో పేద కుటుంబంలోని వారిద్దరిని, వాళ్ళు బ్రతిమాలిన రీతిలోనే అయిష్టంగానే ఆశ్రయం కల్పించాడు కృష్ణమూర్తి – వెలకట్టి.

శ్రీనివాస్ వంక తృప్తిగా చూశాడు కృష్ణమూర్తి. అతనికి పని కల్పించడానికి గౌరవనీయమైన వ్యక్తుల కోసం చూశాడు కృష్ణమూర్తి. తను వాళ్ళ మెదళ్ళలో నాటిన సిద్ధాంత బీజాలు వాళ్ళ కవితలలో పూలై పూశాయి. కృష్ణమూర్తి నిపుణత గల తన వేలిని అందరికన్నా చిన్నవాడివైపు చూపుతూ మొదలుపెట్టాల్సిందిగా కోరాడు.

ఆ పిన్న వయస్కుడు నత్తిగా పలికి దగ్గాడు. "జై సరస్వతీ మాత" అన్నాడు వణుకుతున్న కంఠంతో. రచయితలందరూ చేతిలో స్క్రిప్ట్ కానీ, పరికరాలు కానీ ఉంచుకోకుండా చదవాలి. జ్ఞాపకశక్తి అనేది కృష్ణమూర్తి దృష్టిలో ఒక గొప్ప కళ. ఆ కుర్రాడు నిటారుగా కూర్చుని కళ్ళు మూసుకున్నాడు. 'హా! నా ప్రియమైన తల్లీ, ఏ విధంగా వాళ్ళు ఈడ్చుకెళ్ళారు...' బిగ్గరగా అంటూ కృష్ణమూర్తి 'నాకు కుక్క చెవులున్నాయనుకున్నావా?' అన్నాడు.

'లేక ఓ గుర్రం' అంటూ ఎవరో గొణిగారు. 'ఎవరు అలా అన్నది?' అంటూ కృష్ణమూర్తి ఓ గెంతు గెంతాడు.

జనాలు ఆ వ్యక్తి వైపు దిగ్భ్రాంతిగా చూశారు. తనంతట తాను గ్రహించాడు కృష్ణమూర్తి. అతను ఊహించాడు. ప్రతి ద్వారం వెనుక కుట్రలని చూడనవసరం లేదు. తనని అపహసించే ధైర్యం ఇక్కడ ఎవరికి ఉంది, స్నేహపూర్వక రెక్కలున్న తన సాంస్కృతిక గూటిలో?

ఆ యువకుడు గొంతు సవరించుకుని మరోసారి నిటారుగా కూర్చుని మళ్ళీ మొదలుపెట్టాడు :

*"హా నా ప్రియమైన తల్లీ,*

*వాళ్ళు నీ హారాలని దుమ్ములోకి ఎలా లాగారు,*

*నీ తలని గురించి ఇంగ్లీషు తునకల లేత పారలతో కొట్టారు*

*ఓ నా తల్లీ, గౌరవనీయురాలా! కేవలం ఇంతేనా?*

*వాళ్ళు వాళ్ళ వాగ్దానాలని విస్మరించారు, నీ గాజులని,*

*మన తలకాయలని ఇంకా మన ఇళ్ళని పగులగొట్టారు..."*

కృష్ణమూర్తి మెదడు శూన్యమైంది. తీవ్రమైన శ్రద్ధ కనబర్చడానికి కనీసం ఓ గంట సమయం వుంది అతనికి. ఆ సాయంత్రం కార్యక్రమాన్ని తనతో ముగించడానికి ఇంకా రెండు గంటల సమయం వుంది. అతను గుంపుని పరిశీలించాడు. అందులో కొందరు తన హృదయాంతరాలలో నిలుపుకోవాల్సిన నిజమైన కవులు. వాళ్ళు తనకి అలవాటుపడ్డవారు మాత్రమే కాదు, విధేయులు కూడా. వాళ్ళమీద చెడు ప్రభావం పడకుండా రక్షించాలని భావించాడు కృష్ణమూర్తి. కానీ వాళ్ళలోని సర్వోత్తమమైన వ్యక్తులు

కొందరు మేకల్లా అరుస్తారు. కృష్ణమూర్తి లక్షణం ఒక్కటే, హృదయాలని కదిలించే ఘనమైన గీతాలని సృష్టించాలని. అవి ఆర్యావర్తంలోని నిజమైన అరిస్టోక్రాట్‌లని, వాళ్ళ జన్మహక్కుని తిరిగి చేజిక్కించుకునేలా చైతన్యపరచాలని, కానీ ఏ ఒక్కరూ ఈ మాటల్ని వినటంలేదన్న భావన పగలూ రాత్రి అతన్ని వేధించసాగింది. తను తాజాగా ముగింపు పలికే బుధవారపు పఠనాలు కవిగా తన నైపుణ్యానికి గీటురాయి, కానీ రాతి కింద దాక్కున్న పాములా వాస్తవమైన విషయం ఏమిటంటే, ప్రతీ వారం ఆ కవితని సృష్టించడమన్నది పెద్ద ప్రయాస. తను చూస్తున్న ప్రతీ కాగితం ముక్క గతంలో కన్నా ఖాళీగా కనబడసాగింది, శూన్యపు తునక తన తెలివితేటలనీ మెదడులోంచి పీలుస్తున్నట్టుగా.

కవిత్వం అంధకారమైనదని, అనూహ్యమైన శక్తిగలదన్న విషయం అతను విశ్వసించడు. అది ఓ కాంతిలాంటిదని, దేవుళ్ళలా సహాయమందించి శాంతపరుస్తుందని అతను భావిస్తాడు. యోగా ఏ విధంగానైతే అనుగ్రహించేందుకు దేవుళ్ళని మెలిపెడ్తుందో అదే విధంగా శ్రద్ధ, కష్టపడే మనస్తత్వం నలు దిశలా వున్న ప్రబంధాలని, పాడేందుకు కావల్సిన కావ్యాలని కవిత్వమనే చెట్టు నుంచి పట్టి లాగుతాయి. కవి స్వచ్ఛంగా, నిర్మలంగా వుంటే దైవసంబంధితమైనవి లభిస్తాయి. యువకవి దాటుకుపోవడాన్ని తడబడటాన్ని గమనించని అతను నిట్టూర్చాడు. యధార్థ ధర్మానికి చెందిన కవులని ఉపసంహరించుకునేలా చేయడమన్నది కఠినత్వంతో కూడుకుని వుంటుంది. కానీ నిజంగా కొందరు ధన్యవాదాలు తెలియజేయడాన్ని అతను సంశయించాడు. అతను జీవితంలో చాలా ఆలస్యంగా కవిగా మారాడు. ప్రపంచంలోని ద్వారాలన్నీ మూసి వేసినట్టుగా గోచరించినపుడు తను యువకుడిగా వున్నప్పుడు హైదరాబాద్ నిజాం కొత్తగా స్థాపించిన ఉస్మానియా యూనివర్శిటీ విద్యార్థిగా వుండగా తను గ్రహాలని అభ్యసించాడు. అందమైన ఆ గ్రహాలకి అరబ్బులు పెట్టిన వికారమైన, వికృతమైన పేర్లు తనకి ఇబ్బందికరంగా తోచాయి. ఆల్టేర్, అల్టెబరన్, ఆర్రేకిస్. అందుకు బదులుగా తను తన వ్యాసాలలో హిందూ పేర్లు ఉపయోగించాలని నిర్ణయించుకున్నాడు. కర్కాటక, వృశ్చిక, ఆశ్లేష అనే పేర్లు మనోహరంగాను, మంచిగాను అన్పించాయి.

యూనివర్శిటీ వదిలిన తర్వాత అతను ఓ సామాన్య సర్వేయర్ ఉద్యోగానికి అప్లై చేశాడు. బ్రిటిష్ ఇండియాలో అతను నిర్వహించదగ్గ ఒకే ఒక్క పదవి అది. కానీ దాన్ని వాళ్ళు తిరస్కరించారు. ఆ వారం ఒక స్థానిక సాహిత్య పత్రికలో తను రచించిన ప్రేమగీతం ప్రచురించబడింది. అతని అప్లికేషన్ తిరస్కరించడానికి నిస్సందేహంగా ఆ ప్రేమగీతమే కారణం అని అతనికి తెలుసు. ఆ గీతంలోని ఓ పంక్తిలో తను సంయమనం

కోల్పోయి బ్రిటిషర్స్‌ని 'కాలుష్య కారకం' అని రాశాడు. ఆ ఒక్క పంక్తి తప్ప ఆ రచన ఎవరికీ హాని చేయని ప్రేమ గీతం. స్థానిక నివాసి అయిన ఓ కఠినాత్ముడు కృష్ణమూర్తిని ఎలాంటి సంజాయిషీ కోరకుండా, క్షమ యాచించడానికి కూడా అవకాశం లేకుండా అతని అభ్యర్ధనని తోసిపుచ్చాడు. అతను నిరాశ చెందడాన్ని గమనించిన నిజాం అతనికి 'ఆస్ట్రానమర్ రాయల్' ఉద్యోగం ఇవ్వబోయాడు. కానీ ముస్లింల కొలువులో పనిచేయాలన్న ఆలోచన రాగానే అతను వణికిపోయాడు. తన తల్లి అనారోగ్యంతో వుందన్న సాకు చెప్పి ఆ ఉద్యోగం తిరస్కరించాడతను. ఆ తర్వాత ఎందుకైనా మంచిదని ముందు జాగ్రత్తగా తన తర్వాతి గీతంలో నిజాంని సంతోషపెట్టాలని కీర్తించాడు. అతన్ని ఓ ఆహార గంపతోను, పూల బొకేతోను, ఇంకా రంగురంగుల సిల్కులతో బైండు చేసిన నోట్ బుక్కుతో పోల్చాడు. కృష్ణమూర్తి వదిలిపెట్టలేదు, తన లక్ష్యం పట్ల స్థిరంగా వుండటానికి సంకోచించలేదు.

అతను బ్రాహ్మడి కొడుకు కాదా? తన చుట్టూ జనాలు వున్నంత వరకు సమాజం పట్ల గాని అస్వాభావికమైన వాటి పట్ల గాని లేక రెండిటి పట్ల భయం గలవారు వున్నంతవరకు అతను పస్తులుండాల్సిన పనిలేదు. ఆ తర్వాత కొన్ని సంవత్సరాల పాటు శుభకార్యాలు, అపర కర్మలు చేస్తూ జీవించాడు. ఒకరోజు ఉన్న పళంగా అప్పటికప్పుడు స్థానికంగా వుండే ఓ భూస్వామి ఇంట్లో పిల్లాడికి చనుపాలు మానిపించే వేడుక కోసం ఓ గీతం రాయవలసి వచ్చింది. అందుకు ఆ భూస్వామి సంతోషించి మూడు ఎకరాల భూమి, జత ఆవులు యువకుడైన తనకి బహుమతిగా ఇచ్చాడు. ఆ విధంగా కృష్ణమూర్తి ఆశ్రమానికి బీజం పడింది. ఆ రోజునుంచి అతని భాగ్యం పెరుగుతూ వస్తోంది.

"గురూజీకి ఇంకా పాన్ తీసుకురాలేదు. నువ్వు ఇక్కడే వుండు. నేను వెళ్ళి ఎందుకూ పనికిరాని ఆ సోమరి మనుషుల్ని తొందరపెడ్తాను" అన్నాడు అప్పారావు గొణిగినట్లు శ్రీనివాస్‌తో... అప్పారావు వేదిక వెనక వైపు నుంచి జారుకోగానే వేదికపైనవున్న వ్యక్తి చదవడం పూర్తి చేసి లేచాడు. ఒక యువకుడు, పల్చటి చేత్తో నున్నటి తన చుబుకం పైన వున్న వెంట్రుకల్ని లెక్కపెట్టుకుంటున్నట్టుగా చిన్నగా నిమురుకుంటూ వేదికపైకి వచ్చాడు. "ఓ రాజనీతి చాణక్యుడా ఎక్కడ నీ బుద్ధిమత?" అంటూ కస్సుమన్నాడు కొత్త కవి. "మీ అమ్మ నిన్ను నల్ల గేదె పాలతో పోషించి నీ చర్మాన్ని బంక మట్టిగా మార్చేసింది. కోరికలు తీర్చే ఆవు ఏది? కొన్ని యుగాల రుషుల మూలగ్రంథాలలో చేరిన స్వర్గంలోని నక్షత్రాలు పారే పొదుగులు ఏవి? ఆ పవిత్ర స్తన సంబంధమైనవి ఎక్కడ వున్నాయి?

అంతా విన్న కృష్ణమూర్తి గుర్రుమన్నాడు. ఇప్పటితరం యువకులు అనాగరికంగా మారారు. రెక్కలు తొడిగిన ఈ కుకవి బహుశా తను సాహసవంతుడని, అనుభవశీలుడని అనుకుంటున్నాడేమో. దాన్ని ఎలా అదుపు చేయాలో తనకి తెలుసు. ప్రజలు తెలుసుకోవాలి. ఈ మధ్యకాలంలో కొత్త కొత్త కవులు, కవిత్వ ధోరణులు రావడంతో కొన్ని యుగాల నుంచి వస్తున్న ఘనమైన కవిత్వానికి తెరపడింది. ప్రస్తుతం కొత్త యశస్సు గతంలోని గౌరవప్రదమైన దానికి అనుకరణ మాత్రమే. సంయమనంతో కవిత్వం ఆధునీకరించబడాలి. ప్రజలకి ఇది అర్థం కావాలన్న ఉద్దేశంతో ఆ యువకుడు చాలా దూరాన్నుంచి వచ్చాడు. రైల్వేల గురించిన అతని కావ్యం ప్రసిద్ధిగాంచింది. తను కవిగా కొత్త జీవితాన్ని సెలబ్రేట్ చేసుకోవడానికి అతను దీన్ని రచించాడు. అతను 37 సంవత్సరాల వయస్సులో వున్నప్పుడు ఇంకా తనని చూసి దేవుళ్ళు నవ్వినపుడు అది అద్భుతమైన కాలం. అనుచరులు అతని దగ్గర గుంపు కట్టారు. అతని కవిత్వం గురించి వార్తా పత్రికలు సందడి చేశాయి. కానీ ఆలస్యంగా అతను ఇబ్బందుల పాలయ్యాడు. అతన్ని అందరూ 'గుర్రం' అనడం అటువంటి ఇబ్బందుల్లో ముల్లులాంటిది. దేశమంతటా విచారకరమైన వార్త. యూరోప్‌లో యుద్ధం పనికి మాలినది. ఆర్యావర్తం అసంకల్పితంగా లాగబడింది. దాని సొరంగం చివర కేవలం చీకటిని మాత్రమే చూశాడతను. ఆర్యులుగా చెప్పుకునే ప్రజలు దెబ్బలాడుకోవడం వల్ల ఒరిగేదేమీ వుండదు. కొందరు అన్నారు, బ్రిటిషర్లు ఓడిపోతారని, వాళ్ళు పరిపాలించిన ఆర్యులపైన అంటే బ్రాహ్మలపైన కక్ష తీర్చుకుంటారని. చాలా నెలల క్రిందట వేదశాస్త్రి ఇంట్లో సమావేశం అయినప్పుడు వేదశాస్త్రి అన్న మాటలు జ్ఞప్తికి తెచ్చుకున్నాడు కృష్ణమూర్తి. ఒకవేళ ఆర్యావర్తం బ్రిటన్‌కి సాయమందించడంలో విఫలమైతే బ్రిటిషర్స్ దేశాన్ని పాలించే పాలనా పగ్గాలని ముస్లింలకిచ్చి వెళ్ళిపోతారని అన్నాడు వేదశాస్త్రి. పరిస్థితులు ఇంచుమించుగా 1757కి ముందులాగే వుంటాయని, ఇప్పుడు ముస్లింలకి రైల్వేలు, డాక్‌పోస్ట్, ఆర్మీ ఇంకా పోలీసు విభాగాలని వాళ్ళ సార్వభౌమాధికారంలో వుంచుకోవడాన్ని తప్పించి. అది దాని గురించి ఆలోచిస్తూ సహించలేదు.

ప్రస్తుతం చదువుతున్న ఆ యువ కవి పైన దృష్టి పడగానే కృష్ణమూర్తి మళ్ళీ రుసరుసలాడాడు. కొన్ని జతల పంక్తులు నమోదయ్యాయి. పవిత్ర హృదయపు మంటల గురించినదేదో. నిజంగా అది ఒక విధంగా మంచిదే. అతను సమ్మతించినట్టుగా తలూపాడు. త్యాగాలు అగ్నిలో హరించాలి. ఈ యువకుడు వృద్ధిలోకి వస్తున్నాడు. 'వెరీగుడ్' అన్నాడు కృష్ణమూర్తి. ఆ యువకుడు చదవడం పూర్తవగానే అతని భుజం

తట్టి కృష్ణమూర్తి "చిన్నవాడివైనా చాలా బాగా ఇంప్రూవ్ అయ్యావు. రేపు వచ్చి నన్ను కలుసుకో. నీకు మంచి బహుమతి లభిస్తుంది" అన్నాడు. దాంతో అక్కడ వున్న మిగతా కవులు ఆ యువకుడి వంక ఆకలిగొన్నట్టు చూశారు యజమాని ఎముకని బహుమతిగా చిన్న కుక్కకి వేసినపుడు మిగిలిన పెద్ద కుక్కలు చూసినట్టుగా. తరువాతి కవి వేదికనలంకరించగానే జనాల వెనక పాన్ ప్లేట్ తన చేతిలో వుందన్న విషయం కూడా మర్చిపోయి తనవంక దయ్యాన్ని చూస్తున్నట్లు గుడ్లప్పగించి చూస్తూ నిలబడ్డ అప్పారావుని గమనించాడు కృష్ణమూర్తి. కృష్ణమూర్తి అప్రసన్నంగా ఓ శిష్యుడిని అతని దగ్గరికి వెళ్ళమన్నట్టు సైగ చేశాడు. తర్వాత శ్రీనివాసరావు ఆ తర్వాత కృష్ణమూర్తి చదవాల్సి వుంది.

అప్పారావు వేదికపైకి వచ్చేసరికి కృష్ణమూర్తి చదవడానికి ఉపక్రమించాడు. మిగతా భారతీయ కవులలా కాకుండ కృష్ణమూర్తి వీరోచితంగా తక్కువ స్థాయి స్వరంలోను, చేతిలో చిన్నపాటి నోట్సుతోను టి.ఎస్. ఇలియట్‌ని అనుకరిస్తూ ఏ భాషలో చదవాలి అన్నది పాటించకుండా చదువుతున్నాడు. ఇది ఒక నవీనమైన పద్ధతిగా కృష్ణమూర్తి భావించాడు. కృష్ణమూర్తి చదవడం మొదలుపెట్టాడు.

తల్లీ, నువ్వు ఎందుకు దుఃఖిస్తున్నావు?

నేను నీ పుత్రుడిని. మౌనంగాను, శాంతంగాను వుండే భర్తలని కలిగిన ఘనమైన రాజభవనంలోని సౌందర్యవంతుల కేశాలతో నీ కన్నీరు తుడుస్తానని శపథం చేస్తున్నాను.

ఉన్నత కుటుంబాలలో పుట్టిన వాళ్ళ సంపదల్ని, నిధుల్ని వాళ్ళు జన్మభూమిని కొల్లగొట్టి దోచుకున్నారు. కన్యలు శివుడికి అర్పించు కున్నారు. చూడు, వాళ్ళ దవడలు ఎలా వెడల్పుగా మారాయో. ఎల్లలు లేని శోకం గాలిలో నిండిపోయింది. వాళ్ళ ఆభరణాలు లాక్కుని పాపిష్టి చేతుల్తో చిందరవందర చేశారు.

*మలినమైన నోర్లు ఉన్నతమైన నీ రహస్యాలని మలినం గావించాయి.*

*మలిన హృదయాలు నీ భక్తిని పరిశీలిస్తున్నాయి.*

*మలిన పాదాలు నీ వీధిలోను, ఆలయంలోను అడుగుపెట్టాయి.*

కర్మాగారాలలోని దుర్గంధాన్ని, గోశాలలు, చేపల కొలనులు ఇంకా మరుగుదొడ్లలోని దుర్గంధాన్ని తీసుకువస్తున్నారు.

ఇప్పుడు నీ పాటలు పాడే సాహసం కూడా చేస్తున్నారు. వాళ్ళు నిశ్వాస కంపుతో గాలిని కల్మషం గావించే ప్రయత్నం చేస్తున్నారు.

నిన్ను ప్రార్థిస్తున్నాను. ఇలా కాకూడదు, ఓ తల్లీ, ఎన్నటికీ ఇలా కాకూడదు.

ఆ రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత సాంప్రదాయక మతపరమైన ఆశీర్వచనం, భోజనాల తర్వాత కృష్ణమూర్తి తన గదిలో చిన్న కాగితం ముక్క వైపు చూస్తూ కూర్చున్నాడు. పెన్ను తీసి అక్కడకక్కడా ఏదేదో రాస్తున్నాడు, కొట్టివేస్తున్నాడు, మళ్ళీ రాస్తున్నాడు. మంచిగా వచ్చిందన్న నమ్మకం కలిగేంతవరకూ అలా చేస్తుంటాడు.

అక్కడి ఆశ్రమంలోని కుటీరాలకి తలుపులు వుండవు. కర్టెన్లు మాత్రమే వుంటాయి. కుటీరాలలో మంచం, దిండు, రెండు జతల బట్టలు, పెన్నులు, ఇంకు బాటిల్సు, కాయితాలు ఇంకా గోడ లోపలికి కవితలు వుంచి తాళం వేసేలా చిన్న చెక్కపెట్టెల సెట్టు వుంటాయి (అపఖ్యాతి పాలైన గోపాల సంఘటన తర్వాత కవితల్ని ఆ విధంగా గోడలోపల అమర్చేలా ఏర్పాటు చేశారు. గోపాల దొంగతనంగా తన ప్రత్యర్థి గదిలో దూరి అతని కవితల రాతప్రతులన్నింటినీ తగలబెట్టాడు. అందుకుగాను ఇప్పుడు గోపాల ఒక సంవత్సరం పాటు వంట గదిలో పనిచేయాలి. ఒక్క మంగళవారాలు మాత్రమే కవితలు రాయడానికి అతనికి అనుమతి వుంది). తలుపు తట్టి లోపలికి ప్రవేశించడానికి తలుపులు లేకపోవడంతో సందర్శకులు 'జై సరస్వతీ మాత' అని బిగ్గరగా రెండు మూడుసార్లు ఉచ్ఛరిస్తారు. కాని సంయమనం కోల్పోయిన అప్పారావు 'జై సరస్వతీ మాత' అనడానికి బదులు 'జై సరోజినీ మాత' అన్నాడు.

కృష్ణమూర్తి గబగబా తను చెరిపేసిన పంక్తులున్న పేజీలని దాచేసి కర్టెన్ వేసి అప్పారావు వంక తొంగిచూస్తూ "సరోజిని! ఆ మహిళని నువ్వు కవి అంటావా! కవయిత్రి. అది సరే ! నీకు ఏమైంది అప్పారావ్? సాయంత్రం నుంచి నీ ప్రవర్తన వింతగా వుండటమే కాక ఇప్పుడు ఇక్కడికి వచ్చి నన్ను అవమానించావు!" అన్నాడు.

అప్పారావు మొహం ఊదారంగుకి మారింది. "గురూజీ, పెద్ద దుర్వార్త. నేను పాన్ తీసుకురావడానికి వెళ్ళడంతో అప్పుడు చెప్పడం సాధ్యం కాలేదు. నేను వచ్చేసరికి మీరు చదవడం మొదలెట్టేశారు.."

"అయితే నేను చదవడం ముగించగానే ఎందుకు చెప్పలేదు! అయ్యో! ఫర్వాలేదు, ఇప్పుడు చెప్పు."

అప్పారావు అడుగులు అడ్డదిడ్డంగా పడ్డాయి. కృష్ణమూర్తి కళ్ళు విద్యుత్ బల్బుల్లా వెలిగాయి.

"అప్పారావు ఏంటా విషయం?" ఇప్పుడే చెప్పు. లేకపోతే నీమీద ఓ గంటలో సెటైర్ రాస్తాను."

"గురూజీ, వద్దు! ప్లీజ్. ఇది చాలా గంభీరమైన, సున్నితమైన విషయం" అంటూ అప్పారావు ద్వారాలు తెరిచివున్నాయని, ప్రతి ద్వారానికి చెవులు వుంటాయని తెలిసి చుట్టూ భయం భయంగా చూశాడు.

"ఉఫ్" అంటూ కృష్ణమూర్తి అతన్ని గదిలోకి తీసుకువెళ్ళి "ఏంటి అది? చెప్పు" అన్నాడు.

"గుర్రం. అది గుర్రం. మీరు మెచ్చిన కవిత. అది పదానికి పదం కాపీ కాదు. మన స్నేహితుడైన ఆ యువకుడు ముందు ఒరిజినల్ చదివి మర్చిపోయి వుంటాడని అనుకుంటున్నాను. అది అతని మదిలో నీటి బుడగలా పొంగి ఈ రూపంలో వచ్చి వుంటుంది. తరచూ కవులకు జరిగేది అదేనని మీకు తెలుసు. ఒరిజినల్ కవిత ముప్ఫై సంవత్సరాల క్రితం రాసిందని నేను అనుకుంటున్నాను. అగ్రకులాల వాళ్ళు గుర్రం గ్రామాన్ని తగలబెట్టి, అతని భార్యని నరికి చంపినప్పటిది. అజ్ఞాత వ్యక్తులు దానిని కరపత్రాలలో ప్రచురించి గ్రామమంతటా అతికించారు. దాని గురించి కొన్ని వార్తా పత్రికలు కూడా ప్రచురించాయి. ఆ కథ చదివిన వాళ్ళు తమ మదిలోంచి ఆ కవితని చెరిపేయలేరు. అందులోని ప్రతీ పదం ఈ రోజుకీ నాకు గుర్తుంది. పేదవారు ఇప్పటికీ ఆ కవితని పాడుకుంటారు, కానీ అది రాసిన వారెవరో, ఎందుకోనన్న విషయాన్ని మర్చిపోయి వుంటారు.

అప్పారావుని ఆశ్చర్యంగా చూశాడు కృష్ణమూర్తి. "అంటే ఆ యువకుడు ఆ కవితని తస్కరించాడనా నువ్వు అనేది... గుర్రం రాసిన... తిరిగి చెప్పడానికి? "మరి గ్రేట్ అప్పారావ్, నువ్వేంటి, ఆ అసహ్యకర జీవి కొంటె కవిత్వం చదివే పని చేస్తున్నావా?"

"ఎవరైనా సరే, తన శత్రువు ఎవరో తెల్సుకోవాలి" అన్నాడు అప్పారావు. "నేను చదివి వుండకపోతే గనుక ఆ గ్రంథ చోరుడు దొరికేవాడు కాదు. కాని అతడ్ని దొంగ అనను! అది గుర్రం కవిత అని అతనికి తెలిసి వుండదు. పలుకుబడి, యూనో."

"అశుద్ధం తినేవాడివల్ల ప్రభావితం కావడానికి ఎంత ధైర్యమతనికి!" అంటూ కస్సుమన్నాడు కృష్ణమూర్తి. నేను ఆ యువకుణ్ణి మెచ్చుకుంటుండగా అందరూ చూశారు. ఇప్పుడు అతణ్ణి శిక్షించాలి, పబ్లిగ్గా... నేను నవ్వుల పాలవటం ఖాయం!"

"లేదు, గురూజీ" అన్నాడు అప్పారావు సాంత్వనగా. అపర చాణక్యుడి ఆత్మ చావలేదు. ఆ కుర్రాడిని గురించి మర్చిపోండి. అతనికి ఎలాంటి బహుమతి రాదని నేను కబురు చేస్తాను. నిజంగా అతను దొంగ అయితే బహుమతి ఎందుకు రాదు అని అడగడానికి సందేహిస్తాడు. లేకపోతే మళ్లీ ముందుకి వెళ్తాడు. ఒకవేళ అలా చేసినట్లయితే అతని సంగతి నేను చూసుకుంటాను. ఈ విషయం గురించి మీరేమీ అనకండి. జనాలు ఏమీ లేనట్లు మర్చిపోతారు. మీరు అప్పటికే చాలా చెప్పారు."

కృష్ణమూర్తి మెత్తబడ్డాడు. చిరునవ్వు నవ్వాడు. అతను కరచాలనం కోసం అప్పారావుకి చేయి అందిస్తూ "థాంక్యూ మై ఫ్రెండ్. ఇప్పుడు నీకూ శ్రీనివాసరావుకీ ఓ అప్రియమైన పని అప్పజెప్తాను. మీరిద్దరూ తప్పనిసరిగా గుర్రం కవితల్ని చదవాలి. మీ ఇద్దరిలో ఎవరో ఒకరు తప్పనిసరిగా నా ప్రక్కనే వుండాలి. మరోసారి ఇలా జరగకూడదు. ఇప్పుడే పని మొదలు పెట్టండి. గుడ్‌నైట్."

"అలాగే గురూజీ" అంటూ వినయంతో తలవంచి వెళ్ళిపోయాడు అప్పారావు.

అప్పారావు టేబుల్ ముందు ఉదాశీనంగా కూర్చున్నాడు. గుర్రం కవితల కాపీలు సంపాదించడం అంత తేలిక కాదు. తన ముందున్నది పసుపు రంగుకు మారిన వార్తా పత్రికల క్లిప్పింగులతో వున్న వివరణాత్మక ఫైలు. అందులో అధికంగా గుర్రం కార్యకలాపాలు రిపోర్టులు, అతను రాసిన ఒకప్పటి కవితా పంక్తులు కొన్ని. గుర్రం తన కవితలని పబ్లిష్ చేయలేదో లేక అతని గొంతే అతని పబ్లిషరో. ఆంధ్రదేశంలోని పేద జిల్లాలు, గ్రామాలు అన్నీ తన కవితల్ని గానం చేస్తూ, ఎవరు భోజనం పెడితే వాళ్ళ దగ్గర కవితల్ని ప్రదర్శిస్తూ తిరిగాడతను.

అయితే ఎలాంటి కవితలు! ఫైలులోని చివరి డాక్యుమెంట్ తిరగేశాడతను. సరిగ్గా టైపు చేయని ఈ ఉత్తర్వులని సంపాదించేందుకు లంచాలిచ్చి మానసికంగా ఇబ్బందులని ఎదుర్కొన్నాడతను. అవి బ్రిటిష్ కల్నల్ ఓ వెర్రివాడిని ఇంటరాగేషన్ చేసినప్పటి రాతప్రతులు.

పదాలలో నిప్పు కణికలు! విచారణ జరుగుతున్న సమయంలో గానం చేయడం, వాళ్ళు దెబ్బలు కొట్టినప్పుడు ఊపిరాడక గిలగిల తన్నుకుంటూ ఆగడం, మళ్ళీ పగిలిన పళ్ళలోంచి, రక్తం ఓడుతున్న ముక్కు నుంచి గానం కొనసాగించడం. వాళ్ళు స్పృహ

తప్పేంతవరకు కొట్టినపుడు మాత్రమే పొద్దం ఆపు చేసేవాడు. కానీ మరునాడు మళ్ళీ వాచిపోయిన మొహంతో పొద్దం కొనసాగించేవాడతను. చిట్టచివరికి అతని పరిస్థితిని చూసి విసుగు వచ్చి అతను వెళ్ళిపోవడానికి అంగీకరించారు పోలీసులు.

అప్పారావు మదిలో ఓ ప్రణాళిక రూపుదిద్దుకుంది. అది మూర్ఖత్వంతో కూడిన సాహసవంతమైన ప్రణాళిక. దాంతో గుర్రం నిరర్థకమైపోతాడు. గుర్రం కవితల కాపీల కోసం దాహార్తితో తపిస్తున్న తమ ప్రియతమ గురూజీకి వాటిని ఇవ్వొచ్చు. దివ్యత్వానికి మార్గం కవిత్వమనే స్వచ్ఛమైన జలం. ఎందుకంటే గురూజీలో రాత్రులు చోటు చేసుకునే వేదనలు అప్పారావుకి తెలుసు. అతను శ్రద్ధగా గురూజీకి చెందిన ప్రతీ చెత్తని మధ్య మధ్యలో గమనిస్తుంటాడు.

తన గురూజీ కలం నుండి జాలువారిన అర్థం పర్థంలేని గిలికి రాతల్ని చూశాడతను. ఓ మంచి సేవకునిగా తన యజమాని ఆలోచనల్ని తెలుసుకోవాలని అతని కోరిక, తన గురూజీని బాధించేవి, ఉల్లాసం కలిగించేవి ఇంకా అతనికి అవసరమైన విషయాల గురించి. అప్పుడే గురూజీకి సరియైన సేవ చేయగలనని అతని విశ్వాసం. భూతం దాని మంత్రదండంతో ముందుగా ఏర్పడే అడ్డంకులని తొలగించి వేడుకల గురించి ఆలోచించక మునుపే వాటిని ఏర్పాటు చేసినట్టుగా.

ఏమరుపాటుతో కృష్ణమూర్తికి దుఃఖం కలిగించినందుకు విచారించాడతను. గురూజీ గుర్రం కవిత చదివినప్పుడు తను గురూజీ పక్కన లేకపోవడం, ఎక్కుపెట్టిన విల్లు నుంచి తళతళ మెరిసే బాణం ముందుకి దూసుకుపోయేలోగా అతను దాన్ని అందుకోవడంలో విఫలం చెందాడు. అప్పారావు సాహసాన్ని నమ్మాడు. అతను కృష్ణమూర్తిని అన్వేషించడానికి వెళ్ళాడు.

కృష్ణమూర్తి మెయిన్ హాల్లో 'జాతీయవాద' వార్తా పత్రికలైన 'టియర్స్ ఆఫ్ అవర్ మదర్' ఇంకా 'ప్యూర్ సన్స్'కి చెందిన పాత్రికేయులతో మాట్లాడుతున్నాడు. కృష్ణమూర్తి అన్నాడు. "తెలుగు, కన్నడ రెండు భాషలూ అధునాతన పరిణామక్రమంలోనివి. కానీ వాటి స్వచ్ఛత కోసం మనం కనీస జాగ్రత్తలు తీసుకోవడం లేదు. ఆహారోత్పత్తి అవసరమే కానీ, దాని భాష భవిష్యత్తులో భారతీయ యువత చదివేలా పుస్తకంలో ఒక భాగం కాకూడదు. భవిష్యత్తులో విద్యా విధానం కేవలం వేదాల పైన, పురాణాల పైన కేంద్రీకరించాలి. హేతువాదం (రేషనలిజం) యూరోపియన్‌లది మాత్రమే కాదు. ప్రధానంగా అది క్రిస్టియన్. చూడండి, క్రిస్టియన్ మతగురువు కోపర్నికస్ విజ్ఞాన శాస్త్రంలో

ప్రవేశించి మతానికి మాత్రమే ఎటువంటి సమస్యలు సృష్టించాడో. అలాంటి ధోరణులని హిందూయిజం మొగ్గలోనే త్రుంచివేయాల్సిన అవసరముంది."

"అదెలా గురూజీ ?" అడిగాడు స్థానిక గోసంరక్షణ సమితి ప్రతినిధి. అతనివంక జాలిగా చూస్తూ కృష్ణమూర్తి "మనం పిల్లలకి బోధిస్తున్నపుడు బాగా శ్రద్ధ వహించాలి. అంతేకాదు, వాళ్ళు గర్భంలో వున్నప్పటి నుంచి మనం వాళ్ళ వృద్ధిని గమనించాలి. ఉదాహరణకి మనం పిండ దశలో వుండగానే కేవలం ఆవుపాలు తాగి వుంటే మనం కూడా రష్యన్‌లలా తెల్లగా పొడవుగా వుండేవాళ్ళం" అన్నాడు.

"అవును" అంటూ గోసంరక్షణ సమితి ప్రతినిధి "గేదె పాలు తెలుపే అయినా నల్ల గేదెల వంశ పరంపర కారకాలు అందులో వుంటాయి. అవి మన దేహాలని నల్లబర్చాయి" అన్నాడు.

"నిజమే" అన్నాడు కృష్ణమూర్తి తృప్తితో. అన్ని మగ పశువుల వీర్యం తెలుపే. కానీ వాటిలోని జీన్స్ విభిన్నమైనవి. ఆ విధంగానే గేదె పాలు, ఆవు పాలు ఒకే రంగులో వుంటాయి. కానీ విభిన్నమైన జీన్స్, ప్రొటీన్ నిర్మాణాలతో ఉత్పత్తి అవుతాయి. బ్రాహ్మణ తల్లులు గేదెపాలతో తయారైన నేతిని అతిగా వాడటం వల్ల మనం గర్భాశయంలో వుండగా మన రంగుని మలినం గావించి వుంటాయి. చారిత్రక భౌతికవాదం ఇంకా లామార్క్ పరివర్తన సిద్ధాంతం ఆ విధంగా చెబుతాయి.

'హా!' అన్నాడు అప్పారావు. కృష్ణమూర్తి అతని వైపు చూశాడు. "మీరు ఖాళీగా వున్నపుడు చిన్న మాట గురూజీ" అన్నాడు అప్పారావు.

"ఓహ్! మిమ్మల్ని మరింత సేపు వుంచాలని మేము అనుకోవడం లేదు" అంటూ పాత్రికేయులలో ఒకరు "మీ అనుమతితో ఒక్కటే ప్రశ్న గురూజీ. మీ ఆశ్రమంలో మహిళలు లేరన్నది నిజమేనా? ప్రతీదీ, వంట కూడా పురుషులే చేస్తారా?" అడిగాడు.

"అఫ్‌కోర్స్" అంటూ కృష్ణమూర్తి "రచన అనేది ఓ పవిత్రమైన కార్యం. మహిళల సమక్షంలో అది చెడిపోతుంది. ఇప్పటికే వాళ్ళు చాలా కీడు చేశారు. గర్భిణీలుగా వున్నప్పుడు గేదె పాలు తాగి వాళ్ళు చేసిన చెడుని మనం మరమ్మతు చేయాలి."

"కానీ కవితాత్మకి ప్రేరణ ఎలా?"

కృష్ణమూర్తి ముక్కుపుటాలు అదిరాయి. "నా కవులు ఆ విధమైన కవితలు రాయరు. వాళ్ళకి తల్లి ఒకే మహిళ. ప్రేరణ కూడా ఆమెనే. నీవు అడిగిన ప్రశ్న సమాజ

మూలాధారం మురికి గుంటలో పడిపోయినట్లుగా సూచిస్తోంది. ఇప్పుడు మనం దుర్గంధ పూరితమయ్యాం. శుద్ధి కావాల్సి వుంది. గ్యాలన్ల ఆవుపాలు కూడా మనల్ని శుద్ధిపర్చలేవు. ఈ సబ్జెక్ట్ మీద వందల కొద్దీ రచనలు చేసినా మనం దాన్ని సాధించడమన్నది వీలు పడదు. పురుషుడి పురుషుడి మధ్య సంబంధం శుద్ధి గావిస్తుందని, పురుషుడు స్త్రీకి మధ్య సంబంధం అపవిత్రం చేస్తుందని హిందూ సంప్రదాయం చెప్తోంది. బుద్ధుడు కూడా తన సంఘంలోకి మొదట స్త్రీలని అనుమతించలేదు, కాలుష్య కారకులన్న ఉద్దేశంతో. తర్వాతే తన చెడు శిష్యులైన ఉపాలి – పుట్టుకతో శూద్రుడు, వృత్తి రీత్యా క్షురకుడు – అతను ఆ ఉత్సాహం, శక్తి పోగొట్టుకున్న మహిళల్ని తన సంఘంలోకి అనుమతించాడు. బుద్ధిజానికి జరిగిందేంటో మనకి తెలుసు. ప్రస్తుతం మన ఆశ పునాది దశ నుంచి పరిశుద్ధ స్థితి కలగాలన్నదే' అంటూ వివరించి పాత్రికేయులకు వీడ్కోలు పలికాడు కృష్ణమూర్తి.

సభాసదనం ఖాళీ అవడంతో "మంచిది, ఆ విషయమేంటి?" అడిగాడు కృష్ణమూర్తి చిరచిరలాడుతూ అప్పారావుని. ఆశ్రమంలో చుట్టుప్రక్కల పరిశీలించే చెవులే లేకపోవడంతో ఆ ప్రదేశం ఏకాంతంగా వున్నట్లు గోచరిస్తోంది. తను అనుకున్న ఏర్పాట్లు వాటి రూపురేఖల్ని కృష్ణమూర్తికి వివరించాడు అప్పారావు. అది వినగానే కళ్ళు తలలోంచి పొడుచుకువచ్చినట్టు పెద్దగా అయ్యాయి కృష్ణమూర్తికి. "ఇది ఘోరం. నా గుండెల పైకి పాముని ఆహ్వానించాల్సిందిగా చెప్తున్నావు. నువ్వు మతి వుండే మాట్లాడుతున్నావా?"

"లేదు గురూజీ. జీవితం అంకగణితం కాదు. చాణక్యుడు చెప్పలేదా, స్నేహితుల్ని దగ్గరగా చేర్చుకోవాలని, శత్రువుల్ని దగ్గర చేయాలని."

"కానీ తక్కువ పుట్టిన ఆ పిచ్చాడు నీ ఏర్పాటుని అంగీకరిస్తాడా?"

"అతను ఓ వెర్రిబాగులోడు. అతను చాలా ప్రపంచం చూశాడు. కానీ రిపోర్టులన్నీ అతను ఓ పిల్లాడిలాంటి వాడిగా తెలియజేస్తున్నాయి.

"నిన్ను నమ్మడం కష్టం."

సరే మంచిది. నీదంతా వెర్రి మొర్రి ఆలోచన. నీకు భంగపాటు తప్పదని నాకన్పిస్తోంది. వెళ్ళు వెళ్ళి అతనికి నమ్మకం కలిగించు. ఆ తర్వాత రా... అప్పుడు చూద్దాం." అన్నాడు కృష్ణమూర్తి. మట్టి రోడ్డుపైన గుర్రం నడక మామూలుగా లేదు. అతనికి వృద్ధాప్యం దగ్గర పడుతోంది. తను యవకుడిగా వున్నప్పుడు తరువాతి గ్రామం

వరకు ఈ పక్కా రోడ్ ఒక్కరోజులో తయారయిందన్న విషయం జ్ఞప్తికి తెచ్చుకున్నాడతను. అప్పుడప్పుడూ శూన్యంలోకి చూస్తూ ఏదో గొణుక్కుంటూ వుంటాడు. తన చేతి కర్రని కోపంగా ఆకాశం వైపు ఎత్తి చూపిస్తూ బిగ్గరగా అరచినట్టుగా అన్నాడు. "అయితే నువ్వు నాకు చిరాకు తెప్పించడానికి ఊర్లు తిరుగుతున్నావన్న మాట. యూ ఓల్డ్ జోకర్, నీ పాత స్నేహితుడిని ప్రలోభపెట్టడం గమనించలేదనుకున్నావా? ఇంకా మరి నా మోకాళ్ళు, హ? వాటి నొప్పి తగ్గడానికి ఇంకా నువ్వేమీ చేయలేదు, చేశావా?

నీవు ఒక కవిత కావాలనుకున్నప్పుడు తప్పితే, జల్లెడలాంటి జ్ఞాపకశక్తి గలవాడివి.

ఈ మధ్యన గుర్రం దేవుడితో ఎన్నో విషయాలు ముచ్చటిస్తున్నాడు. ఆ దేవుడికి బోర్ కొట్టినపుడు అతని గురించి దేవతకి ఫిర్యాదు చేస్తాడు. అప్పుడు ఆ దేవత కూడా ఆ దేవుడి గురించి ఫిర్యాదు చేస్తుంది. ఆమె కాస్త నిష్ఠూరంగా సణగడం ఇప్పుడు అతనికి వినిపిస్తోంది. "నేను అర్ధనారీశ్వరుడిని అంటాడతను. సగం స్త్రీ – సగం దేవుడు. అతను ఈశ్వరుడు, నేను నారి. అతని శరీరంలో అర్ధ భాగం పొందిన నేను అర్ధనారీశ్వరి ఎందుకు కాకూడదు స్త్రీలోనే పురుషుడు ఒక భాగంగా. ఎల్లప్పుడూ తనని తాను పెద్ద పెద్ద పేర్లతో పిల్చుకుంటాడు. బలిసిన ముసలి తలకాయ." గుర్రం అటువైపు తిరిగి అన్నాడు, "తల్లీ నువ్వు అతనికి మంచి కల్లు తాగించి ఎందుకు పడుకోబెట్టవు?" అని సలహా ఇస్తూ గుర్రం "నాకు కూడా కొద్దిగా ఇవ్వు. గ్రామంలోని గొర్రెల కాపరులు బొటాబొటీగా నీళ్ళిస్తారు. దరిద్రపు బాస్టర్డ్స్, నేను తాటికల్లు తాగలేదు. ఎందుకంటే... ఎందుకంటే... గుర్రం కళ్ళల్లో నీళ్ళు ఉబికాయి. అతను రోడ్డు ప్రక్కన కూలబడి "నేను అడవి జంతువుల్ని దూరంగా తరమడానికి పాడతాను" అన్నాడు దేవతతో. "నీకు తెలుసా, అవి ఎలా వుంటాయో. అవి క్రిటిక్స్‌లా వుంటాయి లేక పేట్రన్. నువ్వు నీ ధమనులని ఎంత గట్టిగా అదిమి కళని బయటికి లాగుతావో అంతే వేగంతో అవి పరుగుపెడ్తాయి.

గుర్రం స్థిరంగా కూర్చున్నాడు. రోడ్డు వార అనుకూలంగా లేదు. గతంలో ఎప్పటి నుంచో అలాంటి వాటిని తను చూస్తూనే వున్నాడు. అతను సంతోషంగా వున్నాడు. "అయ్యో! దేవుడా ఇకముందు ఎవరూ నీ పట్ల ప్రేమ కనబర్చరు. వాళ్ళు నిన్ను జిల్లా మేజిస్ట్రేట్‌లా సంతోషపెడతారు. నీకు స్వీట్లు, పూలు సమర్పిస్తారు. అంతే తప్ప నిన్నెవరూ లెక్కచేయరు. పూర్ ఓల్డ్ గాడ్! కానీ చింతించకు. నిన్ను అర్థం చేసుకోగలను. నా పాటంటే నీకు ఇష్టం కాదా? అవును, దేవుళ్ళు వాస్తవాలు వినడానికి ఇష్టపడతారు. ప్రజలు అబద్ధాలాడినపుడు దేవుళ్ళు విచారిస్తారు." ఒకసారి విలేకరిలా వున్న ఓ మహిళ ఏదో ఊరిలో తనని చుట్టుముట్టి అడిగింది. "మీరు దళితుల కంఠస్వరం. అవునా?" అప్పుడు తను చిన్నవాడు. తన కళ్ళు మాటిమాటికీ చింతనిప్పుల్లా మారేవి. తనని

'గుర్రం' అని పిలిచేవారు. ఎందుకంటే తన జుట్టు గుర్రం మెడపైన జూలులా ఒత్తుగా రోషంతో నిక్కబొడుచుకుని వుండటం వల్ల. తను అప్పుడు నీళ్ళలో నిప్పులు కురుస్తుండగా ఆ మహిళని ఆపి, "నేను నాకు స్వరాన్ని. నువ్వు నను బాధిస్తే అప్పుడు దళితుల స్వరాన్ని" అన్నాడు. నగరాలలో పరిశుభ్రమైన దుస్తులతో నివసించే కవులు అలాంటి మాటలు మాట్లాడుతూ వెళ్ళిపోతారు. వాళ్ళు అహం ప్రదర్శిస్తారు. కానీ దళిత కవి మౌత్‌పీస్‌లా వుండాలి. సంభాషణ గుళిక బాధితుల సమూహానికి 'అంటు' కట్టాలి. తను ఒకసారి ఉడ్చేటపుడు వుండే సంతోషాన్ని గురించి ఓ చెడ్డ హాస్యపూరితమైన కవిత రాశాడు. గ్రామాల్లో ఆ పని ఆచరించినపుడు దాని అర్థం అందరూ గ్రహించారు. కానీ నగరంలోని ప్రజలు తనవైపు దిగ్భ్రాంతిగా చూశారు. ఊడ్చే పనిని ఎగతాళి ఎలా చేయగలడు తను? అతను అన్నాడు, నేను ప్రేమ కోసం, డబ్బుల కోసం చెత్తని ఊడ్చి శుభ్రం చేశాను. నువ్వు ఎన్నడైనా ఆ రెండింటిలో ఏ ఒక్క దానికోసమైనా అలా చేశావా?" ఆహా! ఇది వచన కావ్యయుగం. పెద్ద పెద్ద బొజ్జలతో, పెద్ద పెద్ద పదాలు తిని తిని మిరుమిట్లు గొలిపే కవి గొప్పదనం ఒక కాల (గణన) దోషం అన్నారు వాళ్ళు దాని అర్థం ఏమైనప్పటికీ. గుర్రం ఏమాత్రం పట్టించుకోలేదు. అతను పాడతాడు. లేకపోతే పిచ్చివాడైపోతాడు. చాలామంది తనకి పిచ్చిపట్టిందన్నారు. వాళ్ళకోసం తన ప్రవర్తన మార్చుకోవాలనుకున్నాడు కానీ వృద్ధాప్యం దగ్గరపడటంతో తను ఇష్టపడేదాన్ని తనిప్పుడు చేస్తాడు.

అప్పుడప్పుడే సూర్యాస్తమయమవుతోంది. దూరంగా కొండల వెనుక చిక్కటి ఎర్రటి సూర్యబింబం. బంతిలా మెల్లగా, కిందికి జారుతోంది. రెప్పలార్పకుండా గుర్రం చూస్తుండిపోయాడు. సూర్యుడు మాయమైనా అతడు పులిమిన ఎరుపును వదల్లేక ఆకాశం దాన్నట్లే పొదివి పట్టుకొని వుంది. కాని దాని చుట్టూ వున్న ఆకాశమప్పుడే ఊదారంగునద్దుకొని రాత్రికి స్వాగత సన్నాహాలు చేస్తోంది. శోభాయమైన ఆ దృశ్యం చూసి భావుకుడైన గుర్రం పాడసాగాడు. అతను కళ్ళు మూసుకుని బిగ్గరగా పాడసాగాడు. తన దగ్గరికి వచ్చి ఆగిన బండి శబ్దం కూడా వినిపించలేదతనికి.

*ఆకాశంలో రక్తం నా హృదయం ఘోషిస్తోంది,*

*ఆకాశంలో రక్తం సాగుతున్నారు పిల్లలు,*

*వీధుల్లో రక్తం భూస్వామి వచ్చి పిలిచినపుడు,*

*కళ్ళలో రక్తం ఎందుకంటే నేను పడిపోతున్నాను, పడిపోతున్నాను.*

ఆ కను చీకటిలో అస్పష్టంగా ఓ ఆకారం తన ముందుకు వచ్చి కూర్చోగానే గుర్రం ఒక్క గెంతు గెంతాడు. హడావిడిగా మిడిగుడ్లేసుకుని చూశాడు. పరిశుభ్రమైన కాటన్ వస్త్రం. తెల్లని వస్త్రం మీద కాషాయ పూత అస్పష్టంగా గోచరిస్తోంది. దూపం, చందన సువాసనలు అతని ముక్కుపుటాలని తాకుతున్నాయి. దివ్యత్వ పరిమళాలు. ఆహా నువ్వా... నువ్వేనా? నువ్వు పడుకోలేదా? లేక దేవత నీకు సరిపడేంత కల్లు ఇవ్వలేదా? నా దగ్గర నించి లాక్కుందామని వచ్చావా? నా దగ్గర ఏమీ లేదు."

ఆ ఆకారం అంది. "గుర్రం నాతోరా... నీవెంత తాగుతావో అంత తాగు. ఇక వద్దు అన్నంత వరకు కల్లు ఇస్తాను."

"హయ్మయ్య! చివరికి! నువ్వు అర్థం చేసుకున్నావు చివరికి" అంటూ గుర్రం అతని వద్దకు వెళ్ళాడు. గుర్రం మదిలో స్పష్టత గోచరించింది. తెలుపు, కాషాయ దుస్తుల్లో వున్న ఆ వ్యక్తి వైపు శ్రద్ధగా చూశాడు. అతను ఎవరో మిషనరీలా వున్నాడు. అంతకు క్రితం రోజు మనఃపూర్తిగా అన్నం పెట్టిన వాడిలా. తనకి ఆ క్రమం తెలుసు. వాళ్ళు అన్నం పెట్టేంతవరకు ఓర్పుతో వినాలి. ఆ తర్వాత బయటపడ్డానికి ఏదో గుర్తుకువచ్చినట్లు నటించాలి. (ఏమైనప్పటికీ తను వృద్ధుడు) వాళ్ళు స్వీట్స్ సర్వ్ చేసేముందే ఇంకా నోరు పట్టని తిట్లు తిట్టి మురుగు నీళ్ళలో ముంచకముందే తను మైదానంలోకి పరుగెట్టాలి. తనకి జ్ఞాపకముంది. అది కఠినమైన పరుగు.

హుఁ, బండిలో అతను ఎలాంటి పుస్తకాలూ చూడలేదు. అపురూపమైన వెల్వెట్ కుషన్‌లు తప్ప. తనకి తెలుసు మిషనరీల దగ్గర పుస్తకాలు వుంటాయని, కుక్కల పైన వాలిన పురుగుల్లా. బహుశా ఇతను ఓ ధనిక వ్యాపారవేత్త అయ్యుంటాడు; గుర్రంకి ఓ విధమైన వ్యాపార సంబంధమైన వాసన వచ్చింది. దాని గురించి ఆలోచించసాగాడు. ఈ వ్యక్తి తను ఎరగని, వినని గ్రామానికి చెందిన వాడయ్యుంటాడు. వ్యాపారస్తులంటే అర్థం మంచి ఆహారం ఇంకా వైన్. "నేను ఎంతసేపు పాడాలి? గ్రామం చౌరస్తాలోనా! అక్కడ నీడనిచ్చే చెట్లు వున్నాయా? నా పాట వినేటప్పుడు జనాలు ఎండలో మాడ్డం నాకు ఇష్టముండదు. అది చాలా భయంకరం. ఆ విధంగా నాక్కూడా మాడ్డం ఇష్టం వుండదు, హే"

"బండిలో ఎక్కు."

గుర్రం తలపైన ఏదో కొట్టినట్టన్పించింది. కళ్ళు చిట్లించి జాగ్రత్తపడ్డాడు. బండి పోలీసులా స్ఫురించిందతనికి. "ఎవరు? మీరంతా ఎవరు? ఈ నెలలో వాళ్ళు

నన్ను కొట్టారు. నాకు తెలిసింది వాళ్ళకి చెప్పాను. ఆ తర్వాత నా బుర్ర పూర్తిగా ఖాళీ అయిపోయింది.”

“నేను నీ అభిమానిని. మాలో ఇంకా చాలామంది అభిమానులు వున్నారు. మాకు నీ కవితలంటే అభిమానం. నువ్వు రాసిన ‘హోలీ ఫైర్ ఆఫ్ ది హార్ట్’ మొదలుకుని నువ్వు రచించినవన్నీ నేను స్వయంగా చదివాను. నీ కవితల్ని వినాలని మేము కోరుకుంటున్నాము. మేము నిన్ను అత్యంత గౌరవంగా చూస్తాము. ఎందుకంటే కవులందరికీ తండ్రివి నువ్వు.”

“నిజమా?”

“దయచేసి మాతో రా.”

గుర్రం కళ్ళు మసకబారాయి. అతని ప్రవృత్తులు నిప్పు హెచ్చరిక గంటలా గణగణమంటూ ధ్వని చేస్తున్నాయి. కానీ అతని విజ్ఞప్తి తన కవి హృదయాన్ని కరిగించింది. “తను ఓ అభిమాని విజ్ఞప్తిని కాదని ఎలా అనగలడు? వాళ్ళ కోసం పాడ్డానికి తను నిప్పుల పైన నడుస్తాడు, వాళ్ళ కళ్ళలో చూపులు చూస్తాడు. ఇంకా కవిత చదవడం అయిపోయి వాళ్ళంతా పోయే సమయంలో మెరుపు మెరిసేంత క్షణంలో దాని సారం వాళ్ళ అరచేతుల్లో వుంచుతాను” అనుకుంటూ గుర్రం “పదండి వెళ్దాం” అన్నాడు.

గుర్రం దీర్ఘంగా నిశ్వసించి బండిలో కుషన్ సీటు మీద కూర్చున్నాడు. ఇక బండివాడితో బయలుదేరమన్నట్టుగా సైగ చేశాడు అప్పారావు. రాత్రి ప్రయాణం కొంత ప్రమాదకరం. కానీ గుర్రం జాడ తెలుసుకోవడమే అప్పారావు పని. ఇక తన చేతి వేళ్ళ సందుల్లోంచి గుర్రం జారిపోకుండా చూడాలి. మొత్తానికి అప్పారావు కొద్దిగా భయపడినా ఎలాంటి సంఘటన జరక్కుండా కొద్దిగా ఆలస్యంగా మర్నాడు సాయంత్రానికల్లా బెంగుళూరు చేరుకున్నారు. గేట్లు తెరిచి బండివాడు బండిని ఆశ్రమం లోపలికి తీసుకువెళ్ళాడు. వంట గదులు దాటి బండి వేగంగా వెళ్తుండగా ఒక్కసారిగా ఊపిరి ఆగినట్లన్పించింది బండివాడికి.

వంటగదుల వెనకాల ఏదో తెల్లగా కదిలినట్లు మసగ్గా కన్పించింది. నేల మీంచి కొంచెం ఎత్తులో దూరంగా కదిలిపోతున్నట్టుగా, ఓ బెలూన్‌లా ముందుకి పోతున్నట్టుగాను చివరికి పొలాల్లో కనుమరుగైనట్టుగాను కన్పించింది. ఆశ్రమవాసులు ప్రశాంతత కోసం అక్కడికి వెళ్తుంటారు. అప్పారావుకి వణుకు పుట్టింది. దెయ్యం! దెయ్యం!

అంటూ గొణిగాడు బండివాడు. 'దెయ్యమా'! తిరిగి గొణిగాడు అప్పారావు. గోపాల తను చూసినట్టుగా చెప్పిన దెయ్యం!'

"ఎందుకు ఇక్కడ ఆగాం? మన ఆశ్రమం ఇక్కడేనా! బండిలోంచే అడిగాడు గుర్రం. సమాధానం రాకపోవడంతో బండిలోంచి తల బైట పెట్టి చూశాడు గుర్రం. తెల్లటి చుక్కలాంటి ఆకారం కనబడిందతనికి. ఆ తర్వాత ఘనీభవించిన అప్పారావు మొహం చూశాడతను.

"ఏం జరిగింది? మహానుభావా?" అడిగాడు గుర్రం అతి వినయంగా.

"ష్! అంటూ అప్పారావు "దయ్యం నీ మాటల్ని విని నీ గొంతు గుర్తు పెట్టుకుంది. ఆ తర్వాత అది వచ్చి నీ పీక పట్టుకుంటుంది" అన్నాడు.

గాల్లో తెల్లగా తేలియాడుతున్న వస్తువుని గుర్రం నిలకడగా చూశాడు. అది దయ్యం అని అనుకోలేదతను. తను గడిపిన చమత్కారంతో కూడిన సంవత్సరాలు ఎవరితోనూ ఎలాంటి ప్రతిఫలం లేకుండా భావాలు పంచుకోవద్దని నేర్పించాయి. అందుకనే గుర్రం మళ్ళీ వెళ్ళి తన వెల్వెట్ సీటుపైన తన స్థానంలో స్థిరంగా కూర్చున్నాడు. కొంచెం సేపటికి బండి కదిలింది. బండివాడు ఇంకా వ్యాపారవేత్త కలిసి ఆందోళనగా మాట్లాడుకోవడం వినిపిస్తోంది గుర్రంకి.

చివరికి బండి ఓ గది దగ్గరికి వచ్చి ఆగింది. అది పాక. బలంగా వున్న మట్టి గోడలు. ఆ గది ఆడంబరమైన వస్తువులతో కూడి వుంది. పైన కప్పు దగ్గర గాలి రావడం కోసం చిన్న చిన్న రంధ్రాలు వున్నాయి. చాలాకాలం క్రితం, దక్షిణం వైపు సిమెంట్ కట్టడం కట్టకముందు దాన్ని ధాన్యం గదిగా వాడేవారు. అందువల్ల ఆశ్రమంలోని మిగతా గదుల్లా కాకుండా దానికి బలమైన ద్వారం వుంది. కీటకాల్లాంటివేవీ రాకుండా. గది లోపల సౌకర్యవంతమైన మంచం, దానికింద వున్న అరలో ఓ కుండ. ఒక టేబుల్ పైన ప్లేట్లో ఆహారం. ఇంకా ఈ మూల నించి ఆ మూల వరకు వరసగా కల్లు కుండలూ వున్నాయి. అప్పారావు గది తాళం వేసి తాళం చేతులు జేబులో పెట్టుకుంటుండగా మొదటి కుండ అడుగంటా ఖాళీ అవుతున్న శబ్దం విన్పించింది. ఆ తర్వాత ఆ రాత్రంతా ఘాటైన ప్రేమగీతాలు విన్పించాయి సుఖప్రదమైన ముగింపుతో.

దేవీ, కండపుష్టి గల నా తల్లీ, నువ్వెంతటి ఆలోచనా పరురాలివి ప్రియా. ముసలి వ్యక్తి క్రూరమైన బాధకి మనోహరమైన గోల్డెన్ బీర్‌తో శాంతపరిచావు. ఇప్పుడు నీ బిగుతుగా చుట్టబడి వున్నాడు. కదలి ఒక్క అడుగు కూడా వేయలేదు.

నీవూ నేను రాత్రి గడుపుదాం తీవ్ర ఉద్రే....

మరునాడు, సమావేశ మందిరంలో ఉదయం ప్రార్ధన అయిన తర్వాత ఓ ప్రకటన చేశాడు కృష్ణమూర్తి. "మనతోపాటు ఓ కొత్త కవి వున్నాడు. కానీ మీ అందరికన్నా అతను ఓ ప్రత్యేక వ్యక్తి. అతను వృద్ధ బ్రాహ్మణుడు. అతనికి ఓ మొండి జబ్బు వచ్చింది. వెలుతురులో అతని చర్మం పాలిపోతుంది. అందుకని మన సమావేశాలలో అతను పాల్గొనడం సాధ్యం కాకపోవచ్చని నా అనుమానం. మీరెవరూ అతన్ని చూసే ప్రయత్నం చేయకండి. అలా చేస్తే దాని పర్యవసానం తీవ్రంగా వుంటుంది. అసంభావ్యమైన పరిస్థితుల్లో అతను ఏదైనా రాస్తే బుధవారపు సమావేశాలలో అది మీకు చదివి వినిపిస్తాను."

సమావేశ మందిరం నుంచి అందరూ వెళ్ళిపోయారు. మరోసారి హాలు ఖాళీగా వున్నప్పుడు కృష్ణమూర్తిని కలిశాడు అప్పారావు. "సమావేశం బాగా జరిగింది" అంటూ అప్పారావు "మీరు ఆ వృద్ధుడి కవితలు చదువుతానని చెప్పడం నాకు నచ్చింది. అలాగయితే మీరు చౌర్యం చేసినట్టు ఎవరూ ఆరోపించరు" అన్నాడు. చర్మవ్యాధితో బాధపడుతున్న ఆ వృద్ధుడి కవితలు ఏవో కృష్ణమూర్తి స్పష్టం చేయాల్సిన అవసరం లేదన్న విషయం తను చెప్పాల్సిన అవసరం లేదనుకున్నాడు అప్పారావు. వృద్ధుడు రాసిన కవితల బండిల్‌ని కృష్ణమూర్తికి అందజేశాడు అప్పారావు. "శ్రీనివాసరావు ఇప్పుడు గుర్రంతో వున్నాడు" అంటూ అప్పారావు "ఇవి ఈ మధ్యాహ్నం వరకు నాకు లభించినవి" అన్నాడు.

కృష్ణమూర్తి బండిల్‌ని చూసి "ఇదంతా నాన్సెన్స్! కొంటె కవిత్వం" అన్నాడు.

అప్పారావు దగ్గాడు. "మంచిది, అతను వచ్చినప్పటి నుంచీ తాగుతూనే వున్నాడు. మనం తాటికల్లుని ఎక్కువగా ఏర్పాటు చేసినట్టున్నాం" అన్నాడు అప్పారావు.

"అది రోత సరుకు. సాధారణంగా ఎంత తాగుతాడో మనకి ఎలా తెలుస్తుంది? అప్పారావ్, నువ్వు అతని మైకం తొలగించు. నాకు వెంటనే అతని కవితలు కావాలి."

ఆ చీకటి గదిలో ఇంటి పై కప్పుకున్న రంధ్రాల గుండా ప్రసరించే వెలుగు తప్ప ఏమీ లేని ద్వారం వైపు రెండు కళ్ళు చూస్తున్నాయి. కాసేపటికి సగం తలుపు ఓరగా తెరుచుకోగానే లోపలికి ఓ సంచీని తోశారు. ఆ తర్వాత ప్లేటులో ఆహారం. ఆ చీకట్లో రెండు బక్కపలుచని బలమైన చేతులు ప్లేటులోని ఆహారం పక్కన వుంచి సంచీ తెరచి అందులో వున్న డబ్బాలని తీసి వరసగా పెట్టాయి. ఆ చేతులు ఒక డబ్బాని

తెరిచాయి. వంటకి ఉపయోగించే అందులోని సుగంధ ద్రవ్యాలు బూజు వాసన కొట్టే గాలిలో ఘాటైన పరిమళాలతో నింపేశాయి. నెమ్మదిగా ఓ రాయి బైటకి తీసి దానిమీద జాగ్రత్తగా దాల్చినచెక్క, లవంగాల కుప్పని వుంచి మరో రాయి ముందుకీ వెనకకీ కదలసాగింది. నూరిన దాల్చినచెక్క , లవంగాలని గరిటెతో కలియదిప్పి డబ్బాలో పోశారు. అలాగే అల్లం, జీలకర్ర, చింతపండు (ఆమెకి చింతపండు అంటే ఎప్పుడూ చిరాకే), సుగంధ ద్రవ్యాలు ఇంకా ఆవాలు అన్నీ అతి జాగ్రత్తగా నూరి వాటి వాటి డబ్బాలలో పెట్టారు. ఆ డబ్బాలనీ సంచుల్లోకి ఎక్కాయి. మళ్ళీ సగం తెరుచుకున్న తలుపులోంచి సంచీ లోపలికి తోశారు. ఆ తర్వాత తలుపు మూసుకుంది సాయంత్రం వరకు.

ఆమె నిట్టూర్పు విడిచింది. ఆ తర్వాత బ్రేక్‌ఫాస్ట్ చేసింది.

గుర్రం తన గదిలోపలి నుంచి తలుపు తట్టి "నేను ఎప్పుడు పాడాలి?" అంటూ అరిచాడు.

"ఇప్పుడే" అంటూ పలికింది బయట వున్న కంఠం. గుర్రంకి చూచాయగా ఆ స్వరం గుర్తుంది. "కానీ ఇక్కడ ఎవరూ లేరు. నా ప్రేక్షకులు ఏరి?" అన్నాడు గుర్రం.

"మేమంతా ఇక్కడే ఎదురుచూస్తున్నాం. లోపలి నుంచి నువ్వు పాడు. మేము వినగలం."

"నిజంగా? నువ్వు దయ్యానివా, భగవంతుడు పంపిన దయ్యానివా? నన్ను దేవతతో మాట్లాడకుండా ఆపడానికా? ఆహా, నీకు సెన్సాఫ్ హ్యూమర్ లేదు, బుద్ధిహీన ముసలి తాగుబోతు. దేవుడా? ఇది న్యాయమేనా? నువ్వు వ్యభిచరించిన వ్యక్తుల గురించి ఆలోచించు. నువ్వు నిజంగా మహాలింగానివే. నీ వెనకాల దేవత నవ్వుకోవడం నీకు నచ్చుదా, ఒకటి రెండు పళ్ళున్న ముసలి కవితో? మంచిది. నీ గురించి ఆమె వృధా చేసింది. ఇది నిజం. నేను కేవలం ఇది మాత్రమే చెప్పగలను."

అప్పారావు నిట్టూర్చాడు. మూడు రోజుల నుంచి గుర్రంతో అతనికి ఇబ్బందిగానే వుంది ఈ హింస భరించడానికి. ఒకరి గురువుని మెచ్చుకున్నందుకు ఈ 'ముసలి మనిషి' తగిన బహుమతా, అనుకున్నాడు అప్పారావు.

"నేను నిజంగానే రాక్షసుడిని. నువ్వు గనుక ఇప్పుడే కవిత వినిపించకపోతే నేను నీ కాలేయాన్ని సంతోషంగా తినేస్తాను" అన్నాడు అప్పారావు.

‘ఓ మలిన బ్రాహ్మడా, నేను మూర్ఖుడిననుకుంటున్నావా?” అని బిగ్గరగా అరుస్తూ గుర్రం ‘ఇక్కడ తాటికల్లుతో నన్ను మభ్యపెట్టావు. నా అపవిత్ర సమక్షం పవిత్రమైన నీ వలలో పడాలని ఎందుకు అనుకుంటున్నావో నాకు తెలియడం లేదు. కానీ నీ కోసం నేను పాడను. ఒకవేళ బోనులో బంధించిన అడవి జంతువులతో నీకేమైనా అనుభవం వుంటే (నాకు అనుమానమే) అది ఎందుకో నీకు తెలుస్తుంది. అసలు నీ గురువు నన్నేం అనుకుంటున్నాడు. వెళ్ళు, వెళ్ళి నీ గురువుతో చెప్పు, యోగాసనాలలో ఒకటి వేసి తన పురుషాంగాన్ని చెవిలో పెట్టుకోమను శూన్యంలోంచి మెదడు జారిపడిపోకుండా.

ఇంతలో శ్రీనివాసరావు అప్పారావు భుజాలని తడుతూ “గురూజీ నిన్ను చూడాలనుకుంటున్నాడు. అతనికి మరో ఆలోచన వచ్చింది” అన్నాడు.

“అందుకు నేనే దొరికానా” అంటూ అప్పారావు కనుబొమలు ముడిచి వెళ్ళాడు.

శ్రీనివాసరావు నోటుబుక్కు, పెన్ పట్టుకొని ద్వారం ముందు కూర్చున్నాడు.

“హలో!” అంటూ లోపలి నుంచి పిలిచాడు గుర్రం.

“మిస్టర్ రాక్షసుడా? నువ్వు గట్టిగా పట్టుబడితే నేను పాడతాను, నువ్వు మంచిదనుకున్న మరో కుండతో.”

“అతను వెళ్ళిపోయాడు” అన్నాడు శ్రీనివాసరావు. సాయంత్రం వరకు నువ్వు నాతో వుండవచ్చు. నేను వెళ్ళిపోయేంత వరకు... నేను వెళ్ళిపోయేదాకా..”

“ఆహా, నువ్వు బాగా బలిసినవాడివి. అయితే నిన్ను ఎప్పుడూ చూడలేదు కాబట్టి నువ్వు లావో, సన్నమో నాకు తెలియదు. కానీ నీ మాట అలా వుంచి నువ్వు నిజంగా లావుగా వుంటావా?”

“అలాగే అనుకుంటున్నాను.”

“బక్కపలుచగా, బలహీనంగా వుండే మరో మనిషి తను కవినే గానీ, పాడనని అన్నాడు. నువ్వు కూడా కవివేనా?”

“అవును, నేనూ అలాగే అనుకుంటున్నాను. నువ్వు కోరితే పాడతాను.”

ఓ.కె. అయితే పాడు. ఆ పనికిమాలిన దేవుడి మీద అరచి అరచి గొంతు బొంగురుపోయింది. నాకు కొంత విశ్రాంతి కావాలి.

శ్రీనివాస్ చిన్నగా దగ్గి గొంతు సవరించుకుని ఆరంభించాడు :

*నా ప్రేమ మరణించినవారికి చెందుతుంది.*

*ఒక దెయ్యం చెయ్యి, మరియు ఆమె జీవించి వుంది.*

*ఒక సమాధిలో అయ్యో నేను ఎప్పటికి*

*కోరాను ఆమె కోసం ఒక జీవితాన్ని*

*అందుకు ప్రతిఫలంగా నాకు లభించింది మరణం*

*నాకు మరణం, అతనికి మరణం, ఆమెకు మరణం.*

"ఎంత ఘోరమైన దయ్యాలు ఈ ప్రజలు." తనలో తాను అనుకున్నాడు గుర్రం. వాళ్ళలో ఏ ఒక్కరూ జీవితాన్ని ప్రేమించడం గాని, వాళ్ళు పీల్చే గాలి వల్ల గాని ఎలాంటి ఆనందాన్ని పొందలేకపోతున్నారు. ఎంత విచిత్రం."

తర్వాత గుర్రం పాడ్డం మొదలుపెట్టాడు :

*ఇక్కడ చీకట్లో, ఎదుగుతున్నాను చీడలా*

*పాతుకుపోయాను విశ్వాసంతో, దినం విడిచింది,*

*మరచిపోయాను ప్రేమలో, విడిచిపెట్టింది కాంతి*

*కానీ లోలోన వెలిగిందో మట్టి దీపం*

*మాట మార్గం హృదయంలో వెలిగాయి.*

గుర్రం మొహమ్మీద కాంతి పడింది. చిరాగ్గా కళ్ళకి చేతులు అడ్డం పెట్టుకున్నాడతను. "అయితే ఇప్పుడేంటి జూనియర్ రాక్షసుడా? ఇప్పుడే నీ కోసం పాడాను. నువ్వు సంతోషించి వెళ్ళిపోవాలి. నీ పెద్దన్న నన్ను విసిగించడానికి వచ్చే సమయమా ఇది?"

శ్రీనివాస్ కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి 'నేను వెళ్ళలేను' అంటూ ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. ఆ తర్వాత మాటలు రానివాడిలా ద్వారానికి అడ్డు లేకుండా ఓ ప్రక్కగా నిలబడ్డాడు.

"గుర్రం, నీ పాట నా గుండె కవాటాలని తెరిపించాయి. నిన్ను లోపల వుంచి నేను తలుపులు ఎలా వేయగలను? దయచేసి నాతోరా, నీకు ఒకటి చూపించాలి. ఆ తర్వాత నీ స్వేచ్ఛని నేను ప్రసాదిస్తాను."

గుర్రం కాళ్ళీడ్చుకుంటూ “ఓ వృద్ధుడు పవిత్రమైన ఈ వలలోంచి బయటికి రాగలడని నువ్వు ఎలా అనుకుంటున్నావు? ఈ ఇంటి కప్పు మీద నుంచి మరో కప్పు పైకి గెంతుతూ రావాలా లేక నా ఆయుధంతో శత్రువుల్ని నరికేయాలా?” అంటూ తన ఊతకర్రని ఝుళిపించాడు.

“నాతోరా. నాతో వుంటే ఎవరూ నిన్ను అడగరు” అని గుర్రం బయటికి రాగానే శ్రీనివాస్ డోర్ లాక్ చేశాడు. “ముందు వాళ్ళు తాటి కల్లు ఇస్తాం పాడు అన్నారు. ఆ తర్వాత వాళ్ళు తాటి కల్లు ఇచ్చి నోరు మూసేయమన్నారు, ఆగమన్నారు, వెళ్ళమన్నారు. వాళ్ళు మనల్ని చంపేస్తారు, మనల్ని ఉపయోగించుకుంటారు. అసలు ఈ పెద్ద మనుషులకి కావల్సిందేంటి?”

వాళ్ళు ఆశ్రమంలోని రోడ్డు వారగా వంట గది వెనుక వైపుకి నడుచుకుంటూ వెళ్తున్నారు. శ్రీనివాస్ ఒకచోట అకస్మాత్తుగా ఆగి చిన్న కిటికీ సందులోంచి గదిలోకి తొంగి చూస్తూ “లీలా! లీలా!” అంటూ సున్నితంగా పిలిచాడు. గది లోపల చీకటి మరింత చిక్కబడింది. “నాన్నా, ఏంటి? నా భోజన సమయం ఇంకా కాలేదు, సూర్యాస్తమయమై గంట మాత్రమే అయ్యింది.”

“ఈ మనిషి తక్కువ పుట్టిన కవి. ఇతనికి అన్ని రోడ్లూ, గ్రామాలు తెలుసు. నువ్వు తప్పించుకోవడానికి ఇతను సహకరిస్తాడు” అంటూ శ్రీనివాస్ గుర్రం వైపు చూసి “నా కూతురు ఈ గదిలో సంవత్సరం నుంచి వుంటోంది. మేము ఇక్కడికి ఓ షరతుపైన వచ్చాం. కవులని చెడగొడ్తుందని ఆమె ఉండటానికి ఇష్టపడలేదు కృష్ణమూర్తి. అందుకని ఆమె తనంతట తాను దినుసులు నూరడం, కూరలు తరగడం ఆశ్రమం వంట గదిలో చేస్తూ వుంటుంది. నేను వాటిని తీసుకువచ్చి ఈమెకి ఇస్తుంటాను. ఆమె ఆ పని పూర్తి చెయ్యగానే వాటిని తీసుకు వెళ్ళిపోతాను. ఎవరూ కూడా ఆమెని చూడ్డం గాని, వినడం గాని చేయలేదు. రోజూ అర్ధరాత్రి ఆమెని బయటికి రానిస్తాను, పొలాల్లోకి వెళ్ళి కాలకృత్యాలు తీర్చుకోడానికి, స్నానం చేయడానికి. కానీ నిన్నటి నుంచి తను దయ్యాన్ని చూసినట్టుగా అప్పారావు చెప్తున్నాడు. అది విని గురూజీ తను ఆమెని చూశానన్న వంక పెట్టి ఆమెని ఇక్కణ్ణించి వెళ్ళిపొమ్మంటాడేమోనని భయం వేస్తోంది” అన్నాడు.

“అయితే? నాకేంటి?”

“ఆమె దృఢంగా వుంది. పనులు చేస్తుంది. ఆమెని ఏ ఊరైనా తీసుకువెళ్ళి ఆమెకంటూ ఓ పేరు, చరిత్ర కల్పించు. ఆమె జీవిక కోసం ఏదైనా ఓ ప్రాంతం చూడు, ఆకాశం కింద గోడలు అవసరం లేదు.

"ఏంటి నువ్వనేది? నేను బ్రాహ్మణుడిని. నేను తీసుకుపోలేను. రోడ్డు మీదనే నాకు శిక్ష వేస్తారు. లేదు, లేదు, ఆమెనేం చెయ్యాలో నువ్వు ఆలోచించుకో. ఈ బాధ్యత మోయడానికి నేను వృద్ధుడిని."

శ్రీనివాస్ కళ్ళల్లో నీరు నిండింది. అతను చేతులు జోడించి వేడుకుంటున్నట్టుగా అన్నాడు, ఆమె వితంతువు. పుట్టింది మొదలు శని దృష్టి ప్రభావంతో శాపగ్రస్తురాలు. నేను ఆమెకి ఇంకేమీ చేయలేను. పెళ్ళి చేసి దివాళా తీశాను. కానీ మహిళలకి, ఇంకా తక్కువ పుట్టిన వాళ్ళకి ఇక్కడ స్థానం లేదు..."

గుర్రం రుసరుసలాడుతూ "మీ జనాలకి ఇదొక అలవాటుగా మారిందని నాకనిపిస్తోంది. మీకు అవసరం వున్నవాళ్ళని గుర్తించడం, వాళ్ళని చీకటి గుహలోకి విసిరేయడం, వాళ్ళ నించి కావల్సింది పిండుకోవడం. ఈ రకమైన చెడుకి కూడా ఓ పేరుండాలని నా అభిప్రాయం. నేను నా శేషజీవితాన్ని దీని గురించి వివరించడానికి, భాష కనిపెట్టడానికి వినియోగిస్తాను" అన్నాడు.

"అయితే నువ్వు ఆమెని తీసుకువెళ్తావా?"

"ముందు ఆమెని అడుగుతాను నాతో వస్తుందేమోనని. ఆమెని గురించి నిర్ణయం తీసుకునే హక్కు నీకు లేదు. ఇది నీకు వచ్చిన విచిత్రమైన ఆలోచన అని నాకు తెలుసు. కానీ నన్ను ప్రసన్నం చేసుకో" అంటూ గుర్రం నెమ్మదిగా కిటికీ తట్టాడు. కొద్దిగా తెరుచుకుంది. గుర్రం కిటికీ సందు గుండా లోపలికి చూసి "హలో, అమ్మాయీ, నాతో రావాలని వుందా? నేను వెళ్ళిపోతున్నాను. ముందు ఇక్కడ నుంచి బయటపడ్డాక నీ దారిన నువ్వు వెళ్ళవచ్చు. నేను ఒంటరిగానే ప్రయాణిస్తాను" అన్నాడు.

శ్రీనివాస్ బెరుగ్గా అతని భుజాల మీంచి కిటికీ లోపలికి చూశాడు. "లీలా, మనకి టైం లేదు. నువ్వు ఈ మనిషితో వెళ్ళు. ఇప్పుడే!"

"నోర్మూసుకో బండోడా !" అన్నాడు గుర్రం. కానీ ధడాల్న తలుపు తెరుచుకుని లీల బైటకి వచ్చి "నీతో వస్తాను" అంది.

"హుం ఇప్పుడు మనం...." శ్రీనివాస్ ఉన్నట్టుండి గుర్రంని ఒక్క ఉదుటున దభీమని ఆ చీకటి గదిలోకి తోశాడు. ఆ యువతి మీద నుంచి దొర్లేలా..

ఓ కంఠం గాడిదలా అరిచింది. "ఏం చేస్తున్నావు ఇక్కడ శ్రీనివాసా? నీకు తెలుసు కదా ఎట్టి పరిస్థితుల్లోను అర్ధరాత్రి లోపు నువ్వు ఇక్కడికి రాకూడదని. ఎవరైనా

చూస్తే సిగ్గు కదా? మన కవి ముందు నువ్వు డ్యూటీలో వుండాలి! అతను సాయంకాల గాలుల మీద పురాణానికి సంబంధించిన కవితలు రాస్తుండవచ్చు. నువ్వు నోట్‌బుక్కుతో అక్కడ వాటిని అందుకోవడానికి లేక సమయం వృథా చేశావు." ఉపమానం అన్న భావన వ్యక్తీకరించే అవకాశం కృష్ణమూర్తి ఎన్నడూ ఇవ్వలేదు.

"మన కవి నిద్రపోయాడు. అందువల్ల అతని ద్వారం దగ్గర చేసేదేమీ లేదు. లీల జ్వరంతో బాధపడుతుందేమోనని భయపడ్డాను" అన్నాడు శ్రీనివాస్.

"ఆమె పరిస్థితి దిగజారితే దిగజారనీ. ఆమెకి ఇక్కడ వైద్యం చేయించి ఆశ్రమ పవిత్రతకి భంగం కలిగించలేను. ఆమె ఇక్కడ నుంచి వెళ్ళిపోవాల్సి వస్తుందేమోనని భయపడుతున్నాను. వితంతువులు బ్రతకడానికి ఇంకా ఆ భగవంతుడిని ప్రార్థించడానికి చాలా ప్రాంతాలు వున్నాయి. నీకు ఆమె పట్ల వుండే భావగర్భితమైన అభిప్రాయాల వల్ల ఆమెని నీతోపాటు వుంచుకుని నా క్షేత్రాన్ని ఎందుకు ఇబ్బందుల్లోకి నెడుతున్నావో నాకు అర్థం కావడం లేదు."

శ్రీనివాస్ శిరస్సు వంచి "నాకు తెలుసు గురూజీ. మీరన్నది వాస్తవమే. ఆమెని పంపించే ఏర్పాటు చేస్తాను" అన్నాడు.

"అదేదో త్వరగా కానియ్. ఎవరూ చూడకూడదు. ఇప్పటికే నేను పరిహాసాస్పద పుకార్లు వింటున్నాను. ఎలాంటి భంగపాటు లేకుండా ఆమె ఇక్కణ్ణించి వెళ్ళిపోవాలని చెప్పాను కదా" అంటూ కృష్ణమూర్తి పెద్ద పెద్ద అంగలేస్తూ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు కర్ర చెప్పులు నేలపైన పెద్దగా శబ్దం చేస్తూ. చంద్రుడు పైపైకి ఎగబాకుతున్నాడు. శ్రీనివాస్ ఉపశమనంగా కుంటుతూ "గుర్రం?" అని పిలిచాడు.

"యస్, మహారాజా, ఈ స్వీపర్ పనికిమాలిన చెత్త ఎత్తుతోంది మామూలుగానే" అంటూ "బిడ్డా, నువ్వు ఇక్కడ వుండాల్సిన అవసరం ఎవరికీ లేదు" అని గుర్రం చేతులతో లీల వైపు సైగ చేస్తూ గేటు వైపు తిరిగాడు. "తాటి కల్లు ఎక్కువైతే బోర్ కొడ్తుంది. నమ్మేవాళ్ళకి అది చాలా మంచి డ్రింక్. రా, లీలా.. ఈ వృద్ధుడి చేతులు పట్టుకో. ఇక్కడ ఉన్న వాళ్ళెవ్వరూ మనల్ని వినిపించుకోరు. మనం వెళ్ళిపోవాలి."

కృష్ణమూర్తి చేతులు వణుకుతుండటంతో వ్యాకులపడ్డాడు. మళ్ళీ బుధవారపు సమావేశం అది. అతను నిన్నటి రోజంతా గదిలోనే గడిపాడు. పేజీలలో ఆవుపాల వంటి తెల్లని సుడిగాలిని పీలుస్తూ, ఏ నల్ల సిరా కూడా దానిని మలినపరచలేదు. అది

చాలా అందంగా నీట్‌గా వుంది. అతను దానికి దాసుడైపోయాడు. ప్రతీ పదం కాంతి వల్ల ఆవిరైపోయింది. ఇప్పుడు నిరీక్షించే ముఖాల ముందున్న తనకి ఆ కాంతి వాళ్ళ కళ్ళ నుంచి నోళ్ళ నుంచి ప్రతిఫలిస్తున్నట్టుగా అనిపిస్తోందతనికి. శరీరానికి ఉపశమనం కలిగింది. అసలు ఇంతకీ తను దేని గురించి భయపడుతున్నాడు? నిజమే అది శూద్ర పదమే. అది నలుపు. అది స్వచ్ఛమైన ఆర్యావర్త శరీర రూపం చెడగొడుతుంది. నిజమైన బ్రాహ్మణిజంకి మాటలు లేవు. ఎందుకంటే బ్రహ్మ వర్ణింప వీలుకానివాడు, చెప్పనలవి కానివాడు. కృష్ణమూర్తి నోరు తెరిచాడు. నేతి, నేతి, నేతి, నేతి... అంటూనే వున్నాడతను. అతను ఏది కాదో చెబుతూ భగవంతుడిని ఆ రకంగా అభివర్ణించాడు. మేధకు ఒక్కసారి అటువంటి జ్ఞానం అందితే ఈ అన్వేషణకు అదే ముగింపు. తన చేతుల్లో కవితల బొత్తులతో వాటిని సగానికి చింపివేశాడు. ముక్కలు ముక్కలు చేశాడు. "నేతి, నేతి, నేతి, నేతి..."[2] ఇది కాదు. ఇది కాదు, ఇది కాదు.

తన ముందు వున్న కళ్ళు, నోళ్ళు సున్నాలా అయ్యాయి. ఇంగ్లీష్‌లోని 'o' ఇంకా 'O' లాగా లేక ఎందుకూ పనికి రాని చిన్న చిన్న కాయిన్స్‌లా. అందం లేదు. తక్కువ పుట్టిన ఇంకా చదవలేనివారు కవితల్లో ప్రకాశాన్ని చూడనీ; ఎందుకంటే రసజ్ఞులకి అది మౌనమే. కృష్ణమూర్తి కవుల వైపు చూసి నమస్కరించి నవ్వాడు. వాళ్ళు వెళ్ళిపోవడానికి స్వేచ్ఛని ప్రసాదిస్తున్నానని వాళ్ళతో అనాలనుకున్నాడు. కానీ నోట మాట రాలేదు. అందుకని కేవలం నవ్వాడతను. వాళ్ళంతా ఒకరి మొహాలొకరు చూసుకుంటూ కలవరపాటుతో కూడిన కోలాహలంతో నెమ్మదిగా లేచి ఓ తరంగంలా అతని మీద నుంచి సాగిపోయారు.

---

**2. బ్రహ్మ అనంత తత్వాన్ని తెలిపే శబ్దం. దీని అర్థం – "అంతం లేదు". భగవంతుని మహిమ అపారమని ఈ శబ్దం తెలుపుతుంది.**

# 6

# ఐసయ్య భవిష్యద్వాణి

**వి**మానం పూర్తిగా నిండలేదు. ఇంకా కొన్ని సీట్లు ఖాళీగా వున్నాయి. విమానం లోపలి వాతావరణం న్యూయార్క్‌లో బయట చల్లదనం కన్నా కొంచెం తక్కువగా వుంది. ఆమ్‌స్టర్‌డామ్ వెళ్ళే ఈ విమానంలో నల్లవాడైన ఐసయ్య జాక్సన్ తప్ప మిగిలిన ప్రయాణీకులంతా తెల్లవారే. ఐసయ్య తనకి కేటాయించిన సీట్లో కూర్చుని తన సీటు ముందున్న పరిమిత ఖాళీ సందులో రహస్యంగా కాళ్ళు చాచే ప్రయత్నం చేస్తున్నాడు. తన చుట్టూ వున్న తెల్లవాళ్ళు ఎయిర్‌పోర్ట్ లాంజ్‌లో తనకి పరిచయమైన ప్రయాణీకుల పక్కన కూర్చోడానికి సీట్లు మారడాన్ని చూడనట్టుగా నటిస్తున్నాడు ఐసయ్య. తమకి కావలసిన సీట్లు లభించే అదృష్టం లేకపోవడంతో ఆ సీట్లు ఆక్రమించుకోవాలని చూస్తున్నారు వాళ్ళు. ఆ విమానంలో ఐసయ్యకి పరిచితమైన మొహాలేవీ లేవు. కానీ దక్షిణ అమెరికాలోని బస్సులు, ట్రైన్‌లలోలా తనని ఎవరూ తొయ్యరని, అక్కడి వాళ్ళు తనని నమ్మించారు. టిక్కెట్లు కొనడానికి అతను చాలా డబ్బు ఖర్చుపెట్టాల్సి వచ్చింది. తను కాలేజీ లెక్చరర్‌గా వున్నప్పుడు పొదుపు చేసుకున్న కొంత డబ్బు ఇంకా తన చర్చి అతి ప్రయాసతో సేకరించిన కొంత డబ్బు కలిపి రానుపోనూ టికెట్ కొన్నాడు ఐసయ్య. తన స్వంత ఆలోచనల మధ్య విమాన ప్రయాణం చాలా ఆహ్లాదకరంగా వుంది. అతనికి ఇండియా గురించి తెలిసింది చాలా తక్కువ. ఇండియా గురించి అవగాహన పెంచుకోవడానికి కాలేజీ లైబ్రరీలో పుస్తకాలన్నీ తిరగేశాడతను.

గ్రామీణ జార్జియాలోని ఓ కుగ్రామంలో ఐసయ్య 1920 సంవత్సరంలో జన్మించాడు. అతని తల్లిదండ్రులు పేరుకు మాత్రమే బాప్టిస్టులు. నగరంలోని నల్లవారు వున్న వాడలలో వాళ్ళకి ఓ కిరాణా షాపు వుంది. అతని నానమ్మ ఫ్రీడమ్ నగరంలో నల్లజాతి పిల్లలకి స్కూలు పెట్టాలని అనుకుని పెద్ద ప్రయత్నమే చేసింది. అది అతని

కుటుంబ గాథ. అతని తల్లిదండ్రులు అత్యాశ గలవారు కాదు. వాళ్ళు ముందుచూపు గలవారు. చిన్నతనంలోనే తన తెలివితేటలని గమనించిన వాళ్ళు తనని స్కూల్లో వెయ్యాలని కొంత సొమ్ము మిగిల్చారు. దాంతో తను బాగా చదువుకున్నాడు. నిశ్శబ్దంగా వుండేవాడు. తండ్రిలా త్వరగా కోపం తెచ్చుకునేవాడు కాదు. చదువు బాగా వస్తోందని, నెమ్మది నెమ్మదిగా అధిగమిస్తున్నాడని తెల్లవాళ్ళ వేధింపులు, నల్లవాళ్ళ మిత్రుత్వాలు వ్యంగ్యపూరితమైన మాటలు, ఎత్తి పొడుపులు ఇవేవీ పట్టించుకునేవాడు కాదు. ప్యాట్రిక్ హెన్రీ స్కూలు టీచరు, ఆమెది జాలి గుండె. యూనివర్శిటీలోని నల్ల విద్యార్థులకి ఇచ్చే స్కాలర్‌షిప్ కోసం అప్లై చేయాల్సిందిగా తనని ప్రోత్సహించింది. అక్కడ కూడా వేర్పాటు ధోరణి రోజూ వుండేదే. అది విద్యార్థుల శ్వాసలో నిండిపోయింది. తను వెళ్ళిన చోటల్లా తెల్లవారికి, నల్లవారికి ప్రత్యేక బస్సులు, ప్రత్యేక షాపులు, రెస్టారెంట్లు విడివిడిగా వున్నాయి. తను రాడికల్స్ వైపు మొగ్గు చూపాడు. మళ్ళీ అదే తెల్లవారు నల్లవారితో కూడిన సమూహం. వాళ్ళు బానిసత్వానికి చిహ్నంగా వున్న అర్థం పర్థం లేని వేర్పాటు వ్యవస్థని ఖండించారు. తను కాలేజీలో ఫిలాసఫీ చదవాలా లేక సోషియాలజీ చదవాలా అన్న సందిగ్ధంలో పడ్డాడు. చివరికి నల్లజాతి సోషియాలజిస్టులలో కెల్లా గొప్ప వ్యక్తి అయిన టెరెన్స్ మార్షల్ సలహా ప్రకారం సోషియాలజీ చదవాలని నిర్ణయించుకున్నాడతను. "పారిశ్రామిక శ్రామికుల్లో నల్లవారి దాస్య విమోచనం, దాని ప్రభావం" అన్న విషయం మీద ఐసయ్య పరిశోధన చేస్తున్నప్పుడు అతని సూపర్‌వైజర్ తనని నగరంలో బీదాబిక్కీ వున్న ప్రాంతాలకి వెళ్ళమని, అక్కడ కనబడే వ్యక్తులతో కలిసి మాట్లాడాల్సిందిగా ప్రోత్సహించాడు. తను కలిసిన చాలామంది 'ఓ నల్లవాడైన ఇతను యూనివర్శిటీలో తెల్లవాడి ఆట ఆడుతున్నాడేంటని' తనని అర్థం చేసుకోలేకపోయారు. అంతేకాదు. తన స్వంత మనుషులు భక్తితోను, కొంచెం ధిక్కార భయంతోను తనని గౌరవించడం గమనించాడు. ఈ విషయం తనని బాధించింది.

అతను తోటి నల్ల విద్యార్థులతో కలిసినపుడు వాళ్ళలో మేధావుల తిరుగుబాటు ధోరణి కన్పించడంతో కొంత సాంత్వన లభించినట్లయిందతనికి. తను ఆఖరి సంవత్సరంలో అడుగు పెట్టగానే భవిష్యత్తు గురించి చింత మొదలైంది. నల్ల లెక్చరర్‌లని ఏ కాలేజీ అంగీకరించదని ప్రతి ఒక్కరూ అన్నారు. తను ఊళ్ళోని స్కూల్లో కార్మికుల పిల్లలకి 'త్రీ ఆర్స్' (రీడింగ్, రైటింగ్, అర్థమెటిక్), ప్రాథమిక నైపుణ్యాలైన చదవటం, రాయటం, ప్రాథమిక గణితం చెప్పుకుంటూ రోజులు గడపాల్సిందేనని కూడా చాలామంది చెప్పారు. కానీ మార్షల్ అతన్ని నార్త్ కరోలినా అగ్రికల్చరల్ అండ్ టెక్నికల్ కాలేజ్,

గ్రీన్స్‌బోరో, నార్త్ కరోలినాకి సిఫార్సు చేస్తూ ఉత్తరం రాయడంతో కాలేజీవాళ్ళు 1948లో తన అభ్యర్థిత్వానికి అంగీకరించారు, మహాత్మాగాంధీ హత్య చేయబడ్డ కొన్ని వారాల తర్వాత. ఎ అండ్ టి గా పిలవబడే ఆ కాలేజీ నల్లవారి కాలేజీగా స్థాపించబడింది. తను మొట్టమొదటిసారి మెజారిటీలో భాగంగా గుర్తించబడ్డాడు. ఏది ఏమైనప్పటికీ తను ఆశించిన ప్రతిభావంతమైన చర్చలు, వాదోపవాదాలు, లోకాన్ని మార్చే ఆలోచనలు గతం కన్నా తగ్గుముఖం పట్టాయి. చాలామంది విద్యార్థులలో డిగ్రీలు పూర్తయిన తర్వాత మంచి మంచి ఉద్యోగాల కోసం, డబ్బు కోసం చింత ఏర్పడింది. ఐసయ్య తొలి సంవత్సరాలు కొంత నిరాశాజనకమైనప్పటికీ సాఫీగానే గడిచాయి. కానీ 1950 సంవత్సరంలో రాజకీయ పవనాలతో సాంఘిక సమస్యలతో కొత్తదనం చోటు చేసుకుంది. 'సివిల్ రైట్స్' లాంటి పదాలు దశదిశలా వినిపించసాగాయి. మాంట్‌గోమెర్రీ, అలాబామాలో బస్సులో తెల్లవాడికి సీటు ఇవ్వకపోవడంతో 1955 సంవత్సరంలో రోజా పార్క్స్ అరెస్టయింది. అప్పటికీ దేశంలో గ్రూపులు, వ్యక్తులు వేర్పాటువాద ధోరణి పట్ల కలిసికట్టుగా ఆలోచించడం మొదలైంది. రోజా పార్క్స్ చేసిన ఓ సాధారణ సూచన చిన్న పీపాలో నిప్పుకణంగా మారింది.

ఐసయ్యకి నవ శకం ప్రారంభం కాబోతున్నట్టుగా అనిపించింది. తనకి లభించిన రిపోర్టులని తీక్షణమైన ఆకలితో చదివాడు. మాంట్‌గో మెర్రీ సంఘటన, ఇంకా క్రూరమైన రేపిస్ట్, పధ్నాలుగు సంవత్సరాల వయసున్న ఎమ్మెట్‌ని నిర్దాక్షిణ్యంగా హత్య చేయడం వంటి పత్రికల్లోని కత్తిరింపులని ఖాళీగా వున్న పుస్తకంలో అతికించాడు. అన్నిటికన్నా ప్రథమంగా ఒక పేరు నిలిచింది. మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్, ఒక యువ ఉద్యమకారుడు. నిర్భయుడు ధైర్యశాలి అయిన ఆ యువకుడు తన ప్రజలకి న్యాయం జరిగేలా చూడాలని నిర్ణయించుకున్నాడు.

స్క్రాప్ బుక్స్ పనితనం ఇబ్బందిగా మారడంతో విద్యార్థులందరినీ పిలిచి ఉదయం పూట క్లాసులు మొదలు కాకముందు తనకి సహకరించాల్సిందిగా కోరాడు. రిపోర్టుల మీద తర్కం, చర్చ, వాదోపవాదాలు ముగిసిన తర్వాత ఇంకా చర్చలు వేడెక్కినపుడు తప్పనిసరి పరిస్థితులలో ఐసయ్య స్వల్పంగా కల్పించుకునేవాడు. అవే చర్చలు తరగతి గదుల్లో కూడా సాఫీగా జరిగిపోయేవి. తన విద్యార్థుల వ్యక్తిగత అనుభవాలని తెలుసుకున్నాడు ఐసయ్య. ప్రాంతీయ దురభిమానంతో కూడుకున్న వాస్తవ పరిస్థితులలో వాళ్ళ జీవన విధానం, మహానగరంలోని వంచనలు, వాళ్ళ కుటుంబాల్ని పోలీసులు హింసించిన తీరుతెన్నులు, బంధువుల చిత్రవధలు లాంటివెన్నో లుసియానా

లేక మిసిసిపీ లేదా టెక్సాస్‌లో జరిగినవి తెలుసుకున్నాడు. దాంతో ఎన్నో దశాబ్దాల రహస్యాలు వెలుగులోకి వచ్చాయి. నల్లవాడిగా తన స్వీయ జీవితానుభవం పెద్ద అతుకుల బొంతలో కేవలం ఒక చదరమని, అదే పోలికలో వున్న రంగు వస్త్రమని ఐసయ్య కొన్ని తరాల వెనక్కి వెళ్ళి తెలుసుకున్నాడు.

విద్యార్థులు చర్యల గురించి మాట్లాడ్డం మొదలుపెట్టారు. తను వాళ్ళకి మహాత్మాగాంధీ గురించి చెప్పాడు. ఇంకా తను మార్టిన్ లూథర్ కింగ్ ప్రసంగాలలో అతని గురించి విన్న తర్వాత పరిశోధించడం మొదలు పెట్టినట్లుగా చెప్పాడు. మార్టిన్ లూథర్ కింగ్ ఇండియాలో 1959లో పర్యటించాడని, ఆ తర్వాత గాంధీ అహింసా సిద్ధాంతాల స్ఫూర్తితో కొత్త చైతన్యంతో తన విద్యార్థుల మెదళ్ళని హింస నించి మళ్ళించగలనన్న నమ్మకంతో కొద్ది నెలలోనే తిరిగి వచ్చాడని చెప్పాడు. వాళ్ళకి గాంధీ సహాయ నిరాకరణోద్యమం, ఇంకా శాసనోల్లంఘనోద్యమం గురించి వివరించాడు ఐసయ్య. వాళ్ళు ఐసయ్య చెప్పింది జాగ్రత్తగా విన్నారు. ఆ తర్వాత కొన్ని నెలలకి ఎ అండ్ టికి చెందిన నలుగురు విద్యార్థులు స్థానిక ఉల్‌వర్త్స్‌లోకి వెళ్ళి లంచ్ కౌంటర్ దగ్గరున్న నాలుగు కుర్చీలలో కూర్చున్నారు. ఆ లంచ్ కౌంటర్‌పైన ఒక సూచన ఉంది. “తెల్లవాళ్ళు మాత్రమే”. అక్కడ వున్న సేవకుడు ఆ నలుగురు విద్యార్థులు సీట్లలో కూర్చోవచ్చని, కానీ తను వాళ్ళకి సర్వ్ చేయలేనని చెప్పాడు. ఆ రోజు చివరగా ఆ నలుగురు విద్యార్థులు వెళ్ళిపోయారు. ఆ షాపింగ్ కాంప్లెక్స్ మేనేజర్ ఆ విద్యార్థులు రావడం అదే చివరిసారని అనుకున్నాడు. కానీ మర్నాడు ఆ నలుగురూ మళ్ళీ వచ్చారు. మూడోరోజు సుమారు ముప్పైమంది విద్యార్థులు ఆ నలుగురిని కూర్చోవల్సిందిగా కోరారు. ఓ వారంలో అక్కడ ఎ అండ్ టి ఫుట్‌బాల్ టీంతో సహా మూడు వందల మంది కన్నా ఎక్కువ చేరారు. అప్పటి వరకు మర్యాదగానే గడిచింది. షాపులోని వాళ్ళు కూడా వీళ్ళని మర్యాదగానే చూశారు. కానీ గ్రీన్స్‌బోరో ద్వారా నిరసనల విషయం అంతటా పాకిపోవడంతో తెల్లవాళ్ళు వాళ్ళని నిందించడానికి వెల్లువెత్తారు. పరిస్థితులు భీతావహంగా మారాయి. నిరసనకారుల్ని బయటికి విసిరేస్తామని కొందరు తెల్లవాళ్ళు బెదిరించడంతో నిరసనకారులందరూ ఏకమై అక్కణ్ణించి వెళ్ళడానికి నిరాకరించారు. ఇంతలో ఎవరో వ్యక్తి షాపు మేనేజర్‌కి ఫోన్ చేసి ఆ బిల్డింగ్‌లో బాంబు వుందని కలకలం సృష్టించాడు. దాంతో షాపు అధికారులు లోపల వున్న అందరినీ ఖాళీ చేయించారు. ఆ బెదిరింపు ఉత్తదే అని తేలినా, నిరసనకారుల్ని వెళ్ళగొట్టడానికి అధికారులు పన్నిన పన్నాగమని కొందరు అన్నారు.

కానీ జరిగిన సంఘటన దావానలంలా అంతటా వ్యాపించడంతో మిగతా నగరాలు కూడా అలాంటి నిరసనలనే మొదలుపెట్టాయి. దక్షిణం అంతటా జనాలు ఎక్కడ కూర్చోకూడదో అక్కడ కోర్చోవడం, ఎక్కడ నిలబడకూడదో అక్కడ నిలబడ్డం, లేవడానికి గాని, పక్కకి జరగడానికి గాని, తొలగిపోవడానికి గాని నిరాకరించడం లాంటివి చేశారు. ఉద్రిక్త వాతావరణం నెలకొంది. ఐసయ్య అది చూసి ఆశ్చర్యపోయాడు జూలై 26వ తేదీన ఊల్‌వర్త్స్ తమ మొదటి నల్ల కస్టమర్లకి లంచ్ కౌంటర్ దగ్గర సర్వ్ చేశారు. గ్రీన్స్‌బోరో ఫోర్ గెలిచారు.

గాంధీ భావాలు సమర్ధవంతంగా పనిచేయడంతో ఐసయ్య ఉత్తేజితుడయ్యాడు. ఈ విధమైన అహింసా విధానాన్ని కనిపెట్టిన గాంధీ గురించి, జాతిని గురించి మరింతగా తెలుసుకోవాలనుకున్నాడు ఐసయ్య. మార్టిన్ లూథర్ కింగ్ ఆలోచనలతో ప్రభావితం అయిన తను ఇండియాకి ఎందుకు వెళ్ళకూడదనుకున్నాడు. అలా వెళ్ళడానికి అతని రిసెర్చ్‌కి ప్రముఖ కారణాలు లేకపోవడంతో ఆర్థిక సాయం కోసం అప్లై చేయలేకపోయాడు. సరిగ్గా ఇక్కడే స్థానిక చర్చి తాను తిరిగి వచ్చిన తర్వాత తన అనుభవాలని వివరించే షరతుపైన తనకు ఆర్థిక సాయం చేసేందుకు సంసిద్ధత వ్యక్తం చేసింది. అందుకు వెంటనే తన ఆమోదాన్ని తెలియజేశాడు ఐసయ్య.

"దయచేసి ప్రయాణికులు రక్షణ బెల్టుల్ని బిగించుకోవాలి. ఇప్పుడు మేము ప్రదర్శన పూర్వకంగా దాని ఉపయోగాల్ని..." విమానం రన్‌వే మీద సాగడం మొదలవ్వగానే చిన్న కుదుపుతో పరధ్యానం నుంచి ఈ లోకంలోకి వచ్చాడు ఐసయ్య. ఎయిర్‌హోస్టెస్ యూరోపియన్ యాస మందంగా ఉంది కానీ వాళ్ళ ప్రదర్శన ఉపయోగకరమే. ఎమర్జెన్సీ డోర్ తెరవడం, సురక్షితంగా నీళ్ళలోకి, భూమి పైకి దూకే విధానాన్ని తెలియజేశారు. కానీ ఐసయ్య పెద్దగా పట్టించుకోలేదు. ఎందుకంటే అలా దూకడానికి ఎవరూ సాహసించరు. ఒకవేళ సాహసించినా బ్రతకలేరు. దేవుడి ఆధీనంలో వుండగా ఇప్పుడు నేను చావు గురించి ఆలోచించటమెందుకు! అనుకున్నాడు ఐసయ్య.

ఓ ఎయిర్‌హోస్టెస్ స్వీట్లు పంచుతోంది, అకస్మాత్తుగా ప్లేన్ క్రాష్ అయి ప్రమాదం సంభవిస్తే అవి రక్షిస్తాయన్నట్టుగా. ఆమె అతనికి ప్లేటు అందిస్తూ తెల్లవాళ్ళు నల్లవాళ్ళ మధ్యన ప్రేమానురాగాలు సంభవమే కనీసం విమానంలోనైనా అన్నట్టుగా నవ్వింది. ఐసయ్య కూడా నవ్వాడు కొంత కఠినంగా. తెల్లవాళ్ళు నవ్వినపుడు వాళ్ళని చూసి అందుకు ప్రతిగా నవ్వేవాడు కాదు ఐసయ్య. అందులోను ముఖ్యంగా అలాంటి అందమైన యువతి నవ్వినపుడు. టెక్నికల్ కాలేజీలో మహిళా స్టూడెంట్లు కొందరున్నారు. వాళ్ళ

వ్యక్తిత్వం పెద్ద గొప్పదేమీ కాదు. తెల్లని మేనిఛాయతో మెరుస్తున్న ఆ యువతి తనని ఓ పేయింగ్ ప్యాసింజర్‌లా చూస్తోందని అనడంలో ఏమాత్రం సందేహం లేదు. అతను పెట్టుబడిదారీ (క్యాపిటలిజం) విధానంలోని సుఖాల గురించి ఒకింత ద్వేషంతో ఆలోచించాడు. ఎవరిదగ్గరన్నా డబ్బు వుంటే సీటుతోపాటుగా డబ్బిచ్చి తెల్ల యువతి నవ్వు కొనుక్కోవచ్చు. స్వదేశీ విమానంలో అతను గతంలో ఒకే ఒక్కసారి ప్రయాణించాడు. లాస్‌ఏంజెల్స్ సెమినార్‌కి వెళ్ళిన సందర్భంలో. అప్పుడు ఆ విమానంలోని హోస్టెస్‌లు ఇద్దరు తన వంక చూశారు, అందమైన వ్యక్తుల మధ్య ఓ అవాంఛిత నల్ల జంతువు కూర్చున్నాడన్నట్టుగా.

ఇండియాలో ఏమేం చూడాలో తనకి తెలియదు. ఎ అండ్ టి లైబ్రరీలో మెటీరియల్ కోసం చూస్తుండగా అతను డా॥ బి.ఆర్. అంబేద్కర్ రచించిన 'ది అన్‌టచబుల్స్ – హూ వర్ దే అండ్ వై దే బికేం అన్‌టచబుల్స్' పుస్తకం కనిపించింది. ఐసయ్య దాన్ని తిరగేశాడు. ఆ పుస్తకం అతన్ని షాక్‌కి గురిచేసింది.

అందుకు అనేక కారణాలు వున్నాయి. కటువుగా, మొరటుగా రాజీపడని నిష్కపటమైనవిగా వున్నాయవి. ఆరంభమే గందరగోళంగాను, పునర్నిర్ధారించేదిగాను వుంది :

> *ఎందుకు బ్రాహ్మణులు 'వోల్టేర్' [3]ని ఉత్పన్నం చేయలేకపోయారు?*
>
> *ఈ ప్రశ్నకి సమాధానం కేవలం మరో ప్రశ్నతో చెప్పవచ్చు.*
>
> *ఎందుకు టర్కీ సుల్తాను మహమ్మదీయ ప్రపంచంలోని మతాన్ని మార్చలేకపోయాడు?*
>
> *ఎందుకు పోప్ (క్రైస్తవ మతాధిపతి) క్యాథలిక్ మతాన్ని నిరసించలేదు?*
>
> *ఎందుకు బ్రిటిష్ పార్లమెంట్ నీలి కన్నుల శిశువులందరినీ హత్య చేయాలని చట్టం చేయలేదు?*
>
> *సుల్తాన్, పోప్, బ్రిటిష్ పార్లమెంట్ వీటిని ఎలా చేయలేకపోయారో అలాగే బ్రాహ్మణులు వోల్టేర్‌ని ఉత్పన్నం చేయలేకపోయారు.*

---

**3. ప్రజాస్వామ్య స్ఫూర్తికి, భావ ప్రకటన స్వేచ్ఛకు పర్యాయపదం వోల్టేర్. అసలు పేరు ఫ్రాంస్వా మారీ ఆరూ. మానవ హక్కుల ఉద్యమకారులకు స్ఫూర్తి ప్రదాత. ఫ్రెంచ్ తత్వవేత్త.**

ఒక వ్యక్తి స్వప్రయోజనం, అతని వర్ణం ఎల్లప్పుడూ అంతరంగికమైన పరిమితితో తన మానసిక ప్రవృత్తిని బట్టి అధికారాన్ని చెలాయిస్తుంది.

బ్రాహ్మణుల సాంఘిక హోదాలు పూర్తిగా హిందూ సంస్కృతీ ప్రభావంతో వచ్చినవే. అది వాళ్ళని మేధావులుగా పరిగణిస్తోంది. దానివలన కింది వర్గాల వాళ్ళు అన్ని రకాల అనర్హతలకి, అశక్తతలకి గురికావడమే కాక వాళ్ళ పైన బ్రాహ్మణుల ఆధిక్యతని వాళ్ళు ఎన్నడూ తిరగబడి ప్రశ్నించడం, హెచ్చరించడం, బెదిరించడం లాంటివి చేయలేదు.

సాధారణంగా ప్రతి (ఒక్క) బ్రాహ్మణుడు తన ఆధిపత్యాన్ని కొనసాగిస్తాడు. పూర్వాచారపరాయణుడైనా, అనాచారుడైనా, పురోహితుడైనా, గృహస్థుడైనా ఇంకా పండితుడైనా కాకపోయినా. ఏ విధంగా బ్రాహ్మణులు వోల్టేర్‌లా సమర్థతని కలిగి వుంటారు? వాస్తవంగా బ్రాహ్మణులలో ఒక వోల్టేర్ నాగరిక సమాజానికి ప్రమాదకరం. వోల్టేర్ తమలో పుట్టకుండా ఉండడం వారి ఆధిపత్యానికి అవసరం.

ఎందుకని కింగ్ గాంధీకి బదులు అంబేద్కర్‌ని అనుసరించలేదని ఐసయ్య ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే అంబేద్కర్ మాటలు హృదయంలోంచి వచ్చినట్లుంటాయి. అంటరానివారి పిల్లల గురించి అంబేద్కర్ మాట్లాడిన మాటల్ని తను సందేహించడు. చిన్నప్పుడు తను భావించినట్టుగానే, తను తెల్ల పిల్లల్ని కొత్త బట్టలు తొడుక్కుని వీధుల్లో తిరుగుతున్నప్పుడు, తనకి బాగా గుర్తుంది. తనని చూసినవాళ్ళు మాట్లాడే నిందాపూరకమైన మాటలు వినాల్సి వస్తుందని వాళ్ళ వంక చూడకుండా తను తప్పుకు తిరగడం (ఎమ్మెట్ టిల్ అలా చూసినందుకే చంపబడ్డాడు). కానీ.. కానీ ఇండియాని అర్థం చేసుకోవడానికి ఆ ఒక్క అనుభవం సరిపోదు.

తనకి తెలుసు అది పెద్ద దేశమని, జనాభా అధికమని. తను దాన్ని ఎలా అర్థం చేసుకోవాలన్నది కనిపెట్టాలి. ఇండియాలోని అంటరానివాళ్ళని తన నల్ల జీవితంలో కలిపేదెలా అన్నది.

ఇంతలో హోస్టెస్‌లు భోజనం, డ్రింకులు సర్వ్ చేయడం మొదలుపెట్టారు. తన వంతు విస్కీని తీసుకున్నాడు ఐసయ్య. తను మొదటిసారి మంచి నాణ్యత గల విస్కీని రుచి చూశాడు. తను టీనేజ్‌లో కలుపు తీసే పనిలో వుండగా, నగరానికి దూరంగా తెల్లవారిని డిస్టర్బ్ చేయకుండా ఉపయోగంలో లేని ధాన్యం కొట్టంలో చవకైన 'మూన్‌షైన్' (చట్ట విరుద్ధంగా ఉత్పత్తి చేసిన మద్యం) తాగిన సందర్భం గుర్తుకు వచ్చిందతనికి. అక్కడ ప్రణయ కథలు కూడా మొదలయ్యాయి. కానీ ఏదీ చివరికంటా నిలవలేదు.

ఐసయ్య చిన్ననాటి నుంచే గాయకుడే కాదు మంచి డ్యాన్సర్ కూడా. అతను ఆరడుగుల పొడవుంటాడు. వెడల్పాటి మొహం. పొడవైన చేతులు. ఆహార కొరత వున్నప్పటికీ కఠినమైన జీవితం గడిపినప్పటికీ అమెరికాలోని నల్ల శరీరాలు వాళ్ళ జీన్స్‌ని ఆమోదించడంతో ఇంకా పొడవుగాను, విశాలంగాను, వెడల్పుగాను పెరుగుతాయి. తనని అధిక బాధకి గురిచేసిన ఆకలి బాధ తనకింకా గుర్తుంది. అయితే తన కండలు, ఎముకలు వాటికి లభించిన తేమ ఆధారంగా వాటికవే పెరిగాయి. ఆకలి నించి దృష్టి మరల్చడానికి ఒకే ఒక్క సాధనం పుస్తకాలు. అతను చాలా ఆకలితో వుండేవాడు. ఇప్పటికీ ఏదైనా షాపు కిటికీ పక్క నించి వెళ్తున్నప్పుడు గాని, రెస్టారెంట్‌లో మెనూ చూస్తున్నప్పుడు గాని లుంగచుట్టుకుపోయి పడిపోతున్న భావన కలుగుతుందతనికి. ఇప్పుడు తను చాలా జాగ్రత్త వహిస్తాడు. రోజూ ఉదయాన్నే పరుగుపెట్టి శరీరాకృతిని సరిగ్గా వుంచుకునేలా. ఎందుకంటే జిహ్వాచాపల్యాన్ని కాస్త అదుపులో వుంచుకోకపోతే దుర్బుద్ధి కలిగించే ఆహారం స్థూలకాయం, మధుమేహానికి దారి చూపుతుందని, తన బంధువుల్లో చాలామందికి జరిగినట్టుగా భావిస్తాడతను.

కంపించే ఘోషతో విమానం టేకాఫ్ అతని ఆలోచనలకి భంగం కలిగించింది. అతను చిన్న కిటికీలోంచి బయటకు చూశాడు. దివ్యంగా ప్రకాశిస్తున్న 'మన్‌హట్టన్' నెమ్మదిగా చీకట్లో కలిసిపోతోంది, నగల బెంచీ మీద నల్ల మఖమల్ బట్ట మీద వుండే సామాను లోపలికి జారిపోతున్నట్టుగా.

అమెరికాని వదిలిపోతున్న సమయంలో క్షణికమైన బాధ కలిగిందతనికి.

కిటికీ నుంచి దూరంగా శూన్యంలోకి చూడసాగాడు.

విమానంలో భోజనం సర్వ్ చేశారు. ప్లాస్టిక్ విమాన సంస్థ భోజనం ప్లాస్టిక్ ట్రేలలో. క్యాబిన్ ముందున్న తెరల మీద చూపించే సినిమా చూస్తూ ఐసయ్య తినేశాడు. ఇయర్ ఫోన్స్ హెడ్ సెట్ ఇవ్వడం మర్చిపోయారు ఎయిర్‌హోస్టెస్‌లు. అతనికి అడగాలనిపించలేదు. కొంతసేపు సినిమా చూసి పడుకున్నాడు. విమానం ఆమ్‌స్టర్‌డామ్ ఎయిర్‌పోర్టులో ల్యాండ్ అవడంతో కళ్ళు తెరిచాడు ఐసయ్య. అతను విమానం దిగి లగేజీ కలెక్ట్ చేసుకుని డ్యూటీ ఫ్రీ షాపులు, రెస్టారెంట్‌లు, టికెట్ కౌంటర్లు ఇంకా సహాయక కౌంటర్లు వరుసగా వున్న పొడవైన కారిడార్‌ల వైపు సాగి న్యూఢిల్లీ ఫ్లైట్ క్యాచ్ చేయడానికి డిపార్చర్ లాంజ్ వద్దకు చేరుకున్నాడు. అతను ఇండియా గురించిన పుస్తకం కొనాలనుకున్నాడు. బహుశా సంచార గ్రంథాలయం కన్నా ఎయిర్‌పోర్టులో

ఇంకా మంచి పుస్తకాలుంటాయనుకున్నాడు. తను ఎక్కాల్సిన ఫ్లైట్ బయలు దేరడానికి ఇంకా కొన్ని గంటల సమయం వుంది. పుస్తకాల షాపులో కవరుపైన మెరిసే అక్షరాలతో ఇటుక మందంలో వున్న థ్రిల్లర్స్, టీనేజ్ యువతుల కోసం లేత గులాబీరంగులో వున్న సన్నపాటి రొమాంటిక్ నవలలు నిండుగా వున్నాయి. స్వయం సహాయక పుస్తకాలు జీవం కోసం అతన్ని చూసి మూలిగాయి. షాపులోంచి బయటకి వస్తున్నపుడు ఓ షెల్ఫుపై అరలో ఓ లావుపాటి పుస్తకం 'కామసూత్ర – ఇండియన్ ఆర్ట్ అండ్ కల్చర్' సబ్ టైటిల్‌తో వున్న పుస్తకాన్ని చూశాడు. తన పొడవైన చేత్తో దాన్ని సులభంగానే అందుకున్నాడు ఐసయ్య.

అలాంటి పుస్తకాన్ని తన జీవితంలో ఎన్నడూ చూడలేదు ఐసయ్య. దాని నిండా వివిధ భంగిమల్లో రతికేళి సలుపుతున్న స్త్రీ పురుషుల పెయింటింగులతో కూడిన బొమ్మలు, శిల్ప రూపాలు, శృంగారభరితంగా వున్నాయి. అతను మొదటి భాగం చూశాడు. అరవై నాలుగు ప్రేమకళలు. అతను త్వరత్వరగా పేజీలు తిరగేయసాగాడు. ఒక ప్రక్కన రతి భంగిమలు వున్నాయి. మరో ప్రక్కన వాటి పేర్లు, అర్థాలు వున్నాయి. అతను కొద్దిగా చదివాడు... ఇవి మత సంబంధమైన అనుభవాలు? అతని హృదయం ఆశ్చర్యంతో నిండిపోయింది. ఒక పేజీలో 'నాగరిక' అని హెడ్డింగు వుంది. ఇంగ్లీషు అనువాదంతో. 'సిటిజన్' మంచి నాగరికుడు. వేకువజామునే లేవాలి. బ్రేక్‌ఫాస్ట్‌గా మంచి టిఫిన్ తీసుకోవాలి. తోటల్లో విహరించాలి, మధ్యాహ్నం ఖరీదైన పుష్టికరమైన లంచ్ తీసుకోవాలి అని వుంది అందులో. ఆ తర్వాత విశ్రాంతి తీసుకుని చివరగా సాయంత్రం వేశ్యా వాటికలకు వెళ్ళి అరవై నాలుగు కళలు ప్రయోగిస్తూ సెక్స్ చేయాలి. చేతిలో పుస్తకంతో ప్రేమ కళలకి సంబంధించిన వివిధ పద్ధతుల ద్వారా స్నేహితులని వశపరచుకుని ప్రజలని ప్రభావితం గావించే తీరికైన ఈ వ్యాపారి గురించిన ఆలోచన ఐసయ్యకి నవ్వు తెప్పించింది. అయినప్పటికీ అతను కొంత సంభ్రమాశ్చర్యాలకి గురయ్యాడు. తన సంప్రదాయ బాప్టిస్ట్ విద్యా విధానంలో, అలాంటి సంప్రదాయాలున్న నాగరికతతో తను ఎలా వ్యవహరించగలడు? అతను అనుకున్నాడు. తెలిసే పెట్టారో, తెలియకనే పెట్టారో కాని మా అమ్మానాన్న నాకు ప్రపంచంలోని గొప్ప ప్రవక్త పేరు పెట్టారు – ఐసయ్య – కానీ ఇటువంటి సమాచారమా తను చదివేది. అయితే అతనికి తెలియదు, భారతీయ శిష్ట జనం ఎవరికైతే 'అయ్య' – ఓ మంచి మనిషి, అన్న పదంతో అంతమయ్యే పేరు గలవాళ్ళని ఓ ఆదరణీయ వ్యక్తిగా ఎన్నడూ పరిగణించరన్న విషయం ప్రవక్తను తీసి పక్కన పెడితే. ఆ దేశంలో ప్రవక్తలు వుండరు. కేవలం దేవుళ్ళే వుంటారు. అక్కడ

అమెరికన్ నల్లవారి పుస్తకాలు అనేకం వుండటం చూసి ఆశ్చర్యపోయాడతను. ఓ తెల్లవాడు రాసిన 'సివిల్ రైట్స్ మూవ్‌మెంట్' పుస్తకం కూడ అక్కడ వుంది.

అతను పుస్తకాన్ని తిరిగి షెల్ఫ్‌లో వుంచి ఓ చిన్న గైడ్ బుక్ తీసుకుని తనకి కేటాయించిన డిపార్చర్ గేటు దగ్గరకి వెళ్ళి కూర్చున్నాడు. లిస్టులో తన కనెక్టింగ్ ఫ్లైట్ ఆరవదో, ఏడవదో. 'ఫ్లైటుకి ఇంకా ఓ గంట దాకా టైముంది' అనుకుంటూ. స్నాక్స్ కోసం ఐసయ్య ఓ కాఫీ బార్‌లోకి వెళ్ళాడు. భారతీయుల్లా కనిపించే చాలామంది వ్యక్తులు ఆ బార్ దగ్గర క్యూలో నిలుచున్నారు. ఐసయ్య ఇద్దరు కొద్దిగా మురికిగా వున్న వ్యక్తుల వెనకాల నిలుచున్నాడు. వాళ్ళు ఇండియా గురించి బ్రిటిష్ – ఇండియన్ ఇంగ్లీష్‌లో చర్చించుకుంటున్నారు.

"మీది ఇండియానా?" అడిగాడు ఐసయ్య అమెరికన్ నల్లజాతి యాసతో.

"యర్స్‌స్స్" అన్నాడు అతని ముందున్న వ్యక్తి ఆక్స్‌ఫర్డ్ బెంగాలీ యాసతో. అతని గడ్డం అస్తవ్యస్తంగా వుంది. "మీరు ఎక్కడికి వెళ్తున్నారు?" తిరిగి అడిగాడతను.

"నేనూ అక్కడికే వెళ్తున్నాను" అంటూ ఐసయ్య "ఇండియాకి" అన్నాడు జవాబుగా. ఆ ఇండియన్స్ తనని పరీక్షగా చూస్తుండటం గమనించాడు ఐసయ్య." ఇండియాకు ఎందుకు వెళ్తున్నారు?" అడిగాడు వాళ్ళలో ఒకడు.

"కులం – అంటరానితనం" గురించి అధ్యయనం చేయడానికి అన్నాడు ఐసయ్య నిజాయితీతో.

"కులం ఇంకా అంటరానితనమా? మనం అరవయ్యో దశకంలో వున్నాం. మధ్యయుగంలో కాదు!" అన్నాడు అతనికన్నా చిన్నవాడైన మరో వ్యక్తి, బహుశా ఆ నల్లవాడిలాగే అతని బుర్ర కూడా నల్లగానే వుందన్నట్టుగా నవ్వుతూ. ఐసయ్యకి ఇబ్బంది కొని తెచ్చుకోవడం ఇష్టం లేదు. స్నాక్స్, కాఫీ తీసుకుని మౌనంగా తన డిపార్చర్ గేటు దగ్గరికి వెళ్ళిపోయాడు ఐసయ్య. అతను ఓ క్షణం ఆగి చుట్టూ చూశాడు. వాళ్ళు తనని అనుసరిస్తున్నట్టుగా గమనించాడు. బహుశా వాళ్ళు కూడా తను ప్రయాణించే విమానం కోసమేనేమో అనుకున్నాడు.

"మీరు కులం ఇంకా అంటరానితనం గురించి అధ్యయనం చెయ్యాలని నిజంగా అనుకుంటున్నారా?" అన్నాడు మొదటి వ్యక్తి పోషణ లేని గడ్డాన్ని నిమురుకుంటూ పట్టువదలని విక్రమార్కుడిలా. ఇది నిజంగా వ్యాఖ్యానానికి ఆరంభంలా వుంది. ఐసయ్య మౌనంగా అతని వంక చూశాడు. అతను మాట్లాడ్డం కొనసాగిస్తూ 'ఇండియాలో

వర్గాలున్నాయి. ఇప్పుడు శ్రామికేతరులు అధికంగా కనిపిస్తున్నారు. శ్రామిక వర్గానికి, ఇంకా రైతాంగానికి అన్ని రకాల ఇబ్బందులూ వున్నాయి. ఆక్స్‌ఫర్డ్‌లోను, కేంబ్రిడ్జిలోను మాలాంటి వాళ్ళు చాలా మంది దాన్ని తొలగించేందుకు వర్గ సమస్యల గురించి అధ్యయనం చేస్తున్నాం" అన్నాడు.

"కానీ ఈ క్రిస్టియన్ మిషనరీలు కొందరు కులం పైన రగడ చేస్తున్నారు... కులం గురించే ఎందుకో మరి నాకు అర్థం కావడం లేదు" అని ఇంకా మాట్లాడబోయాడు. కాని, వృద్ధాప్యం దగ్గర పడుతున్న లావు కళ్ళద్దాలతో వున్న పొడవాటి వ్యక్తి మధ్యలోనే అడ్డు తగిలి.

"మీరు స్కాలర్స్ అనుకుంటా" అంటూ ఐసయ్య "మీ పేర్లు తెలుసుకోవచ్చా" అన్నాడు పొడవాటి వ్యక్తి వైపు చూస్తూ.

"ఓహ్, చూశారా మా పేర్లు చెప్పనే లేదు. నేను దీప్తిరంజన్ ఛటోరాజ్. ఇతను సుబ్రహ్మణ్య అయ్యర్. నాది బెంగాల్. ఇతనిది తమిళనాడు. నేను ఆక్స్‌ఫర్డ్‌లో పిహెచ్‌డి చేస్తున్నాను. ఇతను కేంబ్రిడ్జ్" అన్నాడు పొడవాటి వ్యక్తి. దయచేసి మమ్మల్ని క్షమించండి, మేము సంభాషిస్తున్న ఆదరణీయ వ్యక్తి ఎవరో తెలుసుకోవచ్చా?"

"ఐసయ్యా జాక్సన్. నార్త్ కరోలినా ఎ అండ్ టి కాలేజీలో ప్రొఫెసర్"ని అంటూ ఐసయ్య కరచాలనం కోసం చేయి చాచి "నైస్ టు మీట్ యూ బోత్" అన్నాడు.

"నార్త్ కరోలినా ఎ అండ్ టి కాలేజీనా? ఎప్పుడూ వినలేదే. ఎక్కడ వుందది?" అడిగాడు ఛటోరజ్ కనుబొమ్మలు ముడివేస్తూ.

"గ్రీన్స్‌బోరో, నార్త్ కరోలినా. ఎ అండ్ టి అంటే అగ్రికల్చరల్ అండ్ టెక్నికల్" అన్నాడు ఐసయ్య వాళ్ళు ఆశాభంగం చెందడం చూసి ఆనందిస్తూ.

"గ్రీన్స్‌బోరో... గ్రీన్స్‌బోరో... ఓ, అవును, ఈ సంవత్సరం మొదట్లో పౌర హక్కుల ఉద్యమం జరిగిన ప్రాంతం!" అంటూ అకస్మాత్తుగా ఐసయ్య కేసి చూశారు ఏదో గ్రహాంతరవాసిని చూస్తున్నట్టుగా.

"మీరు పౌరహక్కుల ఉద్యమాన్ని గురించి వినే వుంటారు" అన్నాడు ఐసయ్య.

"అఫ్‌కోర్స్, సిసలైన వామపక్షవాదికి పౌరహక్కుల గురించి తెలుసు. "నా కజిన్ మంచి వ్యవహారదక్షుడు. అతను గత సంవత్సరం మార్టిన్ లూథర్ కింగ్

ఇక్కడికి వచ్చినపుడు కలిశాడు" అంటూ సుబ్రహ్మణ్య అయ్యర్ "అతను మిస్టర్ కింగ్‌ని శాఖాహారిగా మారడానికి ఒప్పించాడు.

"నిజంగా?" అన్నాడు నవ్వుతూ ఐసయ్య.

"కానీ విద్యావంతులైన మీరు కులం గురించి అధ్యయనం చేయడానికి ఇక్కడికి ఎందుకు వస్తున్నట్టు? తప్పనిసరిగా అమెరికాలోని వర్తమాన విషయాల సంఘటనలు లిపిబద్ధీకరణ కోసం మొరపెట్టుకుంటయా? అడిగాడు ఛటోరజ్.

"మంచిది. నేను ఇక్కడ వున్నది కూడా అందుకోసమే. గాంధీ ఇంకా అంబేద్కర్‌ల గురించి తెలుసుకోవడానికి. పౌర హక్కుల ఉద్యమంలో వారు సముచిత వ్యక్తులని నేను భావిస్తాను."

"అంబేద్కర్? అంబేద్కర్ గురించి ఎవరు చెప్పారు మీకు?" అడిగాడు ఆదుర్దాగా అయ్యర్.

"ఎవరూ చెప్పలేదు. స్కూల్ లైబ్రరీలో అతని పుస్తకం వుంది. ఏది ఏమైనా, అతను కొలంబియాలో వున్నాడు" అన్నాడు ఐసయ్య.

"విను మిత్రమా, కేవలం ఒక అమెరికన్ మాత్రమే గాంధీ ఇంకా అంబేద్కర్‌ల గురించి ఒకే గుక్కలో చెప్పగలడు. వాళ్ళిద్దరి మధ్యన సుద్ద, వెన్నకి వున్నంత తేడా వుంది" అన్నాడు ఛటోరజ్ ఎలాంటి మొహమాటం లేకుండా.

"నిజంగానా? దేనికి ఏది? అడిగాడు ఐసయ్య. సంచుల కొద్దీ నలిగిన సామెతలు కూడా హిందువుల ప్రత్యేకత అన్నట్టుగా."

ఛటోరజ్ దీర్ఘంగా నిశ్వసిస్తూ "చెప్పాలంటే తప్పనిసరిగా ఇది కొంత సమయం తీసుకుంటుంది" అన్నాడు.

"ఆహా. మంచిది. మీరు గనుక పోలిక గమనించినట్లయితే, బ్లాక్ బోర్డ్ పైన రాసే టీచర్ అంబేద్కర్ సుద్ద అయితే మేకపాలు తాగే గాంధీ వెన్న. కాదా. మీరు చూడండి. అంబేద్కర్‌నే తీసుకోండి. అవిచ్ఛిన్నంగా ప్రతీదీ కులంతో చూసే నేపథ్యం అతనిది. అంటరానితనంపైన గాంధీజీ అభిప్రాయంతో అసంతృప్తితో వున్నాడతను. అభ్యంతరాలని, శాసన చట్టాలని, సంస్కరణలని అత్యధికంగా కోరుకున్నాడతను; వాస్తవంతో పూర్తిగా అభివృద్ధి చెందిన సామాజిక చైతన్యం అన్నమాట. మరో పక్క

గాంధీని తీసుకోండి. గాంధీ క్రమబద్ధమైన మార్పు రావాలన్న అవసరం వుందని గుర్తించాడు. అన్నిటిని మించి హింసని వ్యతిరేకించాలనుకున్నాడు. అతను అంబేడ్కర్ కళ్ళాలు దృఢంగా లాగి పట్టుకున్నాడు పథకాన్ని చెడగొట్టకుండా ఆపేందుకు. ముస్లింలు హిందూ కవచానికి రవ్వంత బీటలు వారడం కోసం చూస్తున్నారు, పాకిస్తాన్ కోసం అధిక సదుపాయాలు పొందడానికి దేశ విభజన కాలంలో..."

ఛటోరజ్ వెనకాల జనాలు బ్యాగుల్ని ఎత్తిపట్టుకుని ఫ్లైట్ ఎక్కడానికి క్యూలో నిలబడసాగారు. అయ్యర్ వాళ్ళ వంక అసహనంతో చూశాడు.

"అది సరే, ఇప్పటి సంగతేంటి?" అంటూ ఐసయ్య మధ్యలో అడ్డు తగుల్తూ, ఇప్పుడు అంటరానివాళ్ళ పరిస్థితి ఏంటి?" అన్నాడు.

"ఓహ్, చాలా నయం" అన్నాడు ఛటోరజ్. "ఇంకా అధ్వానం" అన్నాడు అయ్యర్ అదే సమయంలో. వాళ్ళు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"ఓకె జెంటిల్‌మెన్" అంటూ ఐసయ్య తన విజిటింగ్ కార్డు తీసి వాళ్ళకిస్తూ "ఇది నా విజిటింగ్ కార్డ్. మీరిద్దరూ ఆ విషయంపైన ఒక అభిప్రాయానికి వచ్చినపుడు నాకు రాయండి" అంటూ ఐసయ్య తన బ్యాగ్ తీసుకుని తెరిచి వున్న డిపార్చర్ గేటు వైపు సాగిపోయాడు.

ఐసయ్య ఢిల్లీకి చేరుకుని మద్రాసు వెళ్ళడానికి మూడో కనెక్టింగ్ ఫ్లైట్ ఎక్కాడు. మద్రాసు ఎయిర్‌పోర్టులో డి.కె.గా పిలవబడే ద్రవిడ కజగం సభ్యులు, దళిత కార్యకర్తలు ఇంకా కొంతమంది క్రిస్టియన్‌లు ఐసయ్యని మర్యాదపూర్వకంగా రిసీవ్ చేసుకున్నారు. ఐసయ్య రాక గురించి ప్రజలకి తెలిసేందుకు పత్రికల్లో కూడా ప్రకటన ఇచ్చారు. పౌర హక్కుల ఉద్యమానికి చెందిన ఓ నల్ల జాతీయుడు ఇండియా వస్తున్న సందర్భంలో దళిత కార్యకర్తలందరూ ఉత్సవం జరుపుకోవాలని నిర్ణయించుకున్నారు. డి.కె. సభ్యులు పరయా సంస్కృతిలో భాగంగా నల్లటి షాల్స్ కప్పి అతన్ని స్వాగతించారు. బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమ నాయకుడైన పెరియార్ నల్ల జాతీయులు – ద్రావిడులు – కేవలం నలుపే ధరించాలని, ఆ వర్ణాన్ని గౌరవించాలని చెప్పాడు. అందుకని నల్ల రాష్ట్రానికి వస్తున్న నల్ల జాతీయుడిని నల్ల షాల్స్‌తో అభివాదం చేయాలి. దళిత కార్యకర్తలు ఐసయ్య మెడలో దండలు వేసి భుజం మీద నీలి రంగు అంగవస్త్రాలు ధరింపచేశారు. ఎందుకంటే అంబేద్కర్ నీలం రంగుని దళితుల గౌరవప్రదమైన వర్ణంగా ప్రకటించాడు. క్రిస్టియన్ నాయకులు అతనికి పుష్పగుచ్ఛాలు, బైబిల్ కాపీలు అందించారు. భారతీయ ఆచార

వ్యవహారాలకి, సంస్కృతీ సంప్రదాయాలకి కొత్త అయిన అమెరికన్ నల్ల జాతీయుడికి ఇది ఒక వింతైన అనుభవం. సుదీర్ఘ ప్రయాణంతో అలసిపోయినప్పటికీ అక్కడి ఆతిథ్యంలో మునిగిపోయాడు ఐసయ్య.

ఐసయ్యకి హోటల్‌లో బస ఏర్పాటు చేశారు. విజిటర్స్‌ని కలుసుకునేందుకు వీలుగా. ఏర్పాట్లు కూడా చేశారు. అమెరికాలో దళితుల్ని ప్రత్యేకించి వేరుగా వుంచే హోటల్‌లాంటిది కాదది. కానీ ఆ హోటల్‌లో దళితుడెవరూ వుండాలనుకోరు. ఎందుకంటే సాధారణంగా ఇండియాలో కూడా వేరు చేసే ధన ప్రాబల్యం ఎక్కువ. ఆ రోజు ఐసయ్య విశ్రాంతి తీసుకుని భారతీయ ఆహారాన్ని స్వీకరించాడు. ఆహారం తీసుకోవడంలో సౌకర్యం అసౌకర్యం రెండూ కలిగాయతనికి. మద్రాసులోని రెస్టారెంట్‌లలో బీఫ్ సర్వ్ చేయరని తెలిసి ఒకింత ఆశ్చర్యం కలిగిందతనికి.

"భారతీయులందరూ చాలావరకు శాకాహారులు. అయినా మేము మటన్, చికెన్ సర్వ్ చేస్తాం" అన్నాడు హోటల్ సర్వర్ ఓ అసాధారణ బీఫేరియన్‌కి అసాధారణమైన ప్రత్యేక సౌకర్యం కల్పిస్తున్నట్టుగా.

ఐసయ్య అతని వంక చూసి సంతోషించినట్టుగా నవ్వాడు. ఆ సాయంత్రం ఐసయ్యని కలవటానికి మళ్ళీ విజిటర్స్ వచ్చారు. డి.కె. నుంచి వచ్చినవాళ్ళు నల్ల చొక్కాలు తెల్ల 'ముండు'లు ధరించారు. దళిత కార్యకర్తలు తమిళ పద్ధతిలో ట్రౌజర్స్, బుష్‌షర్ట్‌లు ధరించారు. క్రిస్టియన్ నాయకుడు ఒకడు సూట్ ధరించాడు. ఇండియా పాశ్చాత్య దుస్తుల ప్రభావాన్ని కొద్దిగా అందుకుంది. 'డెనిమ్' జీన్స్ చూసి ఆశ్చర్యపోయాడు ఐసయ్య. నల్ల జాతీయులు తెల్లవారైన పేదలు అమెరికాలో ధరించే రోజువారీ దుస్తులు అవి. ఇక్కడ వాటిని పెద్ద ఫ్యాషన్‌గా శ్రేష్టులు ధరించడానికి విశేషమైన వాటిగా భావిస్తున్నారు. అయ్యర్, ఛటోరజ్‌లు గుర్తుకొచ్చారు ఐసయ్యకి. వాళ్ళు రంగు వెలిసిపోయిన జీన్స్‌ని ఫ్యాషన్‌గా ధరించారు. దళితుల్ని దుస్తులు గురించి అడిగితే వాళ్ళు చెప్పారు – వాళ్ళ నాయకుడు – అంబేడ్కర్ ఎల్లప్పుడూ సూటూ బూటూ ధరించేవాడని, గాంధీజీకి వ్యతిరేకంగా – గాంధీజీ చిన్న కొల్లాయిని మాత్రమే ఓ కూలి మనిషిలా కట్టుకునేవాడని అందువల్లే జనబాహుళ్యం అతన్ని సులభంగా గుర్తించేవారని, అగ్రవర్ణాల ప్రజలు అతని ఉద్యమానికి భారీగా విరాళాలు ఇచ్చారని, గాంధీ ధరించిన వడికిన నూలు వస్త్రానికి బిర్లాలు ధనాన్ని వెచ్చించేవారని. కాని అంబేడ్కర్ సరియైన పోషణలేని సూటు తన స్వీయ సంపాదనతో కొనుక్కుని ధరించేవాడు. హోటల్ ప్రధాన ద్వారం దగ్గరున్న లాబీలో

వరుసగా చిత్తరువులు వున్నాయి. అంటరానివాడైన అంబేద్కర్ ఫుల్ సూట్‌లో బిజినెస్ క్యాస్ట్ గాంధీ అర్ధనగ్నంగా కొల్లాయితోను, కాశ్మీరీ బ్రాహ్మణుడైన నెహ్రూ ముస్లిం షేర్వాణీ, బిగుతైన పైజామాలోను, కాయస్థ అయిన సుభాష్ చంద్రబోస్ మిలిట్రీ పెరేడ్ డ్రెస్సులోను. – ఆ చిత్తరువులని చూసిన ఐసయ్య "ఎంత ఆసక్తి గొలుపుతున్న దేశమో ఇది" అనుకున్నాడు.

అమెరికాలో నాయకులందరూ – నల్ల జాతీయులు, శ్వేత జాతీయులు. జార్జి వాషింగ్టన్ దగ్గర నుంచి అబ్రహం లింకన్ నుంచి మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్ వరకు – అందరివీ ఒకే తరహా దుస్తులు, సూటు, ప్రజా ప్రతినిధుల సాధారణ దుస్తులు అన్ని చోట్లా. కానీ వాళ్ళ ఆలోచనలు, చేతలు విభిన్నమైనవి అనుకున్నాడు ఐసయ్య.

మరునాడు ఉదయం శివపురం అనే గ్రామానికి అధ్యయనం కోసం వెళ్ళాలని అనుకున్నాడు ఐసయ్య. అది ఆసక్తి గొలిపే ప్రాంతమని ఐసయ్యని కలిసిన వాళ్ళు సూచించారు. ఆ ఊరు పెద్ద దూరమేం కాదు గాని గ్రామీణ వాతావరణంతో కూడుకుని వుంటుంది. ఐసయ్యకి అనువాదకుడిగా, వ్యాఖ్యాతగా జాకబ్ పరయ్యా ఉండేందుకు అతని శ్రేయోభిలాషులందరూ అంగీకరించారు. పుస్తకాలు బాగా చదివిన జాకబ్ అద్భుతంగా మాట్లాడతాడు. తన కాబోయే గైడ్ వల్ల తనకి సంపూర్ణమైన సమాచారం లభించగలదని ఐసయ్యకి నమ్మకం కలిగింది. సరిగ్గా ఉదయం పదకొండు గంటలకి జాకబ్ ఇంటికి వెళ్ళాడు ఐసయ్య. జాకబ్ ఇంటి తలుపు తట్టాడు. జాకబ్ తలుపు తెరిచాడు. కరువు కాటకాల సమయంలో కష్టపడి రాటుదేలిన శరీరంతో పొట్టిగా దృఢంగా వున్నాడు. ఐసయ్య అతన్ని చూసి ఇష్టపడ్డాడు. కారు మద్రాసు రోడ్ల పైన మిట్టమధ్యాహ్నపు ఎండలకి చెమటలు పట్టే సెప్టెంబర్ మాసంలో సాగుతుండగా నగరం ఆధునిక కాస్మోపాలిటన్ జిమ్, అందులో విస్తరించే మురికివాడలు, ఇరుకైన సందుల సమ్మేళనంగా గోచరించింది ఐసయ్యకి. పురుషులు, స్త్రీలు, ఎక్కువ మంది పై బట్టలు గాని కాళ్ళకి షూస్ గాని, శాండిల్స్ గాని లేకుండా నడుస్తున్నారు. కొందరు మహిళలు నడుము పై భాగంలో ఎలాంటి అచ్ఛాదన లేకపోవడం గమనించాడతను. నగరంలో ఎంత మంది జనమో! బస్సుల్లో, కార్లల్లో, జీపుల్లో, ఆటోల్లో, సైకిళ్ళ మీద జనం. ఇంకా పాదచారులు. అందరికన్నా కాలినడకన వెళ్ళేవారే ఎక్కువగా కనిపిస్తున్నారు.

రోజా పార్క్స్ గురించి ఆలోచిస్తూ ఐసయ్య "దళితులు బస్సుల్లో ప్రయాణిస్తారా" అని అడిగాడు జాకబ్‌ని. అందుకు సమాధానంగా 'అవునంటూ' జాకబ్ "కానీ చాలామంది

ఇళ్ళకి వెళ్ళిన తర్వాత, ఇళ్ళలోకి ప్రవేశించే ముందర స్నానాలు చేస్తారు" అని చెప్తూ, "బ్రాహ్మణులు, చెట్టియార్‌లు బస్సుల్లో వీలైనంత తక్కువగా ప్రయాణాలు చేస్తారు" అన్నాడు. జాకబ్ ఇంగ్లీష్ అర్థం చేసుకోవడం కొంచెం కష్టమైనప్పటికీ అతని మొహంలోని హావభావాలని బట్టి అతను చెప్పే విషయాలని అర్థం చేసుకోవచ్చు. జాకబ్ రెడ్ సిగ్నల్ దగ్గర కారు ఆపగానే స్త్రీలు, వృద్ధులు ఇంకా వికలాంగులు చుట్టుముట్టి కిటికీ అద్దాన్ని తట్టి ఆత్రంగా చేతులు చాపుతున్నారు. ఒక పిల్లాడు గాంధీ వేషధారణలో వున్నాడు. దేహమంతా తెల్లటి పేస్టు పులుముకున్నాడు. నడుముకి చిన్న ధోతీలా కట్టుకున్నాడు. ఓ దుడ్డు కర్ర చేతిలో పట్టుకున్నాడు. ముక్కు మీద విరిగిన కళ్ళజోడు ఫ్రేము వుంది. అతను కూడా రెడ్ సిగ్నల్ పడటంతో వేగంగా అన్ని వాహనాల దగ్గరికి వచ్చాడు. ఐసయ్య అతన్ని జాగ్రత్తగా గమనించాడు. "ఎందుకని వీళ్ళు ఇలా ? వీళ్ళకి ఏం కావాలి?" అని అడిగాడు జాకబ్‌ని.

"వాళ్ళు డబ్బుల కోసం భిక్షం అడుక్కుంటారు" అన్నాడు సమాధానంగా జాకబ్. వాళ్ళంతా దరిదాపుగా దళిత, నిమ్న కుటుంబాల నుంచి వచ్చినవాళ్ళే. జీవించడానికి ఏమీ లేనివాళ్ళు. భిక్షం అడుక్కుంటున్నారు.

"గాంధీ కూడా ఆ విధంగా యాచించాడా?" అడిగాడు ఐసయ్య. జాకబ్ సమాధానం చెప్పలేక ఐసయ్య వైపు చూశాడు. "కానీ వాళ్ళు అర్ధనగ్నంగా వున్నారెందుకని? గాంధీ అలా వుండమని చెప్పినందుకా?" అన్నాడు ఐసయ్య. జాకబ్‌కి నవ్వు వచ్చింది. "అబ్బే అదేం లేదు. అర్ధనగ్నంగా వుండాలన్న కోరికేం లేదు వాళ్ళకి. ఎండ వేడిమి నుంచి రక్షించుకోవడానికి బట్టలు వుంటే వాళ్ళు కట్టుకుంటారు. వాళ్ళు మోస్తున్న మూటలు చూడండి? వాటిలో వున్న గుడ్డలు మనిషి చర్మం కన్నా విలువైనవి. పై బట్టలు లేకుండా వున్న మహిళలు వాళ్ళ రూపాన్ని బహిరంగపర్చడం మీరు చూడలేదా? వాళ్ళు అలాగే ధరించాలని ఆజ్ఞాపించారు అగ్రవర్ణాల వాళ్ళు. కొన్ని యుగాల క్రితం 'మనువు' అనే మహర్షి వుండేవాడు. అతను ఓ గ్రంథం రచించాడు. అగ్రవర్ణాల పురుషుడు రెప్పవాల్చకుండా తమని చూసేలా నిమ్న కులాల మహిళలు వుండే ప్రయత్నం చేయాలని అందులో రాశాడు. వాళ్ళు బట్ట కప్పుకుంటే వాళ్ళ మీద దౌర్జన్యం చేసి శిక్షిస్తారు వాళ్ళు."

"అది కిరాతకం!" అన్నాడు ఐసయ్య. కానీ ఆ మాటలు విని ఐసయ్య ఆశ్చర్యపోకుండా వుండలేకపోయాడు.

జాకబ్ సంక్లిష్టమైన భావాలతో కూడిన చూపులతో చూశాడు. తర్వాత జాకబ్ చెప్పడం కొనసాగించాడు. "మనువు ఇంకా అన్నాడు. దళితులు ఆస్తులు సంపాదించకూడదు. బంగారు ఆభరణాలు ధరించకూడదు. వాళ్ళు పగిలిన పాత్రలలోనే వండుకోవాలి. పగిలిన కంచాలు, గిన్నెలలో మాత్రమే తిండి తినాలని కూడా అన్నాడు మనువు. ద్రవిడ కజగ ఉద్యమంలో ఇప్పుడు నెమ్మది నెమ్మదిగా మార్పులు చోటు చేసుకుంటున్నాయి. దళితులు తిరుగుబాటు చేసే క్రమంలో వున్నారు. జనాలు ఇంక ఏమాత్రం మౌనం వహించేలా లేరు. మీరు నిన్న రాత్రి చూసినట్టుగా వాళ్ళలో కొందరు అంబేద్కర్ సూట్లు ధరించారు."

"నువ్వు చెప్పేది వినడానికి బాగుంది" అన్నాడు ఐసయ్య. ఐసయ్య దృష్టి కారులో వెళ్తుండగా బంజరు భూమి పైన అతుకు అతుకులుగా వున్న పొలాలపైన పడింది. "ఇక్కడ ఎప్పుడైనా కరువు ఏర్పడిందా?" అడిగాడు ఐసయ్య. అక్కడక్కడ చెట్లు, పొదలు మొక్కలు కనిపించాయి. అక్కడక్కడా దిబ్బలు కూడా వున్నాయి. ఆ పొలాల్లో పని చేస్తున్న పురుషులు దరిదాపు నగ్నంగా వున్నారు. ఉస్సురంటూ బస్సులు... లారీలు... అక్కడక్కడ కార్లు, బెల్లులు మోగుతూ సైకిళ్ళు, ఇరుకుగా వున్న ఆ ఏక రోడ్డు మీద కాలి నడకన వెళ్తున్న జనంలోంచి దారి చేసుకుంటూ పోయే ప్రయత్నం చేస్తున్నాయి. ఐసయ్య పెద్దగా డ్రైవ్ చెయ్యడు. కానీ సరియైన రోడ్లు లేని ఇండియాలో డ్రైవర్లు డ్రైవ్ చేస్తున్న విధానం చూస్తుంటే ఇండియాలోని డ్రైవర్లు బుద్ధిజీవులుగా అనిపించారు ఐసయ్యకి. తన కారుడ్రైవరు చురుకైనవాడు. ఎల్లవేళలా అప్రమత్తతతో వుంటాడు. ఆ సింగిల్ రోడ్డు అన్నిటికి ఆలవాలమైంది. కుక్కలు అడ్డదిడ్డంగా పరుగెడుతున్నాయి. కొన్ని కుక్కలు రోడ్డు చివర కొట్లాడుకుంటున్నాయి. చాలామంది గజిబిజిగా బిజీగా తిరిగే జనాన్ని చీల్చుకుంటూ రోడ్డు దాటుతున్నారు. జీబ్రా క్రాసింగ్ మీంచి చాలా అరుదుగా రోడ్డు దాటుతున్నారు. మేము ప్రయాణిస్తున్న కారు డ్రైవర్ ఎనభై కిలోమీటర్ల వేగంతో వెళ్తూ కొద్ది నిమిషాలలోనే ఇరవైకి లేక జీరో స్పీడ్‌కి రావడం చేస్తున్నాడు. డ్రైవరు చేతులూ కాళ్ళూ యాంత్రికంగా పనులన్నీ చేస్తున్నాయి. ఏ నిమిషంలో యాక్సిడెంట్ అవుతుందోనని ఐసయ్యకి ఆందోళనగా వుంది. కానీ డ్రైవరు మొహం మాత్రం సాధువులా శాంతంగా వుంది. వేగంగా, ఉత్తమంగా, క్షేమంగా నడిపే డ్రైవింగ్‌కి నోబెల్ బహుమతి గనుక ఉంటే ఆ బహుమతి ఈ డ్రైవర్‌కి ఇవ్వాల్సిందేనని భావించాడు ఐసయ్య.

"ఈ డ్రైవరు ఏ కులానికి చెందినవాడు?" అడిగాడు ఐసయ్య.

ఈ ప్రశ్నని జాకబ్ అనువాదం చేశాడు.

"నేను 'పల్లార్'ని అన్నాడు డ్రైవర్. ఇంతలో ఒక గేదె ఉన్నట్టుండి రోడ్డు మధ్యకి వచ్చింది. డ్రైవరు ఏమాత్రం తొందర, తొట్రుపాటు లేకుండా తాపీగా, లాఘవంగా బ్రేకు వేసి షార్ప్‌గా టర్న్ చేసుకుని ముందుకి వెళ్ళిపోయాడు. ఆ గేదె ఠీవిని చూసిన ఐసయ్యకి దున్నల కథలు జ్ఞప్తికి వచ్చాయి. ముఖ్యంగా బైసన్‌లు (అడవి దున్నలు). అతను వాటి గురించి అమెరికన్ తెగలకి సంబంధించిన పుస్తకంలో చదివాడు. యూరోపియన్ ప్రవాసితులు ఆ దేశాన్ని ఆకాంక్షించేవాళ్ళు. మిలియన్ల కొద్దీ జంతువుల్ని చంపితే ఆదివాసీలు వాటిని సంరక్షించి భద్రపరిచేవాళ్ళు. అందుకు హేతుబద్ధత. ఆ తెగకి గేదె అవసరం గనక గేదెను చంపు. అప్పుడు నువ్వు తెగని చంపినట్లే. ఐసయ్య రోడ్డు కిరువైపులా ఉన్న గేదెలని చూస్తున్నాడు. "డ్రైవరు అంటరానివర్గంలోని ఓ ఉపకులానికి చెందినవాడు అన్నాడు జాకబ్.

"ఆ గేదెలు ఏం తింటాయి? ఈ మరుభూమిలో ఏమీ వున్నట్టు లేదు. ఇది కరువు కాలమా?" అన్నాడు ఐసయ్య. అమెరికాలోని పేద ప్రాంతాల్లో కూడా రకరకాల ధాన్యాల పంటలను చూసేవాడు ఐసయ్య. కానీ ఇక్కడ కేవలం జనమే పంటలా కనిపిస్తున్నారు. బంజరు భూమిలో అక్కడక్కడ ఆకుపచ్చని అతుకులు పెచ్చులు పెచ్చులుగా కనిపిస్తున్నాయి ఎడారిలో ఒయాసిస్సుల్లా. అక్కడక్కడ గొర్రెల కాపరులు భుజాల పైన దుడ్డు కర్రలతో గొర్రెల వెనక నడుస్తున్నారు. అక్కడక్కడ కొందరు మనుషులు చెట్లు, పొదలు నరుకుతున్నారు. "జనాలు పంట చెరకు సేకరించడానికి సంబంధించిన భూములు ఇవి" అన్నాడు జాకబ్.

ఐసయ్య జాకబ్ వైపు తిరిగి "నువ్వు క్రిస్టియన్‌వా" అని అడిగాడు. అవునన్నట్టుగా తలపంకించాడు జాకబ్. "నువ్వు క్రిస్టియన్ ఎప్పుడయ్యావు?" అడిగాడు ఐసయ్య ఆసక్తిగా.

"పుట్టుకతోనే మా నాన్న మతం మారాడు. నేను ఆయన్ని అనుసరించాను, బాప్టిజం ఇచ్చినందుకు."

"మీ నాన్న క్రిస్టియన్‌గా ఎందుకు మారాడు?"

"ఒకరోజు మా నాన్న భూస్వామి అయిన తన యజమాని పొలంలో కూలి పని చేసి వస్తుండగా అగ్రవర్ణాల వాళ్ళు అతనిపైన దాడి చేశారు. మా నాన్న ఓ క్రిస్టియన్ ఆసుపత్రిలో చేరాడు. ఆసుపత్రిలోని తెల్ల క్రిస్టియన్‌లు అతన్ని రక్షించారు.

ఆ తర్వాత అగ్రవర్ణాల దాడుల నుంచి తన్ను తాను కాపాడుకోవడానికి కేరళ వెళ్ళాడు. ఈ మధ్యనే కేరళ చర్చ్ ఆఫ్ ది ఆర్మీ ఆఫ్ సాల్వేషన్‌లో ఆయన మరణించాడు. అది పక్క రాష్ట్రం అయిన కేరళలోని దళితుల చర్చి. అది దళితుల చేత స్థాపించబడింది. అంటరానివాళ్ళు – జీసస్ ఏ విధంగానైతే ఈ దేశంలో అంటబడే జీసస్ ఇంకా అంటరాని జీసస్‌గా విభజించబడినట్లుగా.

"జీసస్ విభజించబడ్డాడా? ఏం మాట్లాడుతున్నావు నువ్వు?" అన్నాడు ఐసయ్య కోపంగా.

"అమెరికాలో మీకు ఓ నల్ల జీసస్ ఓ తెల్ల జీసస్ వున్నారు. లేరా? అలాగే ఇక్కడా ఓ స్పృశించబడే జీసస్, ఓ అంటరాని జీసస్ వున్నారు. ప్రభువు రక్షింపబడుగాక... ఆమెన్" అన్నాడు జాకబ్ మెడలో వేలాడే క్రాస్‌ని తాకుతూ. "నేను చెప్పింది ఏమిటన్నది త్వరలోనే మీకు తెలుస్తుంది" అన్నాడతను చెప్పడం కొనసాగిస్తూ.

ఇంతలో కారు పశ్చిమ మార్గం గుండా శివపురం గ్రామంలోకి ప్రవేశించింది. కారుని తిన్నగా దళిత కాలనీకి పోనివ్వమని డ్రైవర్‌కి చెప్పాడు ఐసయ్య. అతను వెంటనే "పశ్చిమ దిశలో వరసగా వున్న ఇళ్ళు బ్రాహ్మణులవి. ఆ ఇళ్ళ వెనకాల కొంచెం దూరంలో శివాలయం ఉంది. ఆలయంలోని క్రతువులన్నీ బ్రాహ్మణ కుటుంబాలు నిర్వహిస్తాయి. మీరు చూసినట్లయితే వాళ్ళ ఇళ్ళు మధ్య తరగతివిగా అన్పిస్తాయి" అన్నాడు. తర్వాత అతను బ్రాహ్మణుల ఇళ్ళ ప్రక్కనే ముందున్నవాటికన్నా సంపన్నంగా విశాలంగా వున్న చెట్టియార్ ఇళ్ళని చూపించాడు ఐసయ్యకి. "వీళ్ళు గ్రామంలోని వ్యాపారాలపైన పెత్తనం చెలాయిస్తారు. వీళ్ళ ఇళ్ళ తర్వాత వున్న ఇళ్ళు చేతివృత్తుల వర్గం వారివి. గొర్రెల కాపరులు, కుమ్మరులు, వడ్రంగులు, రజకులు, క్షురకులు మొదలైనవారివి. వాళ్ళు పేదవాళ్ళుగా కన్పిస్తారు కానీ ఇళ్ళు మాత్రం చాలా బాగా కట్టినవి. కొన్ని కాంక్రీటుతోను, మరికొన్ని తాటాకులతో కూడిన కప్పుతో వున్న ఇళ్ళు.

వీధుల్లో స్త్రీ పురుషులు చాలామంది అర్ధనగ్నంగా నడుస్తూ కనిపించారు ఐసయ్యకి. కూడళ్ళలో జనం గుంపులు గుంపులుగా కూర్చుని వున్నారు. అది ఓ విచిత్రమైన గ్రామంలా అన్పించింది ఐసయ్యకి. అది నల్ల వెలివాడగానూ లేదు అమెరికన్ సిటీలా గాని, ఓ పేటలా గాని లేదు. అది అర్ధ మురికివాడలా గోచరిస్తోంది. అందులోనే మురికి, ఇరుకైన సందులున్నాయి. కారు దళిత వాడలోకి ప్రవేశించగానే ఆ ప్రాంతమంతా విభిన్నంగా కన్పించింది ఐసయ్యకి. అక్కడ దళితుల ఇళ్ళు చాలావరకు బురద మట్టితో

మాసికలు పట్టి పెచ్చులు ఊడిపోయిన గోడలు, గడ్డితో కూడిన ఇంటి కప్పులు, ఇంకా అరుగులు ఎర్రమన్నుతో గాని, ఆవు పేడతో గాని అలకబడి వున్నాయి. ఐసయ్య కారులోంచి దిగగానే పురుషులు, స్త్రీలు కారు చుట్టూ మూగి వింతగా చూస్తున్నారు. వాళ్ళలో చాలా మంది ఎప్పుడూ కారు చూడలేదు. అక్కడ సుమారు ఎత్తుతోను, బలహీనమైన ఎముకలతో వున్న వాళ్ళందరి కన్నా అతను ఎత్తుగా వున్నాడు. వాళ్ళలో చాలామంది పురుషులకి, కొందరు స్త్రీలకి శరీరాల మీద పై బట్టలు లేవు. కొందరు వృద్ధ మహిళలు "శివుడిలా కన్పించే నల్ల దేవుడు మన కాలనీకి వచ్చాడు" అంటూ మాట్లాడుకుంటున్నారు.

"మన కాలనీకి దేవుళ్ళు ఎప్పుడూ రారు" అంది నెరిసిన జట్టుతో వున్న ఓ మహిళ.

"ఐసయ్య దేవుడు కాదు" అన్నాడు జాకబ్ వాళ్ళతో. కానీ ఎవరూ అతని మాటల్ని వినిపించుకునే స్థితిలో లేరు. అక్కడ వున్న వాళ్ళందరూ ఐసయ్యని చూడాలని, వీలైతే తాకాలని ఎగబడుతున్నారు. అతని కారునలుపు రంగుని ప్రశంసించారంతా. వెడల్పాటి భుజాలు, విశాలమైన పెదాలు, బొద్దుగా వున్న ముక్కు, పొడుగాటి చేతులు, అతనిలో వున్నవన్నీ వాళ్ళకి దివ్యంగా కనిపిస్తున్నాయి. ఇంతలో పిల్లలంతా పరుగెత్తుకుంటూ వచ్చి అతన్ని చుట్టుముట్టారు. వాళ్ళు కారుని తాకుతున్నారు. కొందరు కారు కింద దూరుతున్నారు చక్రాలని చూడ్డానికి. పిల్లలంతా పుట్టినపుడు నగ్నంగా ఎలా వున్నారో ఇపుడూ అలానే వున్నారు. నగ్నత్వం, అర్ధనగ్నత్వం ఈ కాలనీవాసుల జీవితాలలో భాగాలు. ఇదంతా విచిత్రంగా తోచింది ఐసయ్యకి. ఇంతలో దళిత కాలనీ పెద్ద అయిన ఎలుమలై అక్కడికి వచ్చాడు. అతను ఐసయ్యని కావలించుకుని "మీరు ఇక్కడికి రావడం చాలా సంతోషంగా వుంది" అన్నాడు తమిళంలో. జాకబ్ అనువదించాడు. ఎలుమలై గురించి ఐసయ్యకి వివరించాడు జాకబ్. ఎలుమలై కన్నా ముందు అతని తండ్రి కాలనీ పెద్దగా వ్యవహరించాడని, ఎలుమలై ప్రైమరీ స్కూలు విద్య పూర్తి చేశాడని చెప్పాడు జాకబ్.

ఐసయ్య మరోసారి ఆదరంగా షేక్‌హ్యాండిచ్చి ఎలుమలైని అభినందిస్తూ "మీ జీవితాన్ని, మీ నేల, మీ సంస్కృతి, నాగరికతల గురించి తెలుసుకోవాలని అమెరికా నుంచి వచ్చాను" అన్నాడు నెమ్మదిగా.

"మీరు మా గౌరవ అతిథి. ఇంకా చెప్పాలంటే బంధువు. ఈ రోజు మీరు మాతో గడపాలి. కాలనీవాసులు సాయంత్రం మిమ్మల్ని కలుస్తారు. ఇప్పుడు వాళ్ళంతా

పనుల్లోకి వెళ్ళారు" అంటూ ఎలుమలై అక్కడున్న వాళ్ళ వైపు చూస్తూ "అందరూ వెళ్ళండి. సాయంత్రం మన పరయా డ్రమ్ములు వాయిస్తూ నృత్యం చేస్తాడు. మనం సుఖదుఃఖాలు పంచుకుందాం" అన్నాడు. అక్కడున్నవాళ్ళంతా వెళ్ళిపోయారు. కాలనీలో బాగా లోపల కంటా వున్న తన ఇంటికి ఐసయ్యని, జాకబ్‌ని తీసుకువెళ్ళాడు ఎలుమలై. అక్కడ అడుగుపెడుతూ పరిసరాలని విచిత్రంగా పరికించాడు ఐసయ్య. ఆ ఇళ్ళ దగ్గర కాని కాలనీలో గాని బాత్‌రూమ్, టాయిలెట్‌లాంటివేవీ కన్పించలేదతనికి. కాలనీలో పారిశుధ్యం లేదు. "అక్కడున్న వాళ్ళలో చాలామంది ఊరిని శుభ్రం చేస్తారు. కానీ తమ కాలనీలని శుభ్రం చేసుకోరు. వాళ్ళ సంస్కృతిలో అది శోచనీయం" అన్నాడు జాకబ్ పరయా.

"మాదీ అదే సమస్య. మా ఆఫ్రికన్ పూర్వీకులు తెల్లదొరలని సేవించారు. వాళ్ళ కోసం సమస్తం శుభ్రం చేస్తారు. కానీ ఇంటికి వచ్చిన తర్వాత వాళ్ళు ఆ దుమ్ములోనే వుంటారు. ఇప్పుడు పరిస్థితులు మారాయి. ఇప్పుడు మా తెల్ల దొరలు కూడా వాళ్ళంతట వాళ్ళే శుభ్రం చేసుకోవాల్సి వుంటుంది అన్నాడు ఐసయ్య ఎలుమలై ఇంట్లోకి ప్రవేశిస్తూ.

గెస్ట్‌లు రావడం చూసి ఎలుమలై భార్య వీరమ్మ రెండు రాగి పాత్రలతో నీరు అందించి "కాళ్ళు కడుక్కుని రండి" అంటూ ఆప్యాయంగా ఆహ్వానించింది. ఐసయ్యకి అర్థం కాకపోవడంతో జాకబ్ వైపు చూశాడు. జాకబ్ అన్నాడు. వచ్చిన గెస్ట్‌లని కాళ్ళు కడుక్కోమని చెప్పడం దళితుల ఆచారం. అందుకు శాస్త్రీయమైన ఆధారాలు కూడా వున్నాయి. చాలామంది దళితులు షూస్‌గాని, శాండిల్స్ గాని వేసుకోరు. వాళ్ళు ఇతరుల కోసం చెప్పులు తయారుచేస్తారు కానీ వాళ్ళు మాత్రం చెప్పులు వేసుకోవడం నిషిద్ధం. బయట నడిచినప్పుడు పాదాలకి దుమ్ము, ధూళి, బురద అంటుతుంది. వాటిని బయట వదిలించుకుని పరిశుభ్రంగా ఇంట్లోకి రమ్మనమని చెప్పడమే దీని ఉద్దేశం. దుమ్ము, ధూళి, బురదతోకూడిన పాదాలతో వస్తారు. కాళ్ళు కడుక్కుంటే ఆ ధూళి, బురద ఇంట్లోకి చేరదు."

ఐసయ్య షూస్, సాక్స్ విప్పి కాళ్ళు కడిగాడు. పరయ్యా కూడా శాండిల్స్ విప్పి కాళ్ళు కడిగాడు. వీరమ్మ మంచంపైన దుప్పటి పరిచింది. వాళ్ళని మంచంపైన కూర్చోమన్నాడు ఎలుమలై. ఒక దళితుడి ఇంట్లో! అగ్రకులాల డ్రీం ల్యాండ్ – అమెరికా నించి వచ్చిన – ఓ అసాధారణ అనుకోని అతిథి. "మీరు పొగాకు పీలుస్తారా?" అని అడిగాడు ఎలుమలై జేబులోంచి పొగాకు బైటికి తీస్తూ సైగలతో. ఆ సైగలని అర్థం చేసుకున్న ఐసయ్య 'నో, థాంక్స్ ' అన్నాడు.

అక్కడ ఓ రాతి పొయ్యి చుట్టూ రకరకాల సైజులలో కొన్ని కుండలు వున్నాయి. పొయ్యిలో కట్టెలున్నాయి. ఇంట్లో దేవుడి పటాలు గాని, దేవుడి బొమ్మలు గాని లేవు. సున్నం పూసిన మట్టిగోడలు. నేలంతా పేడతో అలకబడి వుంది. ఐసయ్య ఆఫ్రికన్ ఇళ్ళ ఫొటోలని జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. వాళ్ళ పూర్వీకులైన ఆఫ్రికన్‌లు అలాంటి ఇళ్లలో నివసించేవారు. కానీ వాళ్ళు అమెరికాకి బానిసలుగా వెళ్ళిన తర్వాత చాలాకాలం తెల్ల యజమానుల బానిస వీధుల్లోనూ, ధాన్యం కొట్టంలోనూ, పశువులు గుర్రాల కొట్టంలోను నివసించారు. బానిసత్వం నుంచి విముక్తి లభించిన కొన్ని శతాబ్దాల తర్వాత నల్లజాతీయులకి ఇప్పుడు స్వంత ఇళ్ళు వున్నాయి. వేడినీళ్ళు, చన్నీళ్ళు ఇంకా బహుశా ఓ గ్యారేజీ, చిన్నపాటి ఆవరణ. 'ఐసయ్య 'పెద్ద కూర' (బీఫ్) తింటాడా. మా మద్యం తాగుతాడా?' అంటు ఎలుమలై అడిగాడు జాకబ్‌ని. ఐసయ్యని తిరిగి అదే విషయం అడిగాడు జాకబ్.

"నేను బీఫ్‌తోనే పెరిగాను" అని నవ్వాడు ఐసయ్య. "అందువల్లే నా కండలు ఇలా వున్నాయి" అని చొక్కా చేతులు మోచేతుల వరకు మడిచి చూపించాడు ఐసయ్య. అలా చూపిస్తుండగా అతనిలో గర్వం తొణికిసలాడింది."

"మాకు ఇష్టమైన సూప్ ఉదరం నించి తయారు చేయబడింది. అంతర్గత అవయవాలు – ఓ చిన్న ఆవు" అన్నాడు ఐసయ్య.

వెంటనే ఎలుమలై అన్నాడు. "అయితే ఇక్కడ బ్రాహ్మణులతో మాకో చిక్కొచ్చి పడింది. ఆవుని గోమాతగా భావిస్తారు వాళ్ళు. గోమూత్రం తాగుతారు. మనం గోమాంసం తింటే నిందిస్తారు. అఫ్‌కోర్స్, మా నాయకుడైన పెరియార్ వాళ్ళ ముడ్డి మీద నాలుగు తగిలించాడు. కానీ డి.కె. పార్టీలోని శూద్రనాయకులతో వచ్చిన సమస్య ఏమిటంటే వాళ్ళు కూడా 'పెద్ద కూర' తినరు. అందుకని ఈ ఉదయమే మంచి ఆవుని తీసుకువచ్చి రహస్యంగా వధించాం. ఈ రోజు మనకి విందు భోజనం అదే" అని ఎలుమలై ఓ కుండ దగ్గరకి వెళ్ళి కల్లు తీసుకువచ్చాడు. బాటిల్ ఎత్తి చిన్న గ్లాసులో మద్యం ఒంపి ఐసయ్యకి ఇస్తూ "మా జీవితాలని ఇప్పుడు మీరు చూడొచ్చు. కానీ అక్కడ మీ జీవితాలని నేను ఎన్నడూ చూడలేను. మీ దేశంలో జీవితం ఎలా వుంది?" అడిగాడు ఎలుమలై. ఘాటుగా వున్న మద్యం వాసన యవ్వనంలో తను గడిపిన రోజుల్ని గుర్తుకు తెచ్చింది ఐసయ్యకి. ఐసయ్య చెప్పడం మొదలుపెట్టాడు. "ఒకసారి మేము ఇలాంటి పదార్థమే తయారుచేశాం" అంటూ ఒక టోస్ట్ ఎలుమలైకి అందిస్తూ ఐసయ్య. "ఇప్పుడు మేము ఎక్కువగా మద్యం

దుకాణం నుంచి తెచ్చిన మద్యం తాగుతాం. మేము రెండు శతాబ్దాలుగా బానిసలం, వంద సంవత్సరాల క్రితం వరకు మా పూర్వీకులు ఆఫ్రికా నుంచి ఓడలో అమెరికాకి తీసుకురాబడ్డారు పశువుల్లా. వాళ్ళని తెల్లవారి ఇళ్ళల్లో బానిసలుగా మార్చారు. మా జనాలు వాళ్ళ ఇళ్ళలో పశువుల్లా జీవించారు. అయితే మేము అంటరానివాళ్ళం కాదు. మేము స్పృశించబడే బానిసలం. తెల్ల యజమానులు మా మహిళల్ని లైంగిక బానిసలుగా మార్చారు. ఇళ్ళలో వంట మనుషులుగాను, పనిమనుషులుగాను వుండటంతో తెల్ల జాతీయులు మా మహిళల్ని చెరబట్టటడం, లైంగిక దాడులు చేయడం ఎంతవరకు చేరుకుందంటే ఆ చిత్రహింసలకి పుట్టిన పిల్లలు ఓ కొత్త రంగుతో కూడిన జాతిని సంతరించుకున్నారు. వాళ్ళు కూడా బానిసలుగా అమ్మబడ్డారు. కానీ తెల్ల జాతీయులు చాలామంది తమ పోలికలు వాళ్ళలో చూసుకునేవారు వాళ్ళు చేసిన అపరాధాలకి సాక్ష్యంగా. విచారించాల్సిన విషయమేమిటంటే కొందరు స్వచ్ఛమైన నల్లజాతీయులు కూడా ఆ పిల్లల వంక చూసేవారు. కొందరు తెల్ల మహిళలు బైబిల్ చదవడం మా మహిళలకి నేర్పించారు. ఆ విధంగా తెల్ల యజమానుల పట్ల తిరుగుబాటు మొదలైంది. మానభంగం చేయబడ్డ మా మహిళలకి వాళ్ళు పాప విమోచనం పొందేందుకు బైబిల్‌ని ఇచ్చారు. మా మహిళలు బైబిల్ చదివి దైవకృపకు పాత్రులై తెల్ల యజమానుల పట్ల తిరుగుబాటు మొదలుపెట్టారు. పశ్చిమంలో వుండే కొందరు తెల్ల సంఘ సంస్కర్తలు కూడా బానిసత్వానికి వ్యతిరేకంగా మాట్లాడ్డం మొదలుపెట్టారు. పరిస్థితులు జాతియుద్ధం చేయాల్సి వచ్చేటంత దారుణంగా పరిణమించాయి. వంద సంవత్సరాల క్రితం మహాయుద్ధం జరిగింది అన్నదమ్ముల మధ్యన. ఇప్పటికే ఆ యుద్ధం కొందరి మదిలో ఇంకా రేగుతూనే వుంది. స్వాతంత్ర్య యోధులు నెగ్గారు. మాకు బానిసత్వం నుంచి విముక్తి లభించింది. యుద్ధం పరిసమాప్తం అయ్యే సమయంలో మేము పేదవాళ్ళుగాను, అజ్ఞానులుగానూ వున్నాం. ఒక విధంగా మాకు మేమే శత్రువులమయ్యాం. మా అంతట మేము గాయాల నించి పాఠాలు నేర్చుకున్నాం. ఉదాహరణకి, మా కుటుంబంలో కాలేజీకి వెళ్ళిన మొదటి వ్యక్తిని నేనే. మా అమ్మకి మంచి తెలివితేటలున్నాయి. కానీ ఆమె తన జీవితాన్నంతా షాపు నిర్వహించడంలోను, కష్టాల్లో వున్న నల్లవారికి సాయం అందించడంలోనే గడిపింది. మా నగరంలోని షెరీఫ్‌కి భయపడని ఒకే ఒక్క నల్ల మహిళ ఆమె. ఆమె తెల్ల మహిళ గనుక అయ్యుంటే మా నగరం మొత్తాన్ని ఆమె మార్చి వేసేది. ఈ పౌర హక్కుల ఉద్యమం కూడా ఓ మహిళ మొదలు పెట్టిందే. మా పుస్తకాలు, మా ఆలోచనలు, మా పాటలు, మా చర్చి ఇంకా మా దేవుడు ఇవే మా ఆయుధాలు."

ఐసయ్య చేసిన ఈ చిన్నపాటి ఉపన్యాసాన్ని జాకబ్ తమిళంలోకి అనువదించి చెప్పాడు ఎలుమలైకి. అక్కడి జీవితం ఎలా వుంటుందో సవివరంగా కళ్ళక్కట్టేటట్టు అతను వర్ణించి చెప్తున్నంత సేపు ముడుతలు పడ్డ ఎలుమలై చెంపల మీంచి కన్నీరు జాలువారింది. ఆ తర్వాత ఎలుమలై రుద్ధమైన కంఠంతో చెప్పడం మొదలుపెట్టాడు.

చూడండి, ఈ విషయంలో మీ ప్రజలెంతో అదృష్టవంతులు. మీరు, మీ యజమానులు విభిన్న వర్గాలకి చెందినవాళ్ళు. తమిళ దేశంలో మాది, బ్రాహ్మణులది ఒకే వర్ణం. ఒకసారి మా గ్రామంలోకి వెళ్ళి చూడండి. వాళ్ళ శరీర నిర్మాణం, కళ్ళు, పొడవు, రంగు అన్నీ నాలాగే వుంటాయి. పగలు వాళ్ళు మా మహిళల్ని తాకరు. రాత్రిళ్ళు మాత్రం మా మహిళల్ని మానభంగం చేస్తారు. అది కూడా వాళ్ళ దేవుళ్ళు వున్న గుళ్ళలో. మా ఇళ్ళల్లోని యువతుల్ని దేవుని సేవలో వదిలేయమన్నారు. వాళ్ళ దేవుడు మా దేవుడు కాదు. ఈ స్త్రీలని దేవదాసీలంటారు. కానీ నిజం చెప్పాలంటే వాళ్ళు బ్రాహ్మణ పురోహితుల అంటరాని సెక్స్ వర్కర్లు. ఆలయ పరిసరాల్లో ఈ చెత్త పురోహితులు తిని విసర్జించిన మలినాలని శుభ్రం చేయాలి. కానీ ఆ దేవుడి దగ్గరకంటా వెళ్ళకూడదు. మా మహిళలు అగ్రవర్ణాల గొడ్ల సావిళ్ళు శుభ్రం చేయడానికి వెళ్ళాలి. పొలానికి వెళ్ళి వంట చెరకు పోగు చెయ్యాలి. అక్కడ వాళ్ళు మానభంగం చేయబడతారు. మాలోని ఎందరు అగ్రకులాల వాళ్ళకి జన్మించారోనన్న విషయం మాకు తెలియదు. వాళ్ళ మహిళలు మా పురుషుల్ని ఆకర్షించి సెక్సువల్ సంబంధాలు కలిగి వున్నందుకు మా వాళ్ళకి కూడా కొందరు పిల్లలు పుట్టారు. కానీ వాళ్ళు పుట్టగానే దళిత యువకులు తమని మానభంగం చేసినట్టుగా వాళ్ళు అంటారు. మా ఊపిరి అగ్రవర్ణాలకి చెందినది. ఎందుకంటే మాలో ఎవరైనా జబ్బు పడినా, విధివిహితంగా వివాహాలు ఆచరించినా లేక ప్రత్యేకించి ఏదైనా అవసరం పడినా మేము ధనిక అగ్ర వర్ణాల వారి నుంచి లోన్లు తీసుకోవాలి. ఆ లోన్లు, వాటి మీద వడ్డీని తిరిగి చెల్లించడానికి మా రక్తాన్ని ధారపోయాల్సి వస్తుంది. ఎముకల్ని పిండి చేసుకోవాల్సి వుంటుంది. మీరు ఎప్పుడో రెండు శతాబ్దాల కిందటి బానిసత్వం గురించి మాట్లాడుతున్నారు. మా విషయంలో బానిసత్వం అనేది యుగాల తరబడి వస్తోంది. అయినా ఇప్పటికీ మా పరిస్థితిలో మాత్రం ఏమీ మార్పు రాలేదు.

ఐసయ్య జాగ్రత్తగా విన్నాడు. ఎలుమలై తమిళంలో మాట్లాడినప్పటికీ అతని బాడీ లాంగ్వేజి భావప్రకటన సామర్థ్యం కలిగి వుంది. ఈ విధమైన బాడీ లాంగ్వేజీలో

మాట్లాడేవాళ్ళని ఐసయ్య ఎన్నడూ చూడలేదు. ఎలుమలై మొహం కోపంతో జేవురించింది. కళ్ళు ఎర్రబడ్డాయి. మద్యం తాగినందుకు కాదు, చరిత్ర తాగినందుకు... అంటరాని బానిసత్వ చరిత్ర.. మహిళల అంటరాని దేహాలు, తాకే మర్మాంగాలు. ఎలుమలై వేళ్ళూ, అరచేతులు అనుభవం గల సమాచార సాధనాలు. ఎందుకంటే దేవుని చేతిలో వాటికవి అత్యుత్తమమైన పనిముట్లుగా అనుభవం గడించాయి.

ఎలుమలై రెండో రౌండ్ మద్యం పోసి చెప్పడం కొనసాగించాడు. "వాళ్ళ దేవుళ్ళు మీ దేవుడిలా కాదు. వాళ్ళకి చాలా దేవుళ్ళు వున్నారు. అయితే మనకీ చాలా దేవుళ్ళు వున్నారు. వాళ్ళ దేవుళ్ళు కూడా మన స్త్రీ పురుషులతో అలాగే చేశారు. ప్రాచీన కాలంలో మేము ఛండాలురంగా చెప్పబడ్డాం. వాళ్ళ దేవుడైన ఇంద్రుడు మానభంగం చేయడంలోను, మన మహిళల్ని ఉంచుకోవడం లోను పేరుగాంచాడు. అసలు ఆ అప్సరసలు ఎవరు? రంభ, ఊర్వశి, తిలోత్తమ ఇంకా మేనక? వాళ్ళు మన మహిళలు, దేవ వేశ్యలు. వాళ్ళు నాట్యం చేసే ఉంపుడుగత్తెలు. శయనించే సౌందర్యవతులు. వాళ్ళకి సాంఘిక హోదా, చారిత్రక వారసత్వం లాంటివి లేవు. మన దేవుళ్ళు అటువంటి పనులు ఎన్నడూ చేయలేదు. మంచివాళ్ళు. కానీ మన దేవుళ్ళు కూడా ఎన్నడూ ఎలాంటి గ్రంథమూ రాయలేదు. ఆ ముస్లిం దేవుడ్ని చూడండి. ఆయన ఓ గ్రంథం రచించాడు. క్రిస్టియన్ దేవుడు కూడా ఓ గ్రంథాన్ని రచించాడు. మరి మన దేవుళ్ళు.... వాళ్ళు అలాంటిదేదీ చేయలేదు. అందువల్లే మనకి చదువులు లేవు.

ఇంతలో వీరమ్మ ఓ మట్టి పాత్ర నిండా 'పెద్ద కూర' తీసుకువచ్చింది. అది వింతైన సువాసన గొల్పుతోంది. జాకబ్ ముక్కుపుటాలెగరేశాడు. నెమ్మదిగా మద్యం ఆనందం తలకెక్కుతున్నట్టుగా అన్పించింది ఐసయ్యకి. "జాకబ్ మద్యం తాగటం లేదు. ఈస్టర్ సండే నాడు కొద్దిగా వైన్ తప్ప ఏ క్రిస్టియన్ మద్యం స్వీకరించరాదని అతనికి ఎవరో చెప్పారు. వాళ్ళ గ్రామంలో సరియైన వైన్ లభించకపోవడంతో నాగరిక కుటుంబాల్లోని వాళ్ళు కూడా ఆ పండుగ రోజు నాలుక మీద కొన్ని మద్యం బొట్లు చల్లుకుని రుచి చూస్తారు. అంతే. కానీ జాకబ్ 'పెద్ద కూర' కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నాడు.

అది అతనికి చాలా ఇష్టం. సాధారణంగా చలికాలంలో చలి నుంచి రక్షణ పొందడానికి కప్పుకునే ఉన్ని బ్లాంకెట్‌ని నేల మీద పరిచింది వీరమ్మ కూర్చోవడానికి

వీలుగా. ఆ ఇంట్లోని చాలా వస్తువులు రెండు మూడు విధాలుగా ఉపయోగిస్తాయి. వాళ్ళు ఆ బ్లాంకెట్ మీద కూర్చున్నారు. బాసింపట్టు వేసుకుని కింద కూర్చోవడానికి ఐసయ్య ఇబ్బంది పడ్డాడు. చిన్నప్పటి నుంచి డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చుని కత్తి, ఫోర్క్‌లతో తినే అలవాటు ఐసయ్యది. వీరమ్మ అన్నం, గొడ్డు మాంసం రాగి పాత్రలలో వడ్డించింది. ఎలుమలై ఆమె తెచ్చిన బౌల్‌లో ఉన్న ఓ మాంసం ముక్క తీసుకుని నోట్లో వేసుకుని ఎంతో బాగుంది అబ్బ అని లొట్టలేసుకుంటూ తింటూ అన్నాడు. "అంటరానివాళ్ళ జీవితాల్లో రుచి అన్నదే లేదు ఈ రుచి తప్ప. మిగతా కులాలన్నీ ఈ రుచిని పోగొట్టుకున్నాయి. మనం మాత్రమే దీనితో మిగిలాం" అన్నాడు. అతను మాంసం ముక్కని నమిలి మింగుతూ వేళ్ళతో గ్రేవీ నాక్కోవడం మొదలెట్టాడు.

వేళ్ళతో ఎలా తినాలో జాగ్రత్తగా గమనించాడు ఐసయ్య. "భారతీయులంతా ఇలాగే తింటారా?" అడిగాడు ఐసయ్య.

"అన్ని కులాల వాళ్ళు ఇలాగే తింటారు. కానీ బ్రాహ్మణులు, చెట్టియార్లు ప్లేట్లలో చాలా కూరలు వేసుకుని తింటారు. రుచులకు దాసులు వాళ్ళు. మీకు తెలుసా వాళ్ళు. తినటం కోసం బతుకుతారు. మాలాంటి పేదవాళ్ళు బతకడానికి తింటారు. కేవలం ఇటువంటి సందర్భాలలోనే అంటే 'పెద్ద కూర' వండినపుడే మేము కూడా తినటం కోసం బతికినట్టుగా వుంటుంది. కానీ వాళ్ళకి మాత్రం రోజూ ప్రతీది లభిస్తుంది. అయితే ఈ 'పెద్ద కూర' రుచిని మాత్రం వాళ్ళు కోల్పోయారు. శతాబ్దాల కిందటే... పిచ్చివాళ్ళు" అంటూ నిట్టూర్చాడు ఎలుమలై, ఓ పెద్ద బొమికతో కుస్తీ పడ్తూ.

అయితే ఐసయ్య మాత్రం అన్నంలో కూర కలుపుకోవడానికి కుస్తీ పడ్తున్నాడు. నోట్లో పెట్టుకోవడానికి నోటికి సరిపడేటట్టు సరిచేసుకుని ప్రతీ ముద్దని వేళ్ళతో పొడిచి తీసి నోట్లో పెట్టుకుంటున్నాడు. నిజంగా అది కష్టమైనదీ కాదు, ఆశ్చర్యకరమైంది కూడా. ఎలుమలై తన చివరి వేళ్ళ జాయింట్ మధ్యభాగాన్ని ఓ రకమైన చెంచాలా ఉపయోగించడాన్ని గమనించాడు ఐసయ్య. కానీ అతని జీవితం కోసం అతనికి అన్నం ముద్ద, మాంసం 'చెంచా' లోంచి ఎంతో కొంత చిందితే గాని నోటిదాకా రావడం లేదు. నిజంగా వేళ్ళతో తినడం గొప్ప ఆర్ట్. "మేము, అమెరికన్స్, బానిసలు గాని, యజమానులు గాని ఫోర్క్, నైఫ్ పట్టుకుని లేక కనీసం స్పూన్‌తోనైనా నెమ్మదిగా కబుర్లు చెప్పుకుంటూ తింటాం" అంటూ ఐసయ్య మేము అన్నం అసలు ముట్టుకోము!" అన్నాడు. అదెలా సంభవమన్నది ఎలుమలైకి అర్థం కాలేదు. ఎలుమలై ఇంకా పరయ్యా తినడం ముగుస్తున్నా

ఐసయ్య మాత్రం తింటానికి కుస్తీ పడుతూనే వున్నాడు. మిర్చి కారం నషాళానికంటడంతో ఐసయ్య ఇబ్బంది పడుతున్నాడు. “వంటకాలలో ఇంత కారం ఎలా తింటారు మీరు” అడిగాడు ఐసయ్య జేబు రుమాలుతో ముక్కు తుడుచుకుంటూ. నోరారా కూర తిన్నా ఎలుమలైకి గాని జాకబ్‌కి గాని ముక్కు నుండి నీళ్ళు కారకపోవడం ఆశ్చర్యమనిపించింది ఐసయ్యకి. వీరమ్మ ఒక చేతిలో అన్నం, మరో చేతిలో ఉన్ని స్పూన్, కర్రీతో వడ్డించడానికి సిద్ధంగా అందరి ప్లేట్లు గమనిస్తోంది. ఆమె కొద్దిగా వంగి మంచినీళ్ళు తాగితే అంతా సర్దుకుంటుందని సైగ చేస్తూ టంబ్లర్‌తో ఐసయ్యకి మంచినీళ్ళు అందించింది.

“నువ్వు కూడా మాతో కలిసి భోజనం చెయ్యొచ్చుగా?” అన్నాడు ఐసయ్య వీరమ్మ కళ్ళలోకి సూటిగా చూస్తూ. నిదానించి చూస్తే ఆమెలో ఒక వింత ఆకర్షణ వుంది. దట్టంగా నిగనిగలాడే నల్లని జుట్టు పైకి సిగచుట్టి వుంది. పొడవాటి ముక్కు, గుండ్రని మొహం, సౌష్టవమైన దేహం, నీలిరంగు చీరని తొడల మధ్య నుంచి గోచీలాగా పైకి దోపుకుంది మగవాళ్ళలా. ఎరుపురంగు బ్లౌజు ధరించింది. వంట గది వేడికి చెమట బిందువులు నుదుటి మీద, బుగ్గల పైన వజ్రపు తునకల మాదిరి మెరుస్తూ జారుతున్నాయి. ఐసయ్య ప్రశ్నని జాకబు ఆమె భాషలో అనువదించి చెప్పగానే ఆమె నవ్వింది. నవ్వినపుడు తెల్లటి ఆమె పలువరుస మెరిసింది.

“లేదు, లేదు. ఇంట్లో మగవాళ్ళందరూ భోజనం చేసేటంతవరకు మేము ఆడవాళ్ళం భోజనం చెయ్యం” అంది వీరమ్మ ఉల్లాసవంతమైన మొహంతో.

“అలాగా?” అంటూ ఐసయ్య మా విషయానికి వస్తే మగాళ్ళం, ఆడాళ్ళం అందరం డైనింగ్ టేబుల్ చుట్టూ కూర్చుని కలిసి భోజనం చేస్తాం. మా మహిళలు మగాళ్ళ కంటే ఎక్కువ తింటారు” అంటూ ముగించాడు ఒకింత విచారంతో.

“ఏ ఆడదీ మగాడికన్నా ఎక్కువ తినదు. మగాళ్ళే అంతా తినేసి తినలేదని అంటుంటారు” అంది వీరమ్మ శాంతంగా. ఐసయ్య నవ్వుకున్నాడు. ఐసయ్య భోజనం చేయడం పూర్తవ్వగానే చెయ్యి కడుక్కునేందుకు వీరమ్మ నీళ్ళు పోస్తుంటే సబ్బు కావాలని అడిగాడు. దళితులు సబ్బు ఉపయోగించే దశకి చేరుకోలేదన్నాడు ఎలుమలై.

“స్త్రీలు, పురుషులు మూలికల రసంతో తలంటుకుంటారు. చవుడు మట్టితో ఒంటిని రుద్దుకుంటారు” అన్నాడు ఎలుమలై. ఐసయ్య నిట్టూర్పు విడుస్తూ ఇంట్లో సౌకర్యాలు అరకొరగా వున్నాయని భావించాడు.

మధ్యాహ్నం భోజనం ముగించగానే ఎండవేడి తగ్గే వరకు విశ్రాంతి తీసుకుని ఆ తర్వాత ఊళ్ళోకి వెళ్దామని ప్రతిపాదించాడు ఎలుమలై. తన అమెరికన్ కామ్రేడ్‌ని అగ్ర కులపు మతాంధుల మధ్య తిప్పాలని నిర్ణయించుకున్నాడు ఎలుమలై.

వాళ్ళు నేల మీద లంచ్ కోసం పరిచి వున్న దుప్పటి తీసి వేరే మంచం మీద పరిచి విశ్రాంతి తీసుకోవలసిందిగా ఐసయ్యకి సలహా ఇచ్చారు. పాతకాలపు మంచం అది. జాకబ్, ఎలుమలై మరో మంచం మీద విశ్రాంతి తీసుకున్నారు. అమెరికాలో ఒకే మంచం మీద పడుకునే వ్యక్తులు స్వలింగ సంపర్కం (హోమో) నడవడి కలిగి వుంటారన్న సంగతి ఎలుమలైకి తెలియదు. కానీ ఇండియాలోని దళితులలో అలాంటి సూచనలేవీ లేనప్పటికీ అది సాధారణమైనదే. అది ఉన్నంతలో సర్దుకుపోవడం లాంటిది మాత్రమే.

సుమారు నాలుగు గంటల సమయంలో వాళ్ళు గ్రామంలోని వీధులని చూడ్డానికి బయలుదేరారు. ఈ పొడవాటి కారు నలుపు వ్యక్తి, ఎలుమలై ఇంకా ఓ అపరిచిత వ్యక్తితో రోడ్డుపై నడిచి ఆ గ్రామంలో సంచలనం సృష్టించాడు. ఎవరో వచ్చారన్న వార్త గ్రామంలో వ్యాపించడంతో ఆ వచ్చిన వింత జీవి ఎవరా అని ఇళ్ళలోంచి పెద్దా, చిన్నా బయటికి వచ్చి చోద్యం చూడసాగారు.

"పొడవైన దేవుడు వచ్చాడు, తమిళ సినిమాల్లో భీముడిలా వున్నాడు!" అంటూ పిల్లలు గట్టిగా అరిచారు. మరికొందరు సణిగారు. ఆ పరయ్యాని చూడండి. మహారాజులా ఠీవిగా నడుస్తున్నాడు. ఈ ప్రాంతాన్ని తనే పరిపాలిస్తున్నట్టుగా విజయగర్వంతో బోర విరుచుకున్నాడు. అధికార దర్పం తలకెక్కింది." "ఇది నమ్మశక్యంగా లేదు... నమ్మశక్యంగా లేదు! ఈ దేశంలో ఏం జరుగుతోంది?" అంటూ బిగ్గరగా అరిచారు మరికొందరు.

అమెరికన్ గెస్ట్‌తో నడుస్తున్నప్పుడు అంటరానివాడైన తను ఇష్టమొచ్చిన విధంగా గ్రామంలో తిరుగుతున్నాడంటూ మాట్లాడే గ్రామస్తులని చూడ్డం గాని, పట్టించుకోవడం గాని చేయలేదు ఎలుమలై. తనని ఇంతమంది వ్యక్తులు జూలో జంతువుని చూసినట్లు గుచ్చి గుచ్చి చూస్తున్నారు ఎందుకని? అంటూ ఆందోళన చెందాడు ఐసయ్య. వాళ్ళు నడుస్తున్నప్పుడు వాళ్ళు మాట్లాడే మాటల్ని ఒకరికొకరికి అర్థమయ్యేలా అనువదించటానికి హడావిడి పడ్తున్నాడు జాకబ్ పరయ్యా. తను కూడా ఉళ్ళోవారిని చూసే ఉత్సాహంతో వుండటంతో వాళ్ళు మాట్లాడుకునే మాటల్ని అనువదించడానికి ఇబ్బంది పడ్డాడు జాకబ్. వాళ్ళు శూద్రులు వుండే ప్రాంతంలో నడుస్తున్నారు. ఓ ఇంటి ముందు కుమ్మరివాడు మట్టితో పచ్చి కుండలను చేస్తుండగా కుమ్మరి సారెలో మట్టిని తిప్పడం ఐసయ్యని

అమితంగా ఆకర్షించింది. ఆ కుమ్మరివాడు కుండలను చేసే నైపుణ్యం చూస్తూ నిలబడిపోయారు వాళ్ళు. ఆ వ్యక్తి ఓ దుడ్డుకర్రతో చక్రాన్ని విసురుగా తిప్పుతున్నాడు. అతను బంకమట్టి మిశ్రమాన్ని చక్రం పైన వుంచి తన రెండు చేతులతో మలుస్తూ రకరకాల ఆకృతుల్లో కుండల్ని తయారు చేస్తున్నాడు. ఇక్కడ దేవుడు కల్పించిన గొప్ప శ్రేణికి చెందిన శాస్త్రవేత్తలు వున్నారని భావించాడు ఐసయ్య. ప్రపంచంలో తెలియని ఈ మారుమూల ప్రాంతంలో ప్రాచీన వారసత్వపు జాతిలో ఓ శాస్త్రవేత్త సాంప్రదాయక రీతిలో జీవిస్తున్నాడు. ఒక అమెరికన్ నల్ల జాతీయుడైన తను ఒక్కడే అతన్ని చూసిన బయటి వ్యక్తి. బహుశా ఇటువంటిది చరిత్ర ఆరంభం కావచ్చు. జాకబ్ కుమ్మరిని గురించిన చరిత్ర కొంత వివరించాడు. చరిత్రలో లిఖించబడనిది, అదీ ఇండియా ఇంకా తమిళ దేశంలో.

వాళ్ళు శూద్రుల ఇళ్ళు దాటి పొరుగున వున్న బ్రాహ్మణుల ఇళ్ళకి కాస్త దూరంలో వున్న శివాలయం వైపు సాగారు. బ్రాహ్మణుల ఇళ్ళు చూపిస్తూ ఎలుమలై అన్నాడు "పరయా కుటుంబాలలో తప్ప మిగతా అన్ని ఇళ్ళల్లోనూ ఆచార వ్యవహారాల దగ్గర, కర్మకాండ, పెళ్ళిళ్ళ దగ్గర ఈ పురోహితులు ఉండి తీరవలసిందే... కానీ వాళ్ళకి, వాళ్ళ దేవుళ్ళకి మేము అంటరానివాళ్ళం కావడంతో వాళ్ళు మా ఇళ్ళకి రారు." ఐసయ్య బ్రాహ్మణుల ఇళ్ళని జాగ్రత్తగా గమనించాడు. అక్కడ వున్న కొందరు మిగతా వాళ్ళ కన్నా చాలా బాగున్నట్టు కన్పించారు, పోలికలో కూడా సంపన్నులుగా. వృద్ధ మహిళలు కొందరు ఇంటి వరండాల్లో తిరుగుతున్నారు, కొందరు పై వస్త్రం లేకుండా, మరికొందరు నున్నగా వున్న బోడితలలతో. పురుషులు తలవెనక పిలక మాత్రమే వుంచి గుండుతో వున్నారు. ఇప్పటి వరకు తను చూసినవాళ్ళందరిలోకీ వీళ్ళు పూర్తి భిన్నంగా కన్పిస్తున్నారు ఐసయ్యకి. వాళ్ళలో చాలామంది ఐసయ్య వంక కళ్ళు వెడల్పు చేసుకుని విస్మయంతో చూస్తున్నారు. ఈ పొడవైన నల్ల మనిషి ఎవరు? వాళ్ళకి పురాణాలలోని నలుపు, నీలం ఆకృతి గల శౌర్యవంతుల గురించి బాగా తెలుసు. ఐసయ్య మహాభారతంలోని భీముడిలా కనిపిస్తున్నాడు. వాళ్ళకి కృష్ణుడు, శంకరుడు నలుపు – నీలం దేవుళ్ళు. కానీ ఐసయ్యలాంటి నల్ల వ్యక్తిని వాళ్ళు ఎప్పుడూ చూడలేదు. తెల్ల పురుషులు, తెల్ల మహిళల గురించి వాళ్ళు విన్నారు. కానీ నల్ల వ్యక్తుల గురించి తెలియదు వాళ్ళకి. తమిళ పౌరాణిక సినిమాలలో చూపించిన విధంగా పురాణాల్లో వర్ణించే హీరో భీముడు కూడా నల్లగా పొడుగ్గా వుంటాడు. కానీ అతను ఎప్పుడూ సిల్క్ ధోతీ మాత్రమే ధరిస్తాడు, షర్టు లేకుండా. అతనికి వదులుగా పొడవైన ఆడదానికున్నట్టుగా జుట్టుతో తలపైన కిరీటం

వుంటుంది. కానీ ఈ నల్లమనిషి కురచగా కత్తిరించిన జుట్టు, ఇంకా జీన్స్ ధరించాడు. నడుం దగ్గర షర్ట్ టక్ చేశాడు, విచిత్రమైన నీలి రంగు, తెలుపురంగు కలిసి వున్న బూట్లు ధరించాడు. వెళ్ళిన చోటల్లా అతను సరిగ్గా కనిపించడానికి జనాలు ముందున్నవారి భుజాల మీద వాలిపోయి చూస్తున్నారు.

ఆ ముగ్గురూ గ్రామంలోని హిందూ దేవాలయం వైపు సాగుతున్నారు. ఆ గ్రామంలో అవతరించిన ఆ దేవుడికి వాళ్ళలో రెండు ముఖాలు అపరిచితం. వాళ్ళు అంటరానివాళ్ళు అవునో కాదో ఆ దేవుడికి తెలియదు. కానీ ఆ దేవుడికి వాళ్ళలో ఒకడి గురించి మాత్రం తెలుసు. అతని గురించి విన్నాడు కూడా. అతని వాసన పసిగట్టాడు అతను. అతను బీఫ్ తిన్నాడని కూడా అతనికి తెలుసు. ఆ దేవుడు ఇండియాకి తమిళ దేశానికి వచ్చినపుడు బీఫేరియన్ పుట్టుకతో గాని, రూపురేఖలతో గాని. కానీ ఇప్పుడు అతను వెజిటేరియన్. మధ్యయుగంలోని నంబూద్రి శంకర్ అతను అలా వుండాలనుకున్నాడు. పురోహితులు కూడా అతను అలాగే వుండాలని కోరుకున్నారు. ఇంకా మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్ అహింసా విధానాల్ని ఆచరించడానికి తన మార్గదర్శకుడిగా భావించిన గాంధీ కూడా అతను ఎల్లప్పటికీ ప్యూర్ వెజిటేరియన్‌గానే వుండాలని కోరుకున్నాడు. శివపురంలోని ఆ దేవుణ్ణి చూడాలనే కోరిక కలిగింది ఐసయ్యకి. అందుకని ఐసయ్య అటువైపు సాగాడు. ఓ ఛండాలుడు, ఎలుమలై పేరు గల ఓ ఆధునిక పరయ్యాతోను, ఇంకా అంటరాని దేవుడైన జీసస్ మీదున్న నమ్మకంతో ఓ మతాంతరుడికి పుట్టిన జాకబ్ పరయ్యాతో. అసాధారణమైనది ఏదో జరుగుతోంది ఆర్యుల దేవుళ్ళున్న దేశంలో.

ఆ ముగ్గురూ ఆలయ ప్రాంగణం సమీపంలోకి చేరుకోగానే వాళ్ళ వెనకాల కొంతమంది గుంపులు గుంపులుగా రాసాగారు. పిల్లలు వాళ్ళ చుట్టూ తిరుగుతూ పరుగెడుతున్నారు. కొంచెం దూరంలో గుడి సింహద్వారం కనిపిస్తోంది. అక్కడ మందిర ప్రాంగణంలో చాలామంది పురుషులు అర్ధనగ్న దేహాలతో, నున్నని తలపై పిలకతో గేటు కిరువైపులా వున్న అరుగుల పైన కూర్చుని వున్నారు. ఈ ముగ్గురూ గుడివైపు వస్తూ కనిపించడంతో వాళ్ళు భయం భయంగాను, దిగ్భ్రాంతితోను చూశారు. వాళ్ళ కడుపులో దేవినట్లయింది. ఏవగింపు కలిగి గుండెలు అదిరాయి. ఓ అంటరానివాడు ఓ నల్ల రాక్షసుడితో కలిసి తమ దేవుడివైపు వస్తున్నారు!

వాళ్ళు దగ్గరవుతున్న కొద్దీ జీవంతో వున్న శరీరంలోకి ఆ ముగ్గురూ విషంలా వ్యాపిస్తున్నట్లనిపించి గేటు పిల్లర్ల దగ్గర నించి దుర్మార్గుల గుంపు కర్రలతో ఆ ముగ్గురి

వైపు పరుగులాంటి నడకతో వచ్చి క్రూరంగా దాడి చేశారు. ఐసయ్యపైన, అతనికి దారి చూపుతున్న వాళ్ళపైన దెబ్బలు కురిపించారు. రక్షించమంటూ, దయ చూపమంటూ వాళ్ళు ప్రాధేయపడినా వాళ్ళని తీవ్రంగా గాయపరచి పరారయ్యారు వాళ్ళు. అక్కడ వున్నవాళ్ళు వాళ్ళకి మంచినీళ్ళు ఇవ్వడంగాని, ప్రథమ చికిత్స అందించడం గాని చేయకుండా మాయమయ్యారు. ఐసయ్య చుట్టూ చూశాడు. ఎలుమలై అపస్మారక స్థితిలో పడి వున్నట్టు కనిపించాడు. జాకబ్ అతని పక్కన కూర్చుని ముక్కు దగ్గర వేలుంచి చూశాడు. ఐసయ్య ఆ వృద్ధుడి పక్కన మోకాళ్ళపైన కూర్చుని మెడపైన నరాలని గమనించాడు. అతను బతికే వున్నాడు కానీ చేతులు రక్తసిక్తంగా వున్నాయి. వీధి అంతా నిర్మానుష్యంగా మారింది. ఎలుమలైని రక్షిత ప్రాంతానికి తీసుకువెళ్ళడానికి అక్కడ ఎవరూ లేరు. జాకబ్ దళిత కాలనీలో రోడ్డు పక్కగా పార్క్ చేసిన కారు దగ్గరకు పరుగెట్టాడు. కారు తీసుకురాగానే వాళ్ళిద్దరూ ఎలుమలైని పైకి లేపి కారు వెనుక సీట్లో కూర్చోబెట్టారు. ఎలుమలై ఇంటికి చేరుకోగానే అందరూ ఏడుస్తూ ఎదురొచ్చారు. ఇరుకు ద్వారం నుంచి ఆ వృద్ధుడిని అతి కష్టం మీద లోపలికి తీసుకువచ్చి ఐసయ్య ఉపయోగించిన మంచంపైన పడుకోబెట్టారు. తమ నాయకుడిపైన దాడి జరిగిందని తెలుసుకున్న జనాలు ద్వారం దగ్గర గుమికూడటంతో అక్కడంతా గాలీ వెలుతురూ లేకుండా చీకటిగా వుంది.

"ధైర్యంగా వుండు పెద్దాయనా" అన్నాడు ఐసయ్య బాధగా ఎలుమలై తన భాషని అర్థం చేసుకోలేడన్న ఆలోచనతో. కాని భాష అర్థం కాకపోయినా భావం అర్థమై ఎలుమలై బలహీనంగా నవ్వాడు. జాకబ్ కొంచెం పసుపు తీసుకువచ్చి గాయాలపైన అద్దాడు. "మనం పోలీసులకి కబురు చేస్తే మంచిది కదా? ఇక్కడ ఎవరికో ఒకరికి టెలిఫోను సౌకర్యం వుండే వుంటుంది" అన్నాడు ఐసయ్య. జాకబ్ తన పెదవుల కిందుగా జారిన రక్తపు మరకల్ని తుడుచుకుంటూ నిరుత్సాహపూరితమైన నవ్వుతో "పోలీసులు అంటరానివాళ్ళు కాదు. అలాగే టెలిఫోన్ కూడా. పోలీసులు ఇక్కడికి వస్తే రెచ్చగొట్టినట్లయి మనమీద ప్రతీకార చర్యలకు దిగుతారు వాళ్ళు" అన్నాడు.

"అదేంటి? వాళ్ళు కేసు నమోదు చేయాలి కదా. ఓ వ్యక్తి తీవ్రంగా గాయాలపాలయ్యాడు. దీనిని ఎవరూ ఖండించలేదు. అతను చచ్చిపోతాడు. ఈ వాస్తవాన్ని పోలీసులు గుర్తించాలన్న విషయం చట్టంలో వుండదా?

"తెలివైన ప్రశ్న. తప్పనిసరిగా ఎవరో ఒకరు ఏదో ఒకరోజు దాన్ని పరీక్షకు గురిచేస్తారు. దయచేసి అర్థం చేసుకో. పోలీసు, స్థానిక పరిపాలన, మేజిస్ట్రేట్ అంతా

స్నేహితులు. ఇంకా ఈ రోజు మీరు చూసిన ఈ అర్ధగౌరుగుడు కోతులు వాళ్ళ బంధువులు. ఈ రోజు జరిగిన ఈ సంఘటన తర్వాత వాళ్ళు వాళ్ళ ఇళ్ళకి స్వీట్స్ తీసుకువెళ్ళి నీచులయిన పరయాలని ఆలయం వద్ద నుంచి వెళ్ళగొట్టినందుకు వేడుక చేసుకుంటారు.

"కావచ్చు" అంటూ ఐసయ్య "కానీ నేను పరయాని కాను. నేను వాళ్ళ దగ్గరికి వెళ్ళగలను, మాట్లాడగలను, నిరోధించగలను. ఇంకా చెప్పాలంటే వాళ్ళని...

"లేదు, ఐసయ్యా... నువ్వు నవ్వులపాలవుతావు లేదా బహుశా వాళ్ళు మళ్ళీ నీపైన దాడి చేయవచ్చు. నువ్వు మాతో వుండటం చూశారు వాళ్ళు. నువ్వు మమ్మల్ని తాకావు. అది నిన్ను అంటరానివాడిగా మార్చింది. అదీగాక నువ్వు నల్ల జాతీయుడివి, హబ్షీవి నార్త్‌లో సంభోదించినట్టుగా. నగరంలో నువ్వు అమెరికన్ పాస్‌పోర్టు హోల్డరువి, దానికున్న విలువతో.. కానీ ఇక్కడ నీ మాటలకి విలువ ఉండదు."

"ఏంటీ?" అన్నాడు ఐసయ్య బిగ్గరగా. జాకబ్ ఐసయ్య భుజాల పైన చేతులు వేసి "నువ్వు మాతో కలిసి వుండటం ఎవరైనా చూస్తే నీకు క్షేమం కాదు అని నీకు ముందే చెప్పాల్సింది. నేను చెబుదామనే అనుకున్నాను. కానీ నా మాటలు విని నువ్వు నవ్వుకుంటావని, బహుశా మన అదృష్టం బాగుంటే దాటిపోవచ్చని అనుకున్నాను. అదీగాక, నేను ముందే నిన్ను హెచ్చరించి వుంటే గనుక నువ్వు నన్ను చూసి నవ్వేవాడివని నాకు తెలుసు. అందుకని నీకే అర్ధమవుతుందని వదిలేశాను."

'ఉఫ్...' అంటూ బాధపడ్డాడు ఐసయ్య చేతులు పైకెత్తి తడుముకుంటూ. వెంటనే వాళ్ళిద్దరూ గాయపడ్డ వ్యక్తిపైన దృష్టిని కేంద్రీకరించారు. ఐసయ్య అతడి శరీరం అంతా తడిమి చూశాడు. "ఎముకలేం విరగలేదు. చెప్పాలంటే బాధగా వుంది. అతని పక్కటెముకలు పెన్సిల్‌లా సన్నగా వున్నాయి" అన్నాడు. ఎలుమలై ఐసయ్య భుజాలు పట్టుకుని 'ఎవరికీ చెప్పకు' అంటూ గొణిగాడు. "పోలీసుల దగ్గరకి కూడా వెళ్ళకు... మా జనాలు... బాధపడ్తారు" అన్నాడు నెమ్మదైన స్వరంతో.

"భయపడకు" అంటూ ఐసయ్య "నువ్వు చెప్తేనే కాని మేము ఏదీ చెయ్యం. కానీ నిన్ను ఆసుపత్రికి తీసుకువెళ్తాము..."

ఎలుమలై కళ్ళు పెద్దవి చేసి చూశాడు. అతను తమిళంలో ధారాళంగా మాట్లాడాడు. జాకబ్ అనువదించడం మొదలుపెట్టాడు. "ఆసుపత్రులు పెద్ద మనుషుల కోసం. రాష్ట్రంలోని ఆసుపత్రులని అగ్రకులాల వాళ్ళు నిర్వహిస్తారు. ప్రైవేట్ ఆసుపత్రులలో

వైద్యం చాలా ఖర్చుతో కూడినది. డబ్బు బాగా గుంజుతారు...” ఐసయ్య అతని చేతిని అందుకుని “సరే అయితే... నాకంతా అర్ధమయింది... ఇతని కోసం మనం ఏ సహాయమూ చేయలేమా?” అన్నాడు జాకబ్‌తో.

జాకబ్ నెమ్మదైన స్వరంతో అన్నాడు. “ఎలుమలైకి సహాయం చేయగలమనే నీ ఆలోచన నీ వాళ్ళు బానిసత్వం నుండి ఎలా బయటపడ్డారో తెలుసుకోవడానికి కొలమానం కాగలదు. నువ్వు మనిషివి. మేము ఇంకా మృగాలమే. పశువులం, ఏమాత్రం విలువలేని పశువులం.”

“అవును” అంటూ ఐసయ్య “మీరు చెప్పింది నాకు అర్ధమైంది. సరే, అలాగయితే డాలర్‌కి ఈ దేశంలో ఎంతో కొంత విలువ వుంది. అతన్ని కారులో ఎక్కించండి. నగరంలో అతని వైద్యానికయ్యే ఖర్చు నేను భరిస్తాను. ఎలుమలై వృద్ధుడు.

ఈ సమాజానికి నాయకత్వం వహించడానికి నువ్వు అవసరం. రా, జాకబ్.. అలా చూడకు, మనం ఆలస్యం చేయకూడదు” అన్నాడు.

“వద్దు. తీవ్రమైన గాయాలేమీ కాలేదు. కొంచెం నీరసంగా వుంది. గుండె బరువుగా వున్నట్లనిపిస్తోంది. దయగల ఐసయ్యా ఇలా చేయకు. ఎందుకంటే నువ్వు వెళ్ళిపోయిన తర్వాత మేము మూల్యం చెల్లించుకోవాల్సి వస్తుంది. అందుకు బదులుగా నీ మాటలతో నన్ను సంతోషపెట్టు. నా గురించి విచారించవద్దని ఇక్కడున్న వాళ్ళందరికీ చెప్పు. ఓ నిజమైన స్నేహితుడిలా వుండు” అన్నాడు ఎలుమలై. జాకబ్ ఐసయ్య భుజాలపైన చేతులుంచి ఆ వృద్ధుడు చెప్పినట్లుగా చెయ్యి” అంటూ కళ్ళతోనే సూచించాడు.

వెంటనే ఐసయ్య ఒకరి చేతుల్ని మరొకరు పట్టుకుని నిల్చోమన్నాడు మంచం చుట్టూ వున్న జనాలని ఉద్దేశించి. ఐసయ్య ఎలుమలై కోసం ప్రార్ధన చేస్తాడని జాకబ్ పరయ్యాకి అర్ధమైంది. అంతా ఎలుమలై మంచం చుట్టూ వృత్తాకారంలో నిల్చున్నారు. శివపురంలోని దళితులు దాన్ని ప్రార్ధన అంటారని, ప్రార్ధన ఆ విధంగా చేయాలని ఎన్నడూ అనుకోలేదు. ఐసయ్య కళ్ళు మూసుకుని అన్నాడు.

“ఓ ప్రభువా ఈ అమాయకుడికి ఎటువంటి హాని కలగకుండా రక్షింపుము. గాయాలైన అతని శరీరం, మనసును స్వస్థత పరచుము. అతనికి బలమును, ధైర్యమును ప్రసాదింపుము. నీయొక్క తరగని దయలో కొంత ఈ ప్రజలకి బలం, ప్రేమతో పాటు పంచుము. వాళ్ళు దుఃఖంతో అలసి వున్నారు, కానీ వాళ్ళు నీ బిడ్డలు. వీళ్ళు

అస్పృశ్యులైతే నువ్వు కూడా అస్పృశ్యుడివే. పగ, ద్వేషం. దురభిమానంలాంటి అరిష్టాల నుంచి ఈ గ్రామాన్ని కాపాడుము. బ్రాహ్మణులు, అగ్రకులాల వారిని వారి వారి అనాగరికతల నుంచి కాపాడి వారు ప్రేమ మార్గాలని గుర్తించేలా చేయుము..."

జాకబ్ అతని ప్రార్ధనని తమిళంలోకి అనువదించాడు.

ఐసయ్య తన బైబిల్ తీసుకుని ప్రవక్త జాన్ రాసింది చదివాడు.

"సమాజంలో అంటరానివారిగా భావించే ఒక సమరయ స్త్రీ నీటిని తీసుకోవడానికి వచ్చినపుడు జీసస్ నువ్వు నాకు పానీయం ఇస్తావా" అని పలికాడు.

సమరయ స్త్రీ అతనితో "నువ్వు ఒక యూదుడివి. నేను ఓ సమరయ స్త్రీని. నన్ను పానీయం కోసం ఎలా అడగ్గలవు?

జీసస్ సమాధానంగా ఆమెతో అన్నాడు, "నీకు ప్రభువు బహుమతి తెలిస్తే ఎవరు నిన్ను పానీయం అడుగుతున్నారో నువ్వు అతన్ని అడిగేదానివి, అతను నీకు జీవజలం నీటిని ఇచ్చి ఉండేవాడు."

తన కాలంలోని జీసస్, అంటరాని స్త్రీ మధ్య జరిగిన ఈ సంభాషణ జాకబ్ పరయ్యా అనువదించాడు. ఎలుమలై కన్నీటి పర్యంతమవుతూ "మేము ఎంతకాలంగా అలాంటి జీవం వున్న నీళ్ళ కోసం ఎదురుచూశాము. ఏ కులం లేని బావి నించి కాదు, భూమ్మీద వున్న రొమ్ము నించి మేము ఆ నీటిని తాగితే మాలోని శృంఖలాలు ఆకులపై నించి వర్షపు చినుకులు రాలినట్లు రాలిపోయేవి. ఐసయ్య తన చేతులతో స్వయంగా గ్లాసుతో నీళ్ళు అందించాడు. ఎలుమలై ఆ నీళ్ళు తాగి చుట్టూ వున్న జనాలతో అన్నాడు. "మన అతిథుల విందు కోసం స్త్రీలు వంట చేస్తారు. మగవాళ్ళు డప్పులు వాయించండి. అంటరాని దేవుడు మన అంటరానివాడకి వచ్చాడు. మనం ఉత్సవం చేసుకుందాం."

చాలామంది శ్రమ చేయడంతో అలసిపోయి బాగా ఆకలితో వున్నారు. ఎలుమలై అన్న మాటలు వినగానే వాళ్ళలోని అలసట తొలగిపోయి కళ్ళలో వెలుగులు నిండాయి. అందరూ ఇళ్ళకి వెళ్ళిపోయారు. వాళ్ళు కుండలలో దాచే చిన్న చిన్న మద్యం సీసాల కోసం వెతికారు. వాటిల్లో అడుగు బొడుగున వున్నది తాగేశారు. అంతేకాదు, ఈ సమయంలో ఉత్తేజపరిచే వైన్‌గా అనిపించడంతో కొంచెం నీళ్ళు కూడా తాగారు.

వండటానికి ఏమైనా వున్నాయేమోనని స్త్రీలు వంటపాత్రలు, బుట్టలను కిందకీ పైకీ ఆడించారు. ఆ తర్వాత మగవాళ్ళు డప్పులు అందుకుని పరుగెత్తి తిరిగి వచ్చారు. ఎలుమలై ఇంటి ముందు రోడ్డు మీద లెక్కకు మిక్కిలిగా డప్పులు చేరాయి. తీర్చిదిద్దిన కనుబొమ్మలతో నడుము గుడ్డ బిగించారు. ఆ తర్వాత వాళ్ళు డప్పులు తీసుకుని మంద్రమైన లయతో దరువేస్తూ ఎడమ చేతిలో కర్ర, కుడిచేతిలో గుండ్రని పెద్ద కర్రతో డప్పు వాయించడం మొదలు పెట్టారు. వాళ్ళలో ఒకడు పాడాడు :

*దేవుడు వచ్చాడు మన ఇంటికి*

*మనతో ఉండేందుకు అంటరాని దేవుడు*

*సస్పృశ్య దేవుడంటే భయం లేదిప్పుడు మనకి*

*అతని గర్జనా లేదు ఆగ్రహమూ లేదు*

*ద్వేషం, తన పిల్లల పట్ల పగ లేదు*

*ఎందుకంటే నల్ల దేవుడి చేయి మనలని రక్షిస్తుంది*

*అంటరాని దేవుడు మనలని స్పృశిస్తాడు.*

ధుం, ధుం, ధుం, ధుం అంటూ దరువు పెరుగుతూ వుంది. క్రమక్రమంగా వేగం పుంజుకుంటూ వుంది. అడుగు, దరువు, లయ తప్పకుండా జనాలు చిందేస్తున్నారు. ఓ కుర్రాడు కీచుమంటూ గాలిలో పల్టీలు కొడుతూ డాన్స్ చేస్తున్నాడు. మిగతా వాళ్ళు కూడా అతనితో పాటు డ్యాన్స్ చేస్తున్నారు. మట్టి రోడ్డు కావటంతో వాళ్ళ పాదాల తాకిడికి నేల మీద వున్న ధూళి బాగా లేచి అక్కడంతా మబ్బులా వ్యాపించింది. ఐసయ్యకి రక్తం ఉరకలేస్తున్నట్లుగా అన్పించింది. అక్కడ సంతోషంతో జనం చప్పట్లు, ఈలలు, కేకలు మిన్నంటాయి. డప్పుల దరువులో వేగం పెంచుతూ అక్కడున్న వారంతా ఐసయ్యని చుట్టుముట్టి చప్పట్లు కొడుతూ డాన్స్ చేస్తున్నారు. వాళ్ళ భుజాల పైన ఎగురుతూ పడ్తూ వుండే జుట్టులో, నేల మీద ఆనించే పాదాల మీద చెమట బిందువులు చిందుతున్నాయి. ఐసయ్య తలపైకి ఎత్తి ఆకాశంలోకి చూస్తూ పెద్దగా అరిచాడు.

"సువార్త రైలు వస్తోంది,

దగ్గరగా వినిపిస్తోంది,

కారు తిరుగుతున్న శబ్దం వినిపిస్తోంది

భూమిపైన ఉరుముతోంది.

ఎక్కండి బాలల్లారా,

ఎక్కండి బాలల్లారా

ఎందుకంటే మరింత మందికి చోటుంది."

మరునాడు హోటల్ గదిలో గాజు కిటికీ గుండా ఉదయించే లేలేత సూర్య కిరణాలు పాదాలని తాకడంతో ఐసయ్య నిద్ర లేచాడు. రాత్రంతా అవిశ్రాంతంగా గడిపాడతను. శివపురంలోని రూపాలు, ఆలోచనలు కలలో అతన్ని వెంటాడాయి. ఇంకా ఇతరమైన చీకటి స్మృతులు అతని కళ్ళ ముందు తిరుగాడాయి. జార్జియాలో తన బాల్యం, బానిసత్వంలో తన పూర్వీకులు పడ్డ బాధలు, ఎదుర్కొన్న ఇబ్బందులు, యూనివర్శిటీలో థీసిస్ సమర్పించడానికి రిసెర్చ్ సమయంలో తను కొన్ని నెలల పాటు వంశవృక్షం జాడల కోసం ప్రయత్నించడం లాంటివి ఎన్నో. అందుకు కొంత ఆధారం వుంది. తన తల్లిదండ్రులు, తన అత్త మార్తా గతాన్ని గురించి కొంత జ్ఞాపకముంది అతనికి. 1867 సంవత్సరంలో తన తండ్రి వయసు ఐదు సంవత్సరాలు. తల్లి ఇంకా జన్మించలేదు. తన అత్త మార్తా పెళ్ళి చేసుకోలేదు. కౌమార దశలో ఆమె తన అమ్మమ్మ అయిన జూడీకి సేవలు చేసింది. ఆమె మాతామహి 90 సంవత్సరాలు జీవించింది. పదునైన మొన గల మేకులా చలాకీగా వుండేదామె. పత్తి చేలల్లో గడిపిన చెడు రోజులు ఇంకా మనుషుల్ని వేలం వేసే దుర్దినాలు ఆమెకి గుర్తున్నాయి. ఆమె తన కుటుంబం గురించి మార్తాకి ఎన్నో విషయాలు కథలు కథలుగా చెప్పింది. తన నానమ్మ, జూడీ భర్త అయిన జాన్-జోని మొదట్లో కార్టర్ అనే వ్యక్తి కొనుక్కున్నాడు. జాన్-జో ఆయిల్ ప్రెస్‌లో చేయి నలగ్గొట్టుకున్నపుడు కార్టర్ అతడ్ని పొరుగున వున్న జాక్ ఫార్నెస్ బీకి సగం ధరకి అమ్మేశాడు. ఫార్నెస్‌బీ ఇతరులందరికన్నా దయగలవాడని, బానిసల దగ్గర మంచి పేరుంది. బానిసలని చర్చికి వెళ్ళడానికి అనుమతించేవాడతను. బానిసల్ని ఎన్నడూ కొరడాతో కొట్టేవాడు కాదు, తాగినపుడు తప్ప. అతను సంపన్నుడు కాదు. నలభై ఐదు

సంవత్సరాల వయసులో అంతర్యుద్ధానికి ముందర అతను మరణించాడు. అతని గుర్తుగా జాన్–జో తన చివరి పేరుని జాక్సన్‌గా మార్చుకున్నాడు.

జాన్–జో లేక జూడీ పూర్వీకులు ఎక్కడివారు? ఈ విషయం గురించి తనకు కొన్ని సంకేతాలు అందాయి. బట్ట నమూనా చూపించి జూడీ తల్లి దానిని అల్లడం ఎలాగో నేర్పించింది. అది ఓ సంగీత వాయిద్య పరికరం. వంగిపోయిన స్ప్రూన్లతో ఇంకా చెక్కబోర్డుతో తయారు చేసిందది. దానిని ఆమె 'లుక్మె' అని అంటుంది. పేరు కూడా పెట్టింది. 'నబిర్యే'. అది జూడీ తల్లి పేరు, ఓ పెద్ద ఓడలోకి ప్రవేశించక ముందు. ఐసయ్య ఆ పేరుని ఉగాండన్‌గా గుర్తించే ప్రయత్నంలోను, ఆ వాయిద్య పరికరం 'అకోలి' తెగకి చెందినదనే విషయంలోను విజయం సాధించాడు. అంతకుమించి తన మాతామహి ప్రపంచం గురించి ఐసయ్యకేమీ తెలియదు. (కానీ అతను బానిసల ఓడల గురించి విస్తృతంగా చదివాడు. 'నబిర్యే' వాళ్ళ లాంటి భయంకరమైన వ్యథాభరిత గాథలుకూడా చదివాడు. అతను బానిస నౌకలను గురించి చాలా విషయాలు చదివాడు. ఇంకా నబిర్యేలాంటి వ్యక్తులు అట్లాంటిక్ సముద్ర మార్గంలో అమెరికాకి ఈడ్చుకెళ్ళినప్పటి భయంకరమైన సంఘటనల్ని కూడా చదివాడు. ఆ ఓడలో జనాలని ఇనుప గొలుసులతో బంధించి పడుకోబెట్టారు రవాణా సరుకు కుప్పలా. వాళ్ళు పడుకున్న చోటే మూత్ర విసర్జనలు, వాటిని తుడవటాలు. మానవమాత్రులెవరూ తినలేనివి వాళ్ళకి పెట్టేవాళ్ళు. తినకపోతే బలవంతంగా పెట్టేవాళ్ళు. ఆ తర్వాత గస్తీ ఓడలు రాకపోతే బతికి వున్న బానిసల్ని అర్ధరాత్రి సముద్రపు ఒడ్డున విసిరిపారేసేవాళ్ళు,.. సముద్ర తీరానికి మైళ్ళ కొద్దీ దూరాన వున్న బానిసల మార్కెట్‌కి కాళ్ళకి ఇనుప గొలుసులతో ఆకలితో అలమటించి నడిచేలా చేసేవాళ్ళు. బానిసల వ్యాపారం 'చట్టవిరుద్ధం' కావడంతో వర్తకులు దొంగ రవాణాదారులుగా మారారు. 'నబిర్యే'ని 'అభిజా'గా పేరు మార్చి పొలాల్లో పని చేయించడానికి ఓ శ్వేతజాతి పొగాకు రైతుకి అమ్మేశారు జాన్–జో నించి ఎన్నో మైళ్ళు దూరంగా. కాని ఆ ఇంటి ఇల్లాలు ఎంతో మంచిది. ఆ అమ్మాయి అమాయకంగా, ఒళ్ళు దాచుకోకుండా చలాకీగా వుండటాన్ని గమనించి తనకి ఓ పనిమనిషి అవసరముండటంతో అభిజాని ఇంట్లో పెట్టుకుని బానిస పిల్లగా వుంచుకుంది కొద్ది కొద్దిగా ఇంగ్లీష్ నేర్పిస్తూ ఇంటి పనుల్లో మెలకువలు నేర్పిస్తూ... అది మొదలు నరకం, దండన రెండింటి నుంచి విముక్తి, స్వాతంత్ర్యం లభించడానికి. ఎందుకంటే ఆ ఇంటావిడ అభిజాకి బైబిల్ చదవడం కూడా నేర్పించింది. ఆమె జైలు జీవితంలో ఇదొక్కటే కిటికీలాంటిది. భాష కృతకమైనప్పటికీ రాసిన పదాన్ని అభిజా సునాయాసంగా అర్థం చేసుకునేది. కొన్ని మాటలు మాట్లాడటం చేస్తూ నెమ్మదిగా భాషను ఇంప్రూవ్ చేసుకుంది.

కానీ అభిజా తన యజమానురాలి గదిలో చిన్న డెస్క్ దగ్గర కూర్చుని పవిత్ర గీతాలు చదవడం నేర్చుకుంటుండగా కౌమార దశలో వున్న ఆమె యజమానురాలి కొడుకు కామపూరిత దృష్టితో ఆమె రూప లావణ్యాలని ఆబగా, ఆకలిగా చూస్తున్నాడన్న విషయం అభిజా గమనించలేదు. తెలిసిన తర్వాత అతన్నించి సాధ్యమైనంత వరకు తప్పించుకునే ప్రయత్నం చేసింది. కానీ ఒకరోజు ఆమె యజమానురాలు బాల్ డాన్స్‌కి వెళ్ళడంతో కొడుక్కి మార్గం సుగమమైంది. ఇలా చాలాసార్లు జరిగింది. అభిజాకి మొదటి బిడ్డ స్వీట్‌నెస్ జన్మించేంతవరకు. ఈ అపకీర్తి ఆమెని మరింతగా దిగజార్చి వంటింటి బానిసగా మార్చివేసింది. ఈ విషయం తనని నిరుత్సాహపరచిందని తెల్ల యజమానురాలు విచారవదనంతో ఆమెకి వివరించింది. ఈ నిందాపూరిత విషయాలు వంటింట్లో కూడా కొనసాగాయి. కాని అభిజా తన బైబిల్‌ని విడిచిపెట్టలేదు. తనకి రెండో బిడ్డ జూడీ జన్మించినా  కూడా.

స్వీట్‌నెస్, జూడీలు తల్లి నుంచి రహస్యంగా అక్షరాలు నేర్చుకున్నారు. ప్రతీ రాత్రి కిచెన్‌లో నివురుకప్పిన నిప్పు బూడిదలో కలిసి వున్న అగ్ని వెలుతురులో వాళ్ళు నల్ల మసితో తెల్లటి పింగాణీ ప్లేటు పైన రాసింది అస్తమానూ చెరిపివేస్తూ రాసేవాళ్ళు. ఒకసారి ప్లేటు మీద నల్లగా వేలిముద్ర కనిపించడంతో తన వీపు చిట్లి రక్తం కారేంతగా దెబ్బలు తింది జూడీ. ఆ తర్వాత జూడీకి పన్నెండేళ్ళ వయసు రాగానే ప్రమాదం చోటు చేసుకుంది. ఆమె యజమాని ఆమెని 'కార్టర్' పేరుగల వ్యక్తికి తిరిగి బానిసగా అమ్మేశాడు. మంచి తెలివితేటలు, వెంట వెంటనే బదులు పలికే కూతురిని కోల్పోతున్న బాధతో గుండెలు పగిలిన అభిజా బట్టల్లో బైబిల్‌ని వుంచి కుట్టేసింది. తను బైబిల్‌ని పోగొట్టుకున్నానని, కొత్తది కావాలని యజమానురాలిని అడగడం మొదలెట్టింది అభిజా. ఏది ఏమైనప్పటికీ ఇప్పుడు అభిజాకి బైబిల్ కంఠోపాఠమే.

కార్టర్ చేతిలో జూడీ జీవితం కఠినంగా మారింది. జాన్-జో లాంటి వ్యక్తులున్న పొలాలలో కష్టపడి పనిచేయడానికి ఆమె వయస్సుకి ఎలాంటి మినహాయింపు లేకపోయింది. కానీ కార్టర్ ఆమెని నిందించేవాడు కాదు. అతను నల్లవాళ్ళ కండలు తాకడాన్ని గర్వించేవాడు. బాగా పొద్దుపోయిన తర్వాత రాత్రి తన సీక్రెట్ ప్యాకెట్‌లోంచి బైబిల్ బయటికి తీసి వంటింట్లో బూడిదలోని అగ్గి వెలుతురులో చదువుకుంది జూడీ. కానీ ఒకరోజు రాత్రి ఆమె జాన్-జోకి దొరికిపోయింది. ఆ రోజుల్లో జాన్-జో తెల్లవాళ్ళనించి లభించిన వాటిని పాపంగా భావించేవాడు. దాంతో కోపంగా ఆమె నించి ఆ పుస్తకం లాక్కునే ప్రయత్నం చేశాడు జాన్-జో. కానీ జూడీ ఆ పుస్తకాన్ని చేతులతో గట్టిగా పట్టుకుంది తన జీవితం తన చేతుల్లో వుందన్నట్టుగా. జాన్-జో

హింసించే వ్యక్తి కాకపోవడంతో పొగరుబోతు బానిసల్ని ద్వేషించే కార్టర్‌కి చెప్తానని జూడీని భయపెట్టాడు. జూడీ అతని పాదాల మీద పడి తను చెప్పేది వినమంది. జూడీ పెద్ద తెల్ల మహిళలా బైబిల్ చదువుతూ అందులోని విషయాలు చెప్తుంటే విని జాన్–జో కళ్ళు సాసర్ల కన్నా వెడల్పుగా మారాయి!

ఆమెకి వున్న తెలివిని మెచ్చుకుని జాన్–జో రహస్యంగా ఆమెకి నేర్పించసాగాడు. కానీ కార్టర్ తమని ఎక్కడ కనిపెడ్తాడోనన్న భయం వాళ్ళని ఆవరించింది. ఒకరోజు జూడీకి చెందిన అత్యంత విలువైన బైబిల్ దొంగిలించబడింది. రాబోయే కీడును శంకించిన జాన్–జో తన యజమాని కూడా ఆ పుస్తకం ఎక్కడుందో కనిపెట్టలేకపోవడంతో, ఇక ఆ పుస్తకం దొరకదన్న భావం వెంటాడగా ఆ రోజు మధ్యాహ్నం జాన్–జో ఆయిల్ ప్రెస్‌లో ఉద్దేశపూర్వకంగా తన ఎడమ చేయి నలగ్గొట్టుకున్నాడు. కూలి మనిషిగా పనికిరాకపోవడంతో తమని ఫార్నెస్ బీకి అమ్మేయాల్సిందిగా కార్టర్‌ని బ్రతిమాలాడు జాన్–జో. జాన్–జో మెత్తని స్వభావం గల వాడిగాను, చర్చి స్వరూప స్వభావాలు తెలిసి వున్నవాడు కావడంతో బానిసల యజమానులు అతన్ని కొద్దిగా మంచిగా చూస్తారు. జూడీ ఆ సమయంలో అస్వస్థతతోను, బక్కగాను వుండటంతో ఆమె కూడా వెళ్ళిపోయేందుకు ఒప్పుకున్నాడు కార్టర్.

ఫార్నెస్ బీ ఇంట్లో బైబిల్‌ని దాచే అవసరం లేకపోయింది జాన్‌కి. ఫార్నెస్‌బీకి దేవుడంటే భయం, తాగినపుడు తప్ప. తాగినప్పుడు మాత్రం మిగతా తెల్లవాళ్ళ పట్ల అసహ్యంతోను, ద్వేషంతోను కుతకుతమంటూ ఉడికిపోతుంటాడు. అనుకోని రీతిలో అతనిలోంచి విషయాలన్నీ బయటపడ్తుంటాయి. కానీ అతనిది దుష్ట స్వభావం కాదని బానిసలు అర్థం చేసుకున్నారు. ఫార్నెస్ బీ దయగల వాడిగాను, ఉపేక్ష ధోరణితో వుండటంతో జాన్–జో, జూడీలు మిగతా బానిసల సౌలభ్యం కోసం ఓ చిన్న చర్చిని నిర్మించారు రహస్యంగా అక్కడికి వచ్చి ఆరాధించడానికి వీలుగా. వాళ్ళ మొదటి కొడుకు అబ్రహం సివిల్ వార్ సమయంలో పుట్టాడు. రెండో బిడ్డ ఫ్రీడమ్ ఆ వార్ అంతమయ్యేటపుడు పుట్టింది. ఆ తర్వాత ఎనిమిదేళ్ళకి మార్తా జన్మించింది. బానిసత్వం నుంచి విముక్తి లభించిన తర్వాత జూడీ సహాయంతో ఫ్రీడమ్ ఓ చిన్న స్కూలు పెట్టింది. అది పెట్టిన మొదటి నెలలోనే దాన్ని బాంబుతో పేల్చేశారు. ఫ్రీడమ్ ప్రమాదం నుంచి తప్పించుకుంది. ఫ్రీడమ్ ఐసయ్య నానమ్మ, ఆమె కొడుకు జేమ్స్ ఐసయ్య తండ్రి. ఎన్నో సంవత్సరాల క్రితం నాటి శకలాలు, అంచనాల ద్వారా ఇదంతా ఐసయ్య సేకరించాడు.

కనీసం ఈ మాత్రం కథ తెలిసినందుకు ఐసయ్యకి కొంత ఓదార్పు లభించినట్లయింది.

శివపురం గ్రామాన్ని చూసి ఆశ్చర్యపోయాడు ఐసయ్య. అసలు అక్కడ నివసిస్తున్న వాళ్ళకి వాళ్ళ చరిత్ర తెలుసా, లేక వాళ్ళ గతం తన గతానికన్నా ఎక్కువ ఘోరమైనదా? బానిసత్వం జ్ఞాపకశక్తికి శత్రువు అన్న విషయం అతనికి తెలుసు. బానిసలు తమ గత చరిత్ర వైభవాలని తలచుకుని ఆనందించకూడదు. తమ పూర్వీకుల నుంచి సంక్రమించిన చరిత్ర – పేర్లు, ప్రయాణాలు, యాత్రలు, ఇళ్ళు, కోల్పోయిన తమ ప్రియమైన వాళ్ళని గుర్తుపెట్టుకోలేనంతగా అణచివేసింది. అంతేకాదు, హృదయం లేని యంత్రంలా, పశువుల్లా తెల్లవారికి ధనాన్ని సంపాదించే విధంగా మారారు.

మరి దళితుల సంగతేంటి? అవన్నీ గుర్తు పెట్టుకోవడానికి వాళ్ళని అనుమతించారా?

ఇక లేవాలి. ఈ రోజే సెంటర్లోకి వెళ్దామన్నాడు జాకబ్. తను కొన్ని బుక్‌స్టాల్స్ చూడాలనుకొంటున్నట్టుగా జాకబ్‌తో అన్నాడు. అందుకు వాళ్ళు మౌంట్ రోడ్ వైపు వెళ్దామనుకున్నారు. అనుకున్న సమయానికే వచ్చాడు జాకబ్. వాళ్ళు బయలుదేరారు. మొదటి పుస్తకాల షాపులోకి దూరాడు ఐసయ్య. హిందూయిజం గురించిన పుస్తకాలేమైనా వున్నాయా అని అడిగాడు. వయసుమళ్ళిన దుకాణందారుడు మాక్స్‌ముల్లర్ అనువాదం చేసిన ఋగ్వేదం ఇంకా భగవద్గీత పుస్తకాలని చూపించాడు. "వాటిల్లో కులం గురించి ఏమైనా వుందా?" అని అడిగాడు ఐసయ్య. ఏమో అన్నట్టుగా భుజాలెగరేశాడు షాపతను. ఐసయ్య ఆ రెండు పుస్తకాలు కొని బైటికి వస్తుండగా ఆ వృద్ధుడు డ్రా సొరుగు బర్రున లాగి శృంగార బొమ్మలతో వున్న చిన్న 'కామసూత్ర' పుస్తకాన్ని తీశాడు. ఐసయ్య దాన్ని చూడగానే 'వద్దు' అన్నట్టుగా నొసలు ముడిచాడు.

షాపులోంచి బయటికి రాగానే కోణార్క్, ఖజురహో కార్డు సైజ్ ఫొటోలు అమ్ముతున్న బాతుల గుంపులా వున్న పిల్లల్ని తప్పించుకున్నాడు ఐసయ్య. కారెక్కడంతోటే మార్కెట్‌కి పోనివ్వమంటూ డ్రైవర్‌కి చెప్పాడు జాకబ్. "విదేశీయులు అన్నింటికన్నా సెక్స్ పైనే ఆసక్తి చూపిస్తారనుకుంటారా ఈ ప్రజలు?" అడిగాడు ఐసయ్య ఒకింత విచారంగా. జాకబ్ పరయ్యా నవ్వాడు. "విదేశీయులు సెక్స్ పట్ల మాకన్నా నిజాయితీగా వుంటారని నేననుకుంటాను. భారతీయుడు ఆ కార్డుల వైపు ఓరగా చూస్తాడు కానీ కొనడు. మీకు వాటిని కొనాలన్న ఆసక్తి లేదు. అందుకనే మీరు వాటిని తోసిపుచ్చారు. ఈ పిల్లలు మీకు ఇబ్బంది కలిగించారా? చెప్పండి. వాళ్ళని దూరం పెడ్తాను" అన్నాడు జాకబ్.

“లేదు. ఓకె... అది సరే. నేను కొంత ఉద్రేకపడ్డాను. అంతే. నేను ఓ రకమైన సెక్స్ ఫ్రెండ్‌లా కన్పిస్తున్నట్టుగా వాళ్ళు అనుకున్నారేమోనని ఆశ్చర్యం కలిగింది” అంటూ నవ్వుతూ ఐసయ్య “అనేకమంది రోడ్డు పై ఫుట్‌పాత్ మీద బారులు తీరి ఎంత సౌకర్యవంతంగా కూర్చున్నారు! ఇదే అమెరికాలో అయితే పోలీసులు వచ్చి లేపేస్తారు” అన్నాడు.

“ఇక్కడ చాలావరకు వ్యాపారాలు ఇలాగే జరుగుతాయి” అంటూ జాకబ్ బట్టలు, ఇంకా చిన్న చిన్న ఆభరణాలు, ఇంకా రకరకాల వస్తువులు మెరిసిపోతున్న షాపుల వైపు సైగలతో చూపించాడు. “ఇక్కడ ప్రతీదీ బేరమాడవచ్చు. నీకు గనుక బేరసారాలు ఆడ్డం తెలిస్తే, ఏభై నుంచి ఐదు దాకా రేటు కిందికి దిగేలా చేయవచ్చు.”

“అదెలా సాధ్యం?... దుకాణాదారుడికి నష్టం రాదా? లేకపోతే ఎక్కువ రేటు కోట్ చేసి అందర్నీ మోసం చేస్తారా, ఒక్క బేరగాళ్ళని మినహాయించి?”

“అలాంటిదే ఏదో ఉంటుంది. ఆ వ్యాపారస్తులు తమ సరుకుల పేర్లు, వాటి ధరలు అరిచి చెప్తుంటారు. కాని అరిచి చెప్పేది ఒకటి, జనం కొనబోతే చెప్పేది మరొకటి. మొదట చెప్పిన రేటు ఇరువర్గాలూ సీరియస్‌గా తీసుకోవు. వ్యాపారం అంటేనే మోసం. అవును, ఇదో రకం ఇంటెలిజెన్స్! మోసం, దోపిడీ ఈ విధానంలో ఒక భాగం. మెత్తని మనసున్న వారినైతే మాత్రం నిలువుదోపిడీ చేయడానిక్కూడా సందేహించరు. చాలాకాలంగా తమిళనాడులోని చెట్టియార్లు, ఇంకా ఇండియాలోని ఇతర ప్రాంతాలలోని బనియాలని వ్యాపారాలు చేసుకునేందుకు అనుమతించేవాళ్ళు. వ్యాపారాలు కుల ప్రాతిపదికన నడుస్తాయి. ఒకవేళ అంటరానివాళ్ళు గాని, శూద్రులు గాని వ్యాపారం చేయాలనుకుంటే మత వ్యవస్థ, రాజ్యం శిక్షిస్తాయి. స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత వ్యాపార ప్రపంచంలోకి ప్రవేశించామా మేము. ఇంకా మాలో కొందరు ఇప్పటికీ అలాగే వున్నారు.

“అలాగా, మంచిది. ఈ మార్కెట్లో చూడాల్సిందంతా చూశాను. ఇప్పుడు మురికివాడల్ని చూడాలనుకుంటున్నాను.”

“సరే, అలాగైతే మా కజిన్ డేనియల్‌ని చూడ్డానికి వెళ్దాం. అతను రాజాజీ మురికివాడలో వుంటాడు” అంటూ జాకబ్ తల కొద్దిగా తిప్పి ఐసయ్య వంక చూశాడు. “రాజాజీ, మురికివాడకి ఆయన పేరు పెట్టారా. స్వాతంత్ర్యానికి ముందటి తమిళనాడులో శక్తివంతమైన బ్రాహ్మణ రాజకీయ నాయకులలో ఆయన ఒకడు. ఆయన పూర్తి పేరు

చక్రవర్తి రాజగోపాలాచారి. ఆయన గాంధీని అనుసరిస్తున్నట్లు నటిస్తాడు గాంధీలా అర్ధనగ్నత్వాన్ని పాటించకుండా. ఒక విధంగా గాంధీ కులక్రమానుగతిలో మూడవది అయిన 'బనియా' కులస్తుడు అయినప్పటికీ మంచి సామర్థ్యం కలిగినవాడు. ఆ తర్వాత గాంధీ కొడుకు దేవదాసు రాజాజీ కూతురు లక్ష్మిని వర్ణాంతర వివాహం చేసుకున్నాడు. అధికారం, పేరు ప్రతిష్టలు అతనికి సులువుగా లభించాయని అతని కుటుంబ సభ్యులు, ఇతర సంబంధీకులు భావిస్తారు. ఉన్నత వర్గానికి చెందిన బ్రాహ్మణుల ఏకాధిపత్యాన్ని వ్యతిరేకిస్తూ స్వాభిమాన ఆందోళన లేవదీసిన ప్రసిద్ధ కాంగ్రెస్ నాయకుడు పెరియార్ రామస్వామి నాయక్కర్‌ని కాంగ్రెస్ పార్టీలో ఓ అంటరాని కుష్ఠు రోగిగా పరిగణించిన వాళ్ళలో అతనొకడు. అతను తమిళనాడులో మద్యనిషేధం అమలు చేశాడు, మద్యంపైన వచ్చే ఆదాయం దళితుల పిల్లల స్కూళ్ళు నడిపేందుకు వినియోగిస్తున్నారన్న విషయాన్ని లెక్క చేయకుండా."

"హా! అమెరికన్స్ అయిన మాకు తెలుసు, మద్య నిషేధం ఎంత ప్రమాదకరమో. పదమూడు సంవత్సరాలు మేము అస్తికల్లా ఎండిపోయాం, 1920 నుంచి 1933 వరకు. గొప్ప ఆర్థిక మాంద్యం ఏర్పడ్డంతో మళ్ళీ బార్లు తెరవాల్సి వచ్చింది!"

వాళ్ళు డేనియల్ వున్న ప్రాంతానికి చేరుకుని కారుని ఓ పక్కగా పార్క్ చేశారు. రెండు శుభ్రమైన మధ్యతరగతి ఇళ్ళ మధ్యలో సన్నగా, ఇరుకుగా వున్న సందులోకి ఐసయ్యని తీసుకువెళ్ళాడు జాకబ్. ఓ నలభై అడుగుల దూరం వెళ్ళగానే మరో ప్రపంచంలో వున్నట్లనిపించింది వాళ్ళకి. ఒక సందు మలుపు తిరిగేసరికి వ్రేలాడే చూర్లు వాళ్ళ తలలకి తగలసాగాయి. ఆ ఇళ్ళు నేలకి తాకినట్టున్న రెండు వాలు కప్పుల గుడిసెలు. ఇంకా కిటికీల మధ్యన తాడు మీద ఆరేసిన బట్టలు వాళ్ళ మొహాలని తాకాయి. ఐసయ్య తన విశాలమైన భుజాలని కుదించుకుని వాటి మధ్యన వుండే ఖాళీలోంచి దూరి వెళ్ళాల్సి వచ్చింది. అన్నిటిని మించి అక్కడ వెలువడుతున్న దుర్గంధం, మానవ వ్యర్థాలు, కుళ్ళు కంపు, పేదరికం ఐసయ్యని కలవరపర్చాయి. చివరికి ధీటైన గోడలతో వున్న చిన్న గుడిసె దగ్గరకి వచ్చారు. ఐసయ్య విధేయతతో తలవంచి చిన్న వాకిలి నుంచి లోనికి ప్రవేశించాడు వయోజనుడు బొమ్మరిల్లులో దూరబడుతున్నట్టుగా. ఎదురుగా చిన్న జీసస్ ప్రతిమ, దాని వెనకాల ఒక వరుసలో వేలాడే చిత్రాన్ని చూస్తున్న ఇద్దరు బాలల మొహాలున్న పటం. అక్కడే కొద్దిగా చీకటిగా వున్న చోట గోడ కానించి వున్న పక్క బట్టలు, రెండు శుభ్రమైన ఇత్తడి, స్టీలు పాత్రలు, ఇంకా ఓ చిన్న అరలో బైబిలు. మరేవీ లేవక్కడ.

"ఇతను మా కజిన్ డేనియల్. చర్చిలో తోటమాలి ఉద్యోగం చేస్తాడు. ఇతని భార్య రోజీ మున్సిపల్ స్వీపర్‌గా పనిచేస్తుంది" అంటూ జాకబ్ ఇప్పుడు ఆమె బయట ఎక్కడో పనిలో వుంది" అన్నాడు.

"ఎలా... వీళ్ళు ఇక్కడ వుంటారా? ఎలా వుండగలుగుతున్నారు ఇక్కడ?" అన్నాడు ఐసయ్య డేనియల్ వైపు చూసి నవ్వుతూ.

"వీళ్ళ పిల్లలు స్కూలుకి వెళ్తారా?"

"అవును, వెళ్తారు. వాళ్ళు చర్చి నడుపుతున్న స్కూలుకి వెళ్తారు. ఇక్కడున్నందుకు వాళ్ళకున్న ఉపయోగం అదొక్కటే. లేకపోతే వాళ్ళు శివపురంలాంటి మరో చోట ఎక్కడో బతకాల్సి వచ్చేది. క్రిస్టియానిటీ వాళ్ళకి విద్యని అందిస్తోంది. నగర జీవనం ఉద్యోగాలని ఇస్తోంది. కాని మురికివాడల్ని, రోగాల్ని కూడా ఇస్తోంది. గ్రామాల్లో నివసించేవారు పరిశుభ్రమైన వాతావరణంలో జీవిస్తారు. మంచి గాలి, లేదంటే కనీస పక్షం మంచి ఆహారమైనా దొరుకుతుంది."

"కానీ దీన్ని ప్రజలు ఎలా సహిస్తున్నారు? రోజీ ప్రభుత్వ ఉద్యోగి కాదా? అటువంటప్పుడు ఆమె మురికివాడలో నివాసం వుంటూ దుర్భరమైన జీవితం గడుపుతుంటే ఎవరూ పట్టించుకోరా?"

జాకబ్ భుజాలెగరేస్తూ "మురికితో అగ్రకులాల వాళ్ళకి ఎలాంటి సంబంధమూ లేదు" అంటూ జాకబ్ వాళ్ళకి ఇది చాలా చిన్న విషయం. వాళ్ళు ఏ విధమైన మలినాన్ని, మురికిని తాకరు సరికదా అంతా మురికిమయం చేస్తారు. వాళ్ళు పారబోసిన చెత్తాచెదారం దళితులు ఎత్తి పారేయాలి. మేము ఎంత చెడ్డవాళ్ళమో. మేము అగ్రవర్ణాల వాళ్ళ ఇళ్ళూ పరిసరాలూ శుభ్రం చేస్తాం. ఇక్కడికి వచ్చిన తర్వాత ఉమ్మేస్తాం, మలమూత్రాలు విసర్జిస్తాం, చెత్తా చెదారం పడేస్తాం. వాటిని చూసుకోవాల్సిందిగా ప్రకృతికి వదిలేస్తాం.

అటువంటప్పుడు పరిస్థితులు బాగవుతాయని మాత్రం నాకు పెద్దగా అనిపించడం లేదు. అగ్రకులాల వాళ్ళు అశుభ్రత పట్ల శత్రువులుగా మారి ఒక స్ఫూర్తిగా నిలబడితే తప్ప. చెప్పాలంటే ఇది అటు సూర్యుడు ఇటు పొడిచినట్టే అవుతుంది" అన్నాడు. వాళ్ళు డేనియల్ నుంచి సెలవు తీసుకుని తిరిగి ప్రయాణం కొనసాగించారు.

"కానీ వాళ్ళు క్రిస్టియన్‌లు కారా?" అడిగాడు ఐసయ్య, భారీ వాషింగ్ పనిలో మునిగిన వ్యక్తి వంక తొంగి చూస్తూ. 'దైవత్వం తరువాతది పరిశుభ్రత' అని వీళ్ళకి తప్పనిసరిగా చెప్పి వుంటారే" అన్నాడు మళ్ళీ ఐసయ్య.

ఈ దేశంలో 'పరిశుభ్రత తరువాతది దైవత్వం.' కాబట్టి మా సమస్య ఎలా వుందో చూడండి.

మా బంధువులు డేనియల్ తోటమాలిగా పనిచేస్తున్న చర్చికి వెళ్తారు. కానీ వాళ్ళు అంటరాని వాళ్ళ కోసం ప్రత్యేకించి ఏర్పాటు చేసిన ఓ పొడవుపాటి బల్లపైన కూర్చోవాల్సి వుంటుంది. ఇండియన్ చర్చి జీసస్‌ని అగ్రవర్ణాల దేవుడిగా చేసింది. ఇలా చెప్పడంలోని నా ఉద్దేశం నీకు త్వరలోనే అర్థమవుతుంది" అంటూ జాకబ్ ముగించాడు విచారంగా. మరునాడు కలుసుకుందాం అనుకుంటూ వాళ్ళు హోటల్‌కి చేరుకున్నారు.

హోటల్ రూంలో రేడియోలో వార్తలు వస్తున్నాయి. ఐసయ్య రేడియో వాల్యూం తగ్గించి ఆచార్య మాక్స్‌ముల్లర్ అనువదించిన ఋగ్వేదం పుస్తకం తెరిచాడు. మొదటి భాగంలో శ్లోకాలున్నాయి. పేజీలని చూపుడు వేలు బొటనవేలు కలిపి పట్టుకున్నాడు. చిన్నగానే వుంది. కానీ తరువాత వివరణలు మాత్రం ఈ సంహితలో విస్తారంగా వున్నాయి. అతడు వాటి మీద దృష్టి కేంద్రీకరించే ప్రయత్నం చేశాడు. గ్రంథంలోని మొదటి మండలం వివిధ దేవతలని ప్రస్తుతించే మంత్రాలతో కొంత విసుగు పుట్టించేదిగా వుంది. అగ్ని, ఇంద్రుడు, వరుణుడు లాంటి అనేక దేవతల స్తోత్ర పాఠాలు, యుద్ధం చేయడం, శత్రువుల్ని సంహరించడంలో ఇంద్రుడి ఘనకార్యాలను గురించిన ప్రశంసలు వున్నాయి. ఐసయ్య కళ్ళు శీర్షిక నుంచి శీర్షికకు గెంతుతూ 'పురుష సూక్తం' అధ్యాయం పైన నిలిచిపోయాయి. అందులో చాతుర్వర్ణాల ప్రస్తావన వుంది. బ్రాహ్మణులు భగవంతుడి ముఖ భాగం నుంచి, క్షత్రియులు భుజాల నుంచి, వైశ్యులు ఉదరం నుంచి, శూద్రులు పాదాల నుంచి పుట్టారు. అంటరానివారు ఇంకా మహిళల గురించిన ప్రస్తావన అందులో లేదు. బహుశా వాళ్ళ గురించి కాలక్రమంలో ఆలోచిస్తూండవచ్చు. ఐసయ్య 'వంశావళి' జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. 'ఈ విధంగా దేవుడు తన స్వరూపము నందు నరుని సృష్టించాడు. దేవుని స్వరూపమందు అతను వానిని సృష్టించాడు, స్త్రీ గాను, పురుషునిగాను అతను వారిని సృష్టించాడు.'

ఇంతలో టక టక తలుపు తట్టిన శబ్దమైంది. తలుపు తీస్తే గుమ్మంలో ఎవరో అపరిచిత వ్యక్తులు గుంపుగా నిలబడి వున్నారు. కొందరు పొడవైన తెల్లని దుస్తులు, మెడలో క్రాస్ గుర్తును ధరించారు. మరికొందరు సాధారణ దుస్తుల్లో వున్నారు. వారంతా తమను తాము చర్చి నాయకులుగా పరిచయం చేసుకున్నారు. హోటల్ గది చిన్నదవ్వటం మూలంగా ఇంతమందిని చూసి కలవరపడ్డాడు ఐసయ్య. కానీ వాళ్ళు మంచం మీద ఒదిగి కూర్చున్నారు. వాళ్ళు కొన్ని చర్చిలని, విద్యా కేంద్రాలని సందర్శించాల్సిందిగా ఐసయ్యకి సూచించారు. అందుకు ఐసయ్య వెంటనే సమ్మతించాడు. శివపురంలోని అనుభవాలని ఐసయ్య వాళ్ళతో పంచుకున్నాడు. ప్రజల పట్ల హిందూయిజం వ్యవహరిస్తున్న

తీరుతో వాళ్ళు విచారం వ్యక్తం చేశారు. సీనియర్ పాస్టర్ గొణుగుతున్నట్లుగా అన్నాడు. "వాళ్ళకి ప్రభువు ఆశీర్వాదం లభించుగాక... వాళ్ళకి ప్రభువు ఆశీర్వాదం లభించుగాక..."

ఐసయ్య అకస్మాత్తుగా అడిగాడు. "చర్చిలు, కులాలు, అంటరానితనాన్ని ఆచరిస్తాయా? ఓ క్రిస్టియన్ స్నేహితుడు నాతో అన్నాడు. ఓ చర్చిలో అంటరానివాళ్ళు అగ్రకులాల సరసన కనీసం కూర్చోలేరని. ఇది నిజమా?"

ఐసయ్య వేసిన ఆ ప్రశ్నకి తెల్లమొహం వేశాడు సీనియర్ ఫాస్టర్. కొన్ని నిమిషాల పాటు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. తనని వాళ్ళు అర్థం చేసుకున్నారని భావించాడు ఐసయ్య. అతను నిరీక్షించాడు. వాళ్ళు జవాబు చెప్పడానికి తికమక పడ్డారు. సుదీర్ఘ విరామం తర్వాత సాధారణ దుస్తుల్లో వున్న ఓ వ్యక్తి చొరవ తీసుకుని అన్నాడు, "అవును. ఇక్కడ అది ఆచరణలో వుంది. అది హిందూ సంప్రదాయం. ఇక్కడ మాకున్న భారతీయ క్రిస్టియానిటీ సమాజం ఆ విధంగా నిర్దేశించింది." ఐసయ్య నిరాకరించినట్లుగా చేతులూపాడు. ఆ చర్చ పట్ల అతని సహచరులు అయిష్టతతో ఇబ్బంది పడ్డారు.

"మీరు కులాలని అలా ఎందుకు పరిగణిస్తున్నారు, మనుషుల్లా ఉపయోగపడేవారిని అంటరానివాళ్ళలా? తెల్లవాళ్ళు మా పట్ల విచక్షణ చూపుతున్నారు. చెడ్డ నల్లజాతివాళ్ళని – కానీ వాళ్ళు మమ్మల్ని ఎన్నడూ అంటరానివారిగా పరిగణించలేదు. తెల్ల క్రిస్టియన్‌లు జాతి వివక్షత చూపిస్తారు. మీరు కులతత్వం గలవారు కాదా?"

గదిలో నిశ్శబ్దం చోటు చేసుకుంది.

"మీరు అస్పృశ్యులని మీ ఇళ్ళలో పనిమనుషులుగా పెట్టుకుంటారా? మీ ఇళ్ళలోకి వాళ్ళని రానిస్తారా?" అడిగాడు ఐసయ్య.

"ఈ ప్రశ్నలేంటి? ఊహించటానికే భయంగా వుంది. ఏ తెల్ల మిషనరీ ఇలాంటి ఇబ్బందికర ప్రశ్నలు అడగలేదు. వాళ్ళు వేయి డాలర్లు ఇచ్చారంతే. ఈ నల్ల జాతీయుడు పైసా కూడా ఇవ్వలేదు. పైగా తమని ప్రశ్నిస్తున్నాడు తామేదో దాస్తున్నట్టు" అనుకున్నాడు సీనియర్ పాస్టర్. ఏం మాట్లాడాలో ఎవరికీ అర్థం కాలేదు. "అసలు మనం ఇక్కడికి వచ్చి ఇతన్ని చూడాలన్న ఆలోచన ఎందుకు చేసినట్టు" అనుకున్నాడు ఓ పాస్టర్. గౌరవనీయమైన క్రిస్టియన్ సోదరులమైన మనల్ని ఈ విధంగా ఆదరించడం పద్ధతి కాదు అనుకున్నారు మిగతా వాళ్ళు.

"అస్పృశ్యుల పిల్లల్ని చర్చి స్కూళ్ళన్నింటిలోను ప్రవేశం కల్పిస్తున్నారా?" అడిగాడు ఐసయ్య.

జీసస్ పార్టీలని ఇలాంటి ప్రశ్నలు అడిగాడా? వాళ్ళు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. అగ్రకులాల్లో పుట్టడం నేరమా? మనల్ని ఇపుడున్న విధంగా భగవంతుడు సృష్టించలేదా? ఈ దేశంలో  కుల వ్యవస్థకి మనం కారకులం ఎలా అవుతాం? ఈ దేశంలో దేవుడు కులాల్ని సృష్టించాడు అమెరికాలోను, సౌత్ ఆఫ్రికాలోను వివిధ జాతుల్ని సృష్టించినట్టుగా. ఈ మనిషి అందుకు మనల్ని ఎలా బాధ్యుల్ని చేస్తాడు? కానీ ఎవరూ కూడా ఆ నల్ల క్రిస్టియన్ మొహం మీద ఈ విధంగా గట్టిగా అడిగే సాహసం చేయలేకపోయారు.

తెల్ల దుస్తుల్లో వున్న ఓ ఫాదర్ అక్కడ్నించి లేచి, పెద్ద పెద్ద అంగలతో కాళ్ళు నేలకు తన్నుకుంటూ గుమ్మం వైపు నడిచాడు మిగతా వాళ్ళని వచ్చేయాల్సిందిగా సైగచేస్తూ. అందరూ లేచి నిలబడి 'మీరు లేవనెత్తిన అంశాల నుంచి ఆలోచిస్తామంటూ ఐసయ్యతో చెప్పి వెళ్తుండగా ఐసయ్య భుజాలెగరేస్తూ నెమ్మదైన స్వరంతో అన్నాడు. "చాలా మంచిది. కానీ వెళ్ళిపోయే సమయంలో మనం ప్రార్థన చేద్దామా?" అన్నాడు. వాళ్ళు మౌనంగా చేతులు గుండెల కానించారు. ఐసయ్య ప్రార్థన చేశాడు :

*'పరిశుద్ధ తండ్రీ, ఈ ప్రాతఃకాల సమావేశానికి నీకు కృతజ్ఞతలు.*
*నీ సేవకులైన వీళ్ళందరికీ ఆరోగ్యం, సఫలమైన జీవితం లభించుగాక.*
*ప్రభువైన తండ్రి వీళ్ళ చర్చిలని దీవించుగాక.*
*ప్రభువు వీళ్ళ స్కూళ్ళని, వీళ్ళని వృద్ధిపరచుగాక.*
*పరలోకపు తండ్రీ, అంటరాని వాళ్ళని వాళ్ళ చర్చీలలోకి*
*అనుమతించే స్వేచ్ఛని నీవు ప్రసాదించుగాక*
*ప్రభువు పిల్లలందరిని వాళ్ళ స్కూళ్ళల్లో ప్రవేశించడానికి*
*అనుమతించే స్వేచ్ఛను ప్రసాదించుగాక*
*ప్రభువా చర్చీలు నీవి, స్కూళ్ళు నీవి.*
*ప్రభువా ఈ బ్రదర్స్‌లాగే అంటరానివాళ్ళు కూడా నీ బిడ్డలే.*
*ప్రభువైన జీసస్‌ని వీళ్ళందరి కొరకు నేను ప్రార్థిస్తున్నాను.*
*నేను తమిళనాడు కోసం, ఇండియా కోసం ప్రార్థిస్తున్నాను.*
*ఆమేన్, ఆమేన్."*

వాళ్ళు కూడా అన్నారు. 'ఆమేన్'. కానీ వాళ్ళ మొహాలు వెలిగిపోతున్నాయి. ఐసయ్య ప్రార్థన చేస్తున్నట్టు లేదు! అది ఓ నల్లవాడు వాళ్ళ మొహాల మీద విసిరేసిన దూషణ పర్వంలా వుంది. వాళ్ళు మౌనంగా గది నుండి బయటకి వెళ్ళిపోయారు. ఒక అజ్ఞాత అమెరికన్ శవాన్ని వదిలెళ్ళినట్టుగా.

వాళ్ళు వెళ్తుండగా హోటల్ లాబీలోకి జాకబ్ ప్రవేశించాడు. క్రిస్టియన్ ఫాదర్స్ ముఖాలు పాలిపోవడం చూశాడతను.

అతను తిన్నగా ఐసయ్య రూమ్ దగ్గరకి వెళ్ళి బజ్జర్ నొక్కాడు. ఐసయ్య తలుపు తీసి జాకబ్‌ని లోపలికి రమ్మనమని సోఫాలో కూర్చోమంటూ సైగ చేశాడు. "జాకబ్, ఈ దేశానికి ఏమైంది?" అన్నాడు ఐసయ్య సున్నితంగా.

జాకబ్ నెమ్మదిగా అన్నాడు, "అది ఓ పురాతనమైన అరిష్టం. ఒక్క రాత్రిలో తొలగిపోయేది కాదు."

"నువ్వు అంత ప్రశాంతంగా ఎలా ఉండగలుగుతున్నావు? నువ్వు నీ కుటుంబానికి జరిగిన భయంకరమైన వాస్తవాల్ని వెల్లడించావు. ఈ ఫాదర్లు ఆ విధానాన్ని ఖండించే ప్రయత్నం కూడా చేయలేదు. వాళ్ళు నీకు రక్షణగా వుండాల్సిన వాళ్ళు. నీ గార్డియన్లు వాళ్ళు! వాళ్ళ హృదయాలలో దీన్ని ఎలా క్షమించగలరు?"

"వాళ్ళు సమాజాన్ని నిందిస్తారు. వాళ్ళ స్నేహితులని, తల్లుల్ని ఇంకా వీధిలో పోయేవాళ్ళని కూడా. అంతా బాగుంటేనే వాళ్ళు బాగుంటారు. కానీ పతనమయ్యే ప్రపంచంలో నువ్వేం చేయగలవు?" అంటూ వంకరగా నవ్వాడు జాకబ్.

"రా, ఐసయ్యా, ఏ తెల్లవాడూ ఆ విధంగా నీతో ఎన్నడూ మాట్లాడలేదని నాకు చెప్పకు" అన్నాడు జాకబ్.

"కానీ ఈ వ్యక్తులు నీ పక్షాన నిలవాల్సిన వాళ్ళు. ఏ నల్ల జాతీయుడూ ఆ విధంగా ఆలోచించడు. తన స్వంత సమాజం చేత నిందించబడడు. అలాంటి ప్రజల పట్ల మాకు బాధాకరమైన మాటలున్నాయి."

"అయితే మాకన్నా నువ్వే అదృష్టవంతుడివి. ఈ రోజు ఎక్కడికి తీసుకువెళ్దామనుకుంటున్నావు?"

ఐసయ్య చేత్తో నుదుటిని రుద్దుకుంటూ "జాకబ్, అన్ని చోట్లా ఇక్కడ వున్నట్టే వుందా? ఉత్తరాన? తూర్పున? మరి రాజధాని గురించి ఏంటి? అక్కడి ప్రజలు ఉదారంగా వుంటారా? ఒక్కోసారి నగరాలు అలా వుండాల్సి వస్తుంది."

"నాకు తెలియదు" అంటూ జాకబ్ "నేను హిందీ మాట్లాడగలను. కానీ నేను ఢిల్లీ ఎప్పుడూ వెళ్ళలేదు."

"అయితే నాతో వస్తావా? నాకు వ్యాఖ్యాత అవసరం కూడా వుంది. నేను సాధారణ వ్యక్తుల్లా ఢిల్లీకి ట్రైన్‌లో వెళ్దామనుకుంటున్నాను. అక్కడి ప్రపంచాన్ని, నాగరికతని అర్థం చేసుకోవడానికి. ప్రయాణాలు చేయడం వల్ల జాతి నాగరికతని తెలుసుకోవచ్చు, కాదా? నీకు కూడా ఇదో సాహసకృత్యమే."

"కావచ్చు. సరే. ఎందుకు కాకూడదు? మా వాళ్ళకి చెప్పి ఇవాళ వెళ్ళి టిక్కెట్లు తీస్కొస్తా. అది కష్టమైన పనే. కానీ నాకు తెలిసిన వాళ్ళున్నారు. లక్కీగా దొరికితే రేపే ప్రయాణం."

ఉదయం ఆరున్నర అయింది. ఢిల్లీ వెళ్ళేందుకు గాంధీ ఎక్స్‌ప్రెస్ మూడో నెంబర్ ప్లాట్‌ఫామ్ మీద రెడీగా వుంది. ప్లాట్‌ఫామ్ చుట్టూ వ్యాపిస్తున్న దుర్గంధంతో ఐసయ్య ముక్కు నులుముకుంటూ తను ఎక్కాల్సిన బోగీ కోసం మెడలు చాచి చూశాడు. అంతా కోలాహలంగా వుంది. సాధారణ రెండో తరగతి బోగీ వైపు తమ లగేజీ నెత్తి మీద పెట్టుకుని, పెద్ద పెద్ద అంగలు వేస్తూ గబ గబా వెళ్తున్న పోర్టర్‌ని ఐసయ్య, జాకబ్‌లు అనుసరించారు. ప్లాట్‌ఫామ్ మీద విపరీతమైన రద్దీ! ఒకర్నొకరు నెట్టుకుంటూ రైలు వైపు దూసుకొస్తున్నారు జనాలు. "వాళ్ళకి రిజర్వేషన్లు లేవు" అన్నాడు జాకబ్ డోర్ దగ్గర క్రిక్కిరిసి వున్న జనాన్ని చూపిస్తూ. "వాళ్ళు ట్రైన్‌లో ఏదో మూల ఒదిగి కూర్చుని కాలక్షేపం చేస్తారు."

"ఏంటి ఢిల్లీదాకానా?" అన్నాడు ఐసయ్య ఆశ్చర్యంగా.

ఇంతలో విపరీతంగా సూట్‌కేసులు మోసుకుని వెళ్తున్న పోర్టర్ ఒకడు ఐసయ్యని తోసుకుని ముందుకెళ్లాడు. ఐసయ్య బ్యాలెన్సు తప్పి పడబోయాడు. ఈ జనాలకి వరుసక్రమం పాటించాలన్న ఇంగిత జ్ఞానం లేదు, ప్లాట్‌ఫారం మీద సూట్‌కేసుల్తో పురుషులు, చిన్నపిల్లల చేతులు పట్టుకుని స్త్రీలు, తలమీద సామాన్లతో పోర్టర్లు పరుగెడుతున్నారు. ప్లాట్‌ఫారం రక్తంచిందని యుద్ధ భూమిని తలపిస్తోంది. దిగే వాళ్ళు ఎక్కేవాళ్లను లోపలికి పోనివ్వడం

లేదు. అలాగే ఎక్కేవాళ్లు దిగేవాళ్లను దిగనివ్వడం లేదు. ఐసయ్య పోర్టరు వైపు దృష్టి నిలిపి భుజాలు కుదించి తన విశాలమైన శరీరాన్ని బోగీలోకి హడావుడిగా తోసుకుని వెళ్లాడు. జనాలు అతని మొహాన్ని భయంభయంగా చూస్తూ దూరంగా జరిగారు. ఐసయ్య స్నేహపూర్వకంగా నవ్వాడు. మరి కాస్సేపటిలో 'కూ' అంటూ ఇంజను కూత వినిపించింది. అందరూ ఒక్కసారిగా లోనికి వెళ్ళడానికి తోసుకుంటున్నారు. శబ్ద తీవ్రత అధికమయింది. అదేదో సినిమాలో యుద్ధభూమి నించి బయలుదేరిన చివరి ట్రైన్‌లో జీవించి వున్న వాళ్లు తమ పాదాల కింద వున్న అగాధంలోకి జారిపోకుండా ట్రైన్‌లో ఒక చదరపు అడుగు కాలు మోపే స్థలం కోసం దెబ్బలాడుకుంటున్నట్టుగా వుంది. "నిజంగా ఇది విచారకరం" అన్నాడు ఐసయ్య గొణిగినట్టుగా. "ముందు ముందు మరింత ఘోరంగా వుంటుంది" అన్నాడు జాకబ్. ట్రెయిన్ ఒక్క కుదుపుతో ముందుకు కదిలింది. డోర్ దగ్గర జనాలు వేలాడుతున్నారు. స్టేషన్ వదిలేసి రైలు ముందుకు పోతోంది. రైలు వెంబడి వరుసగా మడమల మీద బహిర్భూమికి కూర్చున్న ఆకారాలు కనిపించాయి ఐసయ్యకి, పసుపు, గోధుమ రంగు, నలుపు రంగు కుప్పలతో ఐసయ్య ఎన్నడూ నగ్నంగా వున్న వీపులు చూడలేదు. "మురికివాడల్లోని వారికి వాళ్ల కాలనీల్లో మరుగుదొడ్లు వుండవు. అందుకనే వాళ్లు రైలుకట్ట పొడవునా కూర్చుంటారు" అన్నాడు జాకబ్. దిగ్భ్రాంతికి గురైన ఐసయ్య అటు వైపు మరింక చూడలేకపోయాడు.

ఇంతలో పైనున్న బెర్త్ మీంచి ఓ బ్యాగు పెద్దగా చప్పుడు చేస్తూ కిందపడింది. కొందరు వ్యక్తులు ఎవరి బ్యాగులు ఎక్కడెక్కడ పెట్టుకోవాలన్న దాని మీద గొడవపడుతున్నారు. ఐసయ్య చేతిలో వున్న మ్యాగజైనుతో విసురుకుంటున్నాడు. మంచి సువాసనలతో కూడిన ఆహార పదార్థాల వాసన తన మొహంపైన దిండుతో అదిమినట్లుగా అన్పించింది ఐసయ్యకి.

అకస్మాత్తుగా తెగుతున్న వీణ తీగెలా ముక్కుతో పాడుతున్న పాటలు కంపార్ట్‌మెంట్‌లో విన్పించాయి. బిచ్చగాళ్లు ప్రవేశించారు. కొందరు ఫ్లూటు వాయిస్తుంటే మరికొందరు పాటకి అనుగుణంగా చిరుతలు వాయిస్తున్నారు. నాయకుల్లా కన్పిస్తున్న కొందరి చేతులలో ఖాళీ బొచ్చెలున్నాయి. పాటతో పాటు చేతులూ అందరి దగ్గరా చిల్లర అడుగుతున్నాయి. మగవాళ్ళు ఆడవాళ్లు గుంపులు గుంపులుగా వున్నారు. వాళ్ల ఒంటిపైన మురికిగా వున్న గుడ్డ పేలికలున్నాయి. ఓ వ్యక్తి కుంటివాడవడంతో పాక్కుంటూ అడుక్కుంటున్నాడు; ఒక స్త్రీ అంధురాలు కావడంతో దుడ్డు కర్ర పుచ్చుకుని ముందు నడుస్తున్న కుర్రాడిని అనుసరిస్తూ సన్నని వణికే కంఠంతో పాడుతూ నడుస్తోంది. వాళ్లు ఐసయ్య దగ్గరకి రాగానే ఐసయ్య వాళ్ల వైపు జాలిగా చూస్తూ జేబులోంచి పదిరూపాయల నోటుని తీసి ఇచ్చాడు. పాట

పాడుతున్న వ్యక్తి ఆశ్చర్యంతో కూడిన సంతోషంతో ఆ నోటుని రెండుసార్లు చూసుకుని బొచ్చెలో వేసుకున్నాడు. వాళ్లలో ఒకడు గోచీ పెట్టుకున్నాడు. అతను తెల్లని గడ్డంతో ఎముకలు బైటికి పొడుచుకు వచ్చి సన్నగా వున్నాడు. బక్కపలచని అతని మొహం మనోహరంగా వుంది. అతను జీసస్‌గాను బలవంతంగా శిలువ వద్దకు ఈడ్చబడినట్లుగాను కనిపించాడు ఐసయ్యకి. విజయవాడ స్టేషన్‌లో ఆగింది రైలు. బిచ్చగాళ్లు దిగిపోయారు. కాషాయ దుస్తుల్లో పొడవైన గడ్డాలున్న డజన్ల కొద్దీ జనాలు మూటలు, తెల్ల గిన్నెలతో ఐసయ్య నిల్చున్న కంపార్ట్‌మెంట్‌లోకి తోసుకుంటూ వచ్చారు. వాళ్లు 'జైశ్రీరాం, వందేమాతరం' అంటూ నినాదాలు చేస్తున్నారు. వాళ్లు బలప్రయోగంతో లోపలకి ప్రవేశించి జనాల తలలు కాళ్లు పక్కకి నెట్టి బెర్తులపైన కూర్చున్నారు. వాళ్లలో ఓ కుర్రాడు డోర్ దగ్గర నిలబడ్డ ఐసయ్యని చూసి అన్నాడు. "ఇక్కడ...ఇక్కడ హబ్షీ ఆఫ్రికన్ నల్ల జంతువు.. నల్ల జంతువు ఉంది" అన్నాడు. అక్కడున్న వాళ్లంతా ఘొల్లున నవ్వారు. ఓ ఆరుగురు వ్యక్తులు అతని బెర్త్ మీద చేరారు. పైనున్న బెర్త్‌ల మీద ప్రయాణికులు ఇంకా నిద్రపోతుండటంతో కింద బెర్త్ పైన కూర్చోవటం ఇబ్బందే అయినా వాళ్లు అదుముకుని కూర్చున్నారు.

ట్రైన్ ఒక కుదుపు కుదిపి కదలడంతో కాషాయరంగు వస్త్రాలు ధరించిన మరో కొద్దిపాటి గుంపు కంపార్ట్‌మెంట్‌లోకి తోసుకువచ్చింది. జాకబ్ మిడిల్ బెర్త్‌లో నిద్రపోతున్నాడు. మంచి నిద్రలో వున్నాడతను. కింద కూడా జనాలు ఆక్రమించేశారు. ప్యాసింజర్లు అటూ ఇటూ తిరగాలంటే వాళ్ల మీద నుంచి వంగి వెళ్లాల్సిందే. జాకబ్ దగ్గరికి వెళ్లడానికి ఐసయ్యకి దారి లేకపోయింది. వాళ్లు అతని వంక ఎగతాళిగా చూశారు. ఐసయ్య రెండు బోగీల మధ్య నున్న కారిడార్‌లో కొంతసేపు నిలబడ్డాడు. ఇంతలో టికెట్ కలెక్టర్ బోగీలో ప్రవేశించాడు. అతను పాశ్చాత్య దుస్తులు ధరించాడు; తెల్లటి ట్రౌజర్లు, షర్టు, నల్లటి బ్లేజర్ (తేలికపాటి స్పోర్ట్స్ జాకెట్). అతను తన భుజస్కంధాలపైన వలస (రాజ్య) వాద భారం మోస్తున్నట్టుగా కనిపిస్తున్నాడు. అతను కంపార్ట్‌మెంటులో ప్రవేశించిన క్షణంలోనే కాషాయ వస్త్రధారులు "జై శ్రీరాం, వందేమాతరం" అంటూ బిగ్గరగా అరిచారు. ఓ యువకుడు అతనిపైకి ఎగిరి అతని మెడచుట్టూ చేతులు వేస్తూ అతని బ్లేజర్‌ని లాగేశాడు. మరో వ్యక్తి అతని దగ్గరకి వచ్చి మెళ్లో వున్న టై పుచ్చుకుని గుంజుతూ దాన్ని విప్పి పారేశాడు. "ఇది క్రిస్టియన్‌ల డ్రెస్. మళ్లీ దీన్ని వేసుకోకు, ఎప్పటికీ" అంటూ వాళ్లు టికెట్ కలెక్టర్ మెడలో కాషాయరంగు టవల్ వేసి 'జై శ్రీరామ్" అంటూ అరిచారు. టికెట్ కలెక్టర్‌కి వణుకుపుట్టి కంపార్టుమెంటులోంచి నెమ్మదిగా జారుకున్నాడు. ఐసయ్య అతనితో పాటు ప్రక్క కంపార్టుమెంటులోకి అనుసరిస్తూ "ఈ జనాలు ఎవరు?" అని అడిగాడు. టికెట్ కలెక్టర్ ఐసయ్య వైపు భయం భయంగా చూస్తూ గబగబా వెళ్లిపోయాడు.

ఓ బలమైన పోటుతో జాకబ్ ఒక్క ఉదుట్న లేచాడు. అనేక కళ్లు అతని వైపు చూశాయి. మళ్లీ ఎవరో మోచేత్తో డొక్కలో పొడిచి "నువ్వు పరయ్యావా?" అని అడిగాడు జాకబ్‌ని.

"నేను క్రిస్టియన్ని" అన్నాడు జాకబ్.

వాళ్ల ముఖాలు వివర్ణమయ్యాయి.

"నా ఫ్రెండ్ ఏడి? అడిగాడు జాకబ్ తగ్గు స్వరంతో.

"ఎలాంటి ఫ్రెండు?" ఆ హబ్షీయా? అతన్ని భయపెట్టి తోలేశాం. ఇది మా బెర్త్. గెటౌట్ డర్టీ క్రిస్టియన్. వెళ్లు, వెళ్లి నీ ఫ్రెండ్‌తో లావెట్రీలో వంగో."

జాకబ్ నెమ్మదిగా లేచి ఆ బెర్త్ వదిలేశాడు. కాషాయ వస్త్రధారులు ఆ బెర్త్ మడిచి కిందకి పెట్టి కింద బెర్త్ మీద అందరూ సర్దుకొని కూర్చున్నారు. రెండు బోగీల మధ్యన వున్న మధ్య దారిలోకి వచ్చాడు జాకబ్. అక్కడ ఎవరూ కనిపించక పోవడంతో గుండె గొంతులో కొట్టుకలాడింది జాకబ్‌కి. ఆ తర్వాత అతని ప్రక్క బోగీ ద్వారం దగ్గర నిలబడ్డ ఐసయ్య చీకట్లో వేగంగా వెనక్కి కదిలిపోతున్న వరిచేలు, చిన్న చిన్న చెట్లు, బంజరు భూముల్ని చూస్తూ కనిపించాడు.

"అయితే నిన్ను కూడా తరిమేశారన్న మాట?" అన్నాడు ఐసయ్య.

"తెల్లారితే వెళ్లిపోతారు వాళ్లు. వాళ్లు నీకేమైనా అపకారం తలపెట్టారా?"

"లేదు. నన్ను చూసి భయపడ్డట్టున్నారు. దూరాన్నించే పళ్లికిలించారు ఎలకల్లా. మరి నువ్వు?"

"నన్ను మోచేత్తో డొక్కలో పొడిచి వెళ్లిపోయేలా చేశారు. మన బ్యాగులు తీయరనుకుంటున్నాను."

"నువ్వు బ్యాగుల్ని గొలుసుతో బెర్త్‌కు ఎందుకు కట్టేశావో ఇప్పుడు నాకు అర్థమైంది" అన్నాడు ఐసయ్య.

ఢిల్లీకి చేరుకునేసరికి తెల్లవారుతూ ఉంది.

హోటల్ ఆధునిక మొగలాయి అలంకరణతో పాత పాతగా వుంది. వాళ్లు డైనింగ్ హాల్‌లో బ్రేక్‌ఫాస్ట్ చేసి పాత ఢిల్లీని చూడ్డానికి వెళ్లారు. అక్కడ చారిత్రక కట్టడం రెడ్‌ఫోర్ట్ దగ్గర రెండు ప్రవేశ టికెట్ కౌంటర్లని గమనించాడు ఐసయ్య.

"విదేశీయులు ఏభై రూపాయలు చెల్లించండి. ఇండియన్స్ ఐదు రూపాయలు చెల్లించండి!"

జాకబ్ చిన్నగా నవ్వుతూ “మీరు సంపన్నులని రాజకీయ నాయకులు నిర్ణయించినట్టున్నారు” అన్నాడు.

“బాగుంది. నేను కూడా అలాగే అనుకుంటున్నా. కౌంటర్లోని టికెట్ కలెక్టర్ ఐసయ్య వైపు ప్రశ్నార్థకంగా చూస్తూ ఇండియన్స్ లైన్‌లో రమ్మనమంటూ “సర్, తెల్లవాళ్లు పూర్తి ధర చెల్లిస్తారు. మీరు నల్లగా వున్నారు. ఇండియన్ ధర చెల్లించండి” అన్నాడు.

ఐసయ్య నవ్వుతూ అన్నాడు “నేను నోషనల్ ఇండియన్‌గా ఆదరించబడ్డాను. థాంక్యూ.”

వాళ్లు ఫోర్ట్ చుట్టూ తిరిగి చూశారు. నిటారుగా వున్న ఎత్తయిన గోపురం, దాని విస్తీర్ణం ఐసయ్యకి నచ్చాయి; అది స్పష్టంగా విస్తారమైన దేశ రాజధానికి గుండెకాయ వంటిదని చెప్పబడింది. చెక్కుచెదరని ఆ కట్టడంలో అతను ఢిల్లీ నగర శాశ్వత వాస్తవాన్ని చూడగలుగుతున్నాడు. వ్యాపారస్తుల్లా క్రియాశీలత కోలాహలంగా వుండే మిలటరీ స్థావరం, ఆడంబరమైన అత్యంత అధునాతన కోర్టుతోను పాలించే ప్రాంతంగా. ఆధునిక వాస్తవికతకి అది భిన్నమైనది కాదనడంలో అతనికి ఏమాత్రం సందేహం లేదు.

మరునాడు వాళ్లు కారు మాట్లాడుకుని ప్రపంచ వింతల్లో ఒకటైన తాజ్‌మహల్ చూడ్డానికి ఆగ్రా వెళ్లారు. విదేశీ సందర్శకులు అక్కడ కొంత సమయం గడుపుతారు. అక్కడ వాళ్లు ఓ గైడ్‌ని చూశారు. అతను చుడీదార్, కుర్తాలో పొడుగ్గా విలక్షణంగా వున్నాడు. ఆ స్మారక కట్టడం చుట్టూ వున్న కొందరు మొరటు వ్యక్తుల బారినపడకుండా వాళ్లని రక్షించాడతను. ఈ దేశంలో ఇది చాలా ముఖ్యమైన టూరిస్ట్ ఎట్రాక్షన్ అంటూ తాజ్‌మహల్ గొప్పదనం, కీర్తి చరిత్ర ఉర్దూ, హిందీ రెండు భాషలూ కలగలుపుతూ వివరించాడతను. అతను చెప్పిన విషయాలని ఆగి ఆగి అనువదించాడు జాకబ్. ఐసయ్య శోభాయమానమైన ప్రమాణాలతో కూడిన తాజ్‌ని చూసి ప్రభావితుడయ్యాడు. రెడ్ ఫోర్ట్ లాగే ఇది కూడా ప్రధానంగా నిరుపయోగమైనదిగా భావించాడు. ఆ గుమ్మటాల కింద ఎన్నడూ తిరగని ప్రేమికురాలి చిహ్నముంది. ఇక్కడి సంస్కృతి ఒక మెరుపులా అనిపించిందతనికి: అమెరికాలో ఏ ఒక్కరూ ఇలాంటిది నిర్మించరు. ఒకవేళ నిర్మించినా అందులో ఓ సభా భవనమో, కళామందిరమో, థియేటర్ లేక ఓ కేసినో నిర్వహిస్తారు. కానీ అందంగా అలంకరించి స్మృతి చిహ్నాలుగానో, పెయింటింగ్ లేక ప్రతిమలానో మిగిలిపోయేలా వ్యర్థంగా వుంచబడవు: ఆ ఆలోచన అసాధారణమైనదైనా లేక వృత్తిపరమైనదైనా, అదో చైతన్యంలా అనిపిస్తుంది.

“బ్రిటిష్ సామ్రాజ్యం ఇలాంటిది ఎన్నడైనా ఏదైనా నిర్మించిందా? ఇక్కడ ఎక్కడైనా బ్రిటిషర్స్ నిర్మించిన చారిత్రక ప్రాశస్త్యం గల స్మారక కట్టడం వుందా?’ అడిగాడు ఐసయ్య.

"అలాంటివేమీ లేవు" అన్నాడు సమాధానంగా గైడ్. కలకత్తా నడి మధ్య క్వీన్‌వేలో చారిత్రాత్మకమైన విక్టోరియా మెమోరియల్ ఒక్కటే వుంది. అది ఒక మ్యూజియం. తెల్లని చలవరాయితో తాపడం చేయబడ్డ మనోహరమైన లతని చూపిస్తూ గైడ్ 'మీరు చూస్తున్న ఈ లతలో పొదిగిన రత్నాలు ఆకుపచ్చ మేలకైట్, ఊదా అమెథిస్ట్, ఆరెంజ్ చంద్రకాంత, రోజ్ స్ఫటికం, ముత్యం, వైఢూర్యం. ఇవి సెమి ప్రెషస్. ఈ టెక్నిక్ పదహారవ శతాబ్దిలో 'పియట్రా డ్యూరా ప్రక్రియ'గా విస్తరించబడింది. ఇవి ప్రసిద్ధి చెందిన ప్రియట్రాడ్యూరా టెక్నిక్‌తో రూపొందించబడి అత్యంత మనోజ్ఞంగా ఉండి మనసుకు ఆహ్లాదం కలిగిస్తాయి.

"అవునూ... నీ పేరేంటి?" అడిగాడు ఐసయ్య గైడ్ నమ్రత, మృదు స్వభావం చూసి. "నాపేరు షాబుద్దీన్. వాస్తవానికి మాది బనారస్; నేను అక్కడ స్కాలర్‌గా పనిచేశాను. రోజులు కఠినంగా మారాయి. ఇబ్బందిగా వుంది అన్నాడతను. "మొగలాయిల పట్ల నాకు ప్రత్యేక అభిమానం ఉంది. మారాజులందరూ మంచివారయ్యుంటే గనక ఇండియా మొత్తం ముస్లిం దేశం అయ్యేది" అన్నాడు క్షమాపణలు కోరుతున్నట్లుగా భుజాలెగరేస్తూ.

"నువ్వు అలా ఎందుకు ఆలోచిస్తున్నావు? అడిగాడు ఐసయ్య ఆశ్చర్యంతో.

"కులం కారణంగా. అంటరాని వాళ్లకి, శూద్రులకి మరో మార్గం లేదు, అల్లాహ్ మార్గం తప్ప. ఇక్కడికి ఇస్లాం రాకముందు ఆకాశంపైన అల్లాహ్ వున్నాడని వాళ్లకి తెలియదు. వాళ్ల దగ్గర పంచి ఇవ్వడానికి ప్రేమలు, ఆప్యాయతలు, సహోదరత్వం లాంటివి లేవు. కేవలం శాపనార్థాలు, ప్రలోభాలు తప్ప. సార్, ఇప్పుడు బ్రాహ్మణులు, కాయస్థలు, రాజపుత్రులు తప్ప మిగిలిన వారంతా అల్లాహ్ దగ్గరకే చేరతారు. మరి వాళ్లెందుకు చేరరు? హిందూయిజం వాళ్లకి ఇచ్చినదేంటి? ఇందులోని వాస్తవం నాకు తెలుసు, నా స్వీయ చరిత్రవల్ల. మా తాత ఓ దోభీ. పవిత్ర బనారస్ నగరంలో బట్టలు వుతుకుతాడు. మేము కూడా అంటరానివాళ్లమే. చదువూ సంధ్యలూ ఏమీ లేవు.

"నిజమా?" అన్నాడు ఐసయ్య ఆ మాటల్ని జాకబ్ అనువదించి చెప్పగానే.

"నువ్వు ఇక్కడికి ఎలా వచ్చావు?" అడిగాడు ఐసయ్య.

"మేము అగ్రకులస్తుల బట్టలు శుభ్రం చేస్తూ జీవితం గడిపాం. నాకు ఆ సంగతి ఇప్పటికీ బాగా గుర్తుంది. ఒకరోజు ఎండిపోయిన వాంతి మరకలున్న సిల్కు ధోతీ శుభ్రం చేయడానికి మా నాన్న రోజంతా కష్టపడాల్సి వచ్చింది. బట్టల్ని ఉతికి ఆరేయటానికి మేము ఎంతో కష్టపడతాం. వాటిని తీసుకువచ్చి ఒక్కొక్కటిగా ఇస్త్రీ చేసి మడతలు పెట్టి స్వంతదారులు వాటిని తీసుకువెళ్లే ముందు 'శుద్ధి' అయ్యేందుకు వాటిపైన గంగాజలం

చల్లుతాం ఎందుకంటే ఆ అగ్రకులాల వాళ్ల బట్టలు మేము తాకడం వల్ల అపవిత్రం అవుతాయి. వాటి మీద నీళ్లు చల్లి సంప్రదాయబద్ధంగా వాటిని పవిత్రం చేయాల్సి వుంటుంది. అందుకు బదులుగా ఇళ్లలో మిగిలిపోయిన పాచిపోయిన ఆహారం ఇస్తారు వాళ్లు. ఆ విధంగా మేము కుక్కల్లా బతికాం – కుక్కల కన్నా హీనంగా. ఎందుకంటే కొట్టినంత మాత్రాన కుక్కలు శ్రమించవు. పశువుల్లా అన్నమాట. మా వాళ్లెవరూ పుస్తకమన్నది ఎప్పుడూ చూడలేదు అల్లాహ్ పుస్తకం చూసేంత వరకు" అంటూ అతను జేబులోంచి ఓ చిన్న బౌండు బుక్కు తీశాడు.

"అల్లాహ్ పదం మీకు చెప్పిందెవరు?" అడిగాడు ఐసయ్య.

"అదంతా ఓ పెద్ద కథ నిదానంగా చెబుతాను గానీ మనం ఆ దాబాలో కూర్చుందాం. అది నడుపుతోంది నా స్నేహితుడే; మనం ఎంతసేపైనా అక్కడ కూర్చోవచ్చు" అంటూ నవ్వాడతను. క్షమ యాచించే రీతిలో చక్కని రూపురేఖలు ముడతలు పడ్తుండగా. నా కథ విలువైన మీ సమయాన్ని తీసుకుంటుంది. అందుకని మీరు సౌకర్యవంతంగా కూర్చోండి" అన్నాడు గైడ్.

ఐసయ్య, జాకబ్ పరయ్యా ధాబా బైట కస్టమర్ల కోసం వున్న నులకమంచం మీద కూర్చున్నారు. పైజామా కుర్తా ధరించిన ముస్లిం యువకులు కొందరు కస్టమర్లకు కావలసిన చాయ్, ఆనియన్ సలాడ్, గ్రీన్ చిల్లీస్ వున్న ఆహారపదార్థాలు సర్వ్ చేస్తూ హడావుడిగా తిరుగుతున్నారు. గాజు గ్లాసులు గల గలమంటున్నాయి. ఐసయ్య, జాకబ్ పరయ్యాలకి బాగా ఆకలిగా వుంది. కానీ ఐసయ్య ధాబాలోని పరిశుభ్రతపైన నమ్మకం కుదరలేదు. షాబుద్దీన్ ఓ కుర్రాడిని సైగ చేసి పిలిచి శుభ్రమైన ప్లేట్లలో అప్పటికప్పుడు ఫ్రెష్‌గా తయారు చేసిన పొగలు కక్కే వేడి పదార్థాలు తీసుకు రావాల్సిందిగా ఆర్డర్ చేశాడు. "మీకేమీ హాని కలిగించవు సాబ్, వాళ్లు ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుంటారు" అన్నాడు షాబుద్దీన్.

ముందు గరం గరంగా చాయ్ వచ్చింది. తర్వాత రోటీలు, పాలక్ పన్నీర్ వచ్చాయి. 'మంచి రుచిగా వున్నాయి!' అన్నాడు బిగ్గరగా ఐసయ్య. జాకబ్ అనువదించాడు కానీ ఐసయ్య నవ్వు మొహం చూసి ముందే అర్థం చేసుకున్నాడు షాబుద్దీన్.

"ఇప్పుడు నన్ను చెప్పనివ్వండి, మా తాత దోభీరాం అల్లాహ్‌ని ఎలా గుర్తించాడో" అన్నాడు షాబుద్దీన్ తినడం ముగించగానే. ఒకరోజు మా నాన్న చెప్పాడు. అతని తండ్రి మా ఊరిలోని దోభీఘాట్ దగ్గరున్న రేవులో బట్టలు వుతుకుతున్నాడు. ఓ గొప్ప సూఫీ సాధువు శుద్ధి చేసుకోవడానికి అక్కడికి వచ్చాడు. నమాజు చేశాడు. ఆహారం తిన్నాడు. మా తాతకి కూడా పెట్టాడు. మా తాత తిన్నాడు. చక్కగా వండి తయారు చేసిన బిర్యానీ

అది. ఆ సాధువు మా తాత కలిసి ఒకే ఆకులో వున్న బిర్యానీని షేర్ చేసుకున్నారు. దోభీ జీవితంలో మొట్ట మొదటిసారి ఓ మతానికి చెందిన సాధువు అతనితో కలిసి తిన్నాడు. అతని కోసం ప్రార్థన చేశాడు. ఆ సాధువు మా తాతకి అల్లాహ్ పుస్తకం, పవిత్ర ఖురాన్ కూడా ఇచ్చాడు. కానీ మా తాతకి చదువు రాదు. మా తాత ఆ పుస్తకాన్ని చేతిలో పట్టుకున్నాడు, పెద్ద బంగారు ముద్దలా. మా తాత ఆ పుస్తకాన్ని మరీ మరీ ముద్దాడాడు.

మా తాత ఎంతగానో ఉత్తేజితుడయ్యాడు. అతను అప్పటికప్పుడే అక్కడే అల్లాహ్‌ని చూడాలనుకున్నాడు. కానీ ఆ మత సాధువు కొన్ని రోజులు ఆగి అల్లాహ్ గురించి తీవ్రంగా ఆలోచించమన్నాడు. నాలుగు రోజుల తర్వాత ఆ మతసాధువు మళ్లీ మా తాత ఇంటికి వచ్చాడు. మా తాత తను ముసల్మాన్‌గా మారాలనుకుంటున్నట్లుగా ఆ సాధువుకి చెప్పాడు. అందుకు ఆ సాధువు గతంలో లాగే కొన్ని రోజులు ఆగమన్నాడు. మా తాత దుఃఖిస్తూ అన్నాడు, “నాకు అల్లాహ్‌ని చూడాలని వుంది. ఓ మనిషిగా మారాలని వుంది.” మా తాత మనఃస్ఫూర్తిగా ముస్లింగా మారడానికి ఆసక్తి కనబరుస్తున్నాడని ఆ సూఫీ సాధువుకి నమ్మకం కుదిరింది. మా తాతని స్నానం చేసి పైజామా కుర్తా ధరించి రమ్మనమన్నాడు ఆ సాధువు. మా తాత ఇంట్లో ఉతకడానికిచ్చి తీసుకువెళ్ళని దుస్తులున్నాయి. అందులో కుర్తా పైజామా సెట్ కూడా వుంది. మా తాత వాటిని తొడుక్కున్నాడు. మా తాత గాంధీలా బట్టలు కట్టేవాడు – మీకు తెలుసా గాంధీ, అవునా?

“అవును” అన్నాడు ఐసయ్య ఆసక్తిగా వింటూ.. “ఓహో”.

మా తాతకి తల నుంచి పాదాల వరకు దుస్తులుండడం హిందూ సాంప్రదాయక చట్ట ప్రకారం గొప్ప నేరం. తనని దుర్భాషలాడొచ్చు. తన మీద దాడి చేయవచ్చు. తన్ని శిక్షించవచ్చు. అయినాసరే ఆ బట్టలు తొడుక్కోడానికి ఆయన నిర్ణయించుకున్నాడు. మా తాతకి తలతిరిగినట్లైంది. అయినప్పటికీ ఓ అసాధారణమైన ధైర్యం కలిగిందతనికి. బహుశా అతనిపైన అల్లాహ్ ప్రభావం వుండవచ్చు. ఆ బట్టలు తన ఒంటిని తాకగానే అతను భిన్నంగా దృఢంగా మారడమే కాకుండా అధిక భద్రత కలిగినట్లుగా అనిపించిందతనికి. మా తాతని చూడగానే ఇంట్లో వాళ్లంతా షాకయ్యారు. అతని భార్య – మా నాయనమ్మ ముస్లిం బట్టలు కట్టుకున్నందుకు మా తాతని నిందించింది. జరగబోయే పరిణామాలకి ఆమెకి భయం వేసింది. మా తాత ఏమీ మాట్లాడలేదు. ఎందుకంటే ఆమె వండిన రుచికర పదార్థాలని తినడం, ఆమె వంటని ఆస్వాదించడం చేశాడతను. కానీ ఆహారం వండడానికి ఇంకా అందుకు తగిన సందర్భాలు, వనరులు ఇంట్లో చాలా తక్కువ. చాలా మంది దోభీలు వండిన వాటినే తింటూ గడిపేస్తారు, అది కూడా పాచి పోయినది,

ఖాతాదారులు ఇచ్చినవి. మా తాత సూఫీ సన్యాసి దగ్గరకి వెళ్లాడు. తన వెంట రమ్మంటూ మా తాతకి సైగ చేశాడాయన.

ఆయన మా తాతని దగ్గర్లో వున్న మసీదుకి తీసుకువెళ్లాడు. వజూ (నమాజు ముందు మొహం, కాళ్లూ, చేతులు మూడేసిసార్లు కడుక్కోవడం) చేయించాడు. అంత గొప్ప మసీదు భవంతిలోకి ప్రవేశించే అవకాశం వస్తుందని దోభీరామ్ కలలో కూడా వూహించలేదు. సూఫీ సన్యాసి ఖురాన్‌లోని అధ్యాయం ఒకటి తీసి దాన్ని తెరచి వుంచి చదవమన్నాడు. అయితే దోభీరాం చదవలేకపోయాడు. వెంటనే సూఫీ సన్యాసి అన్నాడు, "ఫరవాలేదు, నేర్చుకుందువు గాని. నువ్వు ప్రతీ శుక్రవారం ఈ మసీదుకి వస్తూవుండు. వీళ్లు ఖురాన్‌లోని సూరాలను చదవటం నీకు నేర్పిస్తారు. ఇప్పుడు ఆ పుస్తకం అలాగే తెరిచి పట్టుకుని అక్షరాల వైపు చూస్తూ వుండు" అంటూ మా తాతని 'అల్లాహ్ హు అక్బర్' అని అనమన్నాడు. ఆ తర్వాత తను అన్నమాటల్ని తిరిగి ఉచ్చరించమన్నాడు, "అల్లాహ్ గొప్పవాడు, మహమ్మద్ అతని ప్రవక్త అని నేను నమ్ముతున్నాను." మా తాత కాలిమా పదాలను పునరుచ్ఛరించాడు. మా తాతని చేతులు పైకెత్తి అరచేతులు చూడమన్నాడతను. అరచేతులు చదవలేని వారికి పుస్తకంలాంటిది అన్నాడతను. "ఆ అరచేతిలోని రేఖలు అల్లాహ్ రాసినవి. వాటిని జాగ్రత్తగా చదువు" అంటూ మా తాతని మోకాళ్ల మీద వంగి నుదుటిని నేల కానించి ఆ తర్వాత నిలబడి చేతులు జోడించి మసీదులో గోడపైన అల్లాహ్ పేరు మీద వున్న అక్షరాలని చదవమన్నాడు. ఇది ఇలా వుండగా ధనికులు పేదలు అన్న తారతమ్యం లేకుండా అందరూ 'జోహార్', మధ్యాహ్నం వేళ చేసే నమాజుకి మసీదులో జమ అవసాగారు. 'ఆ రోజు జుమ్మా.. శుక్రవారం' అన్నాడు షాబుద్దీన్.

"ఈ వ్యక్తి గొప్ప కథకుడు" అనుకున్నాడు ఐసయ్య చివరి భాగాన్ని జాకబ్ అనువదించడం పూర్తి కాగానే. అతను మూడోసారి టీ తాగాడు. అతను చెబుతుండగా ఐసయ్యతో పాటు వెయిటర్లు కూడా చుట్టూ నిలబడి కుతూహలంగా వినసాగారు.

షాబుద్దీన్ చెప్పడం కొనసాగించాడు. "సంపన్నుడైన ఓ వ్యక్తి మా తాతని గుర్తుపట్టి పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆ వ్యక్తిని మా తాత నవాబుగా తలచేవాడు, నవాబు కానప్పటికీ. అతను మా తాత ఖాతాదారుడు. అతను మా తాత దగ్గరకి వచ్చి "దోభీ రాం నువ్వు ముసల్మాన్‌గా మారావా. అల్లాహ్ నిన్ను ఇక్కడికి రప్పించాడు. అద్భుతం దివ్యంగా వుంది!" అంటూ మా తాతని ఆలింగనం చేసుకున్నాడు. అక్కడ వున్నవాళ్లంతా మా తాతని గుండెలకు హత్తుకున్నారు. నిజంగా నవాబు తనని ఆలింగనం చేసుకున్నాడా అని ఆశ్చర్యపోతూ మా తాత మళ్లీ అన్నాడు, "అల్లాహ్.. హు.. అక్బర్!"

సూఫీ సన్యాసి దోభీరాం పేరుని జలాలుద్దీన్‌గా ప్రకటించాడు. “మరి నా పెళ్లాం పిల్లల సంగతేంటి?” అని అడిగాడు జలాలుద్దీన్. అందుకు ఆ సన్యాసి అన్నాడు, “అల్లాహ్ ఆత్మని స్వీకరిస్తాడు, వ్యక్తి ఒడంబడిక ఆధారంగా. ఒకవేళ అల్లాహ్ గనక నీ భార్యా పిల్లల్ని పిలిస్తే వాళ్లంతట వాళ్లే ఖురాన్‌ని స్వీకరించాల్సి వుంటుంది.” నమాజు పూర్తవ్వగానే సూఫీ సన్యాసిని, జలాలుద్దీన్‌ని నవాబు తన ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. నవాబు రజకుడు అయిన దోభీరాం ఇప్పుడు ఓ గెస్ట్‌గా నవాబు ఇంటికి వెళ్తున్నాడు. అతను మసీదు నించి తిన్నగా నవాబు ఇంటికి వెళ్లాడు. వాళ్లు టేబిల్ దగ్గర కూర్చుని ఒకే డిష్‌లో వున్న బిర్యానీ తిన్నారు. మా తాత నవాబు టేబిల్ దగ్గరికి వెళ్ళేటంత సన్నిహితుడు కాదు. మా తాత తప్పులు చేయలేదనికాదు కానీ అందుకు సిగ్గుపడేలా ఒక్కసారి కూడా నవాబు ప్రవర్తించలేదు. మా తాత నవాబుతో కంఠం వణుకుతుండగా అన్నాడు. “నేను మీ సేవకుణ్ణి” అందుకు నవాబు “నాన్సెన్స్, అల్లాహ్ దృష్టిలో అంతా సమానమే” అంటూ ఇదిగో నా చేతిలో వున్న ఈ చిన్న ఖురాన్‌ని మా తాతకి ఇచ్చాడు.

షాబుద్దీన్ చేతిలో రంగుల సిల్కుతో వున్న చిన్న పుస్తకాన్ని చూడగానే ఐసయ్య తలతిరిగినట్లైంది. అయితే తనకి తెలుసు ఇండియాలో ముస్లింలతో పాటు హిందువులు కూడా వున్నారని, కాని ఇలాంటి పరిణామాలు ఇప్పటివరకు ఎదురు కాలేదతనికి. ఇది మద్రాసులో తనని కలిసిన కపట ఫాదర్లకన్నా భిన్నమైన పరిస్థితి. ఐసయ్య మదిలో ఎన్నో రకాల ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి. ఇండియన్ క్రిస్టియన్‌లలా, ఇండియన్ ముస్లిం సమాజంలో కుల సంప్రదాయాలు నెలకొన్నాయా? మతాంతరిత అంటరాని ముస్లింలు రోజీ, డేనియల్‌లాగా మురికివాడలలో నివసిస్తారా? ఇప్పుడు తన స్థానిక చర్చి గురించి సమాచారం లభించింది ఐసయ్యకి. వాళ్లు ఆశ్చర్యపోయారు. ఎందుకంటే ఒకవేళ హింస, బాధ, అన్యాయం, అధర్మాల కుల వ్యవస్థ నించి క్రిస్టియానిటీ బయటపడే మార్గాన్ని ప్రతిపాదిస్తే భారతీయులు క్రిస్టియన్‌లుగా మారటానికి అయిష్టత కనబరుస్తారా? ఆ సమాజంలో కులాన్ని గురించి నిరంతర ప్రయత్నంలోనే సమాధానం ఇమిడి వుంది. ఒకవేళ ముస్లింలు తులనాత్మకంగా కులనిర్బంధం లేని విధంగా వుంటే బహుశా అప్పుడు అంటరానివాళ్లు ఆ ఆప్షన్‌ని ఎంచుకోవచ్చు. అంబేడ్కర్ ఓ బుద్దిస్ట్‌లా వుండాలనుకున్నాడు కానీ ఇంతవరకూ అతను ఏ ఒక్క భారతీయ బుద్దిస్ట్‌ని కలవలేదన్న విషయం జ్ఞప్తికి తెచ్చుకున్నాడు ఐసయ్య. దీని గురించి జాకబ్‌ని తర్వాత అడగాలనిపించి విషయాన్ని దాటవేశాడు ఐసయ్య.

"తర్వాత ఏమైంది?" అడిగాడు ఐసయ్యా షాబుద్దీన్ పుస్తకాన్ని పక్కన పెడుతుండగా. "మీ తాత మతాంతరీకరణాన్ని హిందువులు సమ్మతించారా?" అడిగాడు ఐసయ్య.

ఆ ప్రశ్న వినగానే షాబుద్దీన్ మొహం గంభీరంగా మారింది. "ఐయామ్ సారీ," నా తర్వాతి కథ మిమ్మల్ని బాధపెడుతుంది" అంటూ షాబుద్దీన్ చెప్పడం కొనసాగించాడు. "మా తాత పారిపోయాడన్న వార్త క్షణాల్లో పాకిపోయింది. గ్రామ పురోహితుడు స్థానిక భూస్వామిని కలిశాడు. వెంటనే ఆ భూస్వామి దృఢకాయులైన కొందరు వ్యక్తులని పురోహితుని ఆధీనంలో వుంచాడు. మంచి బలంగా వున్న ఆ వ్యక్తులు మాలాగే అంటరానివాళ్లు. కానీ తాము హనుమాన్ ప్రతిరూపాలమని, రాముడి ఆజ్ఞ శిరసావహించి రాముని బంటు అయిన హనుమాన్ అనే కోతి రాముడి కోసం యుద్ధం చేశాడని, రాముడి కోసం అతని మీదున్న ప్రేమతో సుదీర్ఘమైన ప్రయాణాలు చేశాడని తమ మాటలపై నమ్మకం కలిగేలా ప్రజలందరి బుర్రల్లోకి ఎక్కించారు వాళ్లు. అంతే కాదు, ఈ రోజుకీ ప్రజలంతా ఈ కథని నమ్ముతారంటూ వాళ్ల ఆలోచనాసరళిలో మార్పు కలిగేలా పదే పదే వాళ్లకి చెప్పారు. ఆ విధంగా భూస్వామి పట్ల గల ప్రేమతో ఆ అంటరాని వ్యక్తులు మా తాత ఇంటికి వచ్చారు. ఇలా జరుగుతుందని మా తాత ముందే భయపడ్డాడు. కానీ ఏం చేయాలన్నది ఆయనకి పాలుపోలేదు. మా నానమ్మ మంచి తెలివైనది కావడంతో ఏడేళ్ల చిన్నవాడైన మా నాన్న చేతిలో ఖురాన్‌ని వుంచి ఎలాంటి పరిస్థితుల్లోనూ దాన్ని వదలొద్దని, తాను చెప్పేటంత వరకు ఒక్క ఇంచీ కూడా కదలొద్దని గట్టిగా చెప్పి మా నాన్నని ఓ బట్టల మూటలో చుట్టి గాలి పీల్చడానికి 'స్ట్రా'తో పెరట్లోని గడ్డివాములో కప్పి వుంచింది. ఆ మూటలోంచి మా నాన్నకి ఏమి కన్పించలేదు కాని ఎవరివో మాటలు వినిపించాయి. అదే చెడ్డ అయింది. తలుపుతట్టి లోపలికి వచ్చిన వ్యక్తులు ముందు మర్యాదగానే మాట్లాడారు. ధోబీరాం మంచివాడని, పెద్దమనిషన్న వుద్దేశంతో చూడాలని వచ్చినట్లుగా వాళ్లు నమ్మబలికారు. ఆ తర్వాత వాళ్ల లోని నాయకుడు అన్నాడు. "నువ్వు గొడ్డుమాంసం తినేవాడి నించి కానుక ఏదో తీసుకున్నావని తెలిసింది. ఆ విలువైన కానుక నేను చూడొచ్చా?" అక్కడంతా నిశ్శబ్దం తాండవించింది. ఇంతలో "వెతకండి, మూలమూలలా వెతకండి ఇల్లంతా వెతకండి" అన్న మాటలతో నిశ్శబ్దం పటాపంచలైంది. ఆ బట్టల మూటలో కూర్చున్న మా నాన్న భయకంపితుడై బిగబట్టిన పెదాల నుంచి శబ్దం బయటకు రానివ్వలేదు. ఆ తర్వాత బాధతో పెడుతున్న అరుపులు, చేస్తున్న మూలుగులు హృదయ విదారకంగా మా నాన్న చెవిని తాకాయి. ఆ మూలుగు చాలాసేపటి వరకు అలాగే కొనసాగింది. తర్వాత క్షమించమని వేడుకున్న కేకలో ఆ మూలుగు కలిసిపోయింది. సరిగా అప్పుడే ఆర్తనాదం!

తను ఆ బట్టల మూటలో ఎంతసేపు వుండాలో మా నాన్నకి తెలియలేదు. తన శరీరంలోని కొంతభాగం ఇంకా అక్కడుందని అతనన్నాడు. అతనికి తెలిసింది ఒక్కటే. తను ఆ పుస్తకాన్ని ఎట్టి పరిస్థితుల్లోనూ వదలకూడదని. ఒకానొక క్షణాన తను భుజం ఎముకపైన దారుణంగా దెబ్బపడినట్లై కళ్లు బైర్లు కమ్మినట్లవడంతో బట్టల మూటలోంచి బయటకి వచ్చాడు మానాన్న. ఓ పెద్ద పట్టాకత్తి ఆ మూట మధ్యలోంచి సూటిగా దూసుకెళ్లి మా నాన్న వీపుని ఛేదించింది. మా నాన్న వీపు గీరుకుపోయింది. గీరుకుపోయిన తునక ఆ మూటలో అలాగే వుంది. మా నాన్నకి కత్తి వల్ల ఏర్పడిన ఆ ఎర్రటి చార ఇప్పటికి అలాగే వుండిపోయింది. బలహీనమైన అడుగులతో పెరట్లోంచి మా నాన్న బయటకి వచ్చాడు. ఇల్లంతా నెత్తురుమయం. మా నాన్న అడుగులు వేస్తుంటే మెత్తగా ఏదో తగిలింది. బయటకి వచ్చేసరికి మా నాన్న చేతులు మోకాళ్లూ రక్తంతో నల్లగా మారాయి. రోడ్డు నడిబొడ్డున అతని అత్త శరీరం పడివుంది. ఎనిమిదినెల్ల గర్భిణి ఆమె. ఆమె మొహానికి ఏం కాలేదు కానీ రొమ్ము నించి కింద వరకు శరీరం ఛిద్రమైంది. కండలు ముక్కలు ముక్కలై శరీరం గుల్లగా మారింది. ఆమె ప్రక్కన రక్తంలో ఓ ఆకారం పడి వుంది. బహుశా ఓ మనిషై వుండొచ్చు.

"చూశారా, మీకు ఇబ్బంది కలిగిస్తున్నాను" అన్నాడు షాబుద్దీన్.

"లేదు, లేదు" అంటూ ఐసయ్య. "అంటే నా ఉద్దేశం, ఇది వినాలంటే బాధగా వుంటుంది. కానీ మా నానమ్మ ఎప్పుడు చెప్పేది సత్యానికి భయపడవద్దని. నువ్వు ఉన్నది ఉన్నట్టుగా చెప్పు నేను స్వీకరిస్తాను" అన్నాడు ఐసయ్య.

"మీ నానమ్మ వివేకంగల మహిళ."

"ఆమె ఎన్నో కష్టాలను చూసింది. నీలాంటివి కావు. ప్లీజ్ చెప్పు."

"మా నాన్న ఇంట్లోంచి బైటపడి నవాబు భవనం వైపు వెళ్లాడు. నోట్లోంచి మాట రావడం లేదు. ఆ పవిత్ర పుస్తకాన్ని చేతుల్తో అలాగే పట్టుకున్నాడు. మెయిన్ గేటు వద్ద నిలుచున్న సేవకుడు ఒకడు మా నాన్నని చూసి లోపలికి తీసుకువెళ్లాడు. ఆ పిల్లాడి ముఖంపైన, శరీరంపైన నెత్తురు మరకలు చూసి నవాబు దుఃఖించాడు. మా నాన్న ఓ విధమైన అచేతనంలో వుండిపోయాడు. ఆ తర్వాత కోలుకోవడానికి చాలా సమయం పట్టిందని నాకు తెలిసింది. ఆ సమయంలో మా నాన్నకి నవాబు తన ఇంట్లో రక్షణ కల్పించాడు. మా నాన్న నెమ్మదిగా కోలుకున్నాడు. కాని అప్పుడప్పుడు భయంకరమైన ఆ రాత్రి కలలో కొచ్చి అతన్ని భయానికి గురిచేసేది. కొద్దిగా కోలుకున్న తర్వాత నవాబు మా నాన్నని మదర్సాలో చేరడానికి బనారస్ పంపించాడు. మా నాన్నకి ఉద్యోగం దొరికింది.

నవాబు సేవకురాల్ని పెళ్లి చేసుకుని నన్ను కన్నాడు. మా నాన్న పుట్టుకతోనే ముస్లిం అని నేను ఎంతోకాలంగా భావిస్తూ వచ్చాను. ఈ విషయాలన్నీ చనిపోయే ముందు మా నాన్న నాకు చెప్పాడు. అది నాలో ఎన్నో మార్పులకి కారణభూతమైంది. అతను ఒక్కోసారి తనలో తాను దుఃఖపడడం, మా అమ్మ కూడా అప్పుడప్పుడు జాలిచూపడం నాకు అర్థమయింది.

నా కుటుంబం పగ, ద్వేషాలకి లక్ష్యం అయిందన్న విషయం నా నోట్లోని ఆహారాన్ని బూడిదగా మార్చింది. గాలిని ధూళిగా మార్చింది. ఇప్పుడు నేను న్యాయం కోసం కలలు కంటున్నాను. వాళ్లు చేసిన పనికి ఆ క్రిమినల్స్ అనుభవించి తీరాలని కలలు కంటున్నాను. ఉపాయం వుంటేనే...

ఆ మాటలు అసమగ్రంగా వున్నాయని గ్రహించిన ఐసయ్య "ఐయామ్ సారీ" అంటూ "కానీ నీ కొత్త జీవితం సంగతేంటి, కులం ఎప్పుడైనా నీకు ఇబ్బంది కలిగించిందా? ఎవరైనా ఎప్పుడైనా నీ మూలాల గురించి నీ మొహంపైనే తెలియజేశారా? అడిగాడు.

"లేదు" అన్నాడు షాబుద్దీన్ తీక్షణమైన చూపులతో. 'ఖురాన్ సరిగా తెలియకపోవడంతో ఒకసారి, రంజాన్ మాసంలో కన్నీటిని చప్పరించినందుకు మరోసారి దెబ్బలు తిన్నాను. కానీ నా జీవితంలో తోటి ముసల్మాన్‌లు ఎవరూ నన్ను ఎన్నడూ విభిన్నంగా చూడలేదు నా పుట్టుక కారణంగా. అందువల్ల నాకు తెలుసు మేము చేసింది సరైందే. మేము జీవించగలమని."

"నువ్వు హిందువులను ద్వేషిస్తావా?"

"లేదు, నేను ధర్మం ఆచరిస్తాను. తప్పు చేసిన వాళ్ళకి దండన ఉండదా? వాళ్లు శిక్షింపబడాలి; మా కుటుంబానికి చేసిన అన్యాయానికి ప్రాయశ్చిత్తంగా. అప్పుడే నాకు మనశ్శాంతి."

"కానీ అది శాశ్వతమైన బెదిరింపులకి ప్రతీకారానికి కారణం అవ్వదా?"

"అలాగని ఎందుకనుకోవాలి? నేను మాట్లాడేది హేతుబద్ధమైంది. వాళ్లు గనక శిక్షింపబడకపోతే ఇతరులని కూడా వాళ్లు ఈ విధంగానే చిత్రహింసలకి గురిచేస్తారు. మరో కుటుంబాన్ని నాశనం చేస్తారు. నాలా మరో కుర్రాడు ఈ వ్యథకు గురి కాకూడదు. ఎందుకంటే వాళ్లకి దేవుణ్ణి ఆలింగనం చేసుకునే సాహసం వుంది. దేవుడు అన్నాడు, అక్రమాలకి సమాధానం శిక్షేనని. అయినా ఈ దేశంలోని న్యాయం, చట్టం నా కుటుంబ హంతకులని శిక్షించడమన్నది ఎన్నటికీ జరగదు. ఇప్పుడు పగ, ద్వేషం ఇంకా అసత్యంతో కూడిన ఈ దేవాలయాన్ని పడగొట్టడానికి నాకు ఒక శామ్‌సన్ అవసరం వుంది.

శామ్‌సన్ ఓ అంధుడు అనుకున్నాడు జాకబ్ పరయ్య. కానీ అతను ఏదీ మాట్లాడకుండా ఐసయ్యని కారు దగ్గరికి తీసుకువెళ్లాడు.

జాకబ్ గ్లాసులో విస్కీ పోసీ ఐసుముక్కలు కలిపి "తీసుకో... చాలా సమయం అయింది. ఇది నీకు అవసరం" అన్నాడు.

"మీ ఇండియన్స్ విస్కీలో ఐసు ఎక్కువ వేసుకుంటారు" గొణిగినట్టుగా నవ్వుతూ అన్నాడు ఐసయ్య. ఒక సిప్ చేసి ముఖం వికారంగా పెట్టి "ఈ దేశం బోర్బన్ (ఒక రకమైన విస్కీ) పేరు ఎప్పుడైనా విందా?" అడిగాడు ఐసయ్య.

"సారీ" అని పళ్లు ఇకిలిస్తూ జాకోబ్ "చాలావరకు మాది విస్కీ తాగే జాతి కాదు. హిందువులకి ఇష్టమైన మద్యం నెయ్యి. ద్రవరూపంలోకి వేడిచేయబడ్డ వెన్న. నీకు నచ్చదు" అన్నాడు.

"నువ్వు నా గొలుసు లాగుతున్నావు మళ్లీ. కాదా? అంటూ ఐసయ్య దీర్ఘంగా నిట్టూరు విడిచాడు.

జాకబు భుజాలు ఎగరేస్తూ "షాబుద్దీన్ వాళ్లని ద్వేషిస్తూనే వుంటాడు. ఏదో ఒకరోజు అతను ప్రతీకారం తీర్చుకోవటమే లక్ష్యంగా వ్యవహరిస్తాడు. అతనికి నా కథ చెప్పాలనుకున్నాను, అతను చెప్పిన దానికి బదులుగా. కానీ అతని గాయాలు ఇంకా పచ్చిగానే వుండడంతో ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాను. అంతేకాక తనతో నేను పోటీ పడుతున్నానని భావించే అవకాశముంది. నీకు తెలుసా, పీడించే బ్రాహ్మణులు, వాళ్ల సన్నిహితుల పట్ల మా ఇద్దరిలో పాపాలు ఎవరు ఎక్కువ చేశారో? ఓ పిచ్చి ఆట" అన్నాడు.

"నువ్వు కూడా మా నానమ్మలా తెలివైనవాడివి, అదే కారణంగా జాకబ్ నన్ను ఏదో హైరానా పెడుతోంది. షాబుద్దీన్ బనారస్ గురించి చెప్తూ అదేదో ముస్లిం నగరం అన్నట్టుగా చెప్పాడు. అయినా నేను బుక్‌స్టోర్స్‌లో చూసిన పుస్తకాలెన్నో బనారస్‌ని ఓ పవిత్ర హిందూ ప్రాంతంగా వివరించాయి. వాస్తవం ఏంటి?

"మీరు పవిత్రమైన జెరూసలేమ్ గురించి ఆలోచించండి" అన్నాడు జాకబ్. అది మాదంటే మాదంటూ మూడు మతాల వాళ్లు కొన్ని శతాబ్దాల పాటు దెబ్బలాడుకున్నారు. బనారస్ కూడా కొంతవరకు అలాంటిదే. అయినా కాదు. ఎందుకంటే దాని గురించి అక్కడి వాళ్లు దెబ్బలాడుకోరు. బహుశా అది స్విట్జర్‌లాండ్ లాంటిది. అక్కడి నాగరీకులు కలిసి మెలిసి వుంటారు. నేను ఎన్నడూ బనారస్ వెళ్లలేదు. బనారస్ స్వర్గానికి ప్రతిరూపం అంటారు, కొంచెం నరకంతో కప్పబడినట్లుగా."

"స్వర్గ నరకాలు ఒకే ప్యాకేజీలోనా! చాలా చిత్రంగా ఉందే! నేను బనారస్ చూడాలనుకుంటున్నాను."

"అలాగే మనం కారులో వెళ్దాం. కానీ ట్రైన్ సౌకర్యవంతంగా వుంటుంది. అక్కడ నువ్వు కారు డ్రైవ్ చెయ్యలేవు. అక్కడ వీధులకి ఆధునిక కార్లతో పనేమీ వుండదు."

జాకబ్‌కి ఢిల్లీలో ఓ ట్రావెల్ ఏజెంట్ తెలుసు. నన్స్‌ని, ప్రీస్ట్స్‌ని ఇండియాలో వాళ్లు నిర్వహించే ఇన్‌స్టిట్యూట్‌లలో ట్రాన్స్‌ఫర్లు చేయడానికి వాళ్లు ప్రత్యేక నైపుణ్యం కలిగివున్నారు. మిషనరీ స్కూళ్లు, కాలేజీల గురించి తెలుసుకోవాలని, సంప్రదాయ పరాయణులైన హిందువులు ఆ కాన్వెంటు చదువులతో ఏ విధంగా లాభపడ్డారోనన్న విషయం పరిశీలించాలని ఆసక్తి కలిగింది ఐసయ్యకి. వాళ్లు టిక్కెట్లు తీసుకుని మరునాడు బనారస్ బయలు దేరారు. బనారస్ చేరుకున్నాక తాము హిందూధర్మశాలలో వున్నందుకు ఆశ్చర్యం కలిగింది ఐసయ్యకి. ధర్మశాలలో లంచ్ చేస్తున్నప్పుడు "ఇక్కడ ఇద్దరు క్రిస్టియన్‌లు వుండడం వలన వీళ్లకి ఎలాంటి అభ్యంతరం వుండదా?" అడిగాడు ఐసయ్య జాక్‌బ్‌ని. లంచ్ యూరోపియన్ స్టైల్‌లో టేబిల్ పైన సర్వ్ చేశారు. అక్కడ మరికొంతమంది విదేశీయులున్నారు, ముఖ్యంగా ఫ్రెంచ్, జర్మన్ విదేశీ యువకులున్నారు వీపుల మీద బ్యాగులతో.

"అలాంటిదేమీ వుండదు, నిబంధనలు పాటించినంతవరకు.

మద్యమాంసాలు ముట్టకూడదు. ఉల్లి, వెల్లుల్లి, స్త్రీలు, పాదరక్షలు లాంటివి గదులలో నిషిద్ధం."

"అయ్యో! అలా వుండాలంటే జనాలు ఇష్టపడతారా? కానీ ఓ విషయం. వెజిటేరియన్ ఆహారం అంటే స్టీమ్ చేసిన క్యాబేజీ, బంగాళా దుంపలు అనుకున్నాను. కానీ ఇది గొప్ప విషయమే. రోజంతా ఇదే ఆహారం తీసుకుంటాను."

"అలాగని మితిమీరి తినకు. కొన్నాళ్ల తరవాత నీకు సహజంగానే మధుర పదార్థాలపై కోరిక తగ్గుతుంది" అన్నాడు జాకబ్ నవ్వుతూ.

సాయంత్రం ఘాట్లు చూడ్డానికి వెళ్లారు. అక్కడ సంధ్యా హారతి ఇస్తున్నారు. దేవుళ్లని దీపాలు వెలిగించి నిద్రపుచ్చే వేడుక. వాటి గురించి తనకి తెల్సినంత వరకు వివరించాడు జాకబ్.

"ఆ నది ఒడ్డున ఆ మంట ఏంటి? నెగళ్ల మంటా?"

ఎవరో చితికి నిప్పుపెట్టారు. దహన సంస్కారం చేస్తున్నారు." దూరంగా కుక్కలు మొరగడం, నక్కలు ఊళపెట్టడం గమనించిన ఐసయ్యలో వణుకుపుట్టింది. 'జాకబ్, చాలా సమయమైంది. మనం వెళ్లిపోదాం' అన్నాడు ఐసయ్య.

వాళ్లు తిరిగి వెళ్తున్నప్పుడు పల్లంగా వున్న ఓ పొడవైన బిల్డింగ్ నించి లయబద్ధంగా గీతాలు వినిపిస్తున్నాయి. సందు బాగా ఇరుకైనది కావడంతో ఆ బిల్డింగ్ వరండా లోంచి

వాళ్లు గమ్యస్థానానికి వెళ్లాల్సి వుండడంతో ఐసయ్య వరండా నించి లోపలికి తొంగి చూడకుండా వుండలేకపోయాడు. అక్కడి దృశ్యం చూసి ఆశ్చర్యంతో ఐసయ్య కళ్లు పెద్దవయ్యాయి. అక్కడ వరుసగా యువతులు కూర్చుని వున్నారు. తెల్లటి దుస్తులు ధరించారు. ఐసయ్య వాళ్ల దగ్గరకంటా వెళ్లి పరీక్షగా చూశాడు. వాళ్లలో కొందరు పెద్దవాళ్లు కూడా వున్నారు. కానీ వాళ్లంతా బక్కపలుచగా పీలగా వున్నారు. కొందరు గూనివాళ్ళు కూడా వున్నారు. చెప్పడానికి కూడా వీలులేని విధంగా వున్నారు వాళ్లు. వాళ్లు లయబద్ధంగా గీతాలని ఆలపిస్తున్నారు, యోగ నిద్ర కలిగించే విధంగా. వాళ్లలో ఒకరు అకస్మాత్తుగా తలపైకి ఎత్తి చూశారు; అప్పుడు చూశాడు ఐసయ్య ఆ మొహాన్ని. ఆ మొహం కాంతిహీనమైన నల్లని కళ్లతో పాలిపోయి వుంది. అతని చూపులు ఆమె కళ్లలో సందేహంతో కూడిన భయాన్ని కలిగించాయి. ఆ యువతి తలవంచి మంత్రోచ్చారణలో మునిగిపోయింది.

అందరూ శిరోముండనంతో వున్నారు.

"వాళ్లంతా అలా వున్నారేంటి?" గొణిగినట్టగా అంటూ ఐసయ్య

"వాళ్లు కాన్సర్ రోగులా? వైద్యానికి వచ్చారా?" అడిగాడు జాకబ్‌ని.

జాకబ్ – ఐసయ్య వైపు ఆశ్చర్యంగా చూస్తూ "వాళ్లంతా వితంతువులైన యువతులు అన్నాడు.

"వితంతువులా?"

"వాళ్లంతా బతకడానికి వచ్చిన వాళ్లు. తిరిగి వెళ్లడానికి వాళ్లకి మరో మార్గం లేదు."

"అదేంటి వాళ్లకి కుటుంబాలు లేవా?"

వెంటనే "వాళ్ల కుటుంబంలోని వాళ్లే వాళ్లని ఇక్కడికి పంపించారు" అంటూ ఓ మహిళ కంఠం విన్పించడంతో అటువైపు చూశాడు ఐసయ్య. వరండా చివర సంజె వెలుగులో ఓ యువతి నిలబడి వుంది. ఆమె కూడా వితంతువేమోనని అనుకున్నాడు ఐసయ్య. తర్వాత ఆమె జడ వెనకాల వెంట్రుకల బంతితో తీరైన జుట్టుముడిని చూశాడు. సన్నని ఎర్రంచు చీర ధరించింది. భుజానికి వేలాడుతున్న మందపాటి ఫైల్స్ వున్న సంచీ. మంద్రమైన వెలుగులోంచి ఐసయ్య వంక చూసి నవ్వుతూ "నా పేరు మాలా శ్రీవాత్సవ్. వీళ్ల జీవితాల్ని గురించి పరిశోధన చేస్తున్నాను. నేను వీళ్ళని గురించి రిసెర్చ్ కూడా చేస్తాను" అంది.

"ఓహో! ఓహో. ఐసీ! చాలా సంతోషం. నన్ను నేను పరిచయం చేసుకుంటాను. నా పేరు డాక్టర్ ఐసయ్యా జాక్సన్. సామాజిక శాస్త్రవేత్తని. నార్త్ కరోలినాలో అగ్రికల్చరల్ అండ్ టెక్నికల్ కాలేజీలో "అంటూ తనను తాను ఇంగ్లీషులో పరిచయం చేసుకున్నాడు. "ఇతను నా అసిస్టెంట్. పేరు జాకబ్ ఈ బాలికలంతా వితంతువులా? కొందరు పది సంవత్సరాలకి మించి లేరనుకుంటా! వీటి నుంచి పంథొమ్మిదో శతాబ్దిలోనే ఇండియా విముక్తి పొందినట్టు భావించాను."

ఆమె నవ్వుతూ "ఏదీ అనుకున్నంత తేలికైనది కాదు డాక్టర్ జాక్సన్. చట్టాలున్నాయి. అయినా దురదృష్టవశాత్తు బాల్యవివాహాలు జరుగుతూనే వున్నాయి. ఒక్కోసారి వయస్సు మీరిన వాళ్లకిచ్చి పెళ్లిళ్లు చేస్తున్నారు. సరిగ్గా ఆ బాలికలకి యుక్తవయసు వచ్చేటప్పటికి భర్త చనిపోతాడు. దాంతో చిన్నతనంలోనే తప్పనిసరిగా వాళ్లకి వైధవ్యం ప్రాప్తిస్తుంది. ఆ తర్వాత 'తీర్థయాత్ర' పేరు మీద వాళ్లని బనారస్ పాత పేర్లయిన వారణాశి లేక కాశీకి పంపించేస్తారు. ఇక్కడికి వచ్చిన తర్వాత తిరిగి వెళ్లిపోవాలని వాళ్లు కోరుకోరు. 'కాశీయాత్ర' అనే తీర్థయాత్ర ఓ పరిభాష. వెళ్లడమే తప్ప తిరిగి రావడమంటూ వుండదనే సామెతలా మారింది. క్షమించండి లెక్చర్ ఇస్తున్నా."

ఐసయ్యకి నవ్వు వచ్చింది. "అది సరే. వృత్తిపరమైన విషయాలు. నేను అడ్డుతగుల్తున్నాను. మీరు చేసే రీసెర్చ్ ఎలాంటిది? అది పరిమాణానికి సంబంధించిందా లేక గుణాలని తెలిపేదా?" అన్నాడు ఐసయ్య.

"చెప్పాలంటే రెండూను? కానీ మీరు ఆ విషయం గురించి మాట్లాడాలనుకుంటే మనం రేపు ఎందుకు కలవకూడదు? మీరు అడిగే ఏ ప్రశ్నలకైనా సంతోషంగా జవాబు చెప్తాను. రివర్ ఫ్రంట్ హోటల్ తెలుసా మీకు?"

"తెలుసుకుంటాం" అన్నాడు జాకబ్.

"అయితే రేపు సాయంత్రం ఆరుగంటలకి. కాఫీ షాప్. ఆ సమయానికి ఇంటర్వ్యూలు పూర్తి చేసేస్తాను."

ఆ యువతి ధైర్యం చూసి ఆలోచనలో పడ్డాడు ఐసయ్య. ఇప్పటి వరకు తను కలిసిన ఏ ఇండియన్ యువతిలా అనిపించలేదు ఈమె. ఏం చేయాలా అన్న సందిగ్ధంలో పడ్డాడు ఐసయ్య. అదేగనక స్టేట్స్‌లో అయితే ఏ సమాజ శాస్త్రవేత్తతోనయినా కాఫీతాగుతూ మాటామంతీకి తను పెద్దగా ఆలోచించనవసరం లేదు. కానీ ఇక్కడ తనకి ఉచితానుచితాల పట్ల ఎటువంటి ఆలోచనాలేదు. అటువంటి పరిస్థితులలో తనకి తెలియని ఓ ఇండియన్

యువతి తనని ఆహ్వానించినపుడు ఆ ఆహ్వానాన్ని అంగీకరించాలా అన్నది తనకి అర్థం కావడంలేదు. అతని మనసులోని సంశయాన్ని ఊహించిన ఆ యువతి 'డోంట్‌వర్రీ' అంటూ "ఇక్కడ మహిళా విద్యావేత్తలు అరుదైన విహంగాలు. ఎప్పుడు ఎలా ఉండాలో అలా వుంటాం."

"నేను వాటి కోసం ఎదురు చూస్తూ ఉంటాను" అన్నాడు ఐసయ్య. ఆమె ఉత్సాహంగా నవ్వింది. "మీరు చాలా ధైర్యస్థులు సుమండీ!" అన్నాడు ఐసయ్య చిరునవ్వు నవ్వుతూ.

"నిజమే ఈ దేశంలో ప్రతీ ఒక్కరికి ధైర్యమనేది అవసరం. సరే మంచిది, రేపు కలుద్దాం."

"సో లాంగ్" అన్నాడు ఐసయ్య.

మరునాడు ఉదయం ఐసయ్య, జాకబ్‌లు బ్రేక్‌ఫాస్ట్ కోసం కలుసుకున్నారు. ''సాయంత్రం వరకు సమయమంతా మనదే'' అంటూ జాకబ్ వారణాసిలో ఏం చూడాలనుకుంటున్నావు?" అడిగాడు ఐసయ్యని.

"అవకాశం వుంటే నగరంలో ముస్లింల ప్రాంతం చూడాలనుకుంటున్నాను."

జాకబ్ ఆలోచనల్ని ప్రోది చేసుకుంటూ "మనం పంచగంగా ఘాట్ దగ్గర వున్న ఆలంగీర్ మాస్క్ చూడ్డానికి వెళ్దాం. ఔరంగజేబు ఓ హిందూ దేవాలయంపైన దానిని నిర్మించాడు. కింది భాగం ఇప్పటికీ హిందువులదే. దాన్ని 'వేణీమాధవ్‌కీ దరేరా' అంటారు. ఈ వారణాసిలో ఆ తరహా మాస్క్ – ఆలయాలు చాలా వున్నాయి. ఇలాంటి విడ్డూరమైన క్షేత్రాలు ఇక్కడ మాత్రమే కొనసాగడమన్నది విచిత్రం. మరో నగరంలో గనుక అయితే సంఘ విద్రోహశక్తులు ముక్కముక్కలుగా చీల్చి చెండాడేవాళ్లు. కానీ ఈ నగరం ప్రత్యేకమైంది.

"పవిత్ర స్థలాలు ఆ విధంగానే వుంటాయి. ఇస్తాంబుల్‌లోని హజియా సోఫియా[4] కూడా ముస్లింలకి, క్రిస్టియన్‌లకి సంబంధించినది. ఓకే...పద...చూద్దాం."

ధర్మశాల నించి ఆలంఘీర్ మాస్క్ వరకు నడవాలంటే దూరమే, కానీ ఐసయ్య పబ్లిక్ ట్రాన్స్‌పోర్ట్‌లో వెళ్లడానికి నిరాకరించాడు. అతను నడుస్తూ సిటీ అందాలు ఆస్వాదించాలన్న ఆసక్తి కనబరచాడు. ఇళ్ల మధ్యగల సన్న సందుల్లోంచి దాటి బయటకి రావడం ఇబ్బందన్పించింది. టెర్రకోట రంగు మెట్లమీదగా వేగంగా ప్రవహించే మురికి

**4. హజియా సోఫియా అనేది గ్రీకు పదం. ఆ భాషలో దీనికి దివ్యజ్ఞానం అని అర్థం.**

నీళ్లలోకి నెమ్మదిగా దిగి దూరంగా ఆకాశం వైపుకు చూశాడు ఐసయ్య. ఆ దృశ్యం భయం గొల్పేదిగా వుంది. వారణాసి సగం పట్టణంగా అన్పించింది. నది కావలివైపు దయ్యాలదిబ్బగా అన్పించింది. కానీ అక్కడ అలా లేదు. నేలంతా చదునుగాను పొదలుతోను పిచ్చి మొక్కలతోను నిండి వుంది, ఓ శిధిల ప్రాంతంలా.

"నది కావలివైపు ఏదైనా శాపం వుందా?" అడిగాడు ఐసయ్య.

"మంచి ప్రశ్న. అసలు సంగతి ఏంటంటే నదికి ఇవతల ప్రదేశంలో మరణిస్తే స్వర్గానికి వెళ్తారు. అవతల ప్రదేశంలో మరణిస్తే నరకానికి పోతారు." ఐసయ్య అక్కడే వున్న ఒడ్డు వైపు చూస్తూ "మసీదు అదా?" అడిగాడు.

బిల్డింగ్ చాలా పెద్దది. దిగువ మట్టాలు విశాలంగాను దీర్ఘ చతురస్రాకారంలో దరిదాపుగా రక్షణ స్థావరాలున్నట్టుగా వున్నాయి. భవనం పెరిగే కొద్దీ కొత్త కోణాలతో అనేక సున్నితమైన స్తంభాలతో గోపురం వరకు మరింత అందాలని సంతరించుకుంది. అతి వింత గొల్పేదే కాక అతి ఘనమైనది, పగలనిది. ఒత్తిడిని, బరువుని తట్టుకుని నిలబడగలిగిన కట్టడం. అంతా విదేశీ పద్ధతిలో గోచరిస్తోంది.

"ఇది అద్భుతంగా వుంది. ఒక మాంత్రికుడు మంత్రోచ్చారణ చేస్తూ కూర్చునే కలల సౌధంలా."

"నీ వ్యాఖ్యానం అర్ధవంతంగా ఉంది. ఎంతటి అద్భుతమైన ఊహ నీది" అంటూ జాకబ్ నాకు మీ కవిత్వం బహుమతిగా లభించిందని అనుకుంటున్నాను. నేను మంచి గైడ్ అని నాకనిపిస్తోంది" అన్నాడు.

నదిలో ప్రయాణానికి పడవ మనిషి కనిపించాడు. వాళ్లని తీసుకువెళ్లడానికి సిద్ధంగా వున్నాడతను. జాకబ్ తనకి తెలిసిన ప్రముఖ ప్రదేశాల్ని వివరించాడు. తీరం వెంట వున్న మనుషుల్ని ఆసక్తిగా గమనించాడు ఐసయ్య. కొందరు బట్టలు ఉతుకుతున్నారు. కొందరు ఏదో సమాధిలో వున్నట్టు కూర్చుని వుండడం చూసి బహుశా వాళ్లు ధ్యానముద్రలో వుండొచ్చుననుకున్నాడు ఐసయ్య. మరికొందరు నడుము లోతు నీళ్లలో నిలబడి అరచేతుల నిండా నీళ్లు తీసుకుని యధావిధిగా తిరిగి నీళ్లలో వదులుతున్నారు. దాన్ని అర్థం చేసుకోవడానికి అశక్తతతో నిరుత్సాహంగా నిరీక్షించాడు ఐసయ్య.

"మీరు చూస్తున్న వ్యక్తులంతా అగ్రకులస్థులు. అలవాటు ప్రకారం సంస్కార విధులు నిర్వర్తించడానికి వచ్చిన వాళ్లు. మరణించిన వాళ్ల పెద్దల అస్థికలని గంగలో నిమజ్జనం

చేయడానికి వస్తూంటారు. గంగానదీ తీరంలో చేసే శ్రాద్ధ కర్మల వలన పితరులకు ఉత్తమ గతులు కలుగుతాయంటారు. వారణాసి స్వర్గానికి ప్రవేశ ద్వారమని అగ్రకులాల వారి విశ్వాసం. నిమ్నకులాల వాళ్లు కేవలం అంత్యక్రియలు నిర్వహిస్తారు. దానాల్లో వాళ్లకి వాటా వుంటుంది.

"ఓ నల్ల జాతీయుడు, తన సహచరుడైన పరయ్యాతో కలిసి పవిత్రమైన నదిలో బోటు షికారు చేస్తున్నారని తెలిస్తే వాళ్లు ఏవంటారు?" అనుకుంటూ ఐసయ్యా పెదాలు కర్చుకున్నాడు.

"నది అన్నింటిని ప్రక్షాళన గావిస్తుందని అంటారు" అన్నాడు జాకబ్.

"ఒక్క మురికిని తప్ప" అన్నాడు స్పష్టంగా ఐసయ్యా ముక్కు నలుముకుంటూ.

"మంచిది. మురికి, మతం ఈ దేశంలో విడదీయరానివని ఈ పాటికి నీకు తెలిసేవుంటుంది" అన్నాడు జాకబ్.

"అయినా ఇక్కడి ధర్మశాల చాలా పరిశుభ్రంగా వుంది. ఈ ప్రాంతాన్ని, ఈ ప్రజలని ఎప్పటికైనా అర్థం చేసుకోగలనా? నిన్ను ఎప్పటికైనా అర్థం చేసుకోగలనా జాకబ్? నాకు తెలుసు, నువ్వు ఒక్కోసారి నా వైపు చూసే అనుమానపు చూపులు. నేను నీకు కోపం తెప్పించే విషయం మాట్లాడడమో లేక నీకు హాని కలిగించే విషయాలు మాట్లాడ్డం జరిగిందేమో. ఎందుకో ఏమో తెలియడం లేదు."

"నిజంగానా? అలా చూశానా? అసలు నాకు అలాంటి భావన కలగనే లేదు. ఐయాం సారీ."

"ఇందులో నీ తప్పు ఏమీ లేదు జాకబ్. నా గురించి నిన్ను స్థిమితంగా వుండనివ్వని విషయాలేమైనా వుండొచ్చు."

"లేదు.. మంచిది, అవును. మీదంతా నిర్మోహమాటం. చుట్టూ జరుగుతున్న విషయాలే మీరు మాట్లాడారు."

ఐసయ్యకి నవ్వు వచ్చింది. "అది అమెరికన్ విధానం"అంటూ ఐసయ్యా వాచీ చూసుకున్నాడు. ఐదున్నర నడుస్తోంది. మనం రివర్ ఫ్రంట్ హోటల్ ఎక్కడుందో తెలుసుకుంటే మంచిదేమో" అన్నాడు ఐసయ్యా.

"రివర్ ఫ్రంట్ హోటల్ వైభవోపేతమైన తెల్లని భవనం. బ్రిటిష్ వారి జమానాలో కట్టించినది" అంటూ జాకబ్ "వాళ్లు బనారస్ పైన కూడా తమదైన ముద్రవేశారు" అన్నాడు. కాఫీ షాపు ప్రశాంతంగా, మధురంగా వుంది. సొగసైన కార్పెట్లతో ధరలు చాలా ఎక్కువగా

వున్నాయి, ఐసయ్య అమెరికన్ కళ్లకి కూడా. “చాలా బాధాకరం. ఎవరొస్తారు ఇక్కడికి” అంటూ నవ్వాడు జాకబ్. “వీళ్లలో చాలా వరకు మిగతా చోట్ల వున్న ధనికుల కన్నా మరింత ధనికులు. మన విద్యావేత్త అయిన మహిళ వేషధారణ చూస్తే గొప్పింటి అమ్మాయిలా వుంది. ఆమె ధనవంతురాలే అని తెలుస్తోంది. లేదా ఓ సంపన్నుడిని పెళ్లాడి వుండొచ్చు” అన్నాడు జాకబ్ సంభాషణ కొనసాగిస్తూ. ఐసయ్య చిరాకుపడ్డాడు. తను అమెరికన్ అయినందున తనని కూడా ధనవంతుడికిందే జమకడ్తోందేమో అనుకున్నాడు ఐసయ్య.

“హలో, లేటుగా వచ్చానా?”

ఐసయ్య వెంటనే తలతిప్పి టేబిల్ దగ్గర నిల్చున్న మాలా శ్రీవాత్సవ్‌ని చూశాడు. ఈ రోజు ఆమె ఎర్రంచు చీర బదులు నాజూకైన సల్వార్ కమీజు ధరించింది. భుజంపైన వేలాడుతున్న బ్యాగ్ మాత్రం అదే. ఆమె నవ్వుతూ కరచాలనం కోసం చేతిని ముందుకు చాపుతూ “దయచేసి గతరాత్రి నన్ను నేను పరిచయం చేసుకోలేని అమర్యాదని మన్నించండి” అంది.

ఐసయ్య కరచాలనం చేస్తూ “కానే కాదు. ముక్కూ ముఖం తెలియని అపరిచిత వ్యక్తితో చీకటి సందు మధ్యన కరచాలనం ఎలా చేస్తావు?” అన్నాడు. మర్యాదస్తుడైన వెయిటర్ ఆమె కోసం కుర్చీ వేశాడు. కుర్చీలో ఆమె కూర్చున్న పద్ధతి ఆమెనొక గౌరవనీయమైన స్త్రీగా తెలియజేస్తోంది. ఆమె మృదు స్వభావం, మర్యాదపూర్వకమైన ప్రవర్తన, ఐసయ్యను బాగా ఆకట్టుకున్నాయి. ఆమెకి డబ్బంటే మంచినీళ్ళ ప్రాయంలా వున్నట్లన్పించింది ఐసయ్యకి. వాళ్లు కాఫీ ఆర్డర్ చేశారు. విపరీతమైన దుబారా ఖర్చు గురించి బాధపడకూడదని మనసులో అనుకున్నాడు ఐసయ్య.

“సారీ... లేట్ అయింది. వితంతువులు వదిలిపెడితేగా” అందామె.

ఐసయ్య ఆమె వంక గౌరవ పూర్వకంగా చూస్తూ అన్నాడు. “ఫర్వాలేదు.. అయితే నువ్వు ఆ వితంతువులనించి ఖచ్చితంగా రాబట్టుకునేదేంటి?”

“నేను వాళ్ల కథలని రికార్డు చేస్తాను. వాటిలో కొన్ని సంఖ్యాపరమైన విశ్లేషణ కోసం సేకరించినవి. కానీ విషయం ఏంటంటే ఆ విశ్లేషణ వాళ్ల జీవితాల్లోని వాస్తవాల ప్రారంభదశ కాదు. అందువల్ల వాళ్ల జీవితాల్లోని వివిధ దశలకి చేయాల్సిన చికిత్స గురించి ప్రయత్నిస్తున్నాను.”

“అదేంటి, గతరాత్రి నువ్వే అన్నావుగా వాళ్ల కుటుంబంలోని వాళ్ళే వాళ్లని బయటికి పంపించేస్తారని. అది న్యాయ విరుద్ధం కాదా? మీకు చైల్డ్ ప్రొటెక్షన్ లాస్ ఈ దేశంలో లేవా?”

పేరుకే ప్రొటెక్షన్ లాస్.

"బాల్య వివాహం", "సతి" 19వ శతాబ్ది నించి చట్ట విరుద్ధమే. కానీ ఆ నిషేధం తమ పిల్లలకి చిన్నప్పుడే వివాహం చేయకుండా తల్లిదండ్రులని ఆపదు. చూడండి, 'సతి' ఇంకా చెడు సంప్రదాయాల గురించి చర్చించే సంఘ సంస్కర్తలు వాటి మూలాల్లోకి తొంగి చూసే ప్రయత్నం చెయ్యరు; కులం – కేవలం అగ్రకులాల వితంతువులు మాత్రమే చితిలో కాలిపోతారు. ఎందుకంటే వాళ్ల కుటుంబంలోని రక్త సంబంధం కల్మషమవుతుందన్న భయంతో. ఎవరికి తెలుసు, యువ వితంతువు ఎలాంటి దుర్జనులతో పడుకుంటుందో? స్త్రీలకి చిన్నతనంలోనే పెళ్లిళ్లు చేస్తారు కుటుంబ 'గౌరవం' కోసం. వాళ్లకి పెళ్లి కాకుండా పిల్లలు పుట్టే అవకాశమివ్వకుండా. దాంతో వాళ్లు అతి తక్కువ కాలంలోనే వితంతువులయ్యే అవకాశం వుంది. మహిళలు బ్రాహ్మణులు కాలేరు. నీకు తెలుసా ఇది? పవిత్ర గ్రంథాలు వాళ్లని అపరిశుభ్రమైన శూద్రులుగానే పరిగణిస్తాయి. బంకించంద్ర వితంతుతనాన్ని ఓ 'విషవృక్షం'గా వర్ణించాడు. ఇటీవల దాకా ఏ యువతి అయినా అదృష్టం వరించి చదవడం నేర్చుకుంటే ఆమె తన భర్త మరణానికి కారకురాలు అవుతుంది."

"అది క్రూరమైంది. నాగరికతలు చాలా మటుకు వితంతువుల్ని దురదృష్టవంతులుగా చూస్తాయి."

మాలా శ్రీవాత్సవ్ ఐసయ్యా వంక చూస్తూ అంది. "అది వాస్తవం కాదు. మీరు సాహిత్యాన్ని గనుక జాగ్రత్తగా గమనిస్తే – ఇంగ్లాండ్, అమెరికాలో కూడా కొడుకుల వారసత్వాలు నిరోధించడానికి చట్టాలు పరిమితంగానే వున్నాయి. అక్కడ కఠినమైన సంప్రదాయాలున్నాయి. అంతేకాదు మరికొన్ని సంస్కృతులలో పునర్వివాహమన్నది లేదు. కానీ ఇది మాత్రం వాస్తవం. ఎక్కువగా ధనికులే వితంతువులు చేసిన దానికి ఆలోచిస్తారు.

"అయితే అదంతా ఆస్తి గురించే."

"ఒక విధంగా అంతే. పిల్లల్ని కనడానికి కూడా, అవును."

"ఒకవేళ వితంతువుకి కొడుకు వుంటే."

"మరణం కన్నా భయంకరమైన విధినించి ఆమెని కాపాడేది అదొక్కటే. వారసుడికి తల్లిగా వుండడమే ఆమెకి ఉపకరిస్తుంది. కానీ కొన్నిసార్లు అదీ సరిపోదు. నేను 'జూహి' అనే పిల్లని చదివిస్తున్నాను. పదిహేడు సంవత్సరాల వయస్సులో ఆమె భర్త చనిపోయాడు. భర్త చనిపోయేటప్పటికి ఆమెకి మూడు సంవత్సరాల వయస్సున్న కొడుకు వున్నాడు. ఆమె సవతి తల్లి ఆ పిల్లవాడిని దత్తత తీసుకుని జూహీని గెంటేసింది. జూహి తమ్ముడు

కలగజేసుకున్నప్పుడు జూహి తన భర్తని విషపూరితం చేసిందని ఆ సవతి తల్లి చెప్పింది. కొన్ని ప్రాంతాలలో స్త్రీలకి విషపు చూపు ఉంటుందని కొందరు వ్యక్తులు నమ్ముతారు. ఒక్క చూపుతో మనిషిని చంపేయగలరు."

ఐసయ్య నెమ్మదిగా తలాడిస్తూ "నేను వారం క్రితం దాకా ఏదీ నమ్మేవాడిని కాదు. కానీ వింత వింత కథలు చాలా విన్నాను. అవి అంతగా అసహజమైనవేవీ కావు. అలాంటప్పుడు చివరికి ఆమె ముగింపు ఎలా వుంటుంది?"

"బనారస్ ఉత్తర భారతాన్ని శుద్ధి చేసే ఓ గొప్ప రాజధాని. పాపాలకి ప్రాయశ్చిత్తం చేసుకోవాలనుకుంటే ఎవరైనా అక్కడికి వెళ్లాలి – లేక పంపించాలి. వితంతువుల 'తీర్ధయాత్ర' పేరు మీద బలవంతంగా ఇళ్లనించి పంపబడ్డారు. అది ఓ ఏకమార్గ ప్రయాణం."

ఐసయ్య దీర్ఘంగా వూపిరి పీల్చి నెమ్మదిగా వదిలాడు. "అయితే ఇక్కడికి వచ్చిన తర్వాత వాళ్లకి జరిగేదేంటి?" అన్నాడు.

"అదృష్టవంతులైతే ఆకలితో మరణిస్తారు. అలా కాకపోతే ఆశ్రమంలోకి తీసుకువెళ్లబడతారు. వీటిలో కొన్ని ప్రాంతాలు వ్యభిచార గృహాలకన్నా కొంత నయం. యువతులు వాళ్లంతట వాళ్లే పురోహితులకి సమర్పించుకోవాల్సి వుంటుంది. వాళ్లు, వాళ్ల గెస్ట్‌లు, స్నేహితులు 'షో' నడుపుతారు. యుగాలనించి బనారస్ వేశ్యలకి కేంద్రమైంది. ఆమె నాజూకైన పింగాణీ కాఫీ కప్పు ఎత్తి తాగసాగింది. మంచివాళ్లలో కూడా ఆకలితో అలమటించేవారున్నారు. దాన్ని మంచిగా భావిస్తారు వాళ్ళు; కోరికలు తలెత్తకుండా వుంటాయి. ఇతరులు కూడా అలా వుంటే వాళ్ళలో కూడా కోరికలు తలెత్తవు.

"అక్కడ వాళ్లలో చాలామంది వున్నారు. ఈ పాపాలని జనాలు గుడ్డిగా ఎలా నమ్ముతారో?"

మాలా నది మీంచి చూపు మరల్చి ఐసయ్యని చూస్తూ "నువ్వు ఓ నల్ల జాతీయుడివి, ఒక అమెరికన్ అనుకుంటున్నాను నేను. అలాంటప్పుడు బానిసత్వ చరిత్ర నీకు తెలిసే వుంటుంది. ఇక్కడ మాత్రం అది విభిన్నంగా వుంటుందని ఎలా అనుకుంటున్నావు?" అంది.

"మతం బానిసత్వాన్ని ఎన్నడూ అనుమతించలేదు. బానిసత్వం మంచిదని బైబిల్‌లో చెప్పినట్లుగా కొందరు వ్యక్తులు నిరూపించే ప్రయత్నం చేశారు. కానీ వాళ్ల మాటల్ని ఎవరూ విన్పించుకోలేదు. బానిసత్వం నిర్మూలించబడింది ఎందుకంటే అది క్రిస్టియానిటీకి చెందినది కాదు" అన్నాడు ఐసయ్య.

"నాన్సెన్స్ పత్తి మార్కెట్ దిగువకు పడిపోతోంది. బానిసత్వం ప్రయోజనకరంగా లేదు. మీరు బానిసలుగా వున్నందున మీరు తొలగింపబడరు. మీరు విముక్తి పొందినా ఆకలితో అలమటించవలసిందే. అందుకే ప్రభుత్వం పోరాడుతుంది.. అయితే నా ఉద్దేశంలో పెక్కుమంది వ్యక్తులు పోరాడటానికి విదేశీ ద్వేషం కూడా ఓ కారణం."

"హా! అది అసాధారణ ద్వేషంతో కూడినది. కానీ ఇక్కడ ఓ విషయం వుంది; బానిస వ్యాపారం కేవలం నైతికత కారణంగానే అంతరించలేదు. అటువంటప్పుడు ఇక్కడ డబ్బు కోణం అంటూ ఏముంటుంది మీ బనారస్ వితంతువులకి? ఒకవైపు ఆస్తిని స్వాధీనపర్చుకునే విధానం, మరోపక్క మహిళలని దోపిడీ చేయడం. కానీ లెక్కించడానికి అదేమైనా పెద్దదా?"

మాలా స్పూన్‌ని అటూ ఇటూ ఆడిస్తూ "సంపదనంతటిని డబ్బుతో కొలవలేం. మీరు ఓ విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఈ దేశం స్థిరాస్థులపైన వ్యాపారాలు చేస్తుంది. భూమి, బంగారం, సంప్రదాయక విలువలు గలవి. ఆశ్రమాలని నిర్వహించే వాళ్లు బ్రహ్మాండమైన అంతఃపుర స్త్రీలపైన అధికారం చెలాయించడానికి తమని తాము రాజులుగా భావించుకుంటారనడంలో ఎలాంటి సందేహం లేదు. వాళ్లు స్త్రీల శరీరాలపైన సంపద లెక్కిస్తారు. మీరనుకుంటున్నట్టు ఇదేమంత పెద్ద తప్పుడు విధానమేం కాదు; మహిళలు యుగాల నించీ మారకపు వస్తువుల్లా చూడబడ్తున్నారు."

"అది ప్రతీకార యోచన కాదా?" అన్నాడు ఐసయ్య ఆమె మాటలకి అడ్డుతగుల్తూ. ఐసయ్య చర్చని ఆస్వాదిస్తున్నాడు. మాలా తలని చురుకుగా ఆడిస్తూ "ఏ మాత్రం కాదు. సాంప్రదాయక వివాహాలలో కూడా ఆచరణాత్మకంగా అమ్మాయిని వేరే కుటుంబానికి అమ్మినట్లే, అమ్మాయి తరుపువాళ్లు ఆమెని తీసుకువెళ్లమని కుర్రాడి తరుపు వాళ్లకి డబ్బు ఇచ్చినపుడు తప్ప. ఆమె కోరికలని, అవసరాలని పరిశీలించరు. నేను స్వయానా వ్యాపారస్తుల కుటుంబం నించి వచ్చినదాన్ని; పలు సాంప్రదాయక కుటుంబాలలోని అమ్మాయిలు ఒక తరం క్రితం వరకు కనీసం అక్షరాలు కూడా చదవలేకపోయేవాళ్లు. నా ప్రపంచంలో సంపద మొత్తం వారసత్వంగా సంక్రమించిందే. ఇండియాలో స్వయంకృషితో పైకి వచ్చిన వ్యక్తికి అలాంటివేమీ వుండవు."

"మరి టాటాల సంగతేంటి?" వాళ్ల మాటలకి అడ్డు తగుల్తూ జాకబ్ "వాళ్లు కొత్త వంశానికి చెందిన వ్యక్తులు కారా?" అన్నాడు.

"కావచ్చు. కానీ వాళ్లలో వ్యత్యాసం చూపించడానికి కొందరే వున్నారు. బహుశా సాంప్రదాయకంగా వ్యాపారవర్గాలు, సమాజాలు మార్పు తీసుకురావచ్చు.

"అంటరానివారిలా?"

"ఆమె అతని వైపు చూసింది. ప్రొఫెసర్ మీ హోంవర్క్ మీరు చేస్తున్నారు. వాళ్ల గురించి మీకేం తెలుసు?" అందామె.

ఆమె మాటల్లో చాలా అర్ధముందన్నట్టుగా ఐసయ్య, జాకబ్‌లు కళ్లతో పలుకరించుకున్నారు. 'మంచిది' అంటూ ఐసయ్య "మీ దేశంలోని ప్రమాణాల ప్రకారం బహుశా వాళ్లలో నేను కూడ ఒకణ్ణి."

"డాక్టర్ జాక్సన్ వద్దు! అలా అనవద్దు"

ఆమె కళ్లలో చోటుచేసుకున్న భయాన్ని చూసిన ఐసయ్య "ఆ మాటలు నిన్ను షాక్‌కి ఎందుకు గురి చేసినట్టు?" అన్నాడు.

ఆమె ముందు తలాడించి ఆ తర్వాత విచారంగా నవ్వుతూ "నువ్వు స్పష్టంగా ఏవైతే అనుకుంటున్నావో అది మాత్రం కాదు" అంది.

"ఫర్వాలేదు, అన్నాడు ఐసయ్య వినమ్రతతో. "మీ వితంతువుల గురించి మరిన్ని విషయాలు చెప్పు" అన్నాడు ఐసయ్య. ఆమె ఎలాంటి భావంలేని వాడియైన చూపులతో అతని వంక చూసి చెప్పడం మొదలుపెట్టింది. "వితంతువుల్ని పోషించడానికి ఛారిటబుల్ ట్రస్ట్‌లున్నాయి, ధర్మకర్తల పూర్వీకుల కోసం వాళ్లు శ్లోకాలని చదివేటట్టయితే. గత రాత్రి ఆ హాల్లో మీరు చూసింది అదే. అలాంటి స్థలాల్లో వాళ్ల జీవితాలు నన్స్ జీవితాల్లాంటివే. అక్కడి జీవితాలు విసుగు పుట్టించేవిగాను, కఠినంగానూ వుంటాయి. ఏ ఒక్క చిన్న తప్పు చేసినా వాళ్లని బైటకి గెంటేస్తారు వీధుల్లో బిచ్చమెత్తుకోడానికి, పోషకుడెవరైనా వాళ్లని రక్షించి వుంచుకుంటే తప్ప. ఒకవేళ వాళ్లకి పిల్లలు గనక పుట్టినట్లయితే వాళ్లని నదిలో విసిరిపారేయడమో లేక బిచ్చగాళ్లగా మార్చడమో చేస్తారు. అన్ని ఆశ్రమాల్లోను నలభై శాతం కన్నా అధికంగా మానసిక వ్యాధితో బాధపడ్తున్నారు. డెబ్భై శాతం ఎనీమియాతోను, వాళ్లలో యాభై శాతం తక్కువ బరువుతో ప్రమాదకర స్థాయిలో వున్నారు. ఇప్పటికీ నేను వాళ్ల సగటు జీవితకాలం గురించి స్టాటిస్టిక్స్ సేకరిస్తున్నాను" అంది. ఆ తర్వాత ఆమె నిరాశతో దూరంగా వున్న నది ఒడ్డుని చూడసాగింది. ఒక్కక్షణం తర్వాత మళ్లీ చెప్పడం కొనసాగించింది. "నేను ఈ పని చేస్తున్నందుకు బనారస్ యూనివర్శిటీలో ఏ ఒక్కరూ సంతోషంగా లేరు. నేను స్టాటిస్టిక్స్ సంకలనం చేస్తున్నందుకు వాళ్లకి ఎలాంటి అభ్యంతరాలు లేవు కాని నా నిర్ధారణల్ని వాళ్లు ఇష్టపడరు. అంతేకాదు, వితంతువులని బాగుచేయడం గాని, వాళ్లు అభివృద్ధిలోకి వచ్చేందుకు గాని నా సలహాలు వాళ్లకి అస్సలు ఇష్టముండదు.

కానీ ఈ విషయంలో నాకు పట్టుదల ఎక్కువ. నేను నా కుటుంబంతో బేరం కుదుర్చుకున్నాను; "నాకు పిహెచ్‌డీ రానివ్వండి ముందు. ఆ తర్వాత ఎవర్ని పెళ్లి చేసుకోమంటే వాళ్లని చేసుకుంటాను అని మా వాళ్ళకి గట్టిగా చెప్పాను. మీరు షాక్ తిన్నట్లున్నారు?" అంటూ నవ్వింది ఆమె. ఆమె మాట్లాడ్డం కొనసాగిస్తూ "నన్ను నమ్మండి. నా చెల్లెళ్లకి ఆ మాత్రం అవకాశం కూడా లేదు. వాళ్లు వాళ్ళ అదృష్టం గురించి నాన్నతో మాట్లాడే ధైర్యం కూడా లేదు వాళ్లకి. కానీ నేనొక్కదానినే తెలివితేటల్ని కాస్త ఉపయోగించగలిగాను. 'కాదు' అని నాన్న నాకు చెప్పలేరు."

ఆమె ఈ విషయాలు చెప్తుంటే ఓ మాంత్రికుడు ఆమె చిటికెన వేలుకి ఆమె తండ్రిని చుట్టినట్టుగా మెరుపు మెరిసినట్లైంది. అతనికి వచ్చిన ఆలోచన అతన్ని విస్మయపర్చింది. డాక్టరేట్ చేస్తున్న ఒక విద్యార్థి కేవలం డేటాని సేకరించే నిమిత్తం దారి తప్పిన పిల్లలా నాటకం ఆడాల్సి వుంటుందా! మాలా పి.హెచ్.డి. వృధాగా మారుతుందనిపించింది ఐసయ్యకి. ఆమె గడించిన పరిజ్ఞానం, ప్రతిపాదించిన పరిష్కారాలు గృహ సంబంధిత బాధ్యతల బరువు కింద భూస్థాపితమవుతాయి. చాలాకాలం తర్వాత భాగ్యశాలి అయిన ఏ కూతురైనా పాత ట్రంకు పెట్టె శుభ్రపరిచే క్రమంలో పాత జ్ఞాపకాలతో చుట్టబడివున్న దుమ్ము పట్టిన థీసిస్‌ని చూస్తుంది. భవిష్యత్తులో ప్రస్తుత యాతనలు, దుఃఖాలు స్కూలు పిల్లలకి హిస్టరీ పుస్తకంలో పాఠ్యాంశంగా చేర్చబడుతుంది. వాటి గురించి చరిత్ర పుస్తకాల్లో చదువుకుంటారు.

ఐసయ్య మొహంలోని భావాలు గమనించిన మాలా అతని వైపు ఆతురతగా చూస్తూ "నేను అస్పృశ్యుల గురించి మాట్లాడి మిమ్మల్ని నొప్పించి ఉంటే క్షమించండి" అంది.

"నువ్వు జాకబ్‌కి కూడా సారీ చెప్పాలి. ఓహ్ సారీ.. ఇతని పూర్తి పేరు ఇంతవరకూ చెప్పలేదు కదూ!" ఆమె నిరీక్షిస్తున్నట్టుగా జాకబ్ వైపు చూసింది. ఆ తర్వాత ఐసయ్య వంక చూసింది. జాకబ్ నవ్వుతూ అన్నాడు "అయామ్ జాకబ్ పరయ్యా."

ఆమె ముందు అతని వంక అస్పష్టంగా చూసి తర్వాత ఐసయ్య వంక చూసింది. ఒక్కక్షణం పాటు ఆమె పెదాలు వణికాయి. తర్వాత తమాయించుకుని "ఐసీ" అంది. ఆమె మొహం కుదుటపడినట్లైంది. ఆమె తన ఆలోచనల్లోకి జారుకుంది. "మీరు కూడా ప్రొఫెసరా?" అడిగిందామె జాకబ్‌ని వణుకుతున్న కంఠంతో.

"అతి కష్టంమీ్మద" నేను ఓ గ్రాడ్యుయేట్‌ని. డాక్టర్ జాక్సన్‌కి అనువాదకుడిని" అన్నాడు జాకబ్. ఆమె అధాటుగా తలెత్తింది. ఆ మాటల్ని మాలా జీర్ణించుకోలేక ఏదో ఆలోచనలో పడింది. "కానీ మనం ఇంగ్లీషులోనే మాట్లాడుకుంటున్నాం కదా. అలాంటప్పుడు ఇక్కడ అనువాదకుడు ఎందుకు? అందామె. ఆమె నుదుటి మీద రేఖలు ఏర్పడ్డాయి.

"క్షమించండి" అంటూ నత్తి నత్తిగా పలుకుతూ ఆమె అంది, "మీరు నన్ను క్రూరమైనదానిగా భావించి వుంటారు. నేను.."

"సరే, నాకు అర్థమైంది" అన్నాడు ఐసయ్య సాంత్వనగా. మీ మస్తిష్కం నిష్పాక్షికంగాను, స్థిరంగాను ఉండాలనుకుంటోంది. ఎవరో మీ చిన్నతనంలో మీరు ఎదురు మాట్లాడలేని వయసులో దురభిమానాన్ని పెంపొందించారు. దాంతో యుక్తవయసులో మీరు విషయాలని, ప్రజలని విభిన్నంగా చూస్తూ జీవితాలని గడిపారు. అందుకుగాను మీరు మీలోని లోపలి పొరలలో నెలకొన్న వాస్తవాన్ని ఎదుర్కోవాల్సి వుంది."

"ఖచ్చితంగా!' ఉపశమనం చెందినట్టుగా అంటూ "మీకెలా తెలుసు?" అడిగిందామె.

ఐసయ్య విచారంతో కూడిన నవ్వు నవ్వాడు. "నాకు తెల్ల స్నేహితులు చాలామంది వున్నారు. వాళ్లలో కొందరు దక్షిణ ప్రాంతానికి చెందినవారు. వాళ్లు సాంప్రదాయక కుటుంబాలనించి వచ్చిన వాళ్లు, అచ్చోట డాడీ మోటర్ గ్యారేజ్ లోపల కన్‌ఫెడరేట్ ఫ్లాగ్ వేలాడదీస్తాడు. ఈ పేద పిల్లలకి నల్లవారి గురించిన సామెతలు ఎన్నో చెప్పారు. ఆ తర్వాత వాళ్లు పెరిగి పెద్ద అయిన తర్వాత కాలేజీలకి వెళ్తారు. అక్కడ ఓ నల్ల జాతీయుడైన ప్రొఫెసర్ పాఠాలు చెప్పడమో లేక ఓ నల్ల డెంటిస్ట్ ఇంటి పక్కన వుండడమో జరుగుతుంది. వాళ్లు మంచిగాను, సహృదయతతోను వుంటారు. ఎందుకంటే మధ్యతరగతి వాళ్లు ఒకరినొకరు వ్యవహరించుకునే తీరు అది. కాని వాళ్లు ఎంతగా ప్రయత్నించినప్పటికి అది జరిగేది కాదు, వాళ్లు వర్గద్రోహుల్లాంటి ధ్యేయంతో వుంటారు. ఇది వామపక్షవాదులకి పెద్ద దెబ్బ."

"మీకు తెలుసా, మీరిప్పుడు అలా మాట్లాడ్డంతో నా మనసు నెమ్మదించింది" అందామె ఆశ్చర్యంతో. నిజానికి నాకు దాని గురించి పెద్దగా పట్టింపు లేదు."

"అలా ఎందుకంటే ఇప్పుడు నువ్వు జాకబ్‌ని ఓ రెగ్యులర్‌గా అయినా చూడొచ్చు, నాలాగా.

"అలాగే" అంటూ నవ్వుతూ ఆమె "నిన్ను కలుసుకున్నందుకు సంతోషంగా వుంది జాకబ్ పరయ్యా" అంది.

"నాక్కూడా సంతోషంగా వుంది" అన్నాడు జాకబ్.

మాలా జాకబ్ వైపు తిరిగి చిరుకోపం ప్రదర్శిస్తూ "కానీ నీ గురించి నాకు చెప్పకపోవడం ఉచితమనిపించుకుంటుందా? అనిపించుకుంటుందా?

"లేకపోతే మాతో కాఫీ తాగటానికి నువ్వు ఒప్పుకునే దానివా?"

ఆమె అప్రసన్నతగా ముఖం కిందికి దించుకుని నేలవైపు చూపుల్ని తిప్పి "బహుశా కాదు" అంది.

ఐసయ్య జాలిగా నవ్వాడు. "మా బామ్మ పేరు ఫ్రీడమ్. ఆమె నాకు చెప్పింది, అంతర్యుద్ధానికి కొద్దిగా ముందు కాలం నల్లవారి చరిత్రలో విషాదపు రోజులని. మేము ధరించిన శృంఖలాలు దౌర్జన్యం అనబడే పోత ఇనుముతో తయారు కాబడ్డం వల్ల మార్పు ఎప్పటికీ ఉండదనిపించింది. కానీ ఆ తర్వాత కొన్ని నెలలకే ప్రపంచం మారింది. అసలు విషయం ఏంటంటే మార్పు ఎప్పటికీ మాకు ఆశ్చర్యాన్ని కలగజేస్తుంది, సరిగా కార్చడానికి కన్నీరు ఇంకిపోయి, కృశించి కృశించి ఎముకల పోగులాగ తయారైన సమయంలో. మీరు ధైర్యం కోల్పోకండి. మీరిద్దరూ కూడా" అన్నాడు ఐసయ్య.

కాఫీ షాప్‌లో మౌనంగా వున్న దీపాల వెలుగు ఆమె రెప్పలమాటున దాగిన కన్నీటి బొట్లు ఇంకిపోయేలా చేసింది. జాకబ్‌కి అసౌకర్యమన్పించింది. అతను ఖాళీ కప్పు అడుగుని చూస్తున్నాడు, దాన్ని అటూ ఇటూ కదుపుతూ నల్లటి కాఫీ మడ్డిని తెల్లటి చైనా మీదకి జారవిడుస్తున్నాడు. ఐసయ్య కాఫీ సిప్ చేస్తూ "మీ ఇద్దర్ని ఓ ప్రశ్న అడగొచ్చా?" నేను రోజూ గుర్తుంచుకునే ప్రశ్న ఇది.

"తప్పకుండా" అన్నాడు జాకబ్. మాల తలాడించింది అడగమన్నట్టుగా.

ఓకే.... అడుగుతాను. మీరు మీ దేశాన్ని కులరహిత సమాజంగా ఊహించగలరా? ఏ కులాలూ లేని భారతీయ సమాజం? నేననేది ఏంటంటే మీ రోజువారీ సాధారణ జీవితంలో కులం అన్నది లేకపోతే మీ జీవితాలు ఎలా ఉంటాయో వర్ణించగలరా?

"డేనియల్ చర్చిలో అతనికి ఇష్టమున్న చోట కూర్చోగలడు" అన్నాడు జాకబ్.

"నా వితంతువులు కుండలు చేయగలరు, బుట్టలు అల్లగలరు. జీవించడానికి వాటిని అమ్ముకోగలరు."

"శివపురంలోని ప్రజలు సరైన రీతిలో లోన్లు తీసుకుని మంచి ఇళ్లని కట్టుకోగలరు."

"మా తల్లిదండ్రులు వరకట్నానికి డబ్బు దాచాల్సిన పనివుండదు."

"మేమంతా జీవించగలం" అంటూ జాకబ్ "మేము ఎక్కడ వుంటున్నాము, ఎవరితో కలిసి భోజనం చేస్తున్నాము, ఏం తింటున్నామన్న ఆలోచనల్ని చేయడం మానేస్తాం."

నూతన ప్రపంచం ఎలా ఉండాలని ఎవరికి వారు ఊహించుకోవడంతో నిశ్శబ్దం ఆవరించింది.

నది మీద ఆకాశం వెలుగు ఎర్రగా మెరుస్తోంది. ఆవలి ఒడ్డున మరణించిన వాళ్ళు నరకానికి పోయే రేఖని చిక్కని ఎరుపురంగులో ప్రతిబింబిస్తున్న నీటిలో వాళ్లు చూడగలుగుతున్నారు. ఇక్కడ మరణించడానికి అనుమతింపబడని వాళ్లందరి గురించి ఐసయ్య ఆలోచించసాగాడు. జాకబ్ పరయ్య, లేక పంజరాలలో జీవచ్ఛవంలా బ్రతుకులీడుస్తున్న యువ వితంతువులు ఇంకా కొంచెం మెరుగ్గాను, విశాలంగాను వున్న పంజరానికి పరిమితమైపోయి ఎగరడానికి అశక్తురాలైనట్లు స్వేచ్ఛగా బయటపడే అవకాశం లేని మాలా. వీళ్లందరి గురించి ఐసయ్య ఆలోచించసాగాడు. ఆ నీటి మీదున్న దృశ్యంపైన స్వర్గం త్యాగం చేస్తున్నట్టుగా రక్తమోడుస్తున్నట్టుగా వుంది.

బనారస్ తన హిందూ శరీరం పైన మేలి ముసుగు ధరించింది. క్రిస్టియన్ పర్యాటకులు కొడాక్‌లలో వాళ్ళు బంధించిన మనోభావాలు చూసుకుంటున్నారు. ఐసయ్య దేనికోసమైతే ఎదురు చూశాడో దాన్ని ఏర్పాటు చేసుకున్నాడు. ఇక అమెరికాకు తిరిగి వెళ్ళాల్సిన సమయం వచ్చింది.

ఐసయ్య తన బ్యాగ్‌ని పైన అరలో వుంచి సీటు మీద ఆనుకుని కూర్చున్నాడు. రకరకాల శబ్దాల కంపనలు తన కాళ్ల కింద లగేజి నింపుతున్నట్టుగా తెలుపుతున్నాయి. విమానం చక్రాల మీంచి దుమ్ము తొలగిపోయి వాళ్లు తెల్లని మబ్బుల్లో నీలాకాశంలో ప్రయాణిస్తారు. అతను ఫ్రాంక్‌ఫర్ట్‌లో దిగి న్యూయార్క్ ఫ్లైట్ ఎక్కుతాడు. తర్వాత నార్త్ కరోలినాకి గ్రేహౌండ్ బస్‌లో వెళ్తాడు.

తన మదిలో నింపుకున్న జ్ఞాపకాలు, విజ్ఞానం అతనికి భారంగా తోచాయి. ఇండియా తనకి కొన్ని గొప్ప అనుభవాల జ్ఞాపకాల్ని మిగిల్చి కొన్నిటిని తీసుకుంది. తన అమెరికన్ జీవితం గురించిన కొన్ని భావనలు తొలిగిపోయాయి. చిక్కుముడుల ప్రపంచ క్లిష్టతలపైన మరింతగా దృష్టి సారించాల్సి వుంది. ఇంకా పురాతన తప్పిదాలను, దౌర్జన్యాలను అధిగమించే న్యాయబద్ధతను నేర్చుకోవాల్సింది చాలా వుంది. తను తీసుకువెళ్తున్న మూడోది ఓ విధమైన విశ్వాసాన్ని, భయంగొలిపే విశ్వాసాన్ని. ఈ అనుభూతికి చాలా పొరలున్నాయి; వాటిల్లో ముఖ్యమైనది అభిలాష. తన స్నేహితుడు జాకబ్ పరయ్య, ఎలుమలై, షాబుద్దీన్, మాలాశ్రీవాత్సవ్. ఇంకా చిక్కుల్లో వున్న మాలశ్రీవాత్సవ్ భవిష్యత్తు సంక్షేమం కోసం. ఇదేకాక ఎలుమలై గ్రామంలోని పిల్లల పట్ల, షాబుద్దీన్ తండ్రిని కాపాడిన నవాబు పట్ల,

మద్రాసులోని రాజాజీ మురికివాడలోని జనాల పట్ల ఇంకా తనకి విమానాశ్రయంలో పరిచయమైన ఇద్దరు మేధావుల పట్ల విశాలమైన సానుభూతి. ఐసయ్య తన పవర్‌ఫుల్ కెమెరాని జాకబ్ దగ్గర వుంచమని ఇచ్చేశాడు. తరచూ, సంవత్సరానికి ఒక్కసారైనా ఎలుమలై ఇంటికివెళ్లి అతని యోగక్షేమాలు కనుక్కుంటూ వుండాలని, వాళ్ల ఫొటోలు స్టేట్స్‌లో వుండే తనకి పంపించాల్సిందిగా జాకబ్‌ని  కోరుతూ –

"అది నా బాధ్యతగా భావిస్తాను" అన్నాడు జాకబ్ నవ్వుతూ.

వెంటనే తలాడించాడు. తన విజిటింగ్ కార్డు, తన కీచైన్‌తో పాటు ఎప్పుడూ వుండే తన నానమ్మ ఫ్రీడంకి చెందిన ఇత్తడి తాళం చెవి మాలాకి ఇచ్చాడు ఐసయ్య. చాలా కాలం క్రితం నాశనం కాబడ్డ ఫ్రీడం స్కూలు కప్‌బోర్డు తాళం చెవి అది. ఆ కథని మాలాకి సవిస్తరంగా వివరించి ఆమెని అదృష్టం వరించాలని ఆశీర్వదించాడు. దాన్ని మాలా ఉపయోగిస్తుందని ఆశించిన ఐసయ్య.

తన ప్రశ్నలన్నింటికి జవాబులు తెలుసుకుని తిరిగి వెళ్తున్నాడా లేక మరింత సంక్లిష్టమైన, లోతైన, కష్టమైన ప్రశ్న రూపంలో అంతం లేని గొలుసులా జవాబులు వేలాడుతున్నాయోమోనని ఆశ్చర్యపోయాడు ఐసయ్య. దానికి మీ అమూల్యమైన స్పందనలు అనే లింకులు ఆ గొలుసుకి కలుపుతూ పోవడమే మీరు చేయాల్సింది.

విమానం ఉరుములాంటి ధ్వనితో టేకాఫ్ అవుతుండగా విమానం టేకాఫ్ అవుతున్నట్లు అనౌన్స్‌మెంట్ రావడంతో ఐసయ్య కళ్లు మూసుకున్నాడు. విమానం నేల వదిలి పైకి ఎగురుతుండగా – తనను అదిమి వుంచిన బరువు దారిలో ఎక్కడో పడిపోయినట్లు అతను చిత్రమైన అనుభూతి పొందాడు.  విమానం పైకి లేవగానే ఏభై ఏళ్ల తర్వాత ఈ విమానం కిటికీలోంచి ఇండియా ఎలా కన్పిస్తుందో అనుకుంటూ స్వాప్నిక జగత్తులో తేలిపోయాడు ఐసయ్య.

# కృతజ్ఞతలు

**యు**నైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలో జన్మించిన మా కుటుంబంలోని మొదటి మనుమరాలు 'తను' ఈ నవల రాయాల్సిందిగా 2005 సంవత్సరంలో ఆహ్వానం పలికింది. యూఎస్ఏని సందర్శించిన ఆరు నెలలు నేను అంతటా పర్యటించి కులం, వర్గం, మతం, సామాజిక స్వరూప స్థితిగతుల్ని తులనాత్మకంగా అర్థం చేసుకుని ప్రపంచీకరణలో భాగంగా అధ్యయనం చేసే అవకాశం లభించింది.

నవల రాయడంలో ఇది నా మొదటి ప్రయత్నం కావడంతో అది ఒక రూపు దాల్చేందుకు సహాయ సహకారాలు అవసరమయ్యాయి. ఇందుకు పాఠకులను మెప్పించగలిగేలా నవలలు రాయగల రిమీ ఛటర్జీ నాకు సహాయకారి కాగలదని అనిపించింది. రిమీ సుప్రసిద్ధ నవలా రచయిత్రి మాత్రమే కాదు, ఉత్తమ పత్రికా సంపాదకురాలు కూడా. నా ఇతర రచనలకి కూడా సహకారమందించింది ఆమె. నేను ఈ గ్రంథాన్ని మందిరాసేన్‌కి పంపి రిమీకి చూపించాల్సిందిగా కోరాను. ఆమె వెంటనే స్పందించింది. రిమీ సహకరించింది. మందిరతో నాకు కేవలం గ్రంథకర్త– ప్రచురణకర్త సంబంధం మాత్రమే కాదు, అది గుర్తుండిపోయే జాతి మనుగడకి, మార్పుకి నిబద్ధతకు ఉపయోగపడ్డ సంబంధం. ఇది ఈ నా రచనకి అదనపు వన్నెనందించింది. ఆమెతో కలిసి నేను నాలుగు పుస్తకాలని ప్రచురించాను. రిమీ అంకితభావంతో నా భావాలని పంచుకుంది. నేను కర్ర కోస్తే రిమీ దానిని సాహిత్య శకటంగా రూపొందించేందుకు సహకరించింది. ఇది ఏ రకమైన నవల అన్నది న్యాయనిర్ణేతలుగా పాఠకులే నిర్ణయించాలి. రిమీకి, మందిరకి హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను. ఈ గ్రంథాన్ని రచించడంలో వున్న సమస్యలని నాతోపాటు పంచుకున్న నా స్నేహితులు ఇంకా నా కుటుంబ సభ్యులందరికీ నా కృతజ్ఞతలు.

"ఈ నవల ఒక కొత్త పద్ధతిని, భిన్నమైన ఇతివృత్తంతో రాశాను. చాలా రాష్ట్రాల సంస్కృతి, కులాల సంస్కృతి ఈ నవలలో అలలు, అలలుగా పాఠకుని ముందుకొస్తాయి. కథానాయకుడు ఒకడుండడు. చాలామంది పురుషులు, స్త్రీలు, తమ తమ కుల సంస్కృతులను ఒంటినిండా ఆరబోసుకొని పాఠకుని ముందుకొస్తారు. వలసవాదాన్ని తిట్టి, వలసవాద పద్ధతుల ననుసరించడం, కులమతాలను దాచి దేశ సంస్కృతిని పుస్తకాల్లో నుండి పుట్టించడం ఇందులో మచ్చుకైనా ఉండదు.

"ఈ నవల రచయితగా నేను ఈ దేశపు మట్టి మనిషిని, బ్రహ్మతల మనిషిని కాదు. ఈ దేశ మట్టి నుండి వచ్చి మళ్ళీ మట్టిలోకే పోత. నేను బూడిదను కాను. ఆ మట్టి నుండి మళ్ళీ ఏమై పుడతాననేది ఈ నవల చెబుతుంది. నేను ఈ నవలలో కమ్యూనిజాన్ని శ్రీశ్రీ జగన్నాధుని రథచక్రాల్లా నడిపించలేదు. దాన్ని ఒక షెఫర్డ్ గొర్రెల్ని పచ్చిక బయలల్లో ఎలా తిప్పుతాడో అలా తిప్పాను. ఆ గొర్రెల్లోనే తోడేళ్ళు ఎలా దాగి వున్నాయెూ, ప్రేమ పేరుతో ఎన్ని కుల సంబంధాలను కాపాడుకుంటున్నాయో చూపించాను."



**కంచ ఐలయ్య**, మౌలానా ఆజాద్ నేషనల్ ఉర్దూ యూనివర్శిటీ, హైదరాబాద్‌లో ప్రొఫెసర్‌గా, సెంటర్ ఫర్ ది స్టడీ ఆఫ్ సోషల్ ఎక్స్‌క్లూజివ్ అండ్ ఇంక్లూజివ్ పాలసీ డైరెక్టర్‌గా పనిచేస్తున్నారు. 'నేను హిందువునెట్లయిత'; 'సారె తిప్పు... సాలు దున్ను' మొదలైన పలు గ్రంథాలు రచించారు.

నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్